# జాతీయ గీతాలు



సంపాదకుడు :

గురజాడ రాఘవశర్మ




ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు-500004.

# తొలిపలుకు

స్వరాజ్య ప్రాప్తికై, ప్రజలు నడిపిన ఉద్యమాలు, చేసిన తపస్సు, త్యాగాలు తలచుకొన్నప్పుడు తీవ్రమైన తలంపులు, స్మృతులు రేకెత్తుట సహజము ఉదాత్తమైన ఆదర్శాలు, ఉచితమైన నడవడి, ఉత్తమతమమైన నాయకత్వము ఆ దినముల విశిష్టత జనసముదాయ జీవితములో బంగారు పంటలు పండించిన దినములవి దేశభక్తి పెద్ద ఎత్తున, వీరోచిత త్యాగ సంసిద్ధతగ మారిన దినములవి హింసారహితముగ, అధికారపు శక్తిని, ప్రతిష్ఠను నిర్భీతిగ ఎదుర్కొన్న కాలమది.

ఇది ఏదేని ప్రాంతమునకు, మతమునకు, కులమునకు సీమితమైన విషయముకాదు. అవిభక్త భారతములోని అన్ని ప్రాంతములలోను, నూతన జాగృతవాతావరణమే సరిహద్దు, పంజాబు, బెంగాల్, బీహార్, గుజరాత్, మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళ ప్రాంతములు పోటీలుపడి, వలసిన త్యాగప్రదర్శనములు చేయుచుండినవి.

తొలిసారిగా, స్వాతంత్ర్య సందేశము పల్లెలకుకూడా ప్రాకి మంత్రోపదేశము చేసెనా అన్నట్లు, అచ్చటనే ఎక్కువ సంచలనము కలిగించెను బీహారులో రైతులు, గుజరాతులో రైతులు శిస్తుల నిరాకరణకు అనుమతి యియ్యండని గాంధీజీని కోరుచుండిరి. ఎక్కడ బ్రిటీషుప్రభుత్వపు శక్తి, ఎక్కడ ఈ అసహాయకులైన రైతులు! పొలాలు, యిళ్లు, పశువులు సహితము పోగొట్టుకొని, స్వరాజ్య యోధులుగ నిలువవలెనను కాంక్ష ఒక్కసారిగా ఎటుల ముంచెత్తు కొచ్చెనో!

విద్యార్థులు, యువకులు, యువతులు, రైల్వే కార్మికులు వారి వారికి అనువగు ఉత్సాహ ప్రదర్శనములు చేసి చేయూత నొసగు చుండిరి. వంగ విభజనచే అంటుకొన్న నిప్పు రాజుకొనుచునేయుండినది. జలియన్‌వాలా చిత్ర వధలచే అది ఒక్కసారిగ భగ్గుమని మండినది. సత్యాగ్రహ ఉద్యమములలో ఆ అగ్ని తన వేడిని తగ్గించుకొని, వెలుగును మిక్కుటముగ చూపినది. ఆ వెలుగే త్యాగరూపమెత్తెను.

సర్కారు నౌకరీని వదలువారు. వకీలువృత్తిని వదలువారు, కళాశాలలువదలి దేశమునకై సేవచేసెదమని వచ్చు విద్యార్థులు, మేము సారాయంగడివద్ద లేక విదేశ బట్టలదుకాణములవద్ద పికెటింగ్ చేసెదమని వచ్చు మహిళలు, హిందీనేర్చువారు, రాట్నాలు పెట్టువారు, వడకుట నేర్చువారు, ప్రభాత ఫేరీలు, జాతీయగీతముల పాడు దళములు, ముతకఖద్దరు ధరించువారు, యింకా ఎక్కువమంది వీరినందరిని ఆదరించువారు, తిలక్ స్వరాజ్యనిధికి ప్రత్యక్షముగనో, గుప్తముగనో ధనము నొసగువారు, యిటుల ఎన్నెన్ని పాయలుగానో పారెను ఆ పవిత్రధార !

అది త్యాగయుగము, తప్తకాంచనయుగమది. అహింస, సత్యసూత్రములపై నిలిచి, పరిపాలకులకు, వారి సహాయకులకు ఎట్టి హింసను తలపెట్టక, స్వరాజ్యహోమాగ్నిలో సమిథలగుటకు ముందుకు వచ్చు స్త్రీలు, విద్యార్థులు, రైతులు, కార్మికులు ఇన్నాళ్లుగ ఎచ్చట దాగియుండిరి ! వారి ఆవేశము, త్యాగోత్సాహము, వజ్రసంకల్ప నినాదాలు గ్లేషియర్‌లోని శతాబ్దాలుగా పేరుకొనిపోయిన మంచు దిబ్బలవలె, ఎక్కడ అణగియుండెను ! ఏ మహామంత్ర శక్తిచే, ఏ వేడికిరణముచే, దాని మేల్కొలుపో ! శైలనిర్ఝరము రీతి ఎగురుచు, దుముకుచు అడ్డుల తలదన్నుచు, అపూర్వ సంచలనముతో ఊగాడు జన ప్రవాహమునకు కారణ మేమి ? ఏ మహామానవుని పిల్లనగ్రోవి పిలుపది?

ఏ యుగములోనైన, ఏ ఇతిహాసములోనైన, ఏ అష్టాదశ పురాణములలోనైన ఊహించని రీతిగ, వ్యాస వాల్మీకులకును కల్పనాతీతమైన త్యాగఘట్టనలు చూచిన పవిత్ర ఉద్యమమది లాఠీదెబ్బలకు జైలు శిక్షలకు, ఆస్తి జప్తీలకు వెరవక, కేవలము ఒక తాలూకా, ఒక జిల్లాయనిగాక, దేశమంతటా అన్ని మతాలలో, అన్ని వర్గాలలో, ఇంత పెద్దఎత్తున, కోటీశ్వరుల మొదలు రైతులవరకు, ఎదుటివానిని పల్లెత్తి మాటయనక, కట్టెల, కత్తులతో పనిలేక, కష్టములు పడుటకు, భోగముల విడనాడుటకు, త్యాగముల కష్టములలోని మాధుర్యముసు చవి చూచుచు "మా గమ్యమును చేరెదము, మా జన్మహక్కైన స్వరాజ్యమును పొందెద"మని మాత్రము చెప్పుచున్నవాయనునట్లు ఎగురు జండాలచేబూని, మృత్యుకింకరుల సమక్షమున నిలిచిన శాంతి వాహినుల సత్యసంకల్పమును ఏ మహాకవియైన ఏ భాషలోనైన వర్ణించెనా? అట్టి కని విని తలవని వీరమహాకావ్యము ఆనాటి భారతీయుల దేశభక్తి మయమగు ఆచరణ

రాజకీయములే ఆధ్యాత్మికకాయమును వహించినవి దరిద్ర నారాయణుడే ఆరాధ్యదైవము. అంటరానివారు, వెనుకపడ్డవారు, జీర్ణించిన కుటీర పరిశ్రమలు, మూలబడ్డ రాట్నాలు పైకివచ్చి, ఎన్నడు చూడని గౌరవమును పొందినవి. పల్లెటూరి రైతు వేషము భద్రవేషము, ఆదరణవేషమైనది పరంపరానుగతములైన వైమనస్యముల విడనాడి, హిందూ మహమ్మదీయులు సోదర సౌహార్ద్రితల చూపిరి శాస్త్రబద్ధులగు పండితులును తమ పట్టుదలల విడనాడి, హరిజనోద్ధరణకు సంకల్పములు చెప్పిరి ఎంతటి సోదరభావము, ఎంతటి ఐక్యత, ఎంతటి ఆదర్శభావములు, ఎంతటి పవిత్రత ఆనాటి వాయుమండలమున కలిసియుండినవి!

భారతవర్ష చరిత్రలో ఎన్నో సముజ్వల ఘట్టములు ఉండవచ్చును. కాలసైకతములలో వాని చిహ్నములు నిలిచిపోయి యుండవచ్చును.

అవి ఏ ఋషులనో, తపోవనములనో లేక రాజులనో, రాజధానీ నగరము లనో ఆశ్రయించిన విషయములు కావచ్చును. కాని ఆసహాయోద్యమ ప్రారంభ దినములలో, దేశమంతటా కన్పించిన మహత్తర జనశక్తి, అపూర్వము, అనూహ్యము నిస్వార్థమైన భక్తి కాంగ్రెసు వలంటీరు రూపము దాల్చినదని చెప్పవచ్చును. ఆనాటి వైభవోపేతస్మృతులు, అనుభూతులు భాషయొక్క సరిగ కొంగులో ముడిపడవు అవి పవిత్రములై, ఆదర్శవంతములై, భాష విహరించు వాయుమండలము పైననే శూన్యమండలములోనే సంచరించుచుండెను.

పరదేశ వ్యాపారుల రాజ్యతృష్ణకు చిహ్నములైన విదేశీ వస్త్రముల దహనము, దేశభక్తి లాంఛనములైన ఖద్దరు వస్త్ర ధారణము, స్వదేశీ ఉద్యమముయొక్క రెండు పక్షములై వెలసినవి. గాంధీజీ చొక్కా, టోపి, నిండుధోవతి వదలి కొల్లాయి కట్టుసరికి, దేశములో భావపరివర్తన వచ్చినది. నిరాడంబరమైన వేషము పరిపాటి యైనది. చొక్కాల మానువారు, మాంసభక్షణము మానువారు, చక్కెర, కాఫీలు మానువారు, సిగరెట్లు మానువారు అన్నిప్రాంతము లలో కనబడుచుండిరి దేశము త్యాగమరమై, అహింసాయోధులు దేశబైరాగులైన యుగమది.

ఒకటినిమించి ఒకటి, ఐదు పెద్ద ఉద్యమములు బయలుదేరినవి. అందు మొదటిమూడు, కాంగ్రెసు పదవీస్వీకరణకు పూర్వము, కడపటి రెండు తర్వాత పదవీస్వీకరణమునకుపూర్వముగల ఆదర్శము,నిస్వార్థత, తర్వాత పలుచబడిపోయినవి. పదవీ వ్యామోహము అంకురించినది. టిక్కెట్ల పంపిణీ, కాంగ్రెసులోని అంతఃకలహములకు దారిచూపినది. నాయకత్వము మోజు తలయెత్తినది. పవిత్రమైన గంగనుకూడ తుషారశైలములు చాలకాలము పట్టి ఉంచజాలవు భూమిమీద క్షేత్ర ములకు దిగజారవలసియున్నది కాంగ్రెసు ధారయు త్యాగవాహినిగ చాలకాలము నిలువలేకపోయెను. రాజ్య పదవీకాంక్ష అగ్నియై, పవిత్ర

ధావళ్య త్యాగ నవనీతము ద్రవీభూత మొనర్చెను, ఆ దినముల, ఆ ఆదర్శముల నిస్వార్థతయే నేటికిని కాంగ్రెసుకు మూల సంపత్తిగ నున్నది. ఆనాటి కాంగ్రెసుకు వారసు అయిన ఈనాటి కాంగ్రెసు ఆక్షీణించుచున్న మూలధనమును ఉపయోగించుచున్నది. అర్థశతాబ్దిలో ఎంతటిమార్పు! ఎంతటి గంగావతరణము! భారతి ఆరోహణ భాగమును మరచి, అవరోహణ స్వరముల మాత్రము వీణమీద పలికించుచున్నదా, కదనకుతూహల రాగమున!

ఇక క్లుప్తముగ ఆంధ్ర జిల్లాల సమీక్షించెదము. ఆంధ్రరాష్ట్రము రాలేదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము మాత్రము పనిచేయు చుండెను. స్వరాజ్య ఆందోళనలో రాష్ట్రము మాట ఎవరు-ఎత్తెడి వారుకాదు. పెద్ద విషయాల ఏకాగ్రభావములో చిన్న విషయాలు తలపెట్టరాదని వారి నిశ్చయము మద్రాసునగరములో ఆంధ్ర తమిళ జిల్లా కాంగ్రెసులు వేర్వేరుగా పనిచేయుచుండినవి అటులనే బళ్లారిలో, బరంపురములో కూడా.

ఆంధ్రకూడా గాంధీజీని బాగా అనుసరించిన ప్రాంతములలో నొకటి. 1921 సం॥ మార్చిలో బెజవాడ అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశము చరిత్రాత్మకమైనది తిలక్ స్వరాజ్యఫండుకు కోటిరూపాయలు వసూలుచేయుట, కోటిమంది సభ్యులచేర్చడం, కోటిరాట్నాల నెలకొల్పుట అను తీర్మానము దేశములో నూతన ఉత్సాహమునకు, కార్యదీక్షకు నాందియైనది. గాంధీజీ తొలిసారి ఆంధ్ర జిల్లాలలో సంచారముచేయడముతో, ఆ ఉత్సాహము మిన్నుముట్టినది. దేశమంతట జూపబడిన ఉత్సాహమునకు కొరతలేకుండా, కొంత అధికముగనే ఆంధ్రజిల్లాలు ఊగుచుండినవి ఖద్దరుధారణ, జాతీయ పాఠశాలలు స్థాపించడం, ఊరేగింపులకు, బహిరంగ సభలకు లెక్కలేదు హిందీ నేర్వడం, పరీక్షలకు పోవుట ఆనాటి కార్యక్రమాలలో ముఖ్య

ముగనే యుండినది. అస్పృశ్యతా నివారణకై ప్రచారము సాగినదే గాని, హాస్టలుస్థాపన యింకా ప్రారంభముకాలేదు దేశభక్త కొండ వేంకటప్పయ్యగారు కాంగ్రెసు అధ్యక్షులుకావడం, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య ప్రధానకార్యదర్శి కావడం ఆంధ్రులకు ప్రత్యేక గర్వకారణమాయెను. ఏకైక దినపత్రికయగు ఆంధ్ర పత్రికకై పోస్టాఫీసులవద్ద కాచుకొనియుండుట, రాగానే గుములుగూడి చదివి విని పించుకోవడం సాధారణ దృశ్యమే. అటులనే కృష్ణాపత్రిక సంపాదకీయ వ్యాసాలకు, గాంధీజీ సూత్రాలకు వారి విపుల సమాధానములు ప్రజల ఉత్సాహమును పైస్థాయికే తీసుపోకొవుచుండినవి. 1921-22 సం॥లో చాలమంది శిక్షింపబడుట, మామూలు ఖైదీలవలె వారిని జైలులో చూచుట వారి దీక్షను మరింత చిక్కపరచినవి. చీరాల మునిసిపాలిటీకి వ్యతిరేకముగ ఆందోళన లేవదీసి, కొన్ని వేలమంది, ఊరిబయట పొలాలలో కాపురముండుట, సాధారణ విషయముకాదు మానవ మహాసాగరము ఘూర్ణిల్లి, తరంగ పులకాంకురములతో ఊగిన దినములవి. పవిత్రయుగ దినాలు అవి మగల రావు. స్మృతిపథమున ఉంచుకొనవలసినదే

ఆనాటి జాతీయతా ప్రాణవాయువులను పీల్చిన అనేకమంది యువకులలో శ్రీ గురుజాడ రాఘవశర్మగారును ఒకరు. పాఠశాల మాని ఖద్దరుప్రచారకులై, గాంధీజీని అన్నివిధములుగా అనుసరించిన వారిలో ముఖ్యులై నిలిచారు తగిన కవితాశక్తియు గలదు. అందువల్ల సొంతముగ జాతీయగీతముల రచించుటయే గాక, ఆనాటి సాహిత్య సేకరణకై కృషిసల్పి జిల్లాలు తిరిగి ఎంతో సామగ్రిని చేకూర్చిరి. ఈ సామగ్రికి చారిత్రకమైన విలువ గలదు ఆనాడు ఏ పద్యములు, ఏ పాటలు ప్రజలను కార్యోన్ముఖులచేసినవో అర్థము కాగలదు. ఈ పాటలన్నీ అన్ని జిల్లాలలో ప్రచారములో లేవు. కొన్ని బహుళ వ్యాప్తి పొందినవి. మరికొన్ని స్థానికములే. కాని ఇంచుమించు

యేబది సంవత్సరములు గడచిన కాలములో ఆనాటి సామగ్రిని సేకరించుట తేలికైన పనికాదు. అన్నివిధములా తగినవారే ఈ పనికి ఉద్యుక్తులగుట మన అదృష్టము. మా అకాడమీ, యీపని విలువను గుర్తించి, దీని ప్రచురణకు యియ్యకొనినందులకు మాకే సంతోషముగ నున్నది. ఏబదియేడుల పైగా స్నేహితులైన శ్రీ రాఘవశర్మగారిని అభినందించుచు, ఆంధ్ర మహాజనులు దీనిని స్వీకరించగలరని ఆశించుచున్నాను. ఆనాటి వాతావరణపు అంకములో పెరిగి పెద్దవాడనగుటయే కారణముగ నేను వ్రాసిన తొలిపలుకుల సాహసమును మన్నించెదరుగాక.

మహాత్మా గాంధికి జై.

సుదర్శనమహాల్,
నెల్లూరు.
9-6-1973.

బెజవాడ గోపాలరెడ్డి

# ఉపోద్ఘాతము

శ్రీ రాఘవశర్మగారు చేసిన యీ పని పరదేశములలోనైనచో శిరసావహింప బడెడిది ఒక వాల్టేరు, ఒక కార్లైల్, ఒక గోర్కి చేసిన పనులవంటి పనిగా దీనిని పరిగణించెడివారు ఈయన పాతిక ముప్పది యేండ్లు బహుశ్రమపడి తాను పడిన శ్రమ యంతయు నీ గ్రంథ రూపమున వెలువరచెను. ఎనుబది పుటల పరిచయము వ్రాసెను. ఆంధ్రప్రదేశములోని యానాటి మహోద్యమములో తాను స్వంతముగా పాల్గొనెను. స్వంతముగా కవి అట్టివాని యీ పరిశ్రమ విశిష్టమైనదని చెప్పవలయును ఆనాటి యుద్యమములో నెన్నివందల మంది పాల్గొనిరి? ఎంతమంది ప్రాణములుగోల్పోయిరి? ఉద్యమముతో సంబంధము లేనివారుకూడా తమ యావేశములను దేశభక్తిని పద్యములుగాను గేయములుగాను వ్రాసిరి. ఆనాటి బహు పత్రికల యందు ప్రకటించిరి ఇందులో కొన్ని పద్యములు కలవు కొన్ని గేయములు కలవు పద్యములు వ్రాసిన వారిలో సగానికి సగముగా నొడ్డున కూర్చున్నవారు. గేయములు వ్రాసినవారిలో నూటికి 90 మంది నిప్పులో నురికినవారు. నిప్పుల యొడ్డున కూర్చున్నవారు. కాని యిట్టి మహోద్యమములో పద్యమునకు, గేయమునకు భేదములేదు. నేడు కొందరు గద్యకవిత్వమని, గేయకవిత్వమని వ్రాయుచున్నారు ఇక్కడమాత్రము భేదమున్నది ఒక మహోద్యమమునందు భేదముండదు. ఒక మహోద్యమము జాతి మొత్తముమీద సర్వజనుల గుండెలయందు మండుచున్న జ్వాలయొక్క స్వరూపము. ఆ జ్వాల యొకప్పుడు పద్యముగా నుండును, మరి యొకప్పుడు గేయముగా నుండును

నిజానికి ఈ సర్వకవిత్వమునకు ప్రధానమైనవాడు శ్రీ గరిమెళ్ల సత్యనారాయణగారని చెప్పవలయును. ఆయన యొక్కడే యీ మహాంధ్ర స్వాతంత్ర్యోద్యమము కవితారూపమున వెడలినదన్నచో నా సరస్వతికి రూపమిచ్చినవాడు. ఆయన పండితుడు. సంగీత సాహిత్యములందు గొప్ప సమర్థుడు. కాళిదాసు మహాకవి యైనచో నాయన రచించిన కావ్యములలో నభిజ్ఞాన శాకుంతలము పరమోత్తమ మైనదైనచో నితని మహాకవితాధారలో, 'మా కొద్దీ తెల్లదొరతనము,' అన్నపాట శాకుంతలమువంటిది 'చూడి ఆవులమంద సురిగి యింటికి రాదు' యీ ఒక్క వాక్యముచాలును ఇతరుల నాగరికత, మన నాగరికత, మనమతము, మనమతములోనున్న మేలిమి సర్వము దీని యందు మహాధ్వనిగానున్నది. అంతటి జాతీయకవి పుట్టుట సాధ్యము గాదు. ఈ మహానుభావుడు చివరకు తినుటకు తిండిలేక మాడినాడు. అది మన జాతి లక్షణముగదా వందలమంది ఆయనను చూచి పాటలు వ్రాసినారు. వారి పాటలలోననే ఆ లక్షణము కనిపించును. ఆయన తనపాటలను పాడుచు తెనుగు దేశమున పట్టణము పట్టణము పర్యటించి ప్రచారము చేసినాడు. ఆ రోజులలో ఆయన పాటలు నోటికిరాని సామాన్యుడైన తెనుగువాడు లేడు. నన్నడిగినచో నాయనకొక శిలా విగ్రహము వేయవలయును ఆయన పాటలీగ్రంథములో కొన్ని గలవు. ఆయన వ్రాసిన వింకను చాల పాటలు కలవు భక్తి కీర్తనలు కలవు. ఆయన మంచి సంగీతవిద్వాంసుడని చెప్పితినికదా. నా కాయనతో నెక్కువ పరిచయములేదు. ఆయనను 'జాతీయ గేయ కవితా సార్వభౌము' డనుట తప్పు. ఆయన 'జాతీయ కవిసార్వ భౌముడు.' భారతీయత, ఆంధ్రత్వము, తెలుగు నుడికారము కరడుగట్టిన మహాపురుషుడాయన తక్కినవారు తక్కువవారు కారు. గాంధీని గూర్చి పద్యములు వ్రాసినవారు కలరు. గుండెలుడికినవారు కలరు. గాంధి యొక యోగివంటివాడనుకొని కొందఱు ప్రశంసించిరి. అట్టి

వారు పద్యములలో వ్రాయుట సహజమేగదా. ఎట్లైనను యీ మహా గ్రంథ మీనాటికి సాహిత్య అకాడమీచేత ప్రకటించబడుట ముదావహ మైన విషయము. శర్మగారు 30 ఏండ్లు శ్రమపడినారుగదా. ఆయనకు మూడువేలిచ్చినారట. నిజము మాటాడినచో నాయనకు ముప్పది వేలీయవలయును. నేటి మన యాంధ్రదేశము నాటి యిక్కట్లనేమరచి పోయినది. ప్రాణావశిష్టముగ లాఠీ దెబ్బలుతిన్నవారు, పదిపదిహే నేండ్లు కారాగృహములందున్నవారు, కుటుంబములతోసహా జైళ్ల లోనికి పోయినవారు, మలమల మాడినవారు నాడు కలరు. కారా గృహములో తరగతులు కలవు నిజముగా కష్టపడినవారు 3 వ తరగతి వారు. రాజ్యాంగ మెట్టియాకారము దాల్చినను మొదటి రెండు తరగతులవారికెప్పుడును లోసముండదు. పరరాజ్యమో, స్వరాజ్యమో బాధపడెడివారు 3 వ తరగతివారు. నేడు సంఘమును విచారించుచు మధ్యతరగతివారని కొందఱినందుము ఆ మధ్యతరగతివారిలో కొంత మంది పై తరగతిలో చేరుదురు. ఒకదేశముయొక్క కష్టములు, ఉద్యమములు, బాధలు, దారిద్ర్యములు పీడలు సర్వము ననుభవించెడి వారు నడిమి తరగతిలోని క్రిందివారు. ఆ దేశమునకు సౌభాగ్యము పట్టినను దౌర్భాగ్యము ఆవహించినను దేశమునకు వెన్నెముకగా నిలి చెడి వారీ నడమి రకములోని క్రిందివారు. వారు సామాన్యముగా చదువుకొన్నవారు. సంస్కారముగలవారు. ఆత్మ బలిసేయుటకు సిద్ధ మయ్యెడివారు. వారు దేశమునకు మూలభూతులు. ఈ గ్రంథములో నుదహరింపబడిన కవులలో చాలమంది సంఘములోని యీ నడిమిరకపు క్రింద తెగకు సంబంధించినవారు. వారు ఎప్పుడును సంగీత సాహిత్య వేత్తలు. సంగీత సాహిత్యములు ఒక జాతియొక్క సంస్కృతికి ప్రతి బింబములైనచో అవి రెండును వారియందు ప్రతిబింబించును. వారిలో కొందఱదృష్టజాతకులు యోగించి పైకి పోవుదురు తక్కినవారచటనే యుందురు వారిని చూచెడి దిక్కుండదు కాని జాతి లక్షణము సముద్ధ

రించెడిది వారే. యదార్థమైన జాతియనగా వారే, అట్టివారి గ్రంథములో నున్న కవులలో చాలమంది కలరు. కొందరు ఆ లక్షణమునకు చెందని వారుకూడ గలరు కాని మూకయుమ్మడిగా చెప్పినపుడు వారి పేర్లు కూడ వచ్చును. ఈ గ్రంథములో నావికూడ ఒకటిరెండు పద్యములు కలవు. నిజానికి నావి చేర్చకూడదు. నేనా యుద్యమములో పాల్గొన్న వాడినికాను, అభిమానము సమృద్ధిగా కలవాడిని, కాని కొంపయు గోడియు వదలిపెట్టిన వాడనుగాను. దానికి తాను బలియైనవాడు నిజమైన దేశభక్తుడు. వానికి తాను బలియగుటయే పరమార్థము. నాయకుడుగానగుటకు నుద్యమములో ప్రధాన పాత్రలు వహించెడి వారు కలరు వారియందు దేశముయొక్క ఆత్మగానీ, సంస్కృతిగానీ ప్రతిబింబించవు వారొక విచిత్రమైన స్వార్థపరులైనజాతి. వంట తినెడి వారు వారు, పండించెడివారు వేరు. ఆ పండించెడి వారిలో కవితా రూపమున పండించినవారు శ్రీ గరిమెళ్ల శిఖామణి ముందాయనను చెప్పి తరువాత నింకొకరిని చెప్పవలయును. కవిత్వమును వదలిపెట్టి నచో నా రీతిగా నాత్మబలిచ్చినవారిని నేనెరుగుదును. వారు నేటికిని బ్రతికియున్నారు. వారి యూరును పేరునులేదు అంత ఫ్రెంచివిప్లవము తరుగగానే నెపోలియనును మరల చక్రవర్తిని చేసినారు ఓహో! మానవ జాతి. ఓహో! మానవుని రాజ్యాంగబుద్ధి శ్రీ గురుజాడ రాఘవశర్మగారు చేసిన పని ఉద్యమమునకు మకుటాయమానమైనది. సాహిత్య అకాడమీ ప్రశంసింపదగినది.

విజయవాడ,
11-6-1978

విశ్వనాథ సత్యనారాయణ

ఓం

శ్రీకృష్ణాయనమః

# "జాతీయ గీతములు"

## పరిచయము

శ్రీ 'కవిశేఖర' గురజాడ రాఘవశర్మ,

( బృందావనము, మచిలీపట్నము )



## జాతీయ గీతములు

జాతీయగీతములననరికి, జానపద గేయములు స్ఫురించును. ఆ గేయములు జాతీయాభిమానమును వెలువరించి, జాతిని మేల్కొలుపదగు సూక్తులు. ఇక గేయమనునరికి అది పాడతగిన, మృదుమధుర పద సమన్వితముగా తోచును పదమనునది కొన్ని భావ రాగ తాళ నృత్యములతో, పాడుటకు, నడిపించుటకు ఆనందము చేకూర్పగల యొక ఆలంకారిక రసమయ శబ్దముల కలయిక తొలుత కవితకు పదములే పునాది తొలుత వెలసిన ఉత్కృష్ట గ్రంథములన్నియు పదకవిత్వ రచనలే. పిమ్మట పద్య కవిత్వము వృత్తకవిత్వములు వెలువడినవి ఆ వృత్తి తిరిగిన ఛందస్సులతో నడచినదే, తదుపరి ఛందోమయ సాహిత్యమంతయు.

ఈ పదములనేక రకములు పాడుటకనువైన పాటల క్రింద బహుముఖ వ్యాప్తిచెందినవి. ఊయెల పాటలు, రోకటిపాటలు, తుమ్మెదపాటలు, కోలాటపు పాటలు, జోలపాటలు, లాలిపాటలు, గొబ్బి పదములు, ఏలపదములు

బొబ్బిలి పదములు, వెన్నెల పదములు, గొల్లసుద్దులు, జంగం పాటలు, మేలు కొలుపులు, దరువులు, రగడలు, మొదలగునవి.

ఈ పదములే గేయములు గానము చేయుటకు కీర్తించుటకుపయోగపడు నవి గాన గేయములు. ఆ గేయములే గీతములు అట్టి పదములతో కూడినవి జానపదుల హృదయమునకు సన్నిహితములుగా నుండి, వారికి సులభగ్రాహ్యమై, గానము చేయుటకు సుశ్రావ్యమై వెలువడిన విజ్ఞాన పదములు జానపదులు అను శబ్దములో, జనపదము అనగా అసంఖ్యాక జన బాహుళ్యమునకు స్థానము- నివా సము. పల్లెటూళ్లు, పట్టణములు కూడ జనపదములే-కాని పల్లెటూళ్ళకే యీ పదము వాడబడుచున్నది వారికి సన్నిహితమైనభాష, వారలతో కలసిమెలసి వ్యవహరింపబడు భాష, వారి మనఃప్రవృత్తులను వ్యక్తముచేయుభాష, వారల ప్రబోధింపననువగు భాష వారి వీనులవిందై పసందగు దేశీయ ఛందోమయ భాష జానపద భాష, యనిన వేరుకాదు

జానపద గేయములు బహు విధములు నవరస పద భూయిష్ఠముగ కూడ యుండును ముఖ్యముగ కరుణ, వీర, శృంగార, హాస్య, భక్తి, రస ముల నొప్పారునవికొల్లలు ఈ గేయములు ప్రజాహృదయ పీఠమున స్థిర నివాసమేర్పరచుకొని నేటికిని సజీవములై, జాతికి చైతన్య ప్రదమై నిద్రాణ స్థితి నుంచి మేల్కొలుపుచున్నవి. ఇంతకు పూర్వము, ఎందరో మహాకవులు తద్రసానందపూర్ణులై, తాదాత్మ్యమునొంది గేయములు వెలువరించిరి తద్రసా విష్టులైన కవుల మనఃపద్మముల జాలువారిన మకరందబిందు సందోహమే యీ గేయములు కనుకనే నేటికిని యివి ప్రజాహృదయముల పీఠక భావాంబరమున ప్రతిధ్వనించుచున్నవి

## ఉ దా హ ర ణ లు

భక్తి వేదాంత గేయములు - (రామదాసు కీర్తన)

ఏమిరా ! రామా ! నావల్ల నేర, మేమిరా రామ ! ఏమి రామ ! యీలాగు కష్టము నీ మహిమో ! నా ప్రారబ్ధమో ॥ఏమిరా॥

ఏమి జన్మము ఏమి జీవనము॥ యీమాయకాయము॥ ॥ఏమి జన్మము ఏమి జీవనము॥

'శ్రీరమా హృదయేశ్వరా, భక్తజన- చిత్తజలరుహ భాస్కరా ॥ కారుణ్య రత్నాకరా ॥ నీవేగతి కావవే ॥ నారాయణా ॥

శ్రీరామ నీ నామ మేమిరుచిరా ॥ ఓరామ నీ నామ మెంత రుచిరా ॥

'తక్కువేమి ? మనకు—రాముండొక్కడుండు వరకు.

ఏ తీరున నను దయజూచెదవో ॥ ఇన వంశోత్తమ రామా ॥ నా తరమా, భవసాగర మీదను, నళిన దళేక్షణ రామా॥

శ్రీరామనామం మరువాం- మరువాం సిద్ధము- యమునికి వెరువాం, వెరువాం

కోదండ రామ॥ కోదండరామ ॥ నీ దండమాకు, నీవెందుబోకు, వాదేల ॥ నీకు వద్దు పరాకు

పరాకు సేయుట పాడికాదురా, పరమ పురుష ・ వరద ॥

ఓ బొజ్జ గణపయ్య॥ నీబంటు నేనయ్య॥ ఉండ్రాళ్ళ మీదకు-దండుబంపు

## బాల గేయములు

చేతిలో వెన్నముద్ద చెంగల్వ పూదండ.

గంగగోవుపాలు గంటెడైనను చాలు కడవడైననేమి ఖరము పాలు (వేమన)

చందమామరావె, జాబిల్లిరావె, కొండెక్కిరావె, గోగుపూలుతేవె ॥

## శృంగార గేయములు

గొల్లవారి వాడలను – కృష్ణమూర్తి ॥ నీవు, ఏమి పనికి వచ్చినావు కృష్ణమూర్తి ॥

ఒప్పుల కుప్ప, ఒయ్యారి భామా ॥

కాటుక–కంటికి బెట్టి, కడవ- చంకను బెట్టి-కళ్ళనీళ్ళు కడవ- నిండెను గదరా ॥ చల్ మోహన రంగా ॥

బావా రావా పెట్టెడు ...

సిరి సిరి- మువ్వ—

## వీర ఉనోటిల గేయము

కొండవీడు- మండేరా - కొండపల్లి మండేరా - కాదనువాడు - వాదుకు వస్తే, కటకం దాకా మండేరా-

రామ రామ! శ్రీరామా రామా! రామా రఘురామ! (తానతందనాని)

## సెలయేరు పాటలు

గంగమ్మ తల్లికి—బెంగల్లో పూపులు, కాళింది – తల్లికి- కల్పాలవంట.

## పల్లె పదములు

హరి హరీ నారాయణా! ఆది నారాయణా! కరుణించి మమ్మేలు కమల లోచనుడ!

వానలు కురవాలి—వానదేవుడా!
వరిచేలు పండాలి వానదేవుడా!
పారిపోయిన మా బావ, పరుగెత్తి రావాలి ॥ వాన దేముడా ॥

## కోలాటపు పాటలు

మెళ్లో ముత్యాల పేరు—ముద్దుగుమ్మ! బంగారుబొమ్మ!
చక్కని గోపాల కృష్ణుడమ్మా, వేణు నాదుడమ్మా
కృష్ణమ్మా! గోపాల బాల కృష్ణమ్మా!
గోవింద భజరే కృష్ణమ్మా! గోపాల బాల కృష్ణమ్మా!

## మేలుకొలుపులు

తెల్లవారవచ్చె, తెలియక నా సామి,
మళ్లీ పరున్నావు లేరా సామీ! మేలుకో!
తీరైన కస్తూరి - తిలకము జారెను,
తీర్చి దిద్దవలె, మేలుకో! కృష్ణా! మేలుకో!

లాలి పాట

రామాలాలీ, మేఘశ్యామాలాలీ; తామరస నయన, దశరథ తనయలాలీ,

జోలపాట

లాలి బంగరు బొమ్మ ! లాలి మాయమ్మ !

లాలి ముద్దులగుమ్మ, లాలి సీతమ్మ ! లాలీ.

గుమ్మడిపాట

గుమ్మడేడీ, గోపిదేవీ, గుమ్మడేడీ కన్నతల్లి !

గుమ్మడిని పొడసూపగదవే ! అమ్మా గోపెమ్మా !!

మంగళహారతులు

రామచంద్రాయ ! జనక రాజజా మనోహరాయ

మామకాభీష్టదాయ — మహిత మంగళమ్.

జయ మంగళమ్ — నిత్యశుభ మంగళమ్.

విజ్ఞాన వేత్తలైన పండితుల గ్రంథములున్నవి. కొంత విద్యాగంధము గలిగి ప్రబోధము సేయు-శక్తిగల విద్యావంతులున్నారు వారిదిగాని, వీరిదిగాని, సామాన్య జన హృదయమునకు సన్నిహితము కాగలభాష కాదు ఏ కొంచెమైన ప్రబోధము చేయదగినను, వారితో సమైక్యము కాగల పరిభాష, వారి నాక ర్షింపగల భాష. వారి హృదయాంతర కష్ట నిష్ఠురములను, భావములను పైకి వెలార్చగల భాష, పోకడగాని, అరుదు అట్టి జాతీయ గీతములైన కాలవశాత్తు తాత్కాలిక ప్రయోజనాత్మకములైనను తదుపరి కూడ సజీవములై నిలువగలవు.

సరియైన పదముగాని, పద్యముగాని, గేయముకాని, యావేశముతో పై కుబుకినప్పుడు జాతిని కదలింపగలుగును అవియే జాతీయ జీవనమును ప్రతి బింబింపజేయగల వాఙ్మయమణి ముకురములు.

## జాతీయ గీత కవిత్వము

జాతీయ కవిత్వమునకు గేయము ఆలంబనము, సులభగ్రాహ్యము. ప్రచార మునకు పరమసాధన ఈ గేయములు అంత్యనియమ ప్రాసలతో, యతులతో,

యించుమించు మాత్రాఛందస్సులను, లయ, తాళములను నిరిపడు, గతులతో, పల్లవి, అనుపల్లవి, చరణములలో, కొన్ని కేవలమొక చరణము వరుసతో, అనేక బాణీల సాగినవి కవుల పందోరీతులు. కనుకనే, తొలుత రిపకవులుకూడ సామాన్య ప్రజాప్రబోధమునకు వ్యాపడలనే గేయములుగా వెలువరించిరి

## జా తీ య త

జాతీయ గేయములలో సమగ్ర జాతీయత వెల్లివిరియవలె జాతీయత యనగా, జాతి యొక్క ఔన్నత్యము, ఆత్మగౌరవములను సంబంధించినది. అంతియేగాక, జాతియొక్క సహజ సంస్కృతి, ఉదాత్త సంప్రదాయములను, తరతరాలు అందింపగల అవిచ్ఛిన్న జీవనది.

ఉదాహరణ – శ్రీ 'చింతకుర్తి' ఏష్కని వంపెంచ పలుకు.–

వరిత ఖండం..., చక్కని పొవియూపు,
హిందువులు తెగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను, గడుసరి గొల్లవారు,
పితుకుచున్నారు, మూతులు బిగియగట్టి.

ఇందు సమగ్రమైన జాతి, సమగ్రమైన పాడి హిందువులు తెగదూడలై యేడ్చుచుండ సమస్త భారతావని కుండు విస్తృ నిర్వాహకులు, తెల్లవారను గడుసరి గొల్లవారు, గడుసరి కఠిన ప్రభుత్వము, పితుకుచున్నారు మూతులు బిగయగట్టి; జాతినంతను బంధించి, సమస్తము కొల్లగొట్టుచున్నారు. తెల్లవార కద తెల్లవారు అను గడుసరి వారు. ఇంటికియైనను తేగదూడకు తన బిడ్డకు చిక్కనీక పిండు కొని పోవుచున్నారు. ఇచ్చట చిన్ని నా పొట్టకు శ్రీరామరక్షకాదు. ఇచ్చట స్వార్థమునకు తావులేదు. నిస్వార్థమైన ఆర్తరక్షణలో పరశ్రేయస్సును కాంక్షించుట పరమార్థము ఈ పద్యము సమకాలీన దుస్థితికి వ్యంజకము.

మహాకవి, గురుజాడ.–

దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్,
దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా,

వట్టి మాటలు కట్టి పెట్టోయ్, గట్టి మేల్ తలపెట్టవోయ్,
దేశాభిమానం నాకు కద్దని, వొట్టి గొప్పలు చెప్పకోయ్,
పూని ఏదై నాను-ఒకమేల్ కూర్చి జనులకు- చూపవోయ్,
చెట్టాపట్టాల్ పట్టుకొని, దేశస్థులంతా, నడవవలెనోయ్,
అన్నదమ్ములవలెను జాతులు మతములన్నీ మెలగవలెనోయ్,
ఈసురోమని మనుషులుంటే, దేశమేగతి బాగుపడునోయ్

ఇట్టి మానవతా ప్రబోధకములైనవి కోకొల్లలు.

"వ్రాత పూత లెరుంగని సామాన్యజనులు రసోద్రిక్తులై ఆలపించు మధుర భావ గేయములు జానపద గీతములు." అని యొక సాహితీ ధురంధురుడు.

"జానపద గేయములందుండు, జాతీయతలు-నానుడులు- వింత వింత పలుకుబడులు శిష్టు లాకళించుకొనవలసిన యమూల్య సంపద, నవ్యభారత పున ర్నిర్మాణావసరమున వివిధ ప్రణాళికా ప్రచారమునకు, ప్రజా ప్రబోధమునకు, జానపద కవితారీతులు, ఉపయోగించునంతగా, తదితరములుపయోగ పడవన్న నతిశయోక్తి కాద"న్నారు ఒక జానపద సాహిత్య సంకలన కర్త.

పదములో సహజోద్రేకము, ఆనందదాయకమగు సరళత యుట్టిపడు చుండును. గేయములకు, యొక ఆవేశము, సన్నివేశము, మంచి యితివృత్తము కావలె. ఆ ధారాశుద్ధిగల కవివాగ్విభూతికి సాటి వేరొండు లేదు గేయములు, కళా సరస్వతీ కంఠాభరణములు.

గద్యముగాని, పద్యముగాని, గేయముగాని, క్రియా వైవిధ్యము కల వైనను, సమకాలిక సంఘ జీవన ప్రతిబింబములై యుండును.

హృదయము భావపరిపూర్ణమై, రసార్ద్రమై వెల్లివిరిసినప్పుడు, కవుల వాక్కుల కమోఘ శక్తి ప్రాభవములతో కూడిన సుధా స్రవంతి జాలువారును. ఆయా భావములు సహజ ఛందోబద్ధములై అక్షరాకృతినందును, అంతర్గర్భిత మైన ప్రజాశక్తిని, ప్రజ్జ్వలింపజేసి, కర్తవ్యతా ప్రబోధముచేసి, భక్తి (దేశభక్తి) శిక్షణచే, జాతిని, సమైక్య పరచి, ఒక్కమాట వినిపింపగల, ఒక్క బాటి నడిపింపగల, మహానాయకుడుద్భవించుకాల మాసన్నమైనప్పుడు, జరుగు మహా

ప్రబోధవాయు ప్రసారముల జాతి స్వార్థము విస్మరించును. ఒడలు మరచి, సర్వార్పణకై సంసిద్ధమగును. అట్టి జాతి సన్నిహిత హృదయమునుత్తేజ పరుప గల గేయముల యావశ్యకత కలిగి మహాకవుల హృదయములనుండి ప్రబోధా త్మక గేయములవతరించినవి.

మేలుకొనుమీ భరతపుత్రుడ
మేలుకొనుమీ • సచ్చరిత్రుడ
మేలు కొనవయ్యా ! వత్సా మేలుకో (మంగిపూడి)

జాతీయ భావోద్రేకులైన కవులకు స్వాతంత్ర్య సమర దుందుభి మ్రోయించు నదవకాశము లభించినది.

## గేయముల ప్రయోజనములు

ఇందు కొన్ని సార్వకాలికములు, కొన్ని తాత్కాలికములు, ఈ తాత్కాలి కములు, తాత్కాలిక ప్రయోజనార్థములేగాక, విజ్ఞాన ప్రదములై, ఉత్తమ ధ్యేయములతో యొప్పారుచున్నవి. ఈ యుత్తేజితములగు సూక్తులు, ప్రబోధ ములు, స్వరాజ్య సముపార్జనలో, జాతి మనుగడకేగాక, మోక్షసాధనకు సంప త్తిగా కూడ వినియోగపడునవి కొన్ని కలవు గీతాసారమే, సాధన ఇందు కర్మఫలత్యాగము,సర్వార్పణ ముఖ్యములు. అనాసక్తయోగము, దీక్ష, స్వాతంత్ర్య సముపార్జనకై సర్వ త్యాగము. ఇందు స్వార్థములేదు. త్యాగమే ధ్యేయము. పరశ్రేయస్సే ఆనందము. ఈ సోపానముల నధిష్ఠింపజేయు ప్రయత్నములే జాతీయ గీతముల ప్రయోజనములు

## వైతాళికులు

1921 ఉనహాయోద్యమమునకు పూర్వము సవ్యసాహిత్య వైతాళికులగు శ్రీ చిలకమర్తి, గురజాడ, రాయప్రోలు, చెన్నాప్రగడ, మంగిపూడి, మొద లగు వారెందరో తమ పీర విప్లవాత్మక గేయములచే, ప్రజాబాహుళ్యము నుత్తేజ పరచినారు. ది 9-5-1907న, మహానాయకుడు లాలా లజపతిరాయిగారిని ప్రభుత్వము, రాజద్రోహనేరము క్రింద బంధించి, మాండలే జైలునకు పంపిం నప్పుడు-

"చిలకమర్తి" —

చెరసాలల్ వర చంద్రశాలలెయగున్ చేదోయి గావించు, న
య్యెరదండల్, విరిదండలయ్యెడును, హేయంబైన చోడంబలే
పరమాన్నంబగు, మోటుకంబళులె, తాల్పన్ఁబట్టు సెల్లాలగున్
స్థిరుడై, యేనరుడాత్మ దేశమున భక్తింగాల్చునప్పట్టునన్.

ఉ॥ ఎందరు గుందకుండ, మరియెందరు బందెల కందకుండ, నిం
కెందరు దేశముల్ విడిచి, యీడిగలన్ బడకుండ, యెవ్వరే
చందమునన్ శ్రమంబడక, చప్పున చొప్పడునే ! స్వరాజ్యమో
హైందవులార, చింతిలకుడీ ! చెరసాలలకేగుమన్నచో.

భరత ఖండంబె, యొక గొప్ప బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనుల
యొక్క గది నుండి, మార్చి వేరొక్క గదిని
బెట్టుటేగాక, చెఱయంచు, వేరగలదె ?

దేశభక్తి పరాకాష్ఠలో ద్వంద్వాతీత భావనా శక్తి యెట్లు యిమిడినదో గమనింతము.

1921 అసహాయోద్యమ ప్రారంభమున, శ్రీ గాంధీ మహాత్ముడు విజయ శంఖము పూరించినాడు ఆ శంఖధ్వని ప్రతిధ్వనించిన మహాకవుల హృదయములలో సాక్షాత్కరించినది స్వాతంత్ర్య దేవత. తద్దేవతా కరకంకణ ఝుణం ఝుణ ధ్వనులలో వీర విప్లవ గీతములుప్పతిల్లినవి. తదాలాపన గీతా ప్రబోధమై జాతి నుత్తేజపరచి, కర్తవ్యోన్ముఖ మొనర్చినది.

ఎందరో కవులు కూడ, యీ యుద్యమమున తాదాత్మ్యము జెంది, శ్రీకృష్ణ జన్మస్థానమలంకరించి, స్వీయజీవితమును, జాతిని, పునీతమొనర్చి జన్మసార్థకత చేసికొనినారు ఇంతకంటె యుత్తమ మాతృసేవ దేశసేవ లేదుకదా ! పారతంత్ర్య శృంఖలముల పటాపంచలుచేసి స్వాతంత్ర్య యజ్ఞహోతలుగా నిలబడిన వీరి జీవితము ధన్యము.

ఈ యుద్యమములో ఎందరో మహాకవులు పాటలు, పద్యములు, గేయములు, గానం చేసినారు శ్రీ బసవరాజు అప్పారావు, తుమ్మల, జాషువా, దువ్వూరి, వెంకట్రామానాయుడు బసవరాజు, గరిమెళ్ళ, జగన్నాథదాసు, మంగిపూడి, అబ్బూరి, కోడేటి, దాశరథి, కాళోజీ, గురుజాడ మొదలగు వారి సేవ మరవరానిది ఈ అహింస కృషిలో ప్రత్యేకముగ గాంధిగారి ఆత్మకథ, మహాత్మకథ, పేర్లతో ఉత్కృష్ట గ్రంథములు వెలుపరించిన శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారెంతయో ధన్యులు. స్వరాజ్య సమస్య, నవకాళి, స్వరాజ్య ఢంకా, స్వరాజ్య నవనీతము, స్వరాజ్య తాంబూలము, మొదలగు ఖండకావ్యములు వెలువరించిన కవులెందరో కలరు. వారలందరికీ నా కృతజ్ఞతలు

అపారమైన దేశభక్తి, అఖండమైన స్వభాషానురక్తి, అప్రతిహతమైన జాత్యభిమానము కలవారగుటచేతనే, యిట్టి గేయములు వెలువరించినారు. ఇవి ప్రవిమల కవిగంభీర ధీర మానస సంఫుల్ల సురభిళ దివ్యకుసుమములు ఇవి వాడవు జాతి హృదయములనుండి వీడవు అలసినప్పుడు తోడునీడయి శక్తి సంజీవింప జేయగల పారిజాతములు.

## భారత జనని

శ్లో॥ జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ
'జననియు, జన్మభూమియును స్వర్గముకంటెను మాననీయముల్'

పవిత్రమైన జన్మ ప్రసాదించి, ఆబాల్యము అనురాగామృతము చిల్కి, హృదయమునకు హృదయముగ హత్తుకొని, పెంచి, పెద్దజేసిన తల్లి, సర్వజంతు సముదాయపు కల్పవల్లి

## నమాతుః పరదైవతం

తల్లిని మించిన దైవమెందులేదు. అట్టి సర్వారాధ్యయగు తల్లికి గూడ కన్నతల్లి యీ ధాత్రీమతల్లి. ఆ బంగారు తల్లి చల్లని యొడిలో పెరిగిన సంతతి యామెకెంతయో ఋణపడియున్నది సర్వజీవన ప్రదాత్రియగు ఆ తల్లిని స్మరించి యామె దివ్యపాద పంకజములకు ప్రణమిల్లని ప్రాణి యుండడు. ఈ ఉదాత్త కమనీయ భావనలో, యొడలు తెలియక ఉప్పొంగిన కవిజీమూతములు

వర్షించిన మధుర మంజుల సుధా స్రవంతులు దేశమాత కర్పించిన సుపాద్యములు

వందేమాతరం —బంకించంద్ర చటర్జీ

జనగణమణ —రవీంద్రనాథ ఠాకూర్

దేశమును ప్రేమించుమన్న,
మంచి అన్నది పెంచుమన్నా —మహాకవి గురుజాడ

ఏ దేశమేగినా యెందుకాలిడిన,
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన,
పొగడరా నీతల్లి భూమి భారతిని,
నిలుపరా నీ జాతి నిండు గౌరవము —రాయప్రోలు

వందనమిదె గైకొనుమీ ! భారత జననీ
భారత జననీ! మా పాలిటిరాణీ!
ముప్పదికోట్ల జనమునకు మూల మాతవు,
మూల మాతవు–మాపాలి నేతవు. —గరిమెళ్ళ

'మేలుకొనుమీ ! భరత పుత్రుడ!
మేలుకొనుమీ ! సచ్చరిత్రుడ
మేలు కొనవయ్యా! వత్సా మేలుకో' —మంగిపూడి

జోహార్, జోహార్, భారతమాతా,
జోహార్, జోహార్, జోహార్,
శారద శుభ్రవియత్తల పథమున,
సంచరించు నీ రథము
నీ మృదులీలా గాన ప్రబుద్ధము
నిత్యము మా మనము —దువ్వూరి రామిరెడ్డి

నిన్ను నెన్న మా తరమా ! నిరుపమాన భరతమాత
మిన్నవై యఖిల భూములు కన్నతల్లి, కల్పవల్లి! —మంగిపూడి

దండాలు! దండాలు! భారతమాత —వడ్డాది

అవి అందుకొని దీవించు భారతమాత —పూడిపెద్ది

ఎంత చక్కని తల్లివే! రాణివే!
యెల్ల భూములకు, నీవు,
పుడమిచేడియకు కొప్పున పూలదండ
పొలుపుగల మా జన్మభూమి భారత ధాత్రి — కాటూరి

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి — దేవులపల్లి

జలకంబులాడించు చెలికత్తెగద నీకు గనకాంబు ఢాఢ్య గంగా భవాని,
తలమీది గుండు మల్లెల దండ గద నీకు నత్యున్నతోరు హిమాలయంబు,
పూత బంగారు సొమ్ముల పెట్టెగద నీకు సిరి వెలంది చరించు సింహళంబు,
ముద్దుగారెడు నిగ్గుటద్దంబుగద నీకు నిండారు హిందూమహాంబురాశి.

ఇట్టి నిను జూచి బిచ్చంబు బెట్టుమనుచు
నన్ని దిక్కులు యాచించుచున్నవమ్మ!
ఐకమత్యంబు గల్గి నిన్ననుభవించు
కొరత పూరింపవే! మాకు భరతమాత! —జాషువా

'జయ భారతావనీ! జయలోక పావనీ! శాంతి సుఖదాయినీ! జననీ! నమస్తే
నకల సంపత్ఖనీ! నస్య నందనవనీ! ఆసేతు సీతనగ హాటకావని, జననీ!
చత్వారింశత్కోటి జయ ఘంటికాధ్వనీ! సాశీతికోటి భుజబల మహా వాహినీ
—వరదాచార్య

ఓ జనతా! నతాంజలిపుటోజ్జ్వలకోష్ణ నవోష్ణ రక్త ధా
రా జలసిక్త పాద కమల ద్వయ శోభి మనోజ్ఞదేహరే
ఖా! జయభారతీ! యుగ యుగమ్ముల పున్నెము, పంటవీవు, నీ
పూజకు తెచ్చినాడ నిచె పొంగిన గుండియ నిండు పద్దెముల్
—దాశరథి

ఇట్టి మాతృ పూజా మందిరాంగణమున దశ దిశల కీర్తికాంతులు వెద జల్లు జాతీయ పతాక యీ జాతికి ప్రతీక

## జాతీయ జండా

ప్రతిజాతికి, ఒక ప్రత్యేక సంస్కృతి, దాని కనుగుణ్యముగా ప్రత్యేక జండా యుండును. ఆ జండా రెప రెపలలో జాతి పుట్టుపూర్వోత్తరములు వ్యక్తమగుచుండును. జాతి సమగ్ర స్వరూపమునకు సమైక్యమునకు జండా యొక చిహ్నము.

స్వాతంత్ర్యజాతికిది - చక్కని వెలుగు
జాతి పేరు జగాన - స్థాపింపగలుగు.

జాతి వర్ణ కుల మతాతీత ధ్యేయమునకు ప్రతీక యీ పతాక అజ్ఞానాంధ కారమున త్రోవగాన కలమటించు వారి చేతి కరదీపిక- వీరయోధగణమునకు వెన్నెముక, స్వేఛ్ఛాకాశమున కాంతుల విరజిమ్ము సుధాచంద్రిక యీ పతాక.

తొలుత 1916లో లక్నో జాతీయ కాంగ్రెను సభలో, హోమ్ రూలు జాతీయ పతాకగా, యెగురవేయబడినది తదుపరి 1921లో మహాత్మా గాంధీజీ సలహానుసరించి, బందరు ఆంధ్రజాతీయ కళాశాలోపాధ్యాయుడు కీ. శే. పింగళి వెంకయ్యగారిచే చిత్రింపబడి కాంగ్రెసున కందింపబడినది. ఎద్దుకంటికి యెర్రగుడ్డవలె, మన మూడు రంగుల జండా, బ్రిటిషు ప్రభుత్వమునకు, గుండెపోటయి పోయినది. వారి యూనియన్ జాకు స్థానమున, యీ జండా అధి ష్ఠానమేర్పరచుకొనుచున్నదని యుడికిపోయినది వారి హృదయము. నిలువెల్ల ద్వేషాగ్ని, కోపాగ్ని చుట్టుముట్టి, తమ పశుబలముతో భారతజాతిని సమూల ముగా మట్టుబెట్ట ప్రయత్నించినది. జండా అనునది కేవలము మూడు రంగుల గుడ్డ పీలికకాదు. ప్రతి పౌరుని హృదయాంతర్మయ దేవత. దాని యునికియే జాతికి మనికి అందుచే యీ జాతీయ పతాక ప్రతిష్ఠంబన కేర్పడు సర్వనిరో ధములనతిక్రమించి,జయించి, స్వేఛ్ఛాకాశములోవిహరింప, సర్వార్పణ చేసినారు స్వాతంత్ర్యయోధులు అవసరమైనప్పుడు, జాతి సర్వస్వము జాతీయ జండా ప్రతిష్ఠకై సర్వార్పణ చేసినది. తత్ప్రతిష్ఠాపనాయత్నములో వారి వీర విప్లవ గంభీర నినాదములు భూమ్యాకాశములు ప్రతిధ్వనించినవి.

'ఝండా ఊంఛా రహే హమారా,'
'ఝండా యెత్తర, జాతికి ముక్తిర,'
'పతాకోత్సవము సేయండి!'
'ఎత్తండి స్వరాజ్య జండా!'
'ఎగురవే వినువీధి-ఎగురవే జండా,'
'సౌఖ్యప్రదాతగా, జాతీయ జండా!'
'ఖండాంతరముల ఖ్యాతిగాంచి
జయముగూర్చిన జండా'

ఈ జండాను స్వాతంత్ర్యయోధులు, కరకమలముల ధరించి, వీరవిప్లవ గీతములు గానముచేయుచు వరవళ్ల ద్రొక్కినారు.

ఇదియే జాతీయ జండా!
జాతి కిదియే ప్రాణము, మాన ॥మిదియే॥
ఇదియె, స్వరాజ్యధ్వజము, అదుము ఫిరంగీల హాజము।
ఏపినపుకు-దీటబట్టి-కదలు-శాంతి-ప్రతినబట్టి॥
కాయము, బుద్బుదప్రాయము-హేయము,
ధ్యేయము మాకు, సం-పూర్ణ స్వరాజ్యము
పాయని-యశము-జగాన నింపెదము-
నీయాజ్ఞల, శిర-సావహించెదము ॥ఇదియే॥

తొలుత జండాలోని రంగులు జాతి మతములకు అంతరార్థములుగా నిరూపింపబడినవి. చివరికివి జాతి మతాతీత ధ్యేయ సంపదలుగా నిర్ధారణ చేయ బడినవి. కుంకుమపూవు రంగు శౌర్యము, త్యాగశీలమును సూచించును. ఆకు పచ్చ-అకుంఠిత భక్తి విశ్వాసములను, శూరత్వమును చాటును తెలుపు-స్వాతంత్ర్య పోరాటమునకు ప్రాతిపదికములైన సత్య అహింసలకు ప్రత్యక్ష నిదర్శనము. రాట్నము-గ్రామజీవనమును, రైతు కార్మికత్వమును, స్ఫురింపజేయును.

నేటి రాజ్యాంగపరిషత్తు యీ పతాకంలోని రాట్నము తీసివైచి, దాని స్థానమున అశోకుని ధర్మచక్రమును నిర్ణయించినది ఈ అశోక ధర్మచక్రములో కూడ రాట్నచిహ్నమైన చక్రమున్నది

సాహస త్యాగాలు—శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు- ఔదార్య భావాలు
ఆడనీరా! యెగిరి—ఆడనీరా విప్పి
హాయిగా భారత—జాతీయ జండా!
వీరాధివీరుల, వేడి నెత్తురులపై
విజయస్తంభాలపై—వెలసిన జండా ॥ఆడనీరా॥

జండా సత్యాగ్రహోద్యమములు దేశంలో నలుమూలలా ఆయా రాష్ట్రములలో విజయవంతమైనవి 1923 మే 1 వ తేదీన నాగపురమున జండా సత్యాగ్రహోద్యమము బయలుదేరినది రాష్ట్ర రాష్ట్రములనుంచి వేలాది స్త్రీ పురుష సత్యాగ్రహులు పాల్గొనినారు ఆంధ్ర స్త్రీ వాలంటీర్లలో తొలుత నిలబడినది శ్రీమతి సుభద్రాదేవి యొకతె కోటికి పడగెత్తిన అపర కుబేరుడు శ్రీ జమునాలాల్ బజాజ్, సత్యాగ్రహము చేసినందుకు అరెస్టుచేసి, ప్రభుత్వము రూ. 3000 లు జరిమానా వేసి, దానిక్రింద ఆయన కారును జప్తుచేసి వేలము పాట పెట్టగా, కొనువారు లేక, చివరకు కరియవాడలో ప్రభుత్వము సొమ్ము చేసికొనినది అంతటితో యుద్యమము చల్లారలేదు. 1923 జూలై 10 వ తేదీ కాంగ్రెసు అధ్యక్షుడగు సర్దార్ వల్లభభాయి పటేల్ దీనిని అఖిల భారత ఉద్యమముగా చేపట్టి సత్యాగ్రహమున ప్రవేశించి, విజయమొందెను. దానితో జాతీయజండాకొక పవిత్రత, సార్వజనీనత, గౌరవప్రాముఖ్యములు యేర్పడినవి. రథోత్సవములలో వాలంటీయర్ల కవాతులలో, సభలలో, సర్వే సర్వత్ర జండా లేని సమావేశముగాని, జండా చేబూనని స్వాతంత్ర్య యోధుడుగాని లేదనిన అతిశయోక్తి కానేరదు. ఈ జండా ప్రతిష్ఠకై ప్రాణములొడ్డి, లాటీపోటుల బాధలు భరించి, జరిమానాలు, ఆస్తినష్టము, పొందిన యనేక ఉదంతము లున్నవి. 1930 ఏప్రియల్ 6 వ తేదీన బందరులో కుండు (పట్టణ మధ్య భాగములో కోనేటి మధ్యగల స్తంభము) పై జండా ప్రతిష్ఠించుటకు పట్టణ కాంగ్రెసు శ్రీ స్వామి తత్త్వానందను, గురజాడ రాఘవశర్మను నియమించింది. వీరు ఆ కుండుపై నిచ్చెనల మెట్లెక్కి స్తంభముపై జండా ప్రతిష్ఠించు తరి పోలీసులు లాటీలు కొట్టి దించివైచిరి దరిమిలా జండా ప్రతిష్ఠించిన టి. పి. అళ్వారు, వరదదాసు, వీరభద్రయ్యవారు, చలాసాని నాగభూషణం, చెరువు

సుబ్బారావు మొదలగు వారెందరో గాగా, వారల నందరిని లాటీలతో బాది, ప్రభుత్వము ఆవేకు నెట్టించి ఇంతలో కరికి లంఘించు సింహమ్ము కరణి, పైల్వాన్ వీరుడు, తోట నరసయ్య స్తంభముపై జండా ప్రతిష్ఠించి పట్టుకొని నిలబడెను బలీయులగు పోలీసు లెంపట్టో అతనిని లాగి, లాటీల మోది, త్రోసి, కదలింపజాలరైరి ఆ యెడతెగక కురియు లాటిదెబ్బలకు చేతి దండలు నెత్తురు గారినవి. అతని నోట 'బాపుజీ' అనే స్ఫురణ తప్ప వేరులేదు ఎట్టకేలకు పోలీసులు అతనిని పైనుంచి క్రిందకు లాగి పడవైచిరి మరునాడు మ్యునిసిపల్ చైర్మన్ శ్రీ శీలం జగన్నాథరావునాయుడుగారి ఉత్తర్వు తీసికొని, బ్యాండు మేళములతో కుండుపై జండాప్రతిష్ఠ జయప్రదముగా జరుపబడినది. ఇంకొకటి. అయినంపూడి గ్రామంలో చెరువుగట్టున జమ్మిచెట్టునకు జండాకట్టి యహర్నిశలు శీతాతపమునకోర్చి, పోలీసుల యవమానముల భరించి, జండా సంరక్షించుకొన్న కీ॥ శే॥ అయినంపూడి శ్రీనివాసులు, జండా వీరుడు తోట నరసయ్య మొదలగు వీరులెందరో యీ సమయమున స్మరణీయులు.

నాడు నడిపిన గీతము

కుండుపై జాతీయజండా ప్రతిష్ఠింప
రండోయి! రండు! రారండు!
దండిగ వైరులు, గుండ్లు పేల్చిన,
చెండుచు-నెత్తురు, కండలు చీల్చిన!
జండా యెత్తర! జాతికి ముక్తి!
ప్రాణముండగ, యభిమానముండగ, నిజ
ప్రాణములైనను బలియొసంగి-మన
జండా యెత్తర! జాతికి ముక్తి!

## జాతీయోద్యమము (సాయుధ విప్లవము – శాంతి విప్లవము)

1921 సం॥రం ప్రారంభము [illegible] మునకు పూర్వము మన భారతదేశ స్థితిగతు లాలోచించుకొనిన, యీ జాతీయ గీతముల యావశ్యకత బోధపడును.

రామరాజ్యమని చెప్పదగు, మన భరతఖండమున, ఐకమత్యము నన్నుగిల్లి, స్వతంత్ర రాజ్యములేర్పడి, తదధిపతులు పరస్పర విజయకాంక్షులై, స్వజాతిని, ధన, మన, సర్వస్వమును మట్టుపెట్టుకొనిన యొక అయోమయపు అజ్ఞానాంధకార మావహించిన స్థితిలో పరదేశీయులు, అదను తీసికొని, భేద తంత్రములబన్ని, క్రమ క్రమముగా వంచజేరి యొండొరుల మట్టుబెట్టి, రాజ్యాధికారము చేకొని, జాతిని వశపరచుకొనినారు

తెలియుము, దేశచరిత్ర, తెలిసి
దేశ దాస్యము, బాపు-మోః భరతపుత్రాః
పదహారువందల-పండ్రెండవయేట
భారతదేశ-కర్మమున
పీడుః మొదట బందరు పట్టణమున
చల్లనిః పాదంపెట్టెను, వర్తకమున
కనుచు' పట్టణంబులకు-శీఘ్రమున
తరలిః వర్తక దొంగతనమున
కొంతః రాజ్యము హరించెను, మన
దేశీయః ప్రభువుల-జేర్చి కయ్యమున
నొకరిః పక్షముజేరి, రాజ్యమున
కొంతః భాగము హరించె లంచమున,
ఇట్లైః భారతదేశమంత-పరప్రభుత్వపాలాయె ॥

(తెలియుము దేశచరిత్ర)

వర్తకానికంటూ వచ్చి-పాదంపెట్టినాడు బాబుః
పాదంపెట్టి దొంగతనం-ప్రారంభించినాడు బాబుః
పాలకడలివంటి రాజ్యం-బద్దలయిందండి బాబుః
కూలిచేసికొన్న పొట్టకు-కూడులేదండోయి బాబుః
దండాలండోయ్, మే-ముండలేమండోయ్ బాబుః
ఈ సైతాను ప్రభుతనింక-సాగనీమండోయ్ బాబుః
వర్తకంబునకొచ్చి-పట్టణంబులు పట్టి
రాజ్యమొక్కటి అల్లినాడు,

దాన్ని రాణికొప్పగించినాడు,
రాణి పత్రమ్ము చింపేసినాది,
ఈ చిత్రమేమంటె, శిక్షిస్తానంటాడు
మా కొద్ది తెల్ల దొరతనము ! దేవ
మా ప్రాణాలపై పొంచి-మానాలు హరియించె
మా కొద్ది తెల్లదొరతనము!!

చిరకాలము పారతంత్ర్యమున మగ్గియున్న జాతి యెంతగ తిరుగబడి, స్వేచ్ఛ సంపాదింపదలచినను తగు శక్తి, ఆయుధ పరికరములు, ఐకమత్యము, ప్రజల అండదండ లంతగా లభింపక లోనగల స్వాతంత్ర్యాగ్ని రగుల్కొనుచు, ఆరిపోవుటయే గాని దాని నేకోన్ముఖము చేసి, వీరోచితముగ నడిపింపగల మహా నాయకుడుగాని, తరుణముగాని లభ్యము కాలేదు

1857 లో వీర విప్లవ జాతీయ నాయకమణి యగు ఝాన్సీ లక్ష్మిబాయి, నానా సాహెబ్, బీహారీ కేసరి కువర్‌సింహ, తాంతియా తోపే మొదలగు వీరాధి వీరులు బ్రిటిషు పాలనపై తిరుగబడి యెదిర్చి, యుద్ధము చేసిరి. కాని దీటైన యాయుధములు, మరఫిరంగులు లేక, క్రమశిక్షణ లేని, ప్రజా సమూహము, సహాయముతో పూర్తిగా విజయము సాధింపలేనందున, కుంఫిని ప్రభుత్వమునకు బలము చేకూరి రాజ్యాధికారము సాగించినది. ఇది యెన్నికకు వచ్చిన ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధమైనను, బ్రిటిషు ప్రభుత్వము దీనిని సిపాయీల పితూరి క్రింద చారిత్రాత్మకము చేసికొన్నది

తదుపరి 1905 అక్టోబరు 16 వ తేదిన కర్జన్ ప్రభువు వంగరాష్ట్రమును రెండు భాగాలుగా చీల్చినాడు. ఈ చీలికవలన రాష్ట్రములోని హిందూ మహమ్మదీయులకు అంతఃకలహము లేర్పడి, రాజకీయాందోళనలో ప్రజాశక్తి సన్నగిల్లునని యూహించినాడు. కాని దానికి వ్యతిరేకముగ దేశమంతట తీవ్రాందోళన చెలరేగినది. 1906 లో భారత పితామహుడు దాదాభాయి నౌరోజీ అధ్యక్షతక్రింద, భారతదేశమునకు స్వరాజ్య సంపాదనమే కాంగ్రెసు ఆశయమని తీర్మానింపబడెను. అప్పుడే స్వదేశ దీక్ష, విదేశీవస్తు బహిష్కరణ, జాతీయవిద్య, స్వరాజ్య సాధన, మొదలగు యుద్యమములకు నాంది యేర్పడినది. మొదట స్వరాజ్యమను పదము నౌరోజీ మహాశయుని దివ్యవాక్కుగా

వెలువడింది. అప్పుడు అరవింద ఘోషు, సతీశచంద్ర ముఖర్జీ, బిపిన్ చంద్ర-పాల్ మొదలగు ప్రముఖులీ యుద్యమ ప్రచారమునకు బూనుకొనిరి కాంగ్రెసు అనగా- ఇండియన్ నేషనల్ కాంగ్రెసు- అనగా భారత జాతీయ మహా సభ- దేశీయ మహా సభ అప్పుడే విప్లవనాయకులగు శ్రీ అరవిందుని సోదరుడు హరీంద్రుడు, శ్రీ వివేకానందుని సోదరుడు భూపేంద్రనాథ దత్, 'యుగాంతర్' పత్రిక స్థాపించి, ప్రచారమునకు బూనుకొన్నారు అప్పుడే వందేమాతరం అను నినాదము భారత భూనభోంతరాళముల మహామంత్రముగా వ్యాపించినది. అప్పుడే వంగదేశములో దేశోద్ధరణకు సన్యాసివిప్లవముకూడ బయలుదేరినది

'వందేమాతరం'–జాతీయోద్యమమునకు, జాతీయ గీతములకు తొలిమెట్టు తొలిమట్టు పరజాతిని మట్టిపెట్టి, నెట్టి, జాతికి మేల్కొలుపు అనదగు వందే మాతర గీతమును సృజించిన జాతీయ కవిబ్రహ్మ శ్రీ బంకించంద్ర చటర్జీ– అతడు ప్రతి భారతీయునకు తొలి వందనీయుడు. తదుపరి జాతీయగీతము రచించిన మహాకవి గురుదేవ్ రవీంద్రనాథ్ ఠాకూర్. ఆయన ప్రసాదించిన 'జన గణ మన' గీతము వర్తమాన జాతీయ గీతముగ పరిఢవిల్లినది ఏమైనను నాటికి, నేటికినీ వందేమాతరమంత్రము మాత్రము, స్మరింపనీ భారతీయు డుండదనిన అతిశయోక్తి కానేరదు

> వందే। వందే। సదా–స్వదేశ మాతరం।
> వందే మాతరం–మందే రాజ్యం

ఆంధ్ర ప్రజానీక జిహ్వాగ్రముల తాండవించిన తొలి జీవ మంత్రము 'వందే మాతరం'

1907 లో బాబు బిపిన చంద్రపాల్, దక్షిణ భారతదేశమున సంచారము జేసి, తన మహోపన్యాసములచే ప్రజానీకములో, అచంచల జాతీయభావము రేకెత్తించెను. నాడు బరంపురం మీదుగా, రాజమహేంద్రవరము వచ్చి ది 19-4-1907 నుంచి 24 వరకు ఉండి అయిదు దినములు గంభీరోపన్యాసము జేసి వేలకొలది జనుల నుత్తేజపరచెను. అప్పుడే 25వ తేదీ విజయవాడలోను, 26,28, 29 తేదీలలో మచిలీపట్టణములోను ఉపన్యసించిరి నాటి వారియుపన్యాసముల తెనుగున ననువదించి, తుదిదినమున, సభాంతరమున వెలువరించిన శ్రీ చిలకమర్తివారి చైతన్యగీతము—

భరత ఖండంబు-చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను, గడునరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి

నాటి చాటువు :

వందే మాతరమనుచు- వింతవార్త పుట్టెనే·
బిపిన చంద్రపాలునిచేత-విత్తనము నాటించిరే॥
విన్న పెద్దలంతా సభావేదిక పరుగెత్తిరే
విద్యార్థులు పాఠశాల విడచి గుంపుగూడిరే
॥వందేమాతర మనుచు॥

తదుపరి, శ్రీపాల్, విజయవాడ, మచలీపట్టణము. చెన్నపురి సభలలో యుపన్యసించిరి. వారి దివ్యోపన్యాసముల ఫలితముగ 1910లో బందరులో ఆంధ్ర జాతీయ కళాశాలయు, తదుపరి పలుతావుల జాతీయ విశ్వవిద్యాలయ ములు స్థాపించబడినవి.

1908లోనే స్వరాజ్యము నా జన్మహక్కు అని యెలుగెత్తిచాటిన, మహా నాయకుడు, లోకమాన్య బాల గంగాధర తిలక్ మహాశయుని, రాజద్రోహ నేరము క్రింద ప్రభుత్వము ఆరు సంవత్సరములు శిక్ష విధించి, మాండలే జైలు నకు పంపిరి. ఆ ప్రవాస కాలముననే 'గీతా రహస్యమ'ను మహా గ్రంథము వారి పవిత్ర హృదయనుండి వెలువడినది. ఆంధ్రదేశమున స్వరాజ్య పత్రిక స్థాపించిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, అనుచరుడు శ్రీ బోడినారా యణరావుగార్లినుు, వందేమాతరం ఆందోళన క్రింద బంధించిరి నాటినుంచి ఆంధ్రదేశమున, జాతీయ భావోద్రేకము వెల్లివిరిసిది. ప్రజా హృదయములలో ఒక తీవ్ర స్వరాజ్య కాంక్ష, ఆవేదన నానాటికి వృద్ధినొందుచుండెను. 1905 లో కాశీ కాంగ్రెసు అధ్యక్షుడైన ప్రసిద్ధ రాజకీయవేత్త, మహా విద్వాంసుడైన శ్రీ గోపాల కృష్ణ గోఖలే మహాశయుడు చేసిన దేశ సేవకు, దేశమెంతయు ఋణపడియున్నది అతడు1913లో పరమపదించెను తదుపరి ది. 4-8-1914న ప్రథమ ప్రపంచ మహాసంగ్రామము బయలుదేరినది. మరల దేశములో జాతీయ

చైతన్య మొక్కవరి కదలినది ఇంతవరకు రాజకీయముల జోలికిపోక (1911 ఏప్రియలులో స్థాపించిన) దివ్యజ్ఞాన సమాజ ప్రచార వ్యాప్తికి కృషిచేయు డాక్టరు అనిబిసెంటు 1916లో రాజకీయరంగమున దుమికి, హోంమురూలు (అధిని వేశ స్వాతంత్ర్యము) నినాదము చేసినది ఆ యుద్యమ ప్రచారమున, భారత రాజకీయములకు పుష్టి లభించినది. తదుపరి 16-6-1917న ఆమెను సహచరు లతో సహా, ప్రభుత్వము రాజకీయ నిర్బంధవాసమున నుంచినది. 1919లో మాంటేగు సంస్కరణములు, బ్రిటిష్ వారిచే యామోదింపబడి ప్రవేశబెట్టవడినవి తదుపరి (11-11-1913) యుద్ధానంతరము, బ్రిటిష్ ప్రభుత్వము, దేశమున, ఆపద్ధర్మముగా ప్రవేశపెట్టిన, ఆర్డినెన్సుల పరిపాలన, దేశరక్షణ చట్టములను తాత్కాలికములని గ్రహింపక తగ్గింపక అందుకు బదులు 1919 మార్చిలో క్రొత్త 'రౌలెటు చట్టము' ప్రవేశ బెట్టినది. ఈ చట్టము క్రింద యెట్టివారినైన యే విచారణ, యేకారణము లేకయే అనుమానముచే బంధింపవచ్చు తుదకు ఉరి కంబమునకెరవేయవచ్చు ఈ ఘోరవార్తదేశమునల్దిశలవ్యాప్తిచెందినది.మహాఋషి పుంగవులపుణ్యభూమియగు భారతఖండముకాలవశాత్తు, పరాధీనమై, నిర్వీర్యమై, నిస్తేజమై, నిరాయుధమై, నిర్విణ్ణమై, కొనయూపిరితో యల్లాడుచు, ముక్తకంఠ ముతో విలపించిన మహార్తనాదము జగదేకమూర్తియగు పరమేశ్వరుని కంది నది. సమస్తభారత హృదయములో మహాగ్ని ప్రజ్జ్వరిల్లినది. ధర్మజ్యోతియై, దేశమునకు గ్లాని సంభవించినప్పుడు ఆపద్బాంధవుడు, దీన బాంధవుడు, ఒక పురుషోత్తముడు, ఒక ఋషి పుంగవుడు, ఒక సత్యసంకల్పుడు, ఒక అహింసా శక్తి సంపన్నుడు, సహజమానవ స్వరూపమున బయల్వెడలి, దేశమునుద్ధరింప పరిపక్వకాలమాసన్నమైనది. వెంటనే భారతావని కేడుగడయై, మహాత్మాగాంధీ, భారత చక్రధారిగ యవతరించెను.

## లోకమాన్యుని నిర్యాణము

ఇంతలో 1920 ఆగస్టు 1వ తేదీని మహానాయకుడు విజ్ఞానవేత్తయగు లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుడస్తమించినాడు. యావద్భారతా వని ఘోషిల్లినది.

'శాంతి పొందుమా! మహారాజ! ఆత్మశాంతి పొందుమా!
కారా గృహములు-కైలాసముగ గడిపి
గీతా రహస్యము తెలిపి- కీర్తిగాంచిన మూర్తి!

శోకింపకుమా! జననీ? మా సోదరుడు మహాత్ముడుంత
లోకమాన్య నిర్యాణము-లోపము, మది తలపకమ్మా
ప్రాకటముగ, నతడిపుడే, లోకమంత నిండియుండె,

॥శోకింపకుమా జనని॥

సీ॥ వితతమాయాదుర్గ భేదనంబునకు, నే
ప్రాజ్ఞుని బుద్ధి ఫిరంగి గుండు
గుణలుద్ధ హైందవ కోటులె వ్వానినా
మన్మంత్ర్యక్షర మంత్ర రాజ
మాత్మ సమున్నతి యౌదార్యములె వాని
కుగ్గుతో బెట్టిన యురుగుణములు
చాతుర్యమతులైన సామ్రాజ్యపతులకే
యనఘు సాహసము, భయావహమ్ము

సకల జనమిత్రుడును కర్మసాక్షి, లోక
బాంధవుడు, జగచ్చక్షువు, పరమ దుఃఖ
నిరత నిర్మగ్న ధరణి సంతరణ తరణి
యైన, తిలక ప్రభాకరు డస్తమించె.

దేవుడులేని కోవెలయు, దీపములేని గృహమ్ము, రమ్య రా
జీవములేని కోనెరును, శీతమయూఖుడు లేని రేయునై,
బావురుమన్నదీ సకల భారతదేశము, నేడు నీవు ని
ర్జీవుడవౌట జాతి, బుధశేఖర ' శ్రీతిలకా' జగత్ప్రభూ!

దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహ విజయము సాధించిన మోహనదాసు కరం చంద్ గాంధి 1915 జనవరిలో భారత రాజకీయ రంగమున తొలుత కాలు మోపెను శ్రీ తిలక్ భాస్కరుడస్తమించగనే.

చెప్పినంతకుమాట, చేసితీరుటెకాని
జవదాటి యెరుగని సత్యమూర్తి

మహాత్మగాంధి భారతదేశ నాయకత్వము వహించెను

ఎందరో మహానుభావులు, త్యాగులు, భోగులు, మేధాసంపన్నులు, తమ శక్తి సామర్థ్యముల, దేశపునర్నిర్మాణమునకు పాటుపడిరి ఇదియొకనాడు పూర్తియగు విషయముకాదు క్రమసాధనచేగాని లక్ష్యము చేర వలనుపడనిది. అన్నిటికిని కాల పరిపక్వము చేకూరవలె.

ఇంతలో పరాధీనయైన భారతమాతను బ్రిటిషు ప్రభుత్వము క్రమముగా కట్టుబంధముల బిగించి, కట్టకడపటి యుర్రిత్రాడుగా రౌలెటు చట్టము ప్రవేశ బెట్టినది. ఈ యుర్రిత్రాళ్ళ బంధముల నొక్కుమ్మడి త్రెంచి బైటపడినగాని జాతికి బంధవిముక్తి లేదని భారతావని ఘోషిల్లినది ఆపద్బాంధవుడుగ, మహాత్మాగాంధీ యీ ప్రళయరంగమున విశ్వస్వరూపమున, దుమికినాడు. దేశమంతటికి యొక్కపరి కనువిప్పయిన జాతి జాతి సమూలము లేచినది. సమావేశమైనది. కాని ప్రభుత్వము సమావేశముల భంగపరచి, పశుబలముచే మారణాయుధములచే జాతిని మట్టుబెట్ట పరవళ్ళు ద్రొక్కినది. పెద్దల మాట చెవియొగ్గలేదు. ప్రజానీకపు మొరనాలకించే హృదయములేదు. ప్రభుత్వమునకు, వెంటనే మహాత్మాగాంధీ ది. 6-4-1920 తేదీన, రౌలట్ చట్టమును ప్రతిఘటించుచూ దేశమంతటను హరతాళములు యూరేగింపులు, సభలు జరుపవలెనని యాదేశించిన ప్రకారము దేశమంతయు పాటించినది ఆ ప్రకారము పంజాబులో జలియన్‌వాలాబాగులో ది. 13-4-1920 తేదీ సమావేశమున క్రిక్కిరిసిన సభలో ప్రభుత్వపుటండను, 'డయ్యరు సేనాని' ప్రపంచము లోనిదివర కెన్నడు గనని, వినని, ఘోర కృత్యములొనర్చెను వేలకొలది జనమును, బంధించి, బాధించి పొట్టలపై ప్రాకించి, మందుగుండు సామాను పూర్తియగు వరకు మారణ హోమము గావించి, సతీమతల్లులను సైతము అవమానముల పాలు జేసెను.

కంటా గుడ్డను పెట్టి—కర్ణాన వేలెట్టి,<br>
వింటావటర' ఓరయ్యో' ముంద రింటిలో జరిగిన చర్య<br>
మొన్న మొన్ననే్ సుమ్ము—మూడు సంద్రాల్ దాటి<br>
శత్రులగెలిచొచ్చినారు! పాంచాల దేశములోని వారు<br>
సత్యాగ్రహమని, సర్వేశు పూజింప-కత్తితో తెగ నరికినారు,<br>
అయ్యో' కటికడెందపు-తెల్లవారు!'

—గరిమెళ్ళ

మల మల మాడ్చునుమ్మ్రలికంపు బెంతలో
పసికూ సలను నిల్వ -బంచినారు. —బలిజేపల్లి

హిందు మాతానురా, -దయ్యారు వినర,
లోక మాతానురా! దయ్యారు వినర!
నా దబ్బు తిని నీవు, నా బిడ్డలను జంప
నీ చేతులెట్టాడెరా! —నీతిలేని వాడ! హిందు మాతానురా!
మానవతులకయ్యో, మానభంగము జేసి
మానహీనుడవగుచు, మనియెద వెన్నాళ్లు
హిందుమాతానురా ! దయ్యారు వినరా!
లోకమాతనురా ! -దయ్యారు వినరా ! —కొండవల్లి

ఏడనున్నాడో, శ్రీగాంధి దేవు-దేడనున్నాడో !
ఏడనున్నాడో!—ఆ—జాడ దెలియరాదు
నాడుకెయిరా ప్రజల-కీడు బాపిన తండ్రి (ఏడ)
పాంచాల పుత్రికల-పరిభవంబుల గాంచి
మించివేచన, ననుభ-వించిన ఋషి తుల్యు (దేవ)
—నెల్లూరు వెంకట్రామ నాయుడు

మరువకు డార్యులారా ! —పంజాబు వధలు
కనుల నీరుగారునుగా —కరుణలేక యా దయ్య రొనర్చిన
వధవినిన!! కనుల నీరుగారునుగ !
జలియన్ వాలాబాగున చచ్చిన—జనము లెక్క తెలియదుగా !
అబలలు బాలకులెందరీల్గిరో — అసలే తెలియదుగా.

దీనికి ప్రతిక్రియగా గురుదేవ్ శ్రీరవీంద్రనాధఠాకూర్, ప్రభుత్వ మొసంగి నట్టి 'సర్' ! బిరుదమును విసర్జించిరి— వెంటనే మౌలానా షౌకతాలీతో మహాత్మాగాంధీ దేశమెల్లెడల పర్యటన చేసిరి ఈ పర్యటన సందర్భమున 1920 ఆగస్టులో విజయవాడలో మహాజన సమూహమున నుపన్యసించివెడలిరి 1920 సెప్టెంబరులోకలకత్తాలో శ్రీలాలాలజపతిరాయ్‌గారి అధ్యక్షతన అవసర కాంగ్రెసు మహాసభ జరిగినది

మహాత్మా గాంధీజీ అసహాయోద్యమతీర్మానము ప్రవేశపెట్టగా, సభ ఏకగ్రీవముగా ఆమోదించినది మరల 1920 డిశంబరులో నాగపురములో జరిగిన కాంగ్రెసు మహాసభ యీ తీర్మానమును ధృవపరచినది ఆ తీర్మానము సారాంశము, గౌరవ పదవులు, బిరుదులు విసర్జించుట, న్యాయస్థానములు, కళాశాలలు, శాసనసభలను బహిష్కరించుట

మాకొద్దీ తెల్లదొరతనము-
మా-ప్రాణాలపై పొంచి-మానాలు హరియించె. ॥ మాకొద్దీ॥

దండాలండోయ్-మే-ముండలేమండోయ్! బాబు!
ఈ సైతాను ప్రభుతనింక-సాగనీమండోయ్! బాబు'

అను గీతములు భారతాకాశమున మారుమ్రోగినవి.

## విజయవాడ సమావేశము

విజయవాడలో 1921 మార్చి 31, ఏప్రియల్ 1 వ తేదీలలో అఖిల భారత కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘ సమావేశము జరిగినది ఇది లోగడ జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభలకంటె మిన్నగ జరిగినది ఆనాటి సభకు, ప్రముఖ కాంగ్రెసునాయకులైన, మహాత్మా గాంధీ, కస్తూరిబా గాంధి ఆలీ సోదరులు, వల్లభభాయి పటేలు, విఠలుభాయి పటేలు, జమునాలాల్ బజాజ్, మోతీలాల్ నెహూౄ, జవాహర్‌లాల్ నెహూౄ, లాలా లజపతిరాయి, చిత్తరంజన దాసు, రాజేంద్రపసాద్, సరోజినీదేవి, అజాద్, అన్సారీ, కిచ్లూ, సత్యపాల్, గిద్వాని, సేన్‌గుప్తా, టండన్, రాజాజీ, ప్రకాశం, డాక్టరు పట్టాభి, వెంకటప్పయ్య, సాంబమూర్తి, గిరి, ఉన్నవ, కృపానిధి మున్నగువా రెందరో వచ్చిరి. వారి దర్శనార్థము వెడలిన లక్షలాది జనముతో రైళ్లు, రోడ్లు, విజయ వాడ పట్టణమంతయు క్రిక్కిరిసిపోయినది ఎచ్చటవిన్నను, యెచ్చటగాంచినను, "మహాత్మా గాంధీకీ జై, భారతమాతకు జై" నినాదములే. లోగడ కలకత్తా నాగపురము కాంగ్రెసుల తీర్మానము పురస్కరించుకొని, గాంధీజీ ఆదేశాను సారము, కోటిమంది కాంగ్రెసు సభ్యులను జేర్చుట, తిలకు స్వరాజ్యనిధికి కోటి రూపాయలు వసూలుచేయుట, ఇరవైలక్షల రాట్నములు పెట్టుట మొదలగు తీర్మానములు యేకగ్రీవముగా సభలో ఆమోదింపబడి, జాతికి నూతన

చైతన్యము కూర్చి, కార్యరూపమునకు అంకురార్పణ చేసినట్లు అయినది. నా డాంధ్రావనిలో మారుమూలలనుంచి గ్రామ గ్రామములనుంచి. పల్లె పట్టణముల నుంచి జనము తండోపతండములుగా విచ్చేసినారు. ఆ జనప్రవాహమున జాతీయ గేయములు గానముచేయుచు, ప్రజల నుత్తేజపరచినవారు. రాజమహేంద్రవరము, కేసరీ సమాజమువారు, చీరాల పేరుడు శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి రామదండు సేన మొదలగు అనేక సమాజములు, మురాలు మురాలుగా వచ్చి గానముచేసినవి నేల యీనినట్లు లక్షలాది జనముతో పరివేష్టించియుండిన, ఆ సభ దేశభక్తులకు నేత్రపర్వమేగాక విముక్తి విధానముగా కనిపించినది. గాంధీజీ నాయకత్వమున విరాజిల్లిన యీ సభ శ్రీరామ పట్టాభిషేకోత్సవమువలె నేత్రపర్వమైనది త్యాగధనులైన యీ సమరయజ్ఞాహోత్రులగు నాయకమణుల దర్శనమే భాగ్యముగ ప్రజల మనఃపద్మములు దేశభక్తిపూర్ణములై పరిఢవిల్లినవి. నాడు గానముచేయబడిన గేయపుష్పగుచ్ఛములు, దేశ మాతృపీఠార్చనగ. భారతావని యెంతగనో యానందించినది

మహాత్మా గాంధీ దర్శనమె—పావనము
కలుష హరము—కలుగుముదము
పావనులచేయు—ఆ నామము.
మమ్ముబోవ—మహినివెలసితివి—మహాత్మా గాంధీ
మమ్ముబ్రోవ మహినివెలసితివి (మంగిపూడి)
జగద్రక్షకుడు—గాంధిమహాత్ముడు—జనులందరు
మీరెరుగండిః (జగన్నాథదాసు)
జగతిని ధర్మము స్థాపనసేయగ—జన్మించిన హరి, యితడండిః
(కొండపల్లి)

గాంధీమహాత్ముండు—భారతమాతః
నీ ముద్దుకొడుకుండంగ—భారతమాతః
మాకేమియును భయములేదు—భారతమాత,
మాకేమియును కొదువలేదు—భారతమాతః

ఇంద్రకీలాద్రియైన విజయవాడలో అసహాయోద్యమ దుందుభిమ్రోగినది. శాంతిసమరమునకు జాతి సమగ్రముగా ఆయత్తమైనది. గాంధిగారి అసహా

యోద్యమ శంఖారావము వీనుల సోకినంతనే, న్యాయవాదులు తమ వట్టాలను విసర్జించి, కోర్టుల బహిష్కరించి, యుద్యమ నాయకత్వమునకు కూడ పూను కొనిరి. ఎందరో మేధాసంపన్నులగు విద్యార్థులుకూడ తమ పాఠశాలవిద్యకు స్వస్తిచెప్పి బయటకేతెంచి, ఉద్యమప్రచారమున లీనమైరి. ప్రభుత్వోద్యోగులు బిరుదులను విసర్జించి, కొందరు తమ తమ పదవులకు రాజీనామాలిచ్చిరి. ఎందరో గ్రామోద్యోగులు, కరణము, మునసబులు తమ దస్త్రములు కట్టగట్టి విసరివైచి, బైటికివచ్చిరి భారతదేశమునకు రానున్న వేల్సు యువరాజునకు స్వాగత మీయవలదని తీర్మానించిరి. శాసనసభలకు నిలబడిన యభ్యర్థులకు వోటుచేయక, ఖాళీపెట్టెలను వంపగల స్తోమతు ప్రజలకు చేకూరినది. వేల్సు యువరాజు ది. 17–11–1921 న బొంబాయి చేరిన రోజు దేశమంతటయు హరతాళము. నాటిగేయము

ఏమయో–యువరాజ! ఎందుకొచ్చావయ్యా
ఎందుకొచ్చావయ్యా! ఏమితెచ్చావయ్యా! ఏమయో! (కొండపల్లి)

లోకమాన్య బాల గంగాధర తిలకుమహాశయుని ప్రథమవర్ధంతి దినమగు 1921 ఆగష్టు 1 వ తేదీనాటికి, ప్రోగుచేసిన విదేశ వస్త్రదహనజ్వాలలు యూరూర, వాడవాడల ప్రజ్జ్వరిల్లినవి. గాంధిగారి సహాయనిరాకరణోద్యమము నకు తోడు, దేశ పురోభివృద్ధికి, నిర్మాణకార్యక్రమము చేబూనినగాని యుద్య మము బలవత్తరముకాదని, ప్రచారము కొనసాగెను. మరల పల్లెలలో అటకల కెక్కిన, బూజువట్టిన రాట్నముల దింపి వడకుపని ప్రారంభించుటచే యింటింట రాట్నముగృహలక్ష్మిగ, నూత్న కళలతో రాజిల్లు నదవకాశ మేర్పడినది. సంస్కరణకు, సీతానగరం గౌతమీ సత్యాగ్రహాశ్రమము, పల్లెపాడు గాంధీ ఆశ్రమము, కావూరు వినయాశ్రమము, కొమరవోలు గాంధీయాశ్రమము మొదలగున వెన్నియో స్థాపింపబడి, గాంధీ యుద్యమమునకు వలయు దళముల రూపొందించు దివ్యసాధనా మందిరములైనవి. ఈ నిర్మాణకార్యక్రమమున నూలువడుకుట, ఖద్దరునేత, గృహపరిశ్రమల అభివృద్ధి,స్వదేశీవస్తుప్రోత్సాహము మొదలగునవి జాతీయ కార్యక్రమములుగా చేకొనిరి

యుగయుగములుగ, జాతినుండి అస్పృశ్యులుగ, దూరస్థులుగ పరిగ ణింపబడిన, ఆది ఆంధ్ర పంచమ మొదలగు నిమ్నజాత్యుద్ధరణమునకు, ఒక్క

మ్మడి పూసుకున్నది. ప్రజానీకమున నేడవవంతగు, యీ హరిజనులిట్లేవెనుక బడి మ్రగ్గినచో దేశ పురోభివృద్ధికి, ఐక్యమునకు, గొప్పముప్పు వాటిల్లునని, వారికి కూడ సమాజమున, విద్య, సహజీవనము, సమాన ప్రతిపత్తి గౌరవములు లభింపజేయనిదే సరియైన స్వరాజ్యముకాదని పెద్దలందరు హరిజనసేవ కెంతయోపాటుపడిరి విజయవాడ సమావేశము ప్రజలకు చేకూర్చిన 'ప్రోజ్జ్వల శక్తిలో' త్యాగము, శీలము ముఖ్యాదర్శములు నాడా సమావేశమున, చీరాల నుండి వచ్చిశ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి రామదండు సేన వందలకొలది, చేకర్ర లతో ఆపాదమస్తకము రక్తవర్ణ కవచములు ధరించిన సేవకులు, శిక్షితులైన పోలీసు దళముపలె నిలచి, నాటి సభను ప్రశాంతముగ చక్కదిద్ది, క్రమశిక్షణ కొకపారము నేర్పినట్లయినది మరియొకప్రముఖ సన్నివేశము సభను తేజవరచినది ఆనాడెందరో సతీమతల్లులు, పురుషులు, బాలబాలికలు స్వరాజ్యనిధికి కానుకల వర్షము కురిపించిరి. అందునొక యుత్సాహ యువతి కీ. శే. మాగంటి అన్న పూర్ణాదేవి మేన గల నగలన్నింటిని స్వరాజ్యనిధికి సమర్పించి, కట్టిన విలువ గల పట్టు వస్త్రములు, అగ్నిహోత్రమున కాహుతిజేసి, ముతక ఖద్దరుచీర ధరించి స్వాతంత్ర్య సమరమున దుమికినది. ఈ మహాదృశ్య మెంతమందినో త్యాగ శీలురుగను, జాతీయ భావోద్రేకులుగను ఒనర్చెననుటలో సందేహము లేదు విదేశవస్త్ర బహిష్కరణకై ప్రచారము సాగెను కోట్లకొలది ధనము, మద్య పానము క్రింద వెచ్చించు, అమాయకులకు, త్రాగుడు నిషేధము గూర్చి ప్రబో ధమేగాక, ప్రజల్లో, కల్లుగీతకు, తమ తాడిచెట్లనివ్వరాదను ప్రచార మూరూప ప్రాకెను.

ప్రభుత్వమునకు బ్రతుకుతెరువు ఆయువుపట్టు ప్రజలుచెల్లించు పన్నులు, ఆ పన్నులు ప్రజలు చెల్లించకుండ సరికట్టినచో ప్రభుత్వపు ఆట కట్టించుటయే గాక, ప్రభుత్వమునకొకపరి కనువిప్పయి,ప్రజదగ్గరకు రాజీకి దిగిరాక తప్పదని పన్నుల నిరాకరణోద్యమమునకు అంకురార్పణ జరిగినది గుజరాతులో, గాంధీజీ, బార్డోలీ, ఆనంద తాలూకాలలో పన్నుల సమిష్టి సత్యాగ్రహమునకు ప్రజల నాయకత్వవరచినాడు. 1921 సంవత్సరాంతమున, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు విజయవాడలో సమావేశమై, కృష్ణా, గుంటూరు గోదావరి జిల్లాలలో కాంగ్రెసు ఉత్తర్వువచ్చువరకు, పన్నుల చెల్లింపు నిలుపుదలచేయవలెనని తీర్మానించినది కృష్ణాజిల్లా పామర్రులో, రైతు సమావేశముజరిపి, పన్నుల నిరాకరణోద్య

షమము గురించి చర్చించి కార్యరూపమునకు హెచ్చరికచేసినది. ఈ ప్రచారమున రేయింబవళ్లు శ్రమపడిన శ్రీ చెఱుకువాడ వేంకట నరసింహం గారిని, వేదాంతము శంభుశాస్త్రిగారిని, ప్రభుత్వము చట్టవ్యతిరేకము క్రింద బంధించి, శిక్ష విధించినది. తరువాత యీ యుద్యమ ప్రచారమున అనేకమంది పెద్దలను నాయకులను, యరెస్టుచేసి కారాగృహముల కంపిరి. ఆంధ్ర దేశమంతట, అసహాయోద్యమ ప్రచారము మూలముగా చాలచోట్ల, కల్లు సారాయి దుకాణముల పాటలు పాడలేదు. పికటింగు మూలముగ కల్లు, సారాయి దుకాణములెన్నియో మూలబడినవి చీరాల, పేరాల మునిసిపల్ పన్నులు బహిష్కరణోద్యమమున తొలి త్రోవతొక్కిన శ్రీ దుగ్గిరాలతో వారిని అరెస్టుచేసి శిక్షవిధించిరి

1922 సంవత్సరాంతమున,సమష్టి శాసనోల్లంఘనము చేయుటకు,దేశము సిద్ధముగనున్న సంగతి విచారించుట కొకసంఘము శ్రీ మోతీలాలు నెహూౄ నాయకత్వమున గుంటూరు జేరినది నాడు ప్రభుత్వము ప్రజ నరికట్టదలచి, 144 సెక్షను ప్రయోగించి, చేత జాతీయ జండాగల వారినందరిని, అరెస్టు చేసి, నాల్గుదినముల తరువాత వారిని విడుదలచేసినది ఇంతలో గోరక్‌పూర్‌జిల్లాలో (యు పి) చౌరీచౌరాలో బయలువెడలిన, ప్రజాదౌర్జన్యములకు గాంధీగారిని, ప్రధాన ప్రోత్సాహకారకుడని, ప్రభుత్వము రాజద్రోహనేరము క్రింద, అరెస్టు చేసి, ఆరు సంవత్సరములు శిక్షవిధించి జైలునకంపినది. ఇది సహాయనిరాకరణోద్యమమునకొక చెంపపెట్టయినది. గాంధిజీ, తన అహింసాత్మక యుద్యమునకిది కళంకమని భావించి, విచారణలో వాదింప నిష్టపడలేదు. వెంటనే పన్నుల నిరాకరణోద్యమము నిలుపుదల జేసెను.

## పల్నాడు సత్యాగ్రహోద్యమము

పన్నుల నిరాకరణోద్యమము నిలిపివేయబడిన పిమ్మట కూడ గుంటూరు జిల్లా రైతులకు కొరడా దెబ్బల బాధలు తప్పలేదు. శ్రీ కొండా వెంకటప్పయ్య గారిని అరెస్టు చేసి, ఒక సంవత్సరము శిక్షవిధించిరి

ఇంతకు పూర్వము, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో అటవీశాఖోద్యోగులు మాటిమాటికి ప్రజలను పీడించుటచే, ప్రభుత్వముపై ప్రజలొక్కుమ్మడి తిరుగుబాటుచేసి,చెల్లింపవలసినపుల్లరి చెల్లింపవలదని పట్టుబట్టిరి ఈ యుద్యమము

తీవ్రమై, ప్రభుత్వోద్యోగులకు, ఉప్పు, నీరు చిక్కకుండా ప్రజకట్టుగట్టినది ఈయుద్యమ నాయకుడు మించాలపాడు వాస్తవ్యుడు, వీరుడు, కన్నెగంటి హనుమంతుని, 30 మంది పోలీసులు చుట్టుముట్టి కాల్చిచంపిరి దీనితో గుంటూరు మండల మంతయు అట్టుడికినట్లు, తీవ్రాందోళనచెలరేగి గొప్ప సంచలనముకలిగినది మహాత్మాజీ పన్నుల నిరాకరణోద్యమము నిలుపుదల జేసినను గుంటూరు మండలము, సరకుగొనక, బాధ్యతకొని సాగింప నిశ్చయించి పురోగమించినది

## పెదనందిపాడు పన్నులనిరాకరణోద్యమము

ఈ సమయమున, గుంటూరు జిల్లా పెదనందిపాడు ఫిర్కాలో, పన్నుల నిరాకరణోద్యమమున, ప్రభుత్వోద్యోగులకు కావలసిన వస్తుసంబారములందకుండ ప్రజాసమూహము కట్టుకట్టుట, కలెక్టరు రూథర్ ఫర్డుకు కన్నెర్రయినది వెంటనే తన సేనా సమూహముతో, ఆయుదబలముతో, యీ యుద్యమమునణగ ద్రొక్కి రూపుమాపవలెనని, ప్రజలపై ప్యూనిటివ్ టాక్సు విధించి, ఆ పన్ను వసూలుచేయ మిలటరీ సేనలు ప్రత్యేకముగ రాఎంచి భయోత్పాతము కలిగించి, మారణ హోమము చేయుటకైన వెనుదీయక, మిలటరీని ప్రజలపైకి విచ్చలవిడిగా వదలిపెట్టినాడు. నాడా మిలిటిరీ గావించిన ఘాతుక కృత్యము లింతింతయని చెప్పనలవికాదు కాని ప్రజలేమాత్రము శాంతిగోల్పోక, నాయకుల యాజ్ఞల పాటించి, గాంధీ ఉద్యమమునకు బలము చేకూర్చిరి

శిస్తు వస్తువసూలు చేయకే విసరిరి కరణముల్ దస్త్రిముల కట్టగట్టి
జప్తు చేసినయాస్తి చౌకవేలమువేయ పాటబెట్ట దెవండు, పాడరాదు
బైటికి గొంపోవ బండ్లపైనేదేని కాడి క్రిందకు యెద్దు కదలిరాదు
నిప్పు నీరుపాలు ఉప్పైన దొరకదు పల్కరింపరాదు బాలుడైన

బ్రిటిషుపాలన స్థంభింప వీర కంక
ణములు దాల్చిరిలన్, పెదనందిపాడు ప్రజలు......

చూడియావులదునుమాడి భక్షించు రాక్షసమూక ధాటికి కదలిపోక
మానినీ నతులనవమానింప వెడలు మూర్ఖులకు లొంగక, శాంతి గోలుపోక
కట్టెదుటన్ కొల్లగొట్టుయాస్తుల కాగ్రహింప కహింస యొక్కింత విడక,
రేయిబవలు దద్దరిల్లునటుల్ సేనప్రేల్చు ప్రమోతలకు, కంపింపబోక,

నాయకులయానపై పెదనందిపాడు
శాసనోల్లంఘనమున ప్రశంసనొందె
అపర 'బార్డోలి' యన, మన ఆంధ్రభూమి
ప్రబల యశ మొందె.

యీ విధముగ పెదనందిపాడు ఫిర్కా అపర 'బార్డోలీ' వలె, పన్నుల నిరాకరణోద్యమమున, ఆదర్శముగ నిలబడినది ఈ సందర్భమున, నాయకు లందరిని అరెస్టుచేసినది ప్రభుత్వము. గాంధీగారి నిర్బంధమువలన దేశములో, మాంద్యము, నిరుత్సాహమేగాక, కాంగ్రెసులో కూడ చీలికలేర్పడినవి. తరు వాత పన్నుల నిరాకరణోద్యమమున కిది యదను కాదని విచారణ సంఘము ననుసరించి, ఉద్యమము నిలుపక తప్పలేదు భారత రాజకీయములలో పలు మార్పులు కలిగినవి. 1922 గయా కాంగ్రెసున, శ్రీ చిత్తరంజనదాసు అధ్య క్షతను అంగీకరింపబడిన శాసనసభాప్రవేశ తీర్మానము. 1922లో మౌలానా మహమ్మదాలీ అధ్యక్షత క్రింద కాకినాడలో జరిగిన కాంగ్రెసున మరల ఆమో దింపబడినది. 1925 సెప్టెంబరున పాట్నాలో జరిగిన సమావేశములో 'శాసన సభా ప్రవేశ పక్షము' 'నిర్మాణకార్యక్రమ పక్షము'లుగా కాంగ్రెసు రెండు పక్ష ములుగావిడిపోయినది 1927లో మనదేశమునకు రానున్న సైమను కమీష నును బహిష్కరింపవలెనని తీర్మానించిరి. శ్రీ మోతీలాల్ నెహ్రూ అధ్యక్షత క్రింద 1925లో జరిగిన కాంగ్రెసు సభ, అధినివేశ ప్రతిపత్తి యేర్పరచుట కొక సంవత్సరము గడువొసంగినది...ప్రభుత్వమునకు, కాని ప్రయోజనము లేక పోయెను 1929 డిశంబరు 23న గాంధీ-ఇర్విను ప్రభువుల సంప్రదింపులు నిష్ఫలముకాగా, 1929 డిశంబరు 31 తేదీన, పండిట్ జవాహరులాల్ అధ్యక్షత క్రింద లాహోరు కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్యం తీర్మానమంగీక రింపబడి, తొలిగ, స్వాతంత్ర్య పతాకము యెగురవేయబడినది. 1928లో భారతదేశమున కీయవలసినరాజ్యాంగ సంస్కరణముల గురించి విచారించుటకు మనదేశమునకు వచ్చిన 'సైమన్ కమీషన్, దేశమంతట బహిష్కరింపబడినది, ప్రజలు తండోపతండములుగా నల్లజెండాలను ధరించి, 'సైమన్ గోబ్యాక్' 'తిరిగిపో సైమన్' 'వెడలిపో సైమన్'అనునినాదములతో యూరేగింపులుజరిపిరి

నాడు మద్రాసులో యీసందర్భమున బయలుదేరిన ప్రజలపై ప్రభుత్వము తుపాకులు కాల్చినది. ఎందరో మరణించిరి వెంటనే యిది విన్న ఆంధ్రకేసరి

టంగుటూరు ప్రకాశం పంతులుగారు జెండా చేబూని మత్తేభముపై కురుకు కేసరి వలె ముందున కురికి 'నన్నుపోనీయండి ముందుకు' అని......

గంభీర నిస్వన కాంస్య కంఠమ్మున, ఖంగునమ్రోయు
వాక్ప్రౌఢిమమ్ము

మరఫిరంగులకేని మారొడ్డి రొమ్ము, పోరాడు
నిర్వ్యక్రమ పరాక్రమమ్ము (గురుజాడ)

పోలీసులడ్డగించినను వెనుదీయక, నన్ను ముందు మీరు కాల్చండి, నేను ముందుకుపోయి తీరవలెనని, గుండెనెదిర్చి నిలబడిన సాహసవీరుని, గర్జనకు బ్రిటిష్‌సేన యెచ్చటిదచ్చట ఆగి, తెల్లమొగముపైపక తప్పలేదు. కాంగ్రెసు, ముస్లింలీగు, మితవాదులుకూడ బహిష్కరించిరి దేశమంతట హరతాళములు, సమావేశములు, యూరేగింపులు జరిగినవి. లాహోరులో కూడ మహానాయకుడు లాలా లజపతిరాయి నడిపిన యూరేగింపుపై బడి, పోలీసులు లాటీలతో క్రూర ముగ గొట్టి బాధించిరి నాయకుడగు లాలాజీ, స్వహతప్పునటుల కొట్టబడిన లాటీదెబ్బలకు నేలకొరిగి, కొలది దినములకు మరణించినాడు. కాని నాడాతని ప్రత్యేకముగ బాధించిన, పోలీసుఉద్యోగి, సాండర్సును, 1928 నవంబరులో, తదభిమానులు బలికొనక తప్పలేదు.

## పాంచాల కేసరి (కవిపాదుషా...పువ్వాడ)

ధూమ శకటాన సైమను, దొరకు నెదుట
నల్ల సిడముల గొని, మును, నడచి నిలుచు
లజపతి, యురమ్ము, బడితె వర్షమ్ము వట్టెఁ
దోడి పంచాననమ్ములు తూగియుండ,

పాంచాల వీరులు వదను పెట్టిన కత్తి మొనలెల్ల తళ తళ మనియె నేని,
పాంచాల కేసరుల్ వని పడి తమ కోర మీసాల నొకచుట్టు మెలిపిరేని
పాంచాల యోధ సంప్రార్థనకీవు కన్ బొమలూచు పుణ్యానబోయి తేని,
పాంచాల హరిరాజి పాథోధియల పోలె నడతెంచి యొకమారు కదిగినేని,

ఆంగలేయులే కాదు, దిగంత దంతు
లైన, బాంచాల సింహాల నాపగలవె
మోటు లాటీల నీ బొమ్ము మోదినప్పుడు
శాంతమూనితిగాని, పాంచాల సింహ!

ఉప్పు సత్యాగ్రహము ప్రారంభమునకు ముందు కృష్ణాజిల్లాలో బందరు నకు 8-2-1930న గవర్నరు రాక సందర్భమున నాతని బహిష్కరింప నల్లజెండాల ప్రదర్శనకై ది 1-2-1930 జిల్లా కాంగ్రెసు తీర్మానుసారము శ్రీ బొబ్బా వేంకటశేషయ్య, (దేశాభిమాని, జిల్లాకాంగ్రెసు కార్యదర్శి,)గొట్టిపాటి బ్రహ్మయ్య కొడాలి ఆంజనేయులు, తల్లాప్రగడ రామారావు వల్లూరు రామారావు, అన్నే వెంకటరత్నం, గూడూరు వెంకటాచలం, వడ్లమూడి సత్యనారాయణ, బొబ్బా ఆదినారాయణ, బొబ్బా రంగారావు మొదలగువారు నల్లజెండాలు ప్రదర్శించి అరెస్టుకాబడి శిక్షింపబడిరి.

## ఉప్పు సత్యాగ్రహము (1930 ఏప్రియల్ 6)

స్వాతంత్ర్య స్థాపనకొరకు శక్తివంతమైన పోరాట మవసరమైనది. ప్రభుత్వమునెదిరించి, స్వాతంత్ర్యము సంపాదింపవలెననిన సమిష్టి శాసనోల్లంఘన మొకటియే శరణ్యము. దానికి నాడు జలియన్‌వాలాబాగు దురంతములు ప్రతిక్రియగా సాగిన జాతీయవారమగు ఏప్రియల్ 6 వ తేదీన, దేశమంతటను ఉప్పు సత్యాగ్రహము ప్రారంభించుటకు మహాత్మాగాంధిగారి ఆదేశమైనది దానికి పూర్వము 1930 మార్చి 11వ తేదినాటి సాయింతనము, మరునాడుదయము సాగింపబోవు దండి ఉప్పుసత్యాగ్రహము గురించి, పదివేలమందిగల సభలో మహాత్మాగాంధి యుపన్యసించి, ది 12 మార్చి ఉదయము, జాతీయభావోద్దండులగు 79గురు అనుచరులతో సబర్మతీ ఆశ్రమమునకు 240 మైళ్ళ దూరమునగల దండి సముద్రతీరమునకు, రెండుమైళ్ళపొడువున తీర్చినడచు దండియైన దండుతో, గాంధీజీ వెడలి తొలిగ ఉప్పుసత్యాగ్రహము చేసిరి. యావద్భారత దేశము ఏప్రిల్ 6 వ తేదీన చేసినది. నాడు, వారిననుసరించిన, ధీరవీరగణములో మనఏర్నేని సుబ్రహ్మణ్యంగారొకరగుట, మన ఆంధ్రదేశపు అదృష్టము- ఆయా స్థానిక నాయకులచేతిక్రింద, గంజాం, విశాఖపట్నం, జిల్లావారు, నౌపడాలోను, గోదావరి జిల్లావారు కాకినాడ, చొల్లంగిలోను, కృష్ణా జిల్లావారు బందరు, కోన,

చిన్నాపురం, తాళ్ళపాలెంలోను, గుంటూరు జిల్లావారు చీరాల, గోపవరం, దేవరం పాడులోన, నెల్లూరు జిల్లావారు పల్లెపాడు ఆశ్రమములోను, చెన్నపురివారు చెన్న పురిలోను. వేదారణ్యములో..., అందునిందనక, యాపదాంధ్రావని ఉప్పుసత్యా గ్రహమున పాల్గొన్నది ఈ సత్యాగ్రహమున, ప్రత్యేక శిబిరములు నిర్మించి, జట్టులు జట్టులుగ, శాసనోల్లంఘనమునకు పంపబడిరి ఈ ప్రచారమున, చాలా మందిని నిర్ణీత స్థలములకు జేరక పూర్వమే కూడ అరెస్టు చేసింది ప్రభుత్వము. ఊరూర, పట్టణముల, సత్యాగ్రహులు గేయములు పాడుచు, జండాలతో యూరే గింపులు, సభలు, జరిపిరి. అచట మహాత్మాగాంధీగారు, ఉప్పు కొఠారులపై ముట్టడి సాగింపబోవు దినమునకు, ముందు రాత్రి 6-1-1930 వ తేదీ అర్ధరాత్రివేళ, కరాచీలో వారిని అరెస్టుచేసిరి. ది 21-1-30 న, బందరులో డాక్టరు పట్టాభి, చెఱుకువాడ నరసింహము, స్వామినారాయణానంద, అయ్యదేవర కాళేశ్వరరావు, గంపలగూడెం జమీందారు కోటగిరి వేంకటకృష్ణారావు గార్లకు, శిక్ష విధించిరి. కాకినాడ ఉప్పుసత్యాగ్రహము నడిపిన శ్రీ బులుసు సాంబమూర్తి, వెన్నేటి సత్యనారాయణ, డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, కళా వెంకట్రావు గార్లను అరెస్టుచేసిరి * దరిమిలానడిపిన, వళ్ళంరాజు, మెండపాక రంగయ్య నాయుడు, అన్నపూర్ణయ్య, లింగరాజు, బిక్కిని, కందుల మొదలగు వారిని అరెస్టు చేసిరి. చెన్నపురి శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, గద్దె రంగయ్య నాయుడు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, రామచంద్రుని వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశంపంతులు మొదలగువార్లను, అరెస్టుచేసిరి.

వేదారణ్యములో, శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ, రాజాజీగార్లన, రాయల సీమలో కడప కోటిరెడ్డి, రామసుబ్బమ్మ, శంకర రెడ్డి, సంజీవరెడ్డి, రామకృష్ణం రాజు, కన్నయ్య నాయుడు, వరదాచార్యులు, కల్లూరు సుబ్బారావు గార్లను, విశాఖలో శ్రీ తెన్నేటి విశ్వనాథం, మారేపల్లి రామచంద్రశాస్త్రి గార్లను, నెల్లూరు పల్లెపాడులో వెన్నెలకంటి రాఘవయ్య, బెజవాడ గోపాలరెడ్డి, శ్రీమతి పొణకా కనకమ్మ, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, బొమ్మా శేషురెడ్డి గార్లను, నాపాడలో శ్రీ ఉన్నవ రామలింగం, రావూరు రామకృష్ణారావు, పుల్లెల శ్యామసుందరరావు, జగన్నాథ గుప్త, జానకీ బాయమ్మ, ద్వారకా దీక్షితులు,

*(గమనిక :- కాకినాడ ఉప్పు సత్యాగ్రహము, బుర్రకథ 2 భాగములు, అనుబంధమున చూడుడు)

గౌతు లచ్చన్న గార్లను, పశ్చిమగోదావరిలో కేశిరాజు వేంకటనృసింహఅప్పారావు, శ్రీమతి ద్రోణంరాజు, లక్ష్మీబాయమ్మ, మూల్పూరి చుక్కమ్మ, తల్లాప్రగడ ప్రకాశరాయుడు, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, మాగంటి బాపినీడు, అల్లూరి సత్యనారాయణరాజు, బసవరాజు శ్రీరంగశాయి, డాక్టరు మూల్పూరు రంగయ్య, డాక్టరు జోగయ్యశర్మ, వీరమాచనేని వెంకట నారాయణ, వడ్లపట్లగంగరాజు, ముదిగంటి జగ్గన్న శాస్త్రిగారు, వి బి. నాగేశ్వర రావు, పాలకోడేటి గురుమూర్తి, ప్రకాశరావు మొదలగువారున్నూ, గుంటూరు జిల్లాలో శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గుళ్లవల్లి రామకృష్ణయ్య, నాగళ్ళకృష్ణయ్య, కల్లూరి చంద్రమౌళి, బ్రహ్మాండం నరసింహం గారలున్నూ, శ్రీ కొండా వెంకటప్పయ్యగారు, ఉన్నవ లక్ష్మీనారాయణ గార్ల, నాయకత్వమున, శ్రీచింతమనేని భావయ్య, శరణు రామస్వామి చౌదరి, తుమ్మల సీతారామమూర్తి, మంతెన వెంకట్రాజు, కన్నెగంటి సూర్యనారాయణ, గుళ్ళపల్లి పున్నయ్యశాస్త్రి, ఇటికాల రామమూర్తి మొదలగు వారెందరో అరెస్టు అయిరి దరిమిలా కృష్ణాజిల్లాలో డాక్టరు వెలిదండ్ల హనుమంతరావు, ఘంటశాల సీతారామశర్మ, వేలూరి యజ్ఞనారాయణశాస్త్రి, పేట బాపయ్య, అన్నే కేశవాచార్య శనగవరపు వెంకటసుబ్బయ్య, మల్లాది రామచంద్రశాస్త్రి, శంకర వెంకట్రామయ్య, ఇంటూరి వెంకటేశ్వరరావు, గద్దెలింగయ్య, భాగవతుల సుబ్బరామయ్య, పాదుర్తి సుందరమ్మ, రాయప్రోలు సీతారామశాస్త్రి, నూకల వీర రాఘవయ్య, కల్లూరి పావయ్య, డాక్టరు శివలెంక మల్లికార్జునరావు, దుగ్గిరాల రాఘవచంద్రయ్య, పిడికిటి రామకోటయ్య, కాకాని వెంకటరత్నం, జొన్నవిత్తుల కుటుంబ సుబ్బారావు, పోతిన గణపతి, అద్దేపల్లి గురునాధ రామశేషయ్య, పెదర్ల వెంకటసుబ్బయ్య. మల్లెల శ్రీ రామమూర్తి, ఊటుకూరు లక్ష్మీనరసింహారావు. అన్నే అంజయ్య, కాకుమాను లక్ష్మయ్య చౌదరి, మరుపిళ్ళ చిట్టి, (చిన అప్పలస్వామి) కాట్రగడ్డ మధుసూధనరావు మొదలగువారు అరెస్టు అయిరి. దరిమిలా కృష్ణాజిల్లాలో ముట్నూరి కృష్ణారావు, తంగిరాల వీర రాఘవరావు, తంగిరాల సీతారామమ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, వల్లభనేని రామ బ్రహ్మం, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, కొల్లిపర సూరయ్య, ఆత్మూరి నాగేశ్వరరావు, అట్లూరి శ్రీరాములు, గుళ్ళపల్లి రామబ్రహ్మం, ముత్తేవి కేశవా చార్యులు, కాటూరి వెంకటేశ్వరరావు, అయినంపూడి శ్రీనివాసులు, ఎర్నేని

సుబ్రహ్మణ్యంగారు, యీసూర్యనారాయణగారు, గుళ్ళపల్లి శ్రీరాములు, రామిరెడ్డి, సుబ్బారెడ్డి, కానూరి రామానందం, కాశీనాథుని పూర్ణమల్లికార్జునరావు, కానూరి వెంకటరత్నం, కానూరి బలరామయ్య, బొబ్బా వీరభద్రుడు ఇందు ముఖ్యముగ నా యెరిగినంతవరకు పెద్దలపేర్లను మాత్రముపేర్కొన గలిగితిని. ఇంక ఎంత మందిపెద్దలో సత్యాగ్రహమునపాల్గొనిరి తెలియక వార్లపేర్లను జేర్చలేదు. వీరు పైన పేర్కొనినవారి దేశసేవకుమాత్రము తీసిపోరనిన, మన్నింప గోరెద. నాడు వీరావేశముతో సత్యాగ్రహులు పరవశులైపొక్కుచు పాడిన గేయములు

## బాపూజీ యరెస్టు (16-4-1930)

వింటివా: బ్రిటిషు వీరుల ధైర్యము-తంటాలుపడి
పట్టిరంట-బాపుజీని, అర్ధరాత్రి—ఒంటిగంటకు ॥వింటివా॥
జైత్రయాత్ర వేగ సాగించి, సాగించి,
చేరె: గాంధీజి కరాడీ
బడలి, నిద్ర చెందెను సేనతోడి,
అర్ధ: రాత్రి తోడనె తెల్లవాడి
సేన: వెలిగించె టార్చి, పైబడి
లేవ: పనియున్నదయ్యా, నాతోడి,
అనగ: బంది జేసితిమని, బాపుజీని, పట్టిరంటా॥ ॥వింటివా॥

## ఉప్పు పాట (1930 ఏప్రియల్)

ఉప్పు చేవాము, పదండి:

ప్రాణమర్పించియైన, స్వరాజ్యమిచ్చునట్టి (ఉప్పు)

* వారణాసి వెంకటచలం, దండమూడిపూర్ణయ్య, పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి, టి. వి. ఆళ్వారు, సునర్ల నాగేశ్వరశాస్త్రి, పురాణం సూరిశాస్త్రి, దోనేపూడి సీతారామయ్య, కామినేని వెంకటప్పయ్య, వల్లభనేని తులశమ్మ, కౌసల్యమ్మ, గానుగొంట్ల లక్ష్మీనరసమ్మ గుళ్ళపల్లి, నాగయ్య మొదలగు నెందరో వేలకొలదిగ యరెస్టు కాబడి శిక్షింపబడిరి.

---

* ఈయన తిరుచునాపల్లిలో మరణించిరి.

## మా కొద్దీ తెల్లదొరతనము

పన్నెండు దేశాలు—పండుచున్నాగాని-
పట్టెడన్నమె -లోపమండి!
ఉప్పుముట్టుకుంటె - దోషమండి!
నోట మట్టికొట్టి పోతాడండి!
అయ్యో! కుక్కలతో పోరాడి-కూడు తింటామండి
(మా కొద్దీ తెల్లదొరతనము)
మా ప్రాణాలపై పొంచి -మానాలు హరియించె!

## దండాలండోయ్

దండాలండోయ్—మే—ముండలేమండోయ్ ! బాబు!
ఉప్పు పన్ను—పప్పు పన్ను ఊరికెళితేపన్ను బాబు!
కొప్పుకాస్త దేముడికి—మొక్కుకుంటేపన్ను బాబు ।।దండాలండోయ్।।
(గరిమెళ్ళ)

## ఉప్పుపాట

ఉప్పోయమ్మ!—ఉప్పోయమ్మ, ఉప్పోయమ్మ
మా—ఉప్పుకొనరమ్మా ఉప్పోయమ్మ!
ఉప్పో ఉప్పని మే -మూరూర అమ్మెదము!
చప్పున చప్పున మీరీ-యుప్పుకొన రారమ్మా !
ఉప్పేగదాయని—చప్పరింపకుడమ్మ!
ఉప్పుగాదిది—బంగరు-కుప్పా మన పాలిటికి (గరికపాటి మల్లావధాని)

ముప్పదికోట్ల ప్రజల-ముప్పు దీర్చే ఉప్పు
ఉప్పుగాదిది రత్నపు—తిప్పా మనపాలిటికి,
ఒప్పుగ స్వాతంత్ర్య—మొసగేటి దీ యుప్పు
ఉప్పుగాదిది. వజ్రపు—తెప్ప మనపాలిటికి ।।ఉప్పో।।

## బందరు-అరెస్టులు ( 21-4-30 )

డాక్టరు పట్టాభి, చెరుకువాడ, నారాయణానంద, అయ్యదేవర, గంపల గూడెం జమీందారులకు—ఒక సంవత్సరం శిక్ష

నడుములు కట్టి పదండి :
ఇంక తడవేల; జడియక, నడుములుగట్టి పదండి
గడియసైవగలేమీ-కరిన ప్రభుత్వము॥
పట్టాభిగారిని పట్టుకున్న వదలి, పెట్టాము, వదలిపెట్టాము
నోరు గట్టిన, వదలిపెట్టాము,
కాళ్ళుగట్టిన వదలిపెట్టాము,
కట్టి కొట్టి జైలునపెట్ట, విడము
ఇంక నిట్టి దుష్ట ప్రభుత-నెట్టి రాజ్యము గెలువ నడుములుగట్టి పదండి;
చెరుకువాడ నరసింహముతో పోరు, సేయ సంకల్పించె, వీడు
ఇంచు-కరయడు, తన శక్తి నేడు
ధర్మమెరుగడు తొలుదొల్త వీడు
ముప్పై మూడు కోట్ల సింగముల నెదిరి పోరునే
॥ నడుములుకట్టి పదండి ॥

'తత్త్వమసి' యనెడి—తత్త్వము నేర్చి, తన్మయుడై వచ్చినాడు :
లవణ; తత్త్వము గుర్తెరిగినాడు,
ఇచ్చట। తత్త్వము —రుచి చూపినాడు,
జైలు। తత్త్వ మెరుగ వెళ్ళినాడు
యా, ధన్యు నారాయణా, నందుడానందింప ॥ నడుములు ॥
కాశేశ్వరుండెవరో-కాన-డినుమంతైన, కాలకూటము నుమ్మ తనకు
మ్రింగి। భరియింప-జాలడా వెనుక
యోర్చి। తిమి కష్టముల నింత దనుక
ఇంక। భరియింపజాల —మా వెనుక,
కనక। దుర్గాపురీశునితో కదలు - చక చక ॥ నడుములు ॥

వెలమ బొబ్బిలి శౌర్య-వీర్యముల్ రవ్వంత - వినదొ తలపదొ చెరబట్టి।
వీడు। కులుక దల-చెనేమొ। వట్టి ।
ప్రాణముల జీల్చి-చెండాడు। నట్టి
దిద్ది। తెలియదు, తన శక్తి, వట్టి।
దనుచు। తెలసి యాతని -శక్తిపట్టు
బట్టి। కలసి వెంట రండి। వట్టి
మన, వెలమ పులి - కోటగిరి — వేంకట కృష్ణుని జాడ
॥నడుములు కట్టి పదండి॥ (గురుజాడ)

## గేయ - వాఙ్మూలము

ది 8-5-1930 వైశాఖ పూర్ణిమకు, బందరు కరాగ్రహారమున, సంద్రపు నీళ్ళు కాచి ఉప్పు వండి నందుకు 7 గురిని అరెస్టుచేసిరి. అందు శ్రీ తత్వానందస్వామి. మానికొండ సత్యనారాయణశాస్త్రి, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యం, కాశీనాథుని వీరమల్లయ్యగారు, తాడికొండ వీరభద్ర అయ్యవారు, డి వి. ఆళ్వారు, గురుజాడ రాఘవశర్మ, మొదలగువారు అందరికీ 9 మాసములు కఠిన శిక్ష విధించిరి. అందులో రాఘవశర్మను బందరు సబ్ మేజస్ట్రీటు కోర్టులో, సబ్ మేజస్ట్రీటు అడిగిన ప్రశ్నలకు, గేయములో అతని వాఙ్మూలము.

ప్రశ్న - రాఘవశర్మగారూ ?-మీరున్నూ పదిమంది కలసి బందరు కర అగ్రహారమున, ఉప్పు చేశారట నిజమేనా ?
సమాధానము .- ఎక్కడ పదిమంది అండి ?

పల్లె పట్టణముల- పిల్లా జెల్లా కలసి, బందరు రేవున మేము।
ఉప్పు। కొల్లగ వండజేరాము।
సంద్రపు। నీళ్ళు తెచ్చికాచినాము।

ప్రశ్న .—శాసన ధిక్కారము కాదా ?
జవాబు -చట్ట ముల్లంఘించియే, కాచినాము,

కాని। చల్లని ఈ ప్రభుత్వము
సైప। నొల్లక పడద్రోసి-నోరుకట్టెనయ్య॥

ఉప్పు సేయుట మానకింక (దాన)
చప్పున రాజ్యమ స్తంగతము పొందు ॥ఉప్పు॥
నూట నలభై మూడు - దాటీగర చేకొని - నాటకమాడ దలంచె
డెబ్బది। నాలుగొకటి జేర్చి పెంచి
మనల నూటిగ బట్టగనెంచె
వీని ధాటీ మనము వేగ్రహించె
చట్టము నీట గల్పితిమి, లంఘించి
ఉప్పు నీట గల్పితి ముల్లంఘెంచి।
రెప్ప పాటు సైపమి బ్రిటిషు పాలనము ముగిసె ॥నడుములు॥
ఎన్ని సెక్షనులున్న నున్న—వీని నెగుర తన్నిగూల్చుదము మనము।
దీని కన్న మర్మములేదు గనుము।
గాంధి వన్నిన త్రోవిదియ జనుము।
దాన గూలు బ్రిటిషుపాలనము।
ఆపుడె తెల్లవారిబ్రతుకు తెల్లవారునింక
గడియసైపగలే మింగ్లాండు ప్రభుత్వము॥ ॥నడుములుకట్టి పదండి॥

[దీనికి బహుమానము 9 మాసములు కఠినశిక్ష]

ఈ సమిష్టి శాసనోల్లంఘనమున బయల్వెడలినవి మరికొన్ని.

## సైతాను బాధ (1930 మే నెల)

వదలేమీ సైతానుబాధ
ఇంక గడియ గడియకు ప్రాణకంఠమగుచుండె
* తాటిగెలలునరికి త్రాగుడునిషేధించ తరలిన మాపైకి వీడు నిషేధించ
ధాడిచేసి నూటనలుభై మూడు
వెంట నోటికి తగిలించినాడు
న్యాయ మెట్టిదో గుర్తెరుగలేడు
దైవమేటికి సైచె నీకీడు
మమ్ము హద్దు పద్దులేని అల్లరిగుంపంటాడు
॥వదలేమీ సైతానుబాధ॥

* (ఈ యుద్యమమును తొలుత ప్రారంభించి, త్రోవజూపినవారు, శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారు, జమీ గొల్వేపల్లి, కృష్ణా జిల్లా)

లోకోత్తర పురుషుడైన మహాత్మా గాంధిగారు 1921 నుంచి 1947 వరకు సాగించిన అహింసాయుత భారతస్వాతంత్ర్య సమరమునకు నేత. వారికి తోడై బాసటగా నిలచిన అకుంఠిత మేధాసంపన్నులు,అతిరథులు, మహారథులు, మహా భోగులు,త్యాగులు, దేశ సేవాపరాయణులెందరో కలరు. కాక వారిని మించిన ప్రజ్ఞాశాలురుకూడ కలరు కాని, వారి యచంచల దృఢనాయకత్వముక్రింద వీరు లీనమై, తమ సర్వస్వమును దేశమున కర్పించిన మహానుభావులుకూడ వీరందరు. ఇట్టి మహాత్మా గాంధీగారి గురించి యెన్నియో గద్య పద్యగ్రంథములు పాటలు, పద్యములు, గేయములు భారతావని గల సమస్త భాషలలోనే గాక ఖండాంతరముల గల రాజకీయ వేత్తలు, విజ్ఞానపురుషులు, ప్రజ్ఞాధురీణు లెన్నియో గ్రంథములు వెలువరించిరి వెలువడుచున్నవి. ముందింకను వెలువడ గలవు. ఆ అహింసాచక్రవర్తి, కర్మయోగి, మహాత్యాగినిగురించి మహాకవులు వ్రాసిన పద్యములు, గేయములు యిందు ప్రచురించడమైనది. ముఖ్యముగ వారిని ప్రజాహృదయ మెట్లు సంభావించినది

## అవతారమూర్తి (శ్రీ చెరుకువాడ)

సకల ధర్మోపేత—సౌఖ్య సంఘాత  
ఆనంద సంధాయి అయిన భూమాత  
స్వస్థ చిత్తములేక—సౌఖ్యంబులేక  
పాపభారంబింక భరియింపలేక  
వైకుంఠమునకేగి వాపోయిబల్కె  
నారాయణుండు ఆనతియిచ్చె తాన  
జగముల రక్షింప యుగ యుగంబులను  
బహురూపముల దాన ప్రభవింతుననుచు  
ఆపెనోదార్చి యంతర్హితుండగుచు  
వెడలినపిమ్మట వెలసినాడనగ  
గాంధీమహాత్ముండు—కరుణాసాంద్రుండు

నిర్మలశీలుండు—ధర్మస్వరూపి
భారతదేశంపు పారతంత్ర్యమ్ము
బాపనవతరించె బాపుజీగాంధి
సత్యధర్మంబులే శస్త్రాస్త్రచయము
దౌర్జన్య విరహితత్వంబె కవచంబు
రాట్నమే చక్రమై రక్షించుమనల
ఇట్టి గాంధిమహాత్మ నిదే ప్రస్తుతింతు
జయాభి వైభవ దిగ్విజై భవ
వైష్ణవ జనతో తేనే కహియె—జోపీడ పరాయీ జాణెరే

## అతడే వైష్ణవుడు (దామోజీ)

ఇతరుల కష్టము—లెవ్వండెరుగునో
అతడే వైష్ణవుడు.
సతతము పరులకు—సాయముచేయుచు
గతి తానేయని, గరువము పడడో ॥అతడే॥
నాలుకప్రీలిన అసత్యము పల్కడో
పరదానములకై ప్రాకులాడడో ॥అతడే॥
రామనామమున—లీనుడై పోవునో
రాజిల్లు వానిలో- నెల్లక్షేత్రములు ॥అతడె॥

## జగద్రక్షకుడు (కొండపల్లి)

జగద్రక్షకుడు గాంధిమహాత్ముడు జనులందరు
మీరెరుగండి!
జగతిని ధర్మము స్థాపనసేయగ—జన్మించిన హరి యితడండి!
హిందూదేశము నుద్ధరించుటకు—హిందువుడై జన్మించెన్
హిందూసోదరులారా, మీరిది—డెందములోపల దలచండి
॥జగద్రక్షకుడు॥

## గాంధి దేవ (కొండపల్లి)

ఎంతవాడ వెంతవాడవు! ఓ గాంధిదేవ!
నీ వెంతవాడ వెంతవాడవు?
ఎంతవాడవయ్యా, నీవు వంతల నెగజిమ్మినట్టి
శాంతి ధర్మసూత్రములను వింతగాను నిల్పినావు ॥ఎంత॥

## ఈ జన్మ మిక దుర్లభమురా (బసవరాజు)

ఈజన్మ మికదుర్లభమురా ఏజన్మసుకృతమో–యీనాడు బ్రతికుంటె
ఈశ్వరుడె గాంధిగా–ఇల నవతరించాడు
అందులో మముగన్న–హిందూమాతకడుపున ॥యీజన్మ॥
ధర్మదేవతమూర్తి–దాల్చింది గాంధిగా
కళ్లార మనమతని–గాంచి ధన్యులమైతి ॥మీజన్మ॥

## స్వరాజ్య శంఖము (నెల్లూరు వెంకట్రామానాయుడు)

ఏడనున్నాడో! శ్రీ గాంధీదేవు డేడనున్నాడో!
ఏడనున్నాడో? ఆజాడ తెలియరాదు
నాడు కెయిరా ప్రజల కీడుబాపిన తండ్రి
పాంచాల పుత్రికల–పరిభవంబులగాంచి
మించివేదన ననుభవించిన ఋషితుల్యు ॥డేడ॥

## బాపూజీ మాబాప్ (బసవరాజు)

పోర్‌బందర్ కోమటింట–పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి–మెట్టినాడోయ్
కొత్తయేసుక్రీస్తు–అవతరించినాడోయ్
కొట్టగ వగవాళ్ల పొగరు–దించినాడోయ్
హిందూ పైగంబర్–జన్మించినాడోయ్
అల్లాహో అక్బరంటు–అరచినాడోయ్
చీమను సింహాసన–మెక్కించినాడోయ్
రాతి నాతిజేసిన–శ్రీరాముడేనోయ్ ॥పోర్‌బందర్॥

## పరమూర్తి గాంధి (దామరాజు)

కత్తులులేవు శూలమును గాండివమున్ మొదలే హుళిక్కి నో
రెత్తి ప్రచండ వాక్పటిమనేనియు జూటడు కోపతాపముల్
బొత్తిగసున్న అట్టి పరమూర్తి మనోబలశాలి గాంధి చే
యెత్తి నమస్కరించి స్మరియించుడ మెప్పు స్వరాజ్యసిద్ధికిన్.

## గాంధి ఉపాద (కాటూరి)

హరి సృజించెనరుని—అచ్చమ్ము తనపోల్కి
నరుడు తన్ను చాల—హరి సృజించె
ఇనుము పైడిచేయ—నీశ్వరుండేనేర్చు
గాంధిపలుకు—ధర్మగంధ మొలుకు.
కడలివోలె నెల్ల కడల నీశ్వరుండొక
బిందువై వసించు నందు నరుడు
కడలిబాసి బిందువడగారు నిక్కము
గాంధి పలుకు—ధర్మగంధ మొలుకు.

## రాజవన్నసీవే (విశ్వనాథ)

విరిసిన, బోసి నెన్నగవు వెన్నెల రీ తొలినేల నల్దెనల్
కురిసి, మహా సభాజన చకోరములందనియించి, పేదయై
బిరునయి యెట్టివారి దురపిల్లిన, మా వరిపంట చేలు కా
విలి తలలెత్త నీ కలమ వెన్నెలనించె సుధా ప్రవాహముల్.

సీ. నిలువనీడయులేని నిరుపేద దీర్ఘ/నిశ్వాసమ్ము నీకు వింజామరమ్ము
కడుపాకటిని బేదవడు వానిజీరు|కన్నీళ్ళు క్రొంబడి నీకు వెల్ల గొడుగు,
నంఘ దూషకుల దౌర్జన్య భిన్నాత్మని/గుండె నీకును సభా మండపంబు
ఆజన్మ సిద్ధ కారాగారవాసమ్ము దంబు మీరెడు కిరీటంబు నీకు,

తత దరిద్ర ప్రజాహృదంతరము నిరత
మొలుకు రతనాలు నీకొాలు వున్న గద్దె

ఓ విచిత్ర సన్యాసి, నీ వొక్కరుడవె
రాజువన్న, నిజమ్ముగా రాజువయ్య

## హిమాలయోత్తుంగ శృంగం-మహాత్ముడు (బాపిరాజు)

హిమాలయోత్తుంగ శృంగం నీ బ్రతుకు
ఉమాపతి నృత్యరంగం
దేశాల వాంఛిల్లు
ఆశా హృదయమ్లు
నేలొదలి పోలేని
శీతల తలాలలో
జీమూల పంక్తికై
వ్యోమ మర్మముచూచి, ఓసామి!
తమో మదస్వచ్ఛమే (హిమాలయ)

## మా గాంధి (బసవరాజు)

కొల్లాయి గట్టితేనేమి!-మా గాంధి
కులమేదియైననేమి!-మా గాంధి
వెన్నపూస మనసు-కన్నతల్లిప్రేమ
పండంటి మోముపై-బ్రహ్మతేజస్సు ॥కొల్లాయి॥
నాల్గు పరకల పిలక—నాట్యమాడే పిలక
నాలుగువేదాల-నాణ్యమెరిగిన పిలక ॥మా గాంధి॥
బోసినోర్విప్పితే-ముత్యాలతొలకరే
చిరునవ్వు నవ్వితే-వరహాల వర్షమే ॥మా గాంధి॥

## శాంతిదూత (తుమ్మల సీతారామమూర్తి)

ఇతడహింసా రణాచార్యు, డితడభేద్య
సత్యకవచుడు, భువనైక శాంతిదూత,
యుగ యుగమ్ములు కల్పముల్ ముగియుగాక
తరణియై మింట మెరయు, నీతని పతాక.

## అంతా గాంధిమయం (కొండపల్లి)

అంతా గాంధి మయం-యీ జగమంతా గాంధిమయం
అంతరంగమున, మహాత్మ గాంధియె,
వింత రూపముగ వెలసియుండగ-అంతా గాంధిమయం
ఇండియాలో-యింగ్లాండులో, ఆఫ్రికాలో, అమెరికాలో
అంతా గాంధిమయం.

## గాంధీజీ (దామోజీ)

ఎంతో రుచియైనది-శ్రీ గాంధి నామం, బెంతో రుచియైనది,
పంతముగల వైరికైన-చింతనే గద, గాంధినామం
బాపు నామము-గాంధి నామము-చూపు జనులకు సన్మార్గము,
ఆపు జాతి బల దుర్మార్గము-అఖిల మత సమ్మోదము.

## మహాత్మాజీ (ఉప్పులపాటి వెంకయ్య)

ఎవరు దూషించితేనేమి-మహాత్మ
ఎవరు భూషించితే నేమి,
అవతార పురుషుడని,
ఆదర్శప్రాయుడని
దశదిశల్ మార్మ్రోగి,
ధన్యాత్ముడైనావు,
చూపు చూచాడంటె,
సమ్మోహనాస్త్రిమే,
కరము జాపాడంటె
కనక వర్షమ్మే

## గాంధీప్రభ (బసవరాజు)

గాంధి మహాత్ముడు బయలు దేరగా
కలకలనవ్వింది-జగత్తూ, కలకల నవ్వింది
గాంధి మహాత్ముడు చక చక నడవగ,
కంపించిపోయింది భూదేవి-కంపించి పోయింది.

గాంధిమహాత్ముడు-కన్ను విప్పంగా గడగడ వణికింది:
అధర్మం గడగడ వణికింది.
గాంధిమహాత్ముడు నవ్వునవ్వగా, కన్నుల గట్టింది
స్వరాజ్యం కన్నుల గట్టింది,
గాంధి మహాత్ముడు గొంతు విప్పగా గణ గణ
మ్రోగింది, ప్రణవము, గణగణ మ్రోగింది.

## శ్రీగాంధినామం (దామరాజు)

శ్రీ గాంధినామం-మరువాం మరువాం
సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం
మా గాంధినే, మేం, నమ్మేం, నమ్మేం
మరి యితరుల మేము, నమ్మాం, నమ్మాం
దేశచరిత చెవుల-విందాం-విందాం
వేరే కథలు చెవుల-మందాం—మందాం.
లాటీ దెబ్బల మేము-బెదరాం బెదరాం
మేటి తుపాకికి, చెదరాం, చెదరాం
శ్రీ గాంధి నామం—మరువాం మరువాం
సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం
కూడి భారతమంత-గొలుతాం గొలుతాం
నేడే స్వరాజ్యాన్ని-తెస్తాం తెస్తాం
దేశభక్తులు మాకు-సారాం సారాం
దేశద్రోహులు మాకు దూరాం దూరాం

## ఈ కాలపు ఋషి (చెళ్ళపిళ్ళ)

ఆత్మ దవధూత మార్గమ్ము ననుకరించు
నిదియె బోధించు, నితరుల కలవియగునె:
నేస్తలకు దాని తత్త్వము కేవల మొక
గాంధికే చెల్లె, నాతడీ కాలపు ఋషి.

అతని భక్తియు, మరియు నల్లతని రక్తి
అతని భుక్తియు, మరియు, నల్లతని శక్తి
అతని ముక్తియు, వేరు లోకాతిశాయి
అతని చరితంబితరులకు సందబోదు,
ఛండాలుండేనియు, బా
పం దేనియు, గురుడటంచు బలికి న ధీమం
తు ండల శంకురునట్టి డ
ఖండుడు, గాంధియన ,నొరులుగా, రతని నముల్

## గాంధీజీ (దేశభక్త వెంకటప్పయ్య)

కొట్టగ కర్రలేదు, మరి కోయగ ఖడ్గము లేదు, శస్త్రముల్
పట్టగరాదు శాత్రవులు పట్టిన గొట్టిననేమిచేసినన్.
రట్టును రద్దుజేయకను రమ్మని పిల్చిన తోడ బోవుటే
యిట్టిది యుద్ధపద్ధతి, మరెట్టుల గెల్వగ సాధ్యమయ్యెనో

## మహాత్ముడు. (కందుకూరి రామభద్రరావు)

అతడు మెట్టిన మేర పుణ్యాశ్రమంబు
అతనిని వాక్కులు వేద భాష్యాంతరములు
అతని మౌనము లోక భయంకరమ్ము
అతడు పూనిన దీక్ష బ్రహ్మాండ, రక్ష.

## మహాత్మాగాంధి (కరుణశ్రీ)

నలుబదికోట్ల తమ్ముల జీవితమ్ముల కాయనమాట వేదాక్షరమ్ము,
ధీరులనే కర్మ వీరుల గావించు, ఆయనపిలుపు శంఖారవమ్ము
సత్యంబు శాంత్యహింసలకు స్వాగతమిచ్చె, ఆయన బ్రతుకు, మహాప్రయోగ
కొల్లాయితో పిచ్చి పల్లాయి వలెనుండు, ఆయన దీక్ష లోకైక రక్ష.

అతడొక పవిత్రధర్మ దేవాలయమ్ము
అతడొక విచిత్ర విశ్వవిద్యాలయమ్ము,
ఆ మహాశక్తి అంతయింతంచు చూడ
జాల, మతడొక్క పెద్ద హిమాలయమ్ము॥

## గాంధిజీ

"పాల సముద్రమే నడచి వచ్చిన రీతి, హిమాచలాగ్రశృంగాలు"

—దాశరధి

"బోసినవ్వుల మంచిముత్యాలనొలకించుతాత, మన్ననగన్న నేత యితడు"

—గురుజాడ

"కట్టుకొన్నది, యంగవస్త్రము
పట్టుకొన్నది, రాట్నచక్రము"

—చుక్కభొట్ల

"నవ్వవోయి గాంధి! నా బాపూజీ! గాంధి!
మాయాంధ్య పరిపంధి మా మహాత్మగాంధి! నవ్వవోయి!"

—సారధి కృష్ణ

ఇక, స్వాతంత్ర్య సముపార్జనమునకై వారాశించి, నడిపించిన ప్రణాళి కలలో ప్రజాహృదయము నుజ్జ్వలింపజేసినవి కొన్ని ...

## బహిష్కరణోద్యమము

"నిరాకరణమను మిరాయి యిదిగో ! బిరాన రుచి చూడండి!"

—కొండవల్లి

"దేశమాతా సేవ చేయండీ-జనులారా-భారత ॥దేశమాతా॥"

—కొండవల్లి

"రా రా! పోదాము!-రాజ్యమేలుదాము!
రాజ్యంబు నేలుచును-రంజిల్లు చుందాము;"

—గరిమెళ్ల

"కదిలింది కదిలింది - కాంగ్రెసు రథమంది
చేయెత్తి యొకసారి- జోహారు సేయండి

దేశసేవకు మీరు- ధీరులై నడువండి
దేశస్వాతంత్ర్యమం- దింతుమని సాగండి॥
దాసోహమని గాంధి- దారినే, నడువండి ॥కదిలింది...॥
—దామరాజు

"వినరా! నా ప్రియ సహోదరుడా! సోదరుడా!
భారత భావి- భాగ్య శేఖరుడా! ॥వినరా॥"
—గరిమెళ్ల

"ఇకనైన మాన వేమిరా!- ఈ మాయ చదువు!
ఈ మాయ కొలువు, ఇక యీ మాయకోర్టు
అన్నయ్యా! అన్న! ఇక, పెద్దన్నయ్యా! ఇకనైన॥"
—కొండపల్లి

"వద్దని నేనంటి కదా! వాని జోలి మనకు నింక
వారిచదువు, మనకు నింక, వారి కొలువు, మనకు నింక"

"అన్నలార! రండి!-మన-అమ్మ నుడి వినండి!"

"ఆంగ్లబిరుదుమాని-అల ఆంగ్లకోర్టు మాని
ఆంగ్ల సేవేమాని-మరి-ఆంగ్ల ప్రభుతమాని, ॥అన్నలార॥"
—గరిమెళ్ల

ఇచట, నాడు విదేశవస్తు బహిష్కరణోద్యమ మెంతగావ్యాప్తి జెందిన దనుట కొక దృష్టాంతరము అసహాయోద్యమము తీవ్రముగా సాగిన దినములలో, భారతావనిలో యెన్నికగన్న భాగ్యవంతులలో నొకరగు జమునాలాల్ బజాజ్ ఒకనాడు బందరులో డాక్టరు పట్టాభి గారింట రాత్రి రొట్టె, ఫలహారములో వైచిన పంచదార గాంచి, డాక్టరుగారిని పిలిచి, యీ విదేశీ పంచదార తీయించి, దేశవాళి బెల్లం యిప్పించుమని మనవి చేసినంత మాత్రమున వెంటనే పట్టాభిగారు, "బజాజ్ సాబ్, యీ పంచదార యీ పట్టణములో చెఱకునుండి తయారుచేసిన పంచదార, స్వీకరించండి," అనునరికి, బజాజ్, బందరు పెద్దల యొక్క దీక్ష మర్యాదను గ్రహించి యెంతయో యానందించినారు.

## ప్రబోధము

"గాంధి మహాత్ముని తత్త్వమెరిగి-కష్టపడి పనిచేయండి
బంధము వదలెడు- స్వేచ్ఛవృత్తికై-అందరు సమకూడండి!"
—మంగిపూడి

## రాట్నము-ఖద్దరు

ఈస్టు యిండియా కంపెనీ అనుసరించిన క్రూర కృత్యముల వలన, దేశ పరిశ్రమలు దెబ్బతిన్నవి. సన్నని నూలు వస్త్రములు నేయు నేతగాండ్రకు పరిశ్రమలేక జీవనము పడిపోయినది. నేతకు సప్లయియగు నూలునకు విడుదల లేక ఉత్పత్తికి తగుప్రోత్సాహము, శ్రద్ధలేక, క్రమక్రమముగా రాట్నములు మూలపడినవి దేశమున సగటు విద్యావంతులు విదేశవిద్యామోహితులైన వారు, విదేశవస్త్ర వ్యామోహితులై క్రమముగా తమ వస్త్రములకు పరదేశములపై నాధారపడవలసిన గతిపట్టినది మానము కాపాడుకొనుటకు కూడ లాంకషైరు గుడ్డ యావశ్యకమైనది ఈ మూలముగా దేశములో, విదేశ వస్త్రములకై కోట్ల కొలది ధనము ఖర్చు అగుచుండెను ఈకోట్లకొలది ధనప్రవాహము ఆపినచో దేశము పురోభివృద్ధినంది కోట్లకొలది జనమునకు జీవనోపాధికి మార్గము లేర్పడునని, మహాత్ముడు, గృహలక్ష్మియగురాట్నము ప్రాముఖ్యము చాటి, మరల రాట్నలక్ష్మి గృహలక్ష్మికావలయు, నాడే నిత్యదారిద్ర్యముతో అలమటించు పేద ప్రజానీకమునకు జీవనోపాధి కలిగి, దేశము స్వయం పోషకమై సౌఖ్యవంతమగునని యుద్బోధించెను...స్వదేశ వస్త్రదీక్షతోపాటు విదేశవస్త్ర బహిష్కరణ సాగినచో శీఘ్ర స్వరాజ్యప్రాప్తి యగునని బోధించి, తాను నిరంతర చర్ఖా దేవతోపాసియై, ప్రజలావ్రతదీక్ష పూనుటకెంతయో శ్రమపడెను. ఈ యుద్యమమున వెడలిన సూక్తులు కొన్ని...

## రాట్నము

"మా పాలి మహలక్ష్మి మా యన్నపూర్ణ,
మా సరస్వతీదేవి।-మా రాజ్యలక్ష్మి!"

—చెరుకువాడ

"పెట్టరే, రాట్నము—ఓ తల్లులారా-(పెట్టరే)
పెట్టరే, మీ రింకనైన—పేదతనమున తల్లివ్యధ చే
కట్టుకొనుటకు బట్టలేకను—కడు విచారము బొందుచున్నది."

—నెల్లూరు వెంకట్రామ నాయుడు

## రాట్నము

"నా తల్లి రాట్నమా– నా పాలి భాగ్యమా,
నా దేశమును పీడ—న్యాయమా, చెప్పుమా,
కట్టుగుడ్డల నిచ్చి—పొట్టకూడిచ్చి,
నట్టి తల్లివి నీవె—ఇట్టురావమ్మా, నా తల్లీ రాట్నమా."

"వడుకు, వడుకు, కదుర, వడుకవే కదుర;
వడికి, మా దారిద్ర్య మడపవే కదుర;"

"నూలు వడికే విధము తెలియండి-జనులార, మీరూ
విధము కనుగొని—లాభమొందండి॥"

—కొండపల్లి

"వడుకుమురా।—వడుకుమురా ;
నీ, దేశోద్ధరణకు—తెరగదిరా ;
కలిమి బలిమి-యీా, కదురే గదరా ;
క్రమ్మర రాజ్యంబొసగు సూత్రముర ॥వడుకుమురా॥"

—గురుజాడ

"సుందరమైన రాట్నమె-ప నందు బాంబురా ।
సందేహమేల, దానిలోన-స్వరాజ్యమున్నదిరా ।
ఆరుకోట్ల పంచములకు-అన్నము బెట్టును రా
మాల నూలు మాటనీవు-మరచినావటరా."

—కొండపల్లి

"నేను మీ యిలువేల్పునే—చెల్లీ,
నాతోడ నాడుకొనవే

"నేను మీ గృహలక్ష్మినే తల్లీ, నను మరచిపోతివటవే."

—కాటూరి

"కట్టకుమా! సీమబట్ట
పెట్టకుమా వానిపొట్ట
కట్టి కొట్టి కడకు దేశ—మిట్టి గతికితెచ్చితివి ॥కట్టకుమా॥"

"కొనకుము యీ సీమగుడ్డ నీవు
కొంటివేని మనము కోల్కొనుటదెట్టా! ॥కొనకుమా॥
రంగు రంగుల గుడ్డచూచి పలుభంగుల
కాపురమెనని కాపురమెల్ల దోచి ॥కొనకుమా॥"

—కొండపల్లి

"కట్టకుమా! సీమగుడ్డ
యిటుపై కట్టననుచు నొట్టు—పెట్టరా! బిడ్డ!
మనజాతి మనమతము—మాటను మరపించి
మత భ్రష్టుచేసెడి—మాయా సీమగుడ్డ ॥కట్టకుమా॥"

—నెల్లూరి వెంకట్రామనాయుడు

"సిగ్గులేదా నీకు శరములేదా!
అన్నమైనాలేక బీద లల్లాడుతుంటేను,
సీతాకోక చిలుకలాగ సీమగుడ్డ కట్టితిరుగ ॥సిగ్గులేదా॥

—బసవరాజు

"సీమగుడ్డ కట్టబోకుమురా! నాచిట్టిబిడ్డ!
సీమగుడ్డ కట్టబోకుమురా!
సీమగుడ్డ కట్టినీదు సీమమెల్ల పాడుజేసి
నీ నామమె లేకుండ చేస్తివిరా! నాచిట్టిబిడ్డ!"

—కొండపల్లి

"కొనరాదండోయ్-మీ-రమ్మరాదండోయ్
సీమగుడ్డ కొనరాదండోయ్"

—మల్లావధాని

"వద్దురా, మనకొద్దురా
పరదేశవస్త్రము వద్దురా? మనకొద్దురా!"

సామాన్యముగ జగచ్చక్షువగు సూర్యుడు కానరానిదినము దుర్దినమందురు. వ్రతనిష్ఠులు సూర్యుడు కనువడని దినమున ఉపవసించి మరునాడు సూర్యబింబ దర్శనానంతరము ప్రాశనచేయుదురు. అట్లనే కొందఱు దీక్షాధారులు, ఖద్దరు వాడని శుభకార్యములకు వెళ్లెడివారు కారు రాట్నములేని యింటికి, రాట్నములేని సభకు వెళ్లనను నియమముగల కొందఱు వ్రతినిష్ఠలు పాటించుచుండెడివారు కనీసము తక్లీపై దారముతీయనిచో ప్రయాణములలో సహితము భోజనము చేసెడివారు కారు. ఉ ద్యాధికారియైనను, అతడు ఖద్దరుధరింపనిచో సంఘమున నాడు గౌరవ ముండెడిదికాదు తమచేతితో వడికిన నూలుతో, నేయించినబట్ట కట్టువారు స్వావలంబనులనెడివారు అట్టివారు క్రమక్రమముగా పెరిగి ఖద్దరుప్రచారము దీక్షతో సాగిన రోజులవి.

## గాంధీటోపి

శుద్ధ ఖద్దరుతో తయారుచేసిన స్వచ్ఛమైన తెల్లని గాంధిటోపీ నాడు పవిత్రతకొక ఆనవాలు చుట్ట, బీడి, సిగరెట్టు త్రాగుటకలవాటై వీడలేని వారు సైతము తలపై గాంధిటోపీని ఆకొలది కాల మావలనుంచి యాపని తీరగనే మరల ధరించెడివారు ఆనాడు అట్టిది గాంధీటోపీయొక్క పవిత్రత.

ది 28–9–1921 న విశాఖపట్నం వైద్యకళాశాల విద్యార్థులను గాంధీ టోపీ ధరించినందుకు కళాశాలనుంచి పంపివేసిరి. 1920 నాగపురం కాంగ్రెసుకు హాజరైన 16,000 ప్రతినిధులు గాంధీటోపీలు ధరించిరి. ఇది దేశచరిత్రలో గణనీయమైన నూతనాద్భుత పరిణామము.

## మద్యపాన నిషేధము

కట్ట బట్ట, తిన తిండి సరిగలేని పేద కార్మిక, కర్షక పాటకజనము తర తరాలుగా మద్యపానముక్రింద మత్తులై యిల్లు, ఒళ్లు గుల్లజేసికొని తాము

అధోగతిపాలగుట, కల్లు సారాయీల క్రింద కోట్లకొలది ధనము దుర్వ్యయమగుట గుర్తించి సాగించిన కాంగ్రెసు ఉద్బోధన—

"కల్లుత్రాగి నీ యిల్లునెల్ల గుల్లసేయకు
నీ వళ్ల రోగాలకెల్ల వడ్డికీయకు ॥కల్లు॥"

"కల్లుసారాయి తెచ్చివాడు—యిల్లుగుల్ల చేశాడండి బాబు
పెళ్లాంమెళ్లో పుస్తెలుకూడ—యెళ్లిపోయాయండి బాబు
॥దండాలండోయ్॥"

—గరిమెళ్ల

"త్రాగుడుపిశాచమా ఇంక తరలిపొమ్మ
మొగలాయి పాదుషాల గులాములుగజేసి స్వైరవిహారమ్ము సల్పినావు"
—గురుజాడ

## హరిజనోద్యమము

తర తరములుగ, అస్పృశ్యులుగ, దూరస్థులుగ చూడబడుచున్న జాతి, యెండవానయనక, యహర్నిశలు కాయకష్టముచే జీవించు జాతి, మాయమర్మము లెరుగక, బ్రతుకు హేయమనక జీవనోపాయమునకై పంచ పంచల నొదిగి మసలు జాతి, దూరదృష్టి లేక, భ్రమపడి, స్వార్థపరుల రాజకీయపు పెత్తుల నలిగి, నిత్యజీవనము నడుపుకొను జాతి యగు యీ హరిజనులు జనసంఖ్యలో యేడవవంతు అయినను వారి పొత్తు, సహకారము లేనిది భారతజాతికి మోక్షము లేదని విశాల హృదయులగు మహాత్మా గాంధీ మొదలగు మహానాయకు లెందరో యీ హరిజనసేవకు జీవితముల నంకితము జేసిరి. వారికి సంఘములో విద్యా, సహజీవనము, సమాన ప్రతిపత్తి, గౌరవము మొదలగు సదుపాయములు కూడ కల్పించి, వారి పురోభివృద్ధికి జాతి కనులుదెరచి మసలింది

వీరి సంస్కరణకు గాంధీజీ యుపవాసము చేసి, ప్రభుత్వమునుకూడ దారికి మళ్ళించుట జరిగినది. ఆ యుద్యమమునకు సంబంధించిన గేయములు కొన్ని:—

''ఎవరెన్ని చెప్పిన-హిందూదేశవాసు-లేక
సోదరులె సుండి ;

అంటు దోషముమాకు లేదండి,
పాప-మంటూ చాటుదాము రండి!
యీ కుంటివాదనలు-గూటిలో పెట్టండి ॥మాకొద్దీ॥"

—గరిమెళ్ళ

"గాంధీ మహాత్మా!-గాంధీ మహాత్మా
కాచి రచ్చించు-గాంధీమహాత్మా!
సరకారువోరు-కరుకైనవారు
ఉప్పేరుతేను-తప్పేసినారు
డబ్బుగలోరు-దరికిరానీరు
ఈ గోరమేమి?-మా నేరమేమి?
మాల మాదిగలం-మనుష్యలంగామా?
కుక్కలకన్న-తక్కువయ్యామా?
మా మొరాలకించు-సామీ! మీరేదిక్కు"

—బసవరాజు

"మాల మాదిగవారమండి!-మమ్ము-జాలగ ప్రేమించి
పాలింపరండీ ॥మాల॥"
"మలిన దేహులు-మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ, ధర్మ
మధర్మ ధర్మంబే?"

—మహాకవి గురుజాడ

"అంటరానివారెవరు! మా
వెంటరానివారు!! అంటరాని!"

—మాధవపెద్ది

"జాతులు లేవే పాప!- కులమున
హెచ్చు తగ్గులు-ఎంచుట పాపము!
నీతీ న్యాయము-విద్యాబుద్ధులు
గలవారే-జాత్యధికులు-పాప! ॥జాతులు॥"

—సుబ్రహ్మణ్య భారతి

"రామః రామః రామాభిరామాః- రామాః శ్రీరామాః
లోక నాయకః పావన నామా- లోకైక రామాః
పంచముడని-మన సాటిమానవుల-బహిష్కరించెదరాః
పంచమ సహకారమ్ము లేనిచో-బ్రతుకు గడుప గలరా,''

—కోడేటి రంగాచార్యులు

ఈ ప్రకారము 8 మాసములు స్వాతంత్ర్యపోరాటము సాగినది అనంతరము బ్రిటనులో భారతరాజ్యాంగ వ్యవహారములు చర్చించుటకు 1930 డిశంబరులో, ప్రథమ రౌండుటేబుల్ కాన్ఫరెన్సు జరిగినది భారతదేశము నుంచి, ప్రజా ప్రతినిధులనదగిన వారెవ్వరు సభకు పోలేదు. అందువల్ల బ్రిటిషు ప్రధాని రామ్సేమాక్డనాల్డు కాంగ్రెసుతో రాజీకి రావలసి వచ్చినది. ఈ సూచనగా 1931 జనవరి 26 తేదీన. గాంధీజీని, వారితో 26 గురు కాంగ్రెసు పెద్దలను విడుదల జేసిరి గాంధిజీ లార్డు ఇర్విన్ ప్రభువుతో ది 16-3-1931 న సంప్రతింపులు జరిపిరి. అప్పటికింకను 60 వేలమంది కాంగ్రెసు వారలందరు కారాగారములలోనే యున్నారు. వీరి సంప్రతింపులు ఫలించి అందరు మార్చి 15 వ తేదీని విడుదలయైరి. గుజరాతులో పన్నుల నిరాకరణోద్యమమున యిరసాలు చేయబడక బకాయిపడిన పన్నులు ఇరవై లక్షలు సక్రమముగా చెల్లింపబడినవి. ఈ ప్రకారము పన్నులు చెల్లింపవలదన్న, చెల్లింపక యుంటయు, తిరిగి యొక మాటలో పన్నులు మరల చెల్లింపబడుటయు కూడ సమర్థుడైన నాయకుడను కీర్తి గాంధి గారికి లభించడము గమనించిన రివిన్యూ సభ్యుడైన హాట్సన్ దొరకు కన్నుకుట్టింది. ప్రభుత్వమున కవమానముగా భావించి, వెంటనే, గత సంవత్సరము అతివృష్టి అనావృష్టివల్ల రద్దుచేయబడిన పన్నుల మొత్తము రు. 50 వేలు తిరిగి వసూలుచేయుటకు తన ప్రభుత్వ బలమంతయు ఉపయోగించినాడు. దానితో కాంగ్రెసు స్థితి తారుమారైనది. ఒడంబడికపై సంతకములు చేసిన యిర్విన్ వెంటనే భారతదేశము విడచి వెళ్ళిపోవలసి వచ్చిందికూడా. దానిపై లండనులో 1931 డిశెంబరులో జరుగనున్న ద్వితీయ రౌండుటేబుల్ కాన్ఫరెన్సుకు పోవలసిన గాంధీజీ, యీ పన్నులు తిరుగతోడి వసూలుచేయు అన్యాయమునకు బాధపడి, సమావేశమునకు పోవ నిరాకరించినాడు ప్రభుత్వము, సక్రమముగ విచారించెదమని వాగ్దానము చేయగా, రౌండుటేబుల్ సభకు గాంధీజీ వెళ్ళిరి కాని ప్రయోజనము లేకపోయినది. అది అంతయు ఒక నాటక

ము.గా పరిణమించినది అయన లండనుచో నుండగనే, యిక్కడ భారత దేశములో పండిత్‌జవాహర్‌లాల్‌నెహ్రూ, అబ్దుల్ గఫూర్‌ఖానును అరెస్టు చేసిరి బెంగాలులో ఆర్డినెన్సు పరిపాలన ప్రభుత్వము ప్రవేశబెట్టినది. గాంధీజీ బొంబాయి జేరి ఆజాద్ మైదానములో యీ అన్యాయము గురించి యుపన్యసించి, రాజప్రతి నిధినికలుసుకొన ప్రయత్నించెను. కానిఅతనిని కలుసుకొనుటకు అవకాశమీయలేదు. అంత మరల సహాయ నిరాకరణ సత్యాగ్రహము తప్ప గత్యంతరము కనువడ లేదు. 1932 జనవరి 4 వ దేదీన గాంధీజీని వల్లభభాయి పటేలును అరెస్టు చేసిరి. 1932 సంవత్సరాంతమునకు లక్షమంది జైలుకు వెళ్ళిరి. 1933 మే నెలలో, సమిష్టి సత్యాగ్రహము విరమించి 1940 లో వ్యక్తి సత్యాగ్రహము సాగినది. 1932-33 సంవత్సరము ఒకలక్షా యిరువై వేల మంది స్వాతంత్ర్య సమరములో అరెస్టు అయిరి

చిరకాల పరిపీడిత ప్రజానీకమున కేడుగడగా, ప్రజాపాలిత దేశమున కొక రాజకీయ వేత్తగ, నిర్వ్యాపారమున గ్రుంకిపోవు పార్శ్రామికుల కొక యాదరువుగ, కష్టజీవుల పాలిటి కామధేనువుగ, పతిత మానవలోకములకు దీన జనోద్ధారుడుగ, మహాత్మాగాంధి గారు జీవితమును స్వీయము చేసికొన్నారు. అభి మానులు. వారి వారి మనః ప్రవృత్తుల కందినంతవరకు మహాత్ముని గురించి భావించి, ధ్యానించి, వాగామృతము నిండగ్రోలి, దివ్యాభయము పొందినారు. వారి యడుగుజాడల నడిచింది జనసమూహము. ఆ యా సందర్భముల వారినిగురించి మహాకవులు, తాదాత్మ్యము జెంది వెలువరించిన అమృతవాణిని వినదము, వారి మాట జాతికొక వెల్గుబాట, ఆ సమర దుందుభి నినాదములు కొన్ని —

"పొలి పొలీ! బలి బలీ!
కల కలా రా గదే!
కలికి బంగరు తల్లి!
కనుల పాల్గారుతూ
మా స్వరాజ్య దేవతా! మా తల్లి!
మా భారత లక్ష్మి:"

—మంగిపూడి పురుషోత్తమ శర్మ

"వీరా వేశము జెందినారమిక
వీర విహారము చేస్తాము

పరాధీన తన్, బాపు కొనంగా
ప్రళయభేరి మ్రోగిస్తాం"

—మల్లాది

"ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం
ఎప్పుడు ముడియు, మా అడియరి మోహం"

—సుబ్రహ్మణ్య భారతి

"వీరగంధము తెచ్చినారము
వీరు డెవ్వడొ తెల్పుడీ।"

—కవిరాజు త్రిపురనేని

"స్వాతంత్ర్య సమరము-సాగింపగావేగ
సహచరులతోడి-రావోయి!
సాగిపోవలె-త్వరగ రావోయి"

—మల్లాది

"కదలిరావోయి! తమ్ముడా!
కదలవేమోయి! తమ్ముడా!
రెక్కలారని-బిక్కమొగములు
పక్షులే పరుగెత్తెరా-పదమునెత్తర-కత్తుగా (కదలి)"

—బెల్లంకొండ

"జయభేరి మ్రోగింది-జనులార లేవండి!
జయము పొందెడిదాక-శాంతములేదండి,
జంకు గొంకులేక-భంగు భంగున రండి!
దేశసేవ సేయ—ధీరులై నిలువండి! (జయభేరి)"

—మల్లాది

"లెండు హైందవులారా'-లేమి, దుఃఖము వాయ
రండు, రండు స్వరాజ్య-రాజ్యపాలన సేయ,"

—మద్దూరి అచ్యుతరామయ్య

"ఏవరేశారీ మత్తు మందు,
ఎన్నాళ్ళదాకాను-యీ మొద్దు నిద్దుర ॥ఎవరే॥"

—బసవరాజు

"రా రా! పోదాము!-రాజ్యమేలుదాము!
రాజ్యంబు నేలుచును-రంజిల్లమందాము"

— గరిమెళ్ళ

"దండాలండోయ్! మేమంతలేము-మోయ్! బాబు!
యీ సైతాను ప్రభుత నింక-నాగనీమంటోయ్ బాబు,"

—గరిమెళ్ళ

"వేణునాదము-మోగుతుందండోయ్!
ఓ భక్తులారా! వేణునాదము మోగుతుందండోయ్!"

—బసవరాజు

"కొయ్యడ!-కొయ్యడ!యిలాగరారా!
కోటి యింతలు సెప్పుతానో-రయ్యో!. కోయ్యోడ.!''

— గరిమెళ్ళ

గాంధీగారు జైలునుంచె హరిజన సేవా ప్రబోధము చేయుటకు ప్రభుత్వ మంగీకరింపనందున ఉపవాసము చేయగా, ఉపవాసము మధ్య ది 23.8.1933న విడుదల చేయబడి నాటినుండి రాజకీయముల విరమించి హరిజన సేవకు కాలినడకను ప్రచారము సాగించెను. 1934 ఏప్రియలులో సత్యాగ్రహము విరమింప జేసెను. 1934 నవంబరులో శాసనసభ యెన్నికలు జరుప నిశ్చ యించి, 1934 నుంచి 1945 వరకు శాసనసభల విజయము సాధింప బడెను 1939 సెప్టెంబరు 3వ తేదీన ద్వితీయ ప్రపంచ యుద్ధమారంభ మాయెను. 1940 అక్టోబరు 17నుంచి వ్యక్తి సత్యాగ్రహోద్యమము వాక్ స్వాతంత్ర్యము నకై ప్రారంభింపబడినది దానిలో మొదటి సత్యాగ్రహి శ్రీ వినోబా భావే. అందులో 30 వేలమంది పాల్గొన్నారు గాంధీజీ మాత్రము అరెస్టుకాలేదు. 1941లో యుద్ధప్రతికూల నినాదములతో యీ వ్యక్తిసత్యాగ్రహము ప్రారంభ మైనది. ఇది ఒక సంవత్సరము జరిగిన తరువాత 1941 డిశంబరులో యీ సత్యాగ్రహుల నందరిని విడుదల చేసిరి. 1942 వచ్చునరికి పరిస్థితులు విష మించినవి.

## క్విట్ యిండియా ఉద్యమము

సర్ స్టాఫర్డు క్రిప్సు బ్రిటిష్ ప్రభుత్వ రాయబారిగా మార్చి 23న యిండి యాకు వచ్చి ఏప్రిల్ 1వ తేదీ వరకు ఉండి చేసిన ప్రయత్నములు ఫలింపక

పోవుటచే, రానున్న దారుణ నిర్బంధముల సూచనగా తన ఆగ్రహమును వెళ్ళ బుచ్చుచు తిరిగి వెళ్ళిపోయినాడు బ్రిటిష ప్రభుత్వమును మూల మట్టముగా పారద్రోలుటకు సమష్టి శాసనోల్లంఘనము తప్ప వేరు గత్యంతరము లేదని, ది1942 ఆగష్టు 8వతేదీన అఖిలభారత కాంగ్రెసు సంఘము సమిష్టి శాసనోల్లంఘ నమును యేకగ్రీవముగా తీర్మానించి దానికి గాంధీగారిని మహాసేనానిగా నియ మించింది. క్విట్ ఇండియా, "తొలగిపొండి. మా భారత దేశమునుంచి" అనే నినాదము భారతదేశమంతయు మారుమ్రోగినది తీర్మానము జరిగి ఒక రోజైన గడువలేదు, అందుపై బ్రిటిషు ప్రభుత్వము 1942 ఆగష్టు 9వ తేదీన తెల్లవారకడ, గాంధిగారిని అరెస్టుచేసి, ఆగాఖాను భవనమున నుంచినది. కార్య నిర్వాహక సభ్యులనందరిని అహమ్మద్ నగర్ కోటలోను, మిగతా వారందరిని తాత్కాలికముగా, ఎర్రవాడ జైలులోను నిర్బంధించిరి పీరినిట్లు బంధించిన ప్రదేశము, సమాచారము 1944 ఫిబ్రవరి 22 వరకు యెవరికి తెలియనీక ప్రభుత్వము రహస్యముగా దాచినది. 1945 వరకు నిర్బంధములు సాగినవి.

"పర దేశీయులు తొలగండి!
ఈ భారత దేశం-మా దేశం,
వినండి! వినండి,! విశ్వప్రజలు వీరభారతీ సందేశం"

—వానమామలై వరదాచార్యులు

"వీరభారత యువకుల్లారా,
విజయోత్సాహిత మూర్తుల్లారా,
విన్నారా! మన వీరుల చరితం
కన్నారా! ఆగష్టు విప్లవం,"

—సాంబశివరావు బాష్టి

"అల్పకాయమ్ము బోసి న వ్వంగ వస్త్రు
మూతకోలయు, నౌచు నుర్రూతలూచె
చూడ్కిలోన, త్రివిక్రమస్ఫూర్తి దాల్చి
మూడు జగములు, నెవ్వడీ ముదుక తబిసి."

— కాటూరి

"నేను నీ రణోన్మత్త-గానం విని పులకరించి
రణోన్మత్త రణ డిండిమ-ధ్వానం విని జలదరించి
జలదరించి కళవళించి-రణభూమికి పరుగెత్తాను
పాషాణప్రాకారము-మంచి బురుజు కంచుకోట"

—పురిపండా

జైలులోనే కస్తూరిబా గాంధీ-మహాదేవ దేశాయీలు దేశమాత గర్భంలో దీర్ఘనిద్రపోయారు. ఈ లోపల బొంబాయి తదితర నగరములలో ప్రజలు వేలు, లక్షలకొలది గుంపులు గుంపులుగా బయలుదేరిరి. ప్రభుత్వమీసారి లాఠీలు, కత్తిపోటులతో గాక, తుపాకికాల్పులు మరఫిరంగులయొక్క వర్షముతో ప్రజలను చెదరగొట్టినది దానిచే పట్టరాని రోషాగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లి, జాతియొక్కమ్మడి ఆగ్రహపరవశమై యొడలు తెలియక ప్రతిపత్రిక పరవళ్లు ద్రొక్కినది. తమ మార్గదర్శకులగు నాయకులు వారిమధ్యలేరు పైగా వారు కఠిన నిర్బంధములోనున్నారు. అందుచే ప్రజలలో రోషాగ్ని బహుముఖ ముల వ్యాప్తిచెందినది. ప్రభుత్వమువారి తుపాకి గుండ్లకు సమాధానముగ, ప్రజలు, దోపిడి పరశురామ ప్రీతి కార్యములు జరుపుట, కచేరీలను అగ్ని కాహుతిచేయుట, రైళ్లరాకపోకల నాపివేయుట, రైలుపట్టాలు తొలగించుట,మొద లగు భీతావహ కార్యముల కొడిగట్టిరి గాని, ఒక్కప్రాణి హింసకైన చేయి జేసి కొన్నవారు కారు. టెలిగ్రాఫ్ తీగెలు త్రెంపబడినవి, ఖజానాలు దోయబడినవి, ప్రభుత్వ భవనములమీద జాతీయ పతాకాలు యెగుర వేయబడినవి. ప్రభుత్వము దీనికిమారు ప్రజలయిండ్ల తగులబెట్టి, ప్రజానసమూహముపై విచ్చల విడిగా తుపాకులు కాల్చినది, ఈ భీతావహముతో జాతిని, అణగద్రొక్కుచునే యుండి, యేనాటికైన, కాంగ్రెసు కాళ్ళబేరమునకు రాకతప్పదు అని అట్టివారి రాకకై ఖీక్షించుకొని, నెలలు, యేండ్లు, గడిపినది, ఎప్పటికైన క్షమాపణకు కాంగ్రెసు రాగలదని ఆశించినది.

ఆగష్టువిప్లవము—

"లేచిపోయినవి పోలీసుల టోపీలు। వందలు వేలు రాబందులట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరీలు। ఖరదూషణాదుల కాష్ఠమట్లు"

—కరుణశ్రీ

1944 మే నెలలో ఆగాఖాను భవనములోనున్న గాంధీగారిని ప్రమాద కరమైన అనారోగ్య కారణముగా విడుదలచేసినది ప్రభుత్వము-1942నాటి శాసనోల్లంఘన తీర్మానమునకు కాలదోషము పట్టినది, దానిని 1944న బయటికి రాగానే విరమించితిమన్నాడు గాంధీజీ 1945 జూన్ 15వ తేదీన అహమ్మదు నగర్ కోటలోని వారినందరినీ విడుదల చేసిరి.

## జైలు

గాంధీజీ నాయకత్వమున, భారత స్వాతంత్ర్య సమరమున దుమికి, యెందరెందరో పడరాని కడగండ్ల ప్రమ్మగ్గి ఆస్తిపాస్తుల పోగొట్టుకొని, యిల్లు, వాకిళ్లు విడచి, సంసారముల త్యజించి,కాయకష్టములకోర్చి, తుదకు జైలుకేగియు అచట ప్రభుత్వముపెట్టు బాధలుభరించి కృశించినారు ఎందరో వికలాంగులై, యెందరో లాటీపోటుల చితికి జీవములతో బ్రతికిరి ఎందరో జీవిత సర్వస్వమే గాక, ప్రాణముల సైత మర్పించిన మహాత్ములున్నారు అట్టివారలు జైళ్లలో ప్రమగ్గిన యుదంతములు కొన్ని...

"ఇదిగో! దివాలా ప్రభుత్వము,
ప్రేళ్ళతో! కదిలి, కూలిందిదిగో-కనుము దీసి సత్త్వం॥
ఎన్నాళ్లు సైచిన-నున్న పీడికి జాలి, తిన్నగ కూడు నీరీడు॥
పురుగు! లన్నపు ముద్దలిస్తాడు
మేకు ! లన్నపు ముద్దలిస్తాడు,
ఉప్పు ! డన్నపు ముద్దలిస్తాడు
వాన ! నన్నను మంచిదంటాడు
దీనికి ! మిన్నలేదట, మంచికూడు
జిహ్వా ! లన్నీ కట్టాడు, యీా పాడు
కూడుకన్న నీరే పానకము, ప్రాణాధార ॥మిదిగో దివాలా॥"

—గురజాడ

"కుళ్ళిపోయిన చచ్చు-కూరలు, ముల్లంగి
ఉల్లిపాయలు-గలిజేరు!
షంగ ! పేళ్ళు, చీడ తోటకూర!

ఇనుప : కళ్ళాయిగాచి, యాధరు
వుగ : నిచ్చు దేవతా పులుసు—యితని శక్తి దెలుసు"

—గురజాడ

1946లో శాసన సభల యెన్నికలలో, కాంగ్రెసుకు అఖండ విజయము చేకూరి, రాజ్యాంగ పరిషత్తులో కాంగ్రెసు అభ్యర్థులు సభ్యులుగాకూడ యెన్నుకోబడిరి. ఈలోగా నవకాళీలో జరిగిన ఘోరకృత్యములు విని, మహాత్మా గాంధీ అచటికివెళ్ళి సంచారము చేసి, హిందూమహమ్మదీయ సఖ్యత కెంతయో పాటుబడిరి. అచట హిందువులను, మహమ్మదీయులు పెట్టిన, ఘోర కృత్యము లింతింతయని వర్ణింపనలవికాదు.

"అదిప్రళయోగ్రదారుణ భయంకర దుస్సహ పావ చిత్ర దు
ర్మద జనులేచి హైందవుల రక్తము వెల్లువ జేసినట్టి,తా
వదె, నవకాళి మండలము యత్నముచే, నాటి శాంతి నిల్పగా
కదలె మహాత్ముడంత, నవకాళికి, మారణకేళి భూమికిన్."

—గురజాడ

1947 ఆగష్టు 15వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యము సిద్ధించినది. తరువాత రాజ్యాంగ పరిషత్తులో భారతదేశము రిపబ్లిక్‌గా రూపొందినది.

## స్వాతంత్ర్య ఉద్యమము – (15-8-1947)

భారతదేశ చరిత్రలో 1947 ఆగష్టు 15 వ తేదీ మిక్కిలి చరిత్రాత్మక మైన పర్వదినము. నాడు భారతాకాశమున స్వాతంత్ర్య భానోదయమైనది. దాదాపు 12 శతాబ్దముల తరువాత భారతమాత పారతంత్ర్యబంధములు పటాపంచలైనవి. మాతృభూభాగములో కొంత పరాయిదేశముగా–పాకిస్తానుగా విడిపోయినను, మిగతాదేశము స్వాతంత్ర్యవీచికల నోలలాడే సుదినము చూడ గలిగినది. బ్రిటిష్‌ప్రభుత్వపు రాజకీయపు పన్నుగడలనుంచి బైటపడి, జాతి సర్వస్వము స్వార్థము విస్మరించి, తుదకు ప్రాణార్పణకైన వెనుదీయక, సర్వ త్యాగమొనర్చి, సత్యాహింసావ్రత దీక్ష సఫలీకృతమొనర్చుకొని, స్వరాజ్య స్థాపన చేసికొను మహాభాగ్యము చేకూరినది. ఇది మహాత్మా గాంధీగారి నాయకత్వమున, త్యాగశీలురు, మేధావంతుల అండదండను, జాతి సమైక్యమై,

స్వరాజ్యస్థాపనతో విజయధ్వజం ప్రతిష్ఠించింది రక్తపాతరహిత విప్లవాత్మ కోద్యమము, ప్రపంచమున నింత దనుక, కనని, వినని, యూహింపని వినూత్న సాధనగా దిగ్భ్రమగొలిపినది. దీనితో ఖండాంతరముల నెనలేని కీర్తి సంపా దించుకొనగలిగినది ఏండ్లకొలదిగ స్వాతంత్ర్యమునకై పోరాడి, చివరకు ప్రాణములొడ్డిన వీర నాయక, నారీమణుల కృషి నేటికి ఫలించి వారి యాత్మ లకు శాంతిచేకూర్చు భాగ్యము కలిగినది భావి సంతతికి మంచి బాట తీర్చు సదావకాశము లభించినది. ధర్మచక్రాంకితమైన త్రివర్ణపతాకము ఖండ ఖండాంతరముల వెలయు స్వాతంత్ర్యశక్తి లక్ష్యమైనది. ఏ ధర్మదీక్షవలన యీ విజయము సంపాదింపగలిగితిమో అట్టి ధర్మపథము వీడక ముందు పురోగ మింప దేశమాత యనుగ్రహించుగాక యని దేశమాతకు అంజలి పట్టితిమి.-

"చం. గణ గణ మ్రోగెరా, విజయఘంటలు, భారతమాత మందిరాం
గణమున, ద్వారబంధముల గట్టిరి చిత్ర విచిత్రరత్న తో
రణతతి, వీది వీథుల విరాజిలుచున్నవవే త్రివర్ణ కే
తనములు, మేలుకాంచె, పరతంత్ర పథాన్ముఖమ స్తకంఠముల్ "

—కరుణశ్రీ

"ఎన్నాళకెన్నాళ్లకు—కడగండ్లు—యీడేరె, మాతల్లికి,
కన్నుల పండువయ్యె-మన భారత-కన్న సంతానమునకు."

—గురజాడ

"శా ఏరా భారతపుత్ర నేటికిగదోయీ, నీదు స్వాతంత్ర్య శం
ఖారావము ప్రతిధ్వనించి, దిశలుద్ఘాటించె ప్రాక్పశ్చిమ
ద్వారమ్ముల్ విడివడ్డవిప్పటి కహో!"

—ఏటుకూరి వెంకటనరసయ్య

## నైవేద్యము

"తల్లీ! నీ యుత్సవముగాంచ, దరలినార
లనుగు దనయులు, నైవేద్య హస్తులగుచు"

—దువ్వూరి రామిరెడ్డి

"పానీయమాపులు-పంకి ...లు
భాగ్యములు రాజ్యములు...
యున్నరా! యీ భరతభూమిని
తాలకరించిన పుణ్యభూమిని"

— తురగా వెంకట్రామయ్య

## దేశభక్తులు

"చిరపరాధీన శృంఖలాచ్ఛేదమునకు
జీవిత సుమాలె ధారవోసితిరి, మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమవృష్టి
శ్రీ పిరాజిల్లు మీ యోద్ధ శిరములందు."

—పురిపండా అప్పలస్వామి

## మహాత్ముని దివ్యస్మృతి

భారతదేశము స్వాతంత్ర్యము సంపాదించి ఆరు మాసములైన తిరుగ లేదు, స్వరాజ్య సముపార్జనలో ప్రజలుపడిన శ్రమలనుండి కోలుకొనగ లేదు క్రొత్తయిల్లు చక్కదిద్దుకొను సందిగ్ధస్థితిలో నాయకులు తడబడుచున్నారు, ప్రజలనిర్ణీత మార్గము యూహామాత్రముగనే యున్నది. అట్టి సందిగ్ధ స్థితిలో రాజ్యప్రదాత, స్వతంత్ర భారత పిత, నవభారత భాగ్యవిధాత, భారతీయ జీవనదాతయగు మహాత్మాగాంధి గారు ది 30–1–1948 సాయంతనము ఢిల్లీలో ప్రార్థనసమయమున, ఒక మతోన్మాది పిస్తోలుగుండునకు గురియై నేలకొరిగిన దుర్దినమది. భారతాకాశ మొక్కపరి బ్రద్దలై యీ యశనిపాతమునకు అలమటించినది. తల్లడిల్లిన భారతీయుల గుండెలు ఆ మహాత్మునికి పలవరించి, పలవరించి, చేష్టలుడిగి, దిక్కులేని పసిబిడ్డల భాతివిలపించినారు. అట్లే యిట్టి మహనీయ వ్యక్తి భారతదేశముననే గాక, యావత్ప్రపంచమున యింతవరకు అవతరింపలేదని, ప్రపంచములే గుర్తించినవి. ఆ పురుషోత్తముని పోగొట్టుకొనిన జాతికి మనుగడ దుర్భరము, ఏసుక్రీస్తు ప్రేమతత్త్వము బుద్ధభగవానుని, సత్యాహింసలు మూర్తిగొన్న మరొక భగవదవతారమే గాంధి మహాత్ముడు ఆ మహనీయుని కాలమున జన్మించి, ఆయనను దర్శించి, భాషించి, వారి

సూక్తులాలించి, వారి యాదేశము పాలించి, వారి యడుగుజాడలపయనించి, వారి యఖండప్రేమ చూరగొన్న భారతీయుల హృదయముల తన్మూర్తి మనసార ప్రతిష్ఠితమైనవి. అది యెన్నటికిమాసిపోదు ఆ ఆరంజ్యోతి ఆరిపోదు ఆ వెలుగు బాటలో జాతి తన భవిష్యత్తును దిద్దుకొనగలదు. ఇక ఆయన సూక్తులు వేద వాక్యాలవలె, మానవజాతికి శిరోధార్యములై ప్రబోధింపగలవు ఇదే చివరకు మనకు మిగిలిన దివ్యస్మృతి

గుండెలు పగులువార, యెలుగెత్తి బిట్టురచిన
భారత జనయిత్రి ఘోష :—

బాష్పాంజలి

"యుగ యుగమ్ముల భారతోర్వీతపః పుంజ
మెసరేగి జగముల కిడిన పంట"

— తుమ్మల సీతారామమూర్తి

"కనుపింప వదియేమి! కనక కాంతుల జిమ్ము సత్యావతారప్రశాంత మూర్తి,
వినిపింప వదియేమి' వీనుల విందుగా 'రఘుపతి రాఘవ' రామ భజన"

—కరుణశ్రీ

అశ్రు ధార

"ఓ భారత భాగ్య విధాతా' శోభాయుత కీర్తి సమేతా!
చాలించితివా' అవతారం! సైరింపుము—మా అపచారం!"

— పూ బా.

"శా॥ ఏడీ! మా గుజరాతి వైశ్యముని, నేడేమాయె, గన్పింపడా,
రాడా' మమ్ముల జూడడా' దయ దలిర్పన్"

— వేముగంటి నరసింహాచార్యులు

పరంజ్యోతి

"సీ భువనాలు, కవనాలు పొంగి పొర్లెడువేళ అవని ధేనువులిండ్లకరుగువేళ

.. . . ... ... ... ...

పదమి నవతారమూర్తి యా బుద్ధమూర్తి
యైన, మన బాపు స్వర్గాని కతిథియయ్యె"

—మానేపల్లి

## అశ్రుతర్పణము

"అశనిహతంబొ, భూకంపమొ నాక్కొ!
అగ్ని పర్వతమే బ్రద్దలగుట నిజమొ!!
... ... ... ... ... ...
అయయొ! నేడు మహాత్ముడీ ధరణి లేడా యింక దిక్కేది."

—మల్లావధాని

## ఘోరదుర్దినము

"చం॥ అది తలపోయరాని హృదయపు విదారి, విషాద వాచ్య కా
స్పదమయి, పంచఖండములు, బావురుమన్న పిశాచివేళ-ము
ప్పది కోట్ల భారత తపస్సముదాయము, భస్మరాశియై
చిదికిన ఘోరదుర్దిన మిసీ! వచియింపగ, జిహ్వాలాడునే!"

—జాషువా

## తిరిగిరానియాత్ర

"మ. చనెనా, భారత గౌరవైక కృత దీక్షా కంకణ స్వామి,"

—ఇంద్రకంటి

"నీ చేతులెట్లాడెరా! మన గాంధినిన్ జంప, మనసొచ్చెరా!"

—గురజాడ

## గాంధీమహాత్మ

"ఉ. ఘోర దురాగతంబులకు క్షోణితలంబు కలంగ బోధనా
సారముచేత శాంతిని ప్రసారము చేసిన కర్మ భూమిలో
భారతజాతి ఘాతకుడు భారతజాతి పితన్ వధింపఁగా
ధారుణి క్రుంగలేదు రవితారకచంద్రులు దుల్లరేలకో!"

—గడియారం రామకృష్ణశర్మ

## సాయుజ్యం

"ఉ. క్రుంగె హిమాద్రి శృంగములు, కొండలు గుండెలు కూలిపోయె,
దిక్కుగానలేని పక్షులుగ గొంతుక జించుకనేడ్చి యేడ్చి, –"

— వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

## ఎవరి పాద చిహ్నములివి

"ఎవరి పాద చిహ్నము లివి?
ఎవరి పాద చిహ్నము లివి?
అతని ప్రతి అడుగు గురుతు,
ఆలయమై తల యెత్తును,
అతని చేతి గొడుగు క్రింద
అఖిల జగము శయనించును ॥ఎవరి॥"

— దాశరథి

## ఏడవకు!— ఏడవకు!

"తొలికోడి కూసింది,
తెల తెల వారింది,
ఏడవకు! ఏడవకు! నా చిట్టి పాపా!
ఇప్పుడే వస్తాడు, నీ గాంధి బా బా!"

—కొప్పరపు సుబ్బారావు

## మరల రమ్మి–ఒకసారి

"మరల రమ్మి! ఒక సారి,
కరుణ జూపు బాపూ!
నూరేడులు మన నీయని
క్రూరాత్ముల మన్నింపుము."

## శాంతి

"శాంతిగొను గాక, నీ యాత్మ శాంత మూర్తి!
నిత్యమగు గాక! నీ జ్యోతి సత్యమూర్తి!"

—గురజాడ

లోకోత్తర చరిత్రుడైన మహాత్మాగాంధీ గారారంభించిన అసహాయోద్యమమునాటి (1921) నుండి స్వరాజ్య సంపాదన వరకు (1947) వారి యాదేశానుసారము కోట్లకొలది జనము, మాతృదేశారాధనా తత్పరులై, సర్వ త్యాగముచేసి, స్వాతంత్ర్య సమరమున ఆహుతులైరి శ్రీగాంధీగారి శంఖా రావము విని, కవులు, రచయితలు, పండితులనేకులు వీరావేశముతో, తమ

తమ పద్యగేయగానములతో దేశము నుత్తేజితమొనరించినారు. భారతదేశమందలి వివిధ రాష్ట్రకవులు, తమ తమ భాషలలో రచనలువెలువరించి, ప్రజాళి నుత్తేజ పరచిరి. ఆంధ్రావనిలో లెక్కలేని మహాకవులు, తమ తమ గేయములు, గానం చేసినారు. అసహాయోద్యమమునకు పూర్వము స్వరాజ్య సముపార్జనకై, నడచిన 'వందేమాతరం' మొదలగు యుద్యమములనాటి నుండి కూడ మహా కవులుగానం చేసినారు. వీరి దివ్యకంఠోద్గీతికలు ఆంధ్రులకు పరిచయమే. ఇప్పుడవి కొన్ని, అసహాయోద్యమము నాటి నుంచి లభ్యమైన కవుల గీతములు విశేషముగను, సంకలనముచేసి యిందు ప్రకటించదమైనది. ఇందు స్వీయము కొంత చెప్పక తప్పదు, మన్నింప గోరెద. 1916 ప్రాంతమున నాకు బందరు ఆంధ్ర జాతీయ కళాశాలకు హోమ్‌రూలు యుద్యమ ప్రచార సందర్భమున అరండేలు వాడియాగారలతో విచ్చేసి మహోపన్యాసము గావించిన డాక్టరు అనిబిసెంటు ప్రబోధము విను భాగ్యమబ్బినది. పంజాబు దురంతములనంతరము, కలకత్తాలోజరుగబోవు అవసర కాంగ్రెసుమహాసభలో అసహాయోద్యమతీర్మానము ప్రవేశపెట్టుటకు షౌకతాలీగారిని వెంటనిడుకొని,దేశపర్యటనజేయుచు గాంధీగారు విజయవాడకరుదెంచిరి. ఆనాడు వారి యుపన్యాసములు వేలకొలది జనముల హృదయముల కదలించినవి. ఆయుపన్యాసములను, తెనుగు ననువదించినఆంధ్ర రత్న దుగ్గిరాలవారి గంభీర వాగ్విలాసము కూడ నన్నాకర్షించినది. కలకత్తా కాంగ్రెసు తీర్మానించిన త్రివిధ బహిష్కారము క్రింద, నేను పనిచేయు పాఠ శాలోద్యోగమునకు 1920లో రాజీనామాయిచ్చి, ఖద్దరు ధరించి అంగరక విడచి, నాయకా మణియగు డాక్టరు పట్టాభిగారిని సందర్శించి, కాంగ్రెసు యుద్య మమున ప్రవేశించితిని. మరల 1921 మార్చి 31వ తేదీ ఏప్రియల్ 1వ తేదీ లలో విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యు లగు మహానాయకులను దర్శించుట వారి దేశప్రబోధకమగు మహోపన్యాసము వినినంత యొడలు పులకరించినది. కాంగ్రెసు సేవాదీక్షకు నాందియైనది ఆ దివ్య సుముహూర్తము. ఆ సభకు విచ్చేసిన వెన్నియో దేశభక్తి బృంద ములు, జాతీయ గీతములు గానము చేయుచు, సభకొక నూత్నశోభ చైతన్యము చేకూర్చినవి. ఆనాడు విచ్చేసిన రాజమహేంద్రవరము 'కేసరీసమాజము' వారుపాడిన "దండాలు దండాలు భారతమాత"—మంగిపూడి వారి "మహాత్మగాంధి దర్శనమే పావ నము"-మొదలగు వీర విహార గీతములు, నన్నింకను ఉత్తేజపరచినవి. ఆ వీరా

వేళ దృశ్యములు నా జీవితమున కొక ముఖ్య పర్వదినమైనది నాటి అలభ్య దృశ్యముగాంచు భాగ్యమేగాక, అజ్ఞాత జాతీయకవిగా ఆంధ్రదేశమున "మా కొద్దీ తెల్లదొరతనము"-గేయమును సృష్టించి, జాతి సుప్రఖ్యాతలూగించిన గేయ కవిసార్వభౌమ కీ. శే గరిమెళ్ళ సత్యనారాయణగారితో కలసి, ముఖ్యమగు తావుల వారి గేయములు స్వయముగా గానము చేయుచు, పచారమున పాల్గొంటిని. అట్లనే ఇతర కవుల గేయములు కూడ గానము చేయుచు, ప్రచారముచేయు నదవకాశము లభించినది కాలం గడచిపోయినది శ్రీగరిమెళ్ళ మొదలగు కవులెందరో కాలగర్భమున కలసిపోయిరి. వారికి, వారి గీతములకు ప్రత్యేక గౌరవాభిమానములు లభింపలేదు వీని ఫణితులు, పోకడలు, చరిత్రాత్మక వివరములు పరిచయముగల నేను, వీనిని ప్రచురించుటకు ఉబలాటపడుటయేగాని, కారణాంతరములచే కార్యాచరణకు రాజాలనైతిని కాంగ్రెసు ప్రచారమున అప్పటిప్పటికి వెడలిన, స్వీయ గేయములు, అందునను జైలులోనున్నప్పుడు, పొరలినవి మరికొన్ని, యివన్నియు వెలువరుచు భాగ్యముండునా యని తలపోసెడివాడను అన్నిటినీ కాలము సమకూర్చవలె గదా ఇంతవరకెవరు యిట్టిజాతీయ గీతముల సమగ్ర సంకలనమునకు బూనుకొనలేదు ఇటీవల, నేను సంకలనము ప్రారంభించి, దాదాపు పూర్తిసేయు సమయమున, గాంధీ సాహిత్య ప్రచురణాలయము వారు గాంధీ మహాత్ముని గురించి రెండు పద్య సంపుటములు వెలువరించిరి ఇవి ప్రత్యేకముగ గాంధిగారిని గురించినవి కాని నేను సంకల్పించి సేకరించినవాటి రీతి వేరు నాకును వయస్సు మళ్లినది ఈ గేయ ప్రచురణ కాలసింపదగదని త్వరలో దీనిని ఆంధ్రావని కందించిన, వారి పూర్వచరిత్రనందించుటయేగాక, జాతి యొక్కవరి సింహావలోకనము జేసికొని పురోగమింపగలదని నా ఆశయము ముఖ్యముగ గేయకవులగు కీ. శే గరిమెళ్ల, తమిళరాష్ట్ర జాతీయ కవి కీ శే సుబ్రహ్మణ్య భారతికేమాత్రము తీసిపోవని ప్రతిభాశాలి, అట్టి కవి చరమదశలో కటిక దారిద్ర్యమనుభవించి, యే ఆదరణలేక యజ్ఞాతముగ కాలగర్భమున లీనమగుట ఆంధ్రావని దురదృష్టము కాని మహాకవి ప్రాణోజ్జీవన గీతములీనాడును ఆంధ్రాకాశమున మారుమ్రోగుచు, అతనిని కీర్తికాయునిగా నిలబెట్టినవి ముఖ్యముగ నా యీ పూనికకు అట్టివారి గేయములతో వారి సంక్షిప్త జీవిత చరిత్రకూడ వెలువరించిన ఆంధ్రావని యాతని కించుక ఋణము దీర్చునట్లు అగునని నా యీ ప్రయత్నము

ఇందు సేకరించిన గేయకవులవేగాక, ఇంకెందరో కవులు గానం చేసియుందురు. అంతియేగాక యిందు సేకరించినవి కూడ, వారి రచనలందలి కొలది భాగములు మాత్రమే.

ఈ సేకరణలో ఆంధ్రదేశ పుస్తక భాండాగారములందలి పుస్తకముల గాలించి, వివిధ కవులను సందర్శించి, మారుమూలల ఉన్నటువంటిగల జాతీయాభిమాన వ్యక్తుల దగ్గఱగల గేయములు, పద్యభాగములు, సేకరించు భాగ్యము కలిగినది.

ఈ ప్రచురణలో తమ తమ రచనల ప్రచురణ కనుమతి నొసంగిన వారలందరికి నా ధన్యవాదములు. కడమ కవుల రచనల సేకరింపజాలని నా యశక్తతను యాంధ్రావని మన్నించుగాక.

ఎందరో కవులు, పెద్దలు, పత్రికాధిపతులు, పుస్తకభాండాగారాధిపతులు, నా యీ సంకలనకు తోడ్పడిరి. అందు ముఖ్యముగ వేటపాలెం సారస్వత నికేతన గౌరవ కార్యదర్శి శ్రీ ఆద్దుమిల్లి శ్రీనివాసరావుగారు, రాజమండ్రి గౌతమీ పుస్తక భాండాగారపు గౌరవ కార్యదర్శి శ్రీ మహీధర జగన్మోహనరావుగారు, కొన్ని పద్యభాగములు సేకరించి యిచ్చిన మిత్రులు శ్రీగూడూరి నమశ్శివాయ గారు, 'చందమామ' మేనేజరు శ్రీ బి. యస్. రామారావుగారు, వివిధ గీతములు గల తన పాటల పుస్తకమును అందించిన, కీ. శే. గుమ్మిడిదల సుబ్బారావు గారి భార్య రాజేశ్వరీబాయమ్మగారును, ముఖ్యముగ తెలంగాణా కవుల గేయ భాగములు సేకరించుటకు తోడ్పడిన శ్రీ కోదాటి నారాయణరావుగారు, శ్రీదేవుల పల్లి రామానుజరావుగారు, శ్రీ కేశవపంతుల లక్ష్మీనృసింహశాస్త్రిగారు, శ్రీ దాశరథిగారు మొదలగు పెద్దలును, యిందలి వ్రాతలకు తోడ్పడిన ఆప్తమిత్రులు, వీరు వారనక అభిమానముతో నా యీ యుద్యమమునకు తోడ్పడిన వారికందరకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. లోగడ 1947లో 'స్వాతంత్ర్య పథము' అనే గేయ పద్య సంపుటి వెలువరించితిని. కాని నేటియ్యది మహాకవుల సమష్టి గేయ పద్య సంపుటి.

పద్య, గేయ, సమీకరణలో, విచక్షణలో, ప్రచురణలో, అశాభంగము అనేకములుండవచ్చును. ఇయ్యవి బహుముఖముల సేకరింపవలసినవై, గురుతర బాధ్యత కష్టములతో కూడిన బృహత్కార్యమని పాఠక మహాశయులెరింగి నన్ను మన్నింతురుగాక.

ఇయ్యడి గాంధీజయంతీ వత్సరముననే ప్రచురింప ప్రయత్నించితిని. సాగలేదు ఇంతలో నా యదృష్టము పండినట్లు కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, హైదరాబాదులో జరుగు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ సమావేశమునకు గొనిపోయి, తదధ్యక్షులు, నాకు చిరకాల మిత్రులగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి యీ సంకలనము గురించి పరిచయము జేసిరి అంత వారు సంతసించి, యిద్దానిని, మాకిచ్చిన ప్రచురించెదమని ఆనంద ముప్పొంగబలికిరి, వల్లెయంటిని కార్యదర్శి శ్రీదేవులపల్లి రామానుజరావుగారుయీగ్రంధముపూర్తి యగునంత వరకెంతయో హెచ్చరించిరి ఇది అచ్చు గ్రంధముల నుండియేగాక వ్రాత పుస్తకములనుంచి సేకరించుటచే సరిగా వ్రాసికొనుట, తప్పులు దిద్దుకొనుట లుప్తభాగములు, దస్తూరి తెలియని భాగములు పూరించుకొనుట మొదలగు ఘట్టముల దాటి, ప్రచురింపగల్గితిని. ఈసంకల్పమును భారతస్వాతంత్ర్య రజతోత్సవ సంవత్సరమున, ఆకాడామీ వారు ముద్రించి, ప్రచురించుటకు తీర్మానించి తెలిపిరి. అందులకెంతయు నేను వారికి సర్వదా కృతజ్ఞుడను.

నా యీ ప్రచురణకు తోడ్పడిన, శ్రీ విశ్వనాథవారికి, శ్రీ గోపాలరెడ్డి గారికి, ముఖ్యముగ శ్రీ దేవులపల్లి వారికి, యింక దీనికి సాయము, ప్రోత్సాహమొసంగిన వార లందఱకు నా మనఃపూర్వక ధన్యవాదములు.

నా యీ జాతీయ గీతముల సంకలనకు తొలిపలుకు వ్రాసిన సుహృద్వరేణ్యులు శ్రీ గోపాలరెడ్డిగారికి, శ్రమయనక విమల పీఠిక వ్రాసియిచ్చిన కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

ఈ గేయ పద్య సంకలనము పూజ్య బాపూజీకి, ఒకఅమూల్య కంఠమాలయై అజ్ఞాత వీరులకొక కృతజ్ఞతా పూర్వక పుష్పాంజలియై, దేశమాత పాదారవిందముల కొక మహాభిషేకమై పాఠకమహాశయులకొక దివ్యస్మృతియై, విరాజిల్లు గాక యని యాశించుచున్నాను

హైదరాబాదు, తే౹౹ 3 2—1973

ఇట్లు
మాతృపాద రేణువు
గురుజాడ రాఘవశర్మ

~~.o.~~

# సమర్పణ

('మాకొద్దీ తెల్లదొరతనము' పాటవలె)

పల్లవి : జాతీయగీత, సం-గీతం వినండి, వి
ఖ్యాత కవీంద్ర, హృ-ద్గీతా రసామృతం. ॥జాతీయగీత॥

చరణము: స్వాతంత్ర్య సమరాన-జాతిమేల్కొలిపి, ఉ-ద్యోగిత
ఊగించినదండి,
వీరః వ్రాతము నడిపించె నండి,
వైరిః వ్రాతము నెట్టె సుమండీ,
రాజ్యంః చేతికందించిన దండి,
స్వీయః జాతికి ప్రాణము సుండి,
వీర, జాతీయస్ఫూర్తి, వి-ఖ్యాత విజయకీర్తి,
పీతి హోత్రుసిఖ్యాతి, వెలయించె, నిజశక్తిః
॥జాతీయగీత సంగీతం వినండి॥

గీ॥ దెబ్బదియు నాలుగేండ్లు నిండెను గదయ్యః
తరిలు నేడును, సత్కవితా స్రవంతి
తెలియజాల నెందుఁకొ, జాతీయ వీర
గీతముల పొందుపరచు, గిర్గింతనాకు.

గీ॥ ఉడుకుచున్నది, రక్తమిప్పుడును మరల
భరతదాస్య విముక్తికై పాటుపడిన
దేశభక్తుల హృదయ ము త్తేజపరుప
నెంచి, గీతామృతము చిందించినట్టి
కవుల వాగ్విభూతి, దలచి, కాంచిలోన॥

గీ॥ విమల విఖ్యాత కవుల గేయములనుండి
యేర్చికూర్చిన యట్టి జాతీయగీత
ముల సమర్పింతు సద్భక్తిపూర్వకముగ
పొందుగా మాతృపాదారవిందములకు॥ (గురుజాడ)



## "జాతీయగేయ కవిసార్వభౌమ" - శ్రీ గరిమెళ్లసత్యనారాయణగారి జీవితము

అగాధమైన మహార్ణవమున అట్టడుగున పడియుంటవి. అమూల్యమైన ముత్యాలు. కఠిన శిలాగర్భమున కానరాకుండ, యొదిగి యుంటవి ఘనమైన వజ్రాలు. ధూళి ధూసరముగ కప్పబడి, నిద్రించుచుంటవి, మట్టినైన మచ్చలేని మాణిక్యాలు. అటులనే మహాకవులు కూడ, మారుమూలల యూరు పేరు లేని, యుపాధులలో యజ్ఞాత గర్భములనుంచి, పైకుబికి, జీవమణులుగ, ప్రకాశించి, స్వప్రకాశులై నిలచి, కీర్తి చంద్రికల విరజిమ్ముచు భావాంబరమున ధ్రువతారలుగా భాసిల్లుదురు. అట్టి సుకృత జీవులలో మన గరిమెళ్ళ సత్యనారాయణగా రొకరు.

ఆంధ్ర దేశమున, ఉత్తరమున గల, కళింగాంధ్రమున శ్రీకాకుళమండలము, నరసన్నపేట తాలూకా, గోనెపాడు గ్రామం శివారు, ప్రియాగ్రహారం వీరు జన్మించిన పుణ్యభూమి. గరిమెళ్ళ సూరయ్య అనే బ్రాహ్మణోత్తముడీయన పితామహులు. ఆయన కుమారుడు రామకృష్ణమ్మ అనే వేంకట నరసింహం, యీ కవి పితృపాదులు. ఈ శూర కవిని కన్నతల్లి పుణ్యవతి సూరమ్మ. ఈయనకు ముగ్గురు చెల్లెండ్రు, నలుగురు తమ్ములు. వీరి ప్రాథమిక విద్య స్వస్థానమగు అగ్రహారముననే గడిచిపోయినది. వీరి ఉన్నత విద్య, విజయనగరం, మచిలీపట్టణములలో సాగినది. ప్రసిద్ధ భూస్వాములు బారిస్టరు శ్రీ కన్నేపల్లి లక్ష్మీనృసింహం గారి ధన సహాయముతో పట్టభద్రులు కాగలిగినారు. తొలుత గంజాంజిల్లా కలక్టరాఫీసులో వీరి గుమాస్తాగిరి. ఆ ఉద్యోగం తొలిఘట్టములలోనే, వీరికి జాతీయభావము లంకురించుట, ఉద్యోగమునకు స్వస్తి చెప్పడము కూడ జరిగినది. తరువాత విజయనగరము ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేసిరి. అది మూణ్ణాళ్ళ ముచ్చటైనది. తరువాత రాజమండ్రి ట్రయినింగు కళాశాలలో యల్. టి. ట్రయినింగు క్లాసులో చేరినారు. అది శ్రీపాద కామేశ్వరరావుగారి సహాయ సంపత్తులతో నడిచినది. ఇంతలో జాతీయ ప్రవాహం, హిమాలయోత్తుంగ శృంగముల నంటునట్లు భారతావనిని వ్యాపించినది. దేశనాయకమణి లోకమాన్య బాలగంగాధర తిలకు మహాశయుడస్తమించినాడు.

తోడనే గాంధీమహాత్ముడు భారతావని కేతనమయ్యె యావద్భారత ప్రజ్వలనముగలవి. దేశబంధు లాలా లాజపతిరాయ్ అధ్యక్షత క్రింద కలకత్తాలో ప్రత్యేకావసర కాంగ్రెసు సమావేశము జరిగినది. దానిలో బ్రిటీషు ప్రభుత్వమును ప్రతిఘటించుటకు బహిష్కారణోద్యమము (అసహాయోద్యమము) సాగింప తీర్మానించినారు. ఆ తీర్మానానుసారము కోర్టులు, శాసన సభల బహిష్కరణ, విద్యార్థులు విద్యాలయములు బహిష్కరింపవలెనని తీర్మానించిరి దీనికి నాయకుడు గాంధీజీ. వారి శంఖారావము, మన సత్యనారాయణగారి చెవిని పడినది. వెంటనే ట్రయినింగు కళాశాలావరణదాటి ప్రభుత్వముసుగూర్చి సూటిగా 'మా కొద్దీ తెల్లదొరతనము,' అంటూ ప్రబోధ గీతం పాడనారంభించెను. స్వదేశోద్యమము భారతావని నల్గడల వ్యాపించినది, ఈ అహింసాయుత శాంతి సమరమును, రాజమంద్రి వాతావరణము కూడ ఆయనకు కొంత దోహదము చేసినది మించి వారి ప్రచారమునకు ఆయువు పట్టైనది. 'దండాలంటోయి, మేముండలేము దొరో (బాబు), నూలు పోగు మీద రాజ్యం ఊగుతున్నదండి బాబు, సీమనూలు తెంచితేను-సితికి పోవునండి బాబు!' అనే పాటలు వారి నోటినుంచి వచ్చినవో లేవో, ఆంధ్రావని నింద ప్రాకి, ఉద్రూత లూగించినవి. ఇంక ననేక గేయములు ప్రచారము చేసినారు. ఈ పాటలు పాడిన వారికి ప్రభుత్వము జైలుశిక్షవిధించిన, ఇక యీ పాట సృజించి, పాట పాడిన కవిని ప్రభుత్వము విడచి వదలుపెట్టునా. దానికి ప్రతిఫలం ఒక సంవత్సరము శిక్ష. శ్రీకృష్ణ జన్మస్థానమున దొరలిన గేయములు వ్రాసి, కంఠస్థము చేసికొని, బయటకు రాగానే, ప్రచారమునకు బూనుకొనినారు. మరల వారికి రెండున్నర సం.లు శిక్ష విధించినది ప్రభుత్వం. స్థైర్యము, ధైర్యము కలిగిన సహధర్మచారిణి, భార్య సకలావస్థలుపడుచూ, దురదృష్టవశాత్తు వీరు జైలులో నుండగనే, దేశమాత యొడిలో దీర్ఘనిద్రపోయినది. సత్యనారాయణగారు స్ఫురద్రూపికాదు. కురూపియు కాదు. ఒకమాదిరి చామనచాయ. 5 అ. 4 అం.ల పొడగరి. ఆయనది పలుచని శరీరము. చూచుటకు కొంతమోటు మానిసిగా పొడగట్టువాడు. పెద్దనుదురు, తీర్చినకళ్లు, గంభీరమైన చూపు కోడేరువంటి ముక్కు కావిరంగు ముతక ఖద్దరు పంచె యీయన వేషం. మితభాషి. కంచుకంఠ స్వరము. బరంపురం కారాకిల్లి నోట- అనునాసిక ధ్వని మిశ్రితమైన వాక్కు. నిష్కల్మషమైన నవ్వు మొగము. అవసరమైనప్పుడు ప్రసంగములలో ఆవేశము

వెల్లివిరిసెడిది 'మా కొద్దీ తెల్లదొరతనం,' అనే పాట గరిమెళ్లను మరువరానీయని మంచి కోట మనసున చెరిగిపోని బాట తెనుగునాట జాతీయ కవిత్వమునకు యొరవడి పెట్టిన ప్రముఖ కవిగణమున, మన గరిమెళ్ల వారొక మణిపూస. వారిదొక నూత్నపంథా ఆయన గేయముల బాణిని, యెంతమంది కవులో, యొరవడిదిద్ది గేయకవులు కాకలిగినారు. ఆయన ఒక జానపద గేయ ప్రబోధ నాయకమణి భావమునకు తగిన ఫణలి-ఫణతికి తగిన శబ్దము; తీర్చిన తెలుగు నుడి కారములతో, గేయ ప్రవాహమును స్రవింపజేసినారు ఆ జాతీయ వీరరస వాహినిలో ముగ్ధులై యుత్తేజితులు గాని ఆంధ్రులేకాదు ఆంధ్రేతరులుకూడ యుండ రనిన అతిశయోక్తికాదు ప్రజలే కాదు గాంధీగారే యొకప్పుడు తన్మయులై 'భలేకవి' అన్నారు ఈయన గళమెత్తి 'రా రా! పోదాము రాజ్యమేలుదాము' 'కొయ్యేడ, కొయ్యేడ ఇలాగురారా కోటీయింతలు సెటుతానో రయ్యోకొయ్యాడ' అని పాటలు పాడుసరికి యొడలు మరచి, యుప్పొంగి, జనప్రవాహము నిలచి పోయెడిది. ఒకప్పుడు భరతనాట్యము జేసెడిది. జనం రాకపోకలు కూడ ఆగి పోయెడివి. అట్టి సమ్మోహనాస్త్ర గేయముల బాణి, పలుకుతీరు ప్రత్యేకము వేరు. ఆయన ఒక గేయ సరస్వతీ చరణ చారణ చక్రవర్తి ఆ దినములలో అతడు పాడినదిపాట అతడు నడచినది, నడిపించినది ఒక ఆట లయాన్వితమైన ఉర్రూతలూగించెడి శ్రావ్యచరణ నాదప్రసాద వినోదమునకు మూలకందమై సకల జన సమ్మోద పులకిత చైతన్యానందము వారిదారా ప్రవాహము

చిన్న తనముననే వివాహమై, అనతి కాలముననే భార్య గతించుటచే, మరల వివాహమాడెను. మొదటి భార్యయందు ఇద్దరు, తరువాత వివాహ మాడిన భార్యయందిద్దరు కుమార్తెలు కలిగినారు ప్రచారాగ్రగణ్యులుగ ప్రతిభ వహించిన గరిమెళ్ళ రాజమండ్రి యందే భరింపజాలని కష్ట నిష్ఠురములకు గురియయ్యెను. చెడి చెన్నపట్నం జేరినట్లు, తప్పని సరిగా 1928 ప్రాంత మున పవిత్రగోదావరితీరము వదని చెన్నపురికూవంనదీ తీరమునకు జీవితమును దరలించినారు. ఒక విశిష్టత, ఆయనలో కలదు. ప్రభుత్వము సత్యనారాయణ గారిని బంధించి, మేజస్ట్రేటువిలిచి, మీమైనేరము మోపబడినది, ఇందుకు మీ సమా ధానమేమిటి అని ప్రశ్నించుటచే తడవుగ, వెంటనే 'వినండి! ఇదుగో! నా సమాధానం వ్రాసికొనండినా వాఙ్మూలము అని, 'కూలిపోతున్నాది, మూర్ఖబ్రిటీషు ప్రభుత్వము మూలమట్టంతోటి కూలిపోతున్నాది,' అని గంగా ప్రవాహము వంటి, వీరవిహార

గీతము వెలువడినది గరిమెళ్ళ వారి కీర్తి ఎల్లెడల వ్యాపించినది. తమిళనాడుగేయ వాఙ్మయ చక్రవర్తి అనబడిన స్వామి. ద్రావిడ దేశమున పాడిన వీరి భారత విప్లవ గీతములు దేశజాతి కీర్తనలుగా స్థాపించుకొనిన శ్రీ.శ్రీ సుబ్రహ్మణ్య భారతి కూడ, ఆర్థికముగ యిబ్బందుల పాలైనవారే. లేమిబాధలే. వీరు మహా త్యాగులు విరాగులు. తిండిలేక, యనారోగ్యపడి అజ్ఞాతముగ కాలగర్భమున లీనమైనారు. సుబ్రహ్మణ్యభారతికి మాత్రము ద్రావిడదేశము మరపురాని, జ్ఞాపక చిహ్నముగ కీర్తిస్తంభమొకటి ఆయన పేర ప్రతిష్ఠించినది. మన భారతికి పట్టెడన్నము పెట్టి జోక్యం పుట్టించుకొన్న పెద్దలెవరు అంతగాలేరు. ఇది మనదేశ దురదృష్టము. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన - మా కర్మఫల హేతుర్భూర్మాతే సంగోస్త్వ కర్మణి' అను గీతావాక్యాను సరిణి చింతకు తావీక దారిద్ర్యమును సంతోషముగ యనుభవించి జీవితమును దేశమునకు ధారపోసిన ధీరుడు వీరుడు మన గరిమెళ్ళ.

వీరి జీవితరంగమునగల కొన్ని ఘట్టములు: ఆయన కొంతకాలము గృహలక్ష్మి పత్రికలో, పత్రికాధిపతియగు కేసరిగారికి సహాయులు. కాల వశాత్తు యిద్దరికి పడక యీతడు బయటికి రావలసివచ్చెను. తరువాత త్రిలింగ పత్రికలో కొన్నాళ్ళు, తరువాత శారదాశ్రమాం స్థాపించి ద్రవిడము నేర్చు కొని, ప్రముఖ ద్రావిడ గ్రంథమగు 'కురల్' ఆర్షత్రయము సర్వస్వము వచన కావ్యముగ అనువదించిరి. నాలదియార్ అను నీతి గ్రంథమును, ద్రావిడ భర్తృహరి, అనుపేరిట తెనిగించి, ప్రచురించిరి. 'హార్టు ఆఫ్ ది నేషన్సు' అను గ్రంథమును పద్యకావ్యముగ బుర్రకథగ వ్రాసినారు. ఖండకావ్యములు కొన్ని ప్రచురించిరి. అనేక హరిజన పాటలు, స్వరాజ్యపాటలు వ్రాసినారు. ఫ్రీలాన్సు జర్నలిస్టుగ, కొంతకాలం ఆంధ్రప్రభ సంపాదక వర్గంలో కొన్నినాళ్ళు పనిచేసిరి. ఎంత చేసినను దేహమునకు పుష్టిలేదు. చివరకు దృష్టితగ్గి హ్రస్వదృష్టితో, క్రమేపి, యీ మాయా ప్రపంచము నవలోకింప ప్రయోజనములేదనునట్లు, యీ అదృష్టహీనునకు, పూర్తిగ దృష్టినష్టమైనది. అప్పుడప్పుడు అవసరమునకు శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారు, అమృతాంజనము వారు, కొలదిగ ధన మొసంగి ఆదరించెడివారు. చెన్నపురి వీథులలో చేయానిచి నడుముపై, తల వంచుకొని, తరలిపోవుచుండెడివారు. యీ నిరాడంబర భావకవి చక్రవర్తి, చేతిమీదుగ పదిమందికి అన్నము పెట్టినను మరొకజన్మనైన అన్నము దొరుకు

నేమోయన్నట్లు 'కల్పకవిలాసం'అనే భోజన హోటలు నిర్వహించి వారు అందున గూడ అన్నపూర్ణ అనుగ్రహించలేదు అప్పుడప్పుడు మిత్రులు పలకరించుటలో కుశల ప్రశ్నలలో అనెడివారు– "కొందరు త్యాగముచేయవలె, కొందరు దారి ద్ర్యముతో నశింపవలె, పూర్తిగా నాశనమైనగాని, దేశమునకు స్వరాజ్యము రాదు" ఒకప్పుడు మాధవపెద్ది అన్నాడు...ఋణాల బాధ పడలేక, నిత్యదారిద్ర్యజీవనపు నెత్తురుసైతము పీల్చునట్టి పాపిష్ఠి ఋణాలబాధ." అటుల వీరు దారిద్ర్యము అనుభవించిరి గాంధిగారొకనాడు, జాతీయ గీతముల రచ యితల సమావేశము యేర్పరచి, సబర్మతీ ఆశ్రమమున వివిధ రాష్ట్రములతో బాటు వీరినికూడ బిల్వగా, హాజరైరి గాంధిగారి ఆజ్ఞానుసరణి యెవరిపాట వారు పాడి వినిపించినారు, గరిమెళ్ళ స్వీయ వీరావేశ గేయమొకటిపాడి, "దీనికి బహుమతి ఒక సంవత్సరం శ్రీకృష్ణజన్మస్థానము లభ్యమైనది" అన్నారు. అనగానే గాంధిగారు నమ్మలేదు తెలుగువారిమాట అంత తేలికగ నమ్మెడి వారు కారు గాంధిగారు వారు "నేను నమ్మను, ఇట్టిపనికివేరే నీవేదియో చేసియుండవలె"నని చమత్కరించినారు సాక్ష్యము ధృవమైన తరువాత నమ్మక తప్పలేదు అంతియేకాదు గాంధిగారు, తారస్థాయినందుకొన్న ఆ పాట విని ఆశ్చర్యచకితులై, మిగతా కవిగణమునకు సలహానిచ్చినారు ఈ బాణిలో, వీరందరుకూడ గేయములు వ్రాయుడని, అది మన గరిమెళ్ళకు గాంధి గారి చ్చిన యోగ్యతాపత్రము (Certificate) ఈ పాటను ప్రకాశం పంతులుగారు ఆంగ్లమున అనువదించి తమ స్వరాజ్య దినపత్రికలో ప్రకటించినారు కూడ.

ఈయన జీవితము యే యుద్యోగమునకు పనికివచ్చినదికాదు. జీవిత శకటము మొదటనే పట్టాలు తప్పినది. దారిలోనికి రావడమనునది యెంత అదృష్టవంతునకోగదా?

అరవై యేండ్లు నిండినవి, చూపు కనపడదు. పిల్లలందరు పెళ్ళికాని వారు ఒక కుమార్తెమాత్రం ఆయన పోషణభారము వహించినది. వావిళ్ళ వారు ప్రతినెలా యిచ్చెడి పదిరూపాయలతో జీవనోపాధికిసరిపోదుకదా. చివరకు ఉపనయనమునాటి పెన్నిధివిద్య భిక్షాటనం ఆధారమైనది. అదియే చరమ దశలో వీరి కాధారము

దారిద్ర్యదేవతకు కూడ, కిమ్మతే యంత్రాపహా అనునట్లు శ్రీ దుగ్గిరాల, రామకృష్ణకవి, మొదలగు మహాపురుషులెందరో దారిద్ర్యమును స్వాభావికముగ సంతోషముగ అనుభవించిరి. ఇక గరిమెళ్ళకూడ కడక దారిద్ర్యమనుభవించి 60వ యేట 18-12-52 తేదీన భారత సావిత్రి వీరాంక పీఠిపై దీర్ఘశాంతి తీసుకొనినారు. ఇట్టి జాతీయ కవిసార్వభౌముని మనదేశము అందరితోపాటు వీరినికూడ మరచిపోయినది. ఇట్టి అజ్ఞాత జాతీయగేయ కవి సార్వభౌమునకు నా హృదయపూర్వకపు జోహారులు.

ఓం శాంతి——శ్శాంతిః శాంతిః

రాఘవశర్మ—గురుజాడ.



# విషయ సూచిక





మాతృ పూజా ధ్యాన తత్పర
మతి పవిత్ర స్నాతుడవునై
విశ్వమందిర పుణ్య భూమికి
వెడలి రావోయి !

—"రాయప్రోలు"

# వందే మాతరం

(శ్రీ బంకించంద్ర చటర్జీ)

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం-మాతరం॥ వందే మాతరమ్।।
శుభ్రజ్యోత్స్నా-పులకిత యామినీం
ఫుల్లకుసుమిత-ద్రుమదళశోభినీం
సుహాసినీం-సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం॥ వందే మాతరం।।

త్రింశత్కోటి కంఠ కలకల నినాద కరాళే
ద్విత్రింశత్కోటి భుజైర్ధృత ఖరకరవాలే
కే బోలే మా తుమి అబలే
బాహుబలధారిణీం-నమామి తారిణీం
రిపుదళ వారిణీం-మాతరం॥ వందే మాతరం।।

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ తుమి ప్రాణ శరీరే
బాహుతే తుమి మా శక్తి-హృదయే తుమి మా భక్తి
తుమారీ ప్రతిమా గఢి-మందిరే మందిరే।। వందే మాతరం।।

తుమీ దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ-నమామి త్వాం
కమలాం-అమలాం-అతులాం మాతరం।। వందే మాతరం॥

శ్యామలాం-సరళాం-సుస్మితాం
భూషితాం-ధరణీం-భరణీం-మాతరం।। వందే మాతరం॥
వందే మాతరమ్.



# జాతీయ గీతం

(గురుదేవ్: శ్రీ రవీంద్రనాథ్ ఠాకూర్)

జన గణ మన అధినాయక జయహే !
భారత—భాగ్యవిధాతా,
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా.

వింధ్య, హిమాచల, యమునా, గంగా
ఉచ్ఛల జలధి తరంగా,
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా.

జన గణ మంగళ దాయక జయహే !
భారత—భాగ్యవిధాతా,
జయహే ! జయహే ! జయహే !
జయ ! జయ ! జయ ! జయహే !!



# దేశభక్తి

(మహాకవి గురజాడ)

దేశమును ప్రేమించు మన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టి మేల్ తలపెట్ట వోయ్!

పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువ్ పాటు పడవోయి
తిండి కలిగితె కండ కలదోయి
కండ కలవాడేను మనిషోయి!

ఈసురోమని మనుష లుంటే
దేశ మేగతి బాగుపడునోయి
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి!

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
దేశి సరుకుల నమ్మవలె నోయి
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి!

వెనక చూసిన కార్యమేమోయి
మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయి
వెనక పడితే వెనకే నోయి!

పూను స్పర్థను విద్య లందే
వైరములు వాణిజ్య మందే
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి!

దేశాభిమానము నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయి!

ఓర్వ లేమి పిశాచి దేశం
మూలుగులుపీల్చెనోయి
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

సొంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి !

చెట్ట పట్టాల్ పట్టుకుని
దేశస్థు లంతా నడవవలె నోయి
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలె నోయి !

మతం వేరై తేను యేమోయి
మనసు వొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగి
లోకమున రాణించు నోయి !

దేశ మనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్త వలె నోయి
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలె నోయి !

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలకవలె నోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్త వలె నోయి !



# మాతృస్తవము

("గరిమెళ్ళ")

వందనమిదె గైకొనుమీ - భారత జననీ!
భారత జననీ మా పాలిటి రాణీ. ॥ వందన ॥

నందనుల బ్రోవుమీ - ఆనందదాయినీ
ఆనందదాయినీముని బృంద వందినీ! ॥ వందన ॥

ముప్పది కోట్ల జనమునకు - మూల మాతవు
మూల మాతవు మా పాలి నేతవు, ॥ వందన ॥

మాదు భాగ్యములకునెల్ల - మహిత కర్తవు
మహిత కర్తవు—మా యఘవిహర్తవు! ॥ వందన ॥

ఉపనిషత్తులుప్పొంగె యుదరమందున
ఉదరమందున, అవి నిదుర చెందునా! ॥ వందన ॥

సకల పురాణేతిహాస - సారభరితవు
సారభరితవు-ఓంకార మహితవు ॥ వందన ॥

సకల సంపదలకు నీవు సంగ్రహంబవు
సంగ్రహంబవూ! గర్వ సంహారంబవు! ॥ వందన ॥

సాత్విక నిరోధమునకు-జన్మశాఖవు
జన్మశాఖవు, పటు జన సమేతవు! ॥ వందన ॥

యుద్ధశరము మాన్పునట్టి బుద్ధిశాలివి
బుద్ధిశాలివీ - అనిరుద్ధ ప్రజ్ఞవీ! ॥ వందన ॥

స్వరాజ్య దీక్ష గొనిన-సత్యమూర్తివి
సత్యమూర్తివీ - అసహాయ వర్తివీ! ॥ వందన ॥

*

# రాష్ట్రగీతము

("రాయప్రోలు")

వందే త్వాం భూదేవీం ఆర్యమాతరం
జయతు జయతు పదయుగళం తే నిరంతరమ్ ॥

శుభ్రశరచ్చంద్రయుక్త చారు యామినీం
వికసిత నవకుసుమ మృదుల దామ శోభినీం
మందస్మిత యుక్త వదన మధుర భాషిణీం
సుజలాం సుఫలాం సరళాం శివవరదాం
చిర సుఖదాం ముకుళరదాం ఆర్యమాతరం. ॥ వందే ॥

దశకత్రయకోటి జనకంఠనాదినీం
అమిత భుజాం ధృతసదసీం తనయతారిణీం
హిమనగజాం స్వాభిమాన బుద్ధిదాయినీం
కమలాం అమలాం అతులాం రిపుహారిణీం
బలకరిణీం ధృతనళినీం రాష్ట్రమాతరం. ॥ వందే ॥

ధర్మస్త్వం మర్మత్వం త్వం యశో బలం
శక్తిస్త్వం భక్తిస్త్వం కర్మచాఖిలమ్
ప్రతిసదనం ప్రతిమా తే త్వం మహాబలం
ధరణీం భరణీం జననీం కవిప్రతిభాం
నతసులభాం జగదంబాం హిందుమాతరం ॥ వందే ॥



# మేలుకొలుపు

(' మంగిఫ్రూటి ')

మేలుకొనుమీ భరత పుత్రుడ
మేలుకొనుమీ సుజన మిత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యా ! వత్సా ! ॥ మేలుకో ॥

వేడుకను జాతీయతాయను
వేగుచుక్క పొడిచె నదిగో
కూడి "వందేమాతరం" బని
కుక్కుటంబుల రచెన్. ॥ మేలుకో ॥

అల్లనదె విజ్ఞాన పసియెడు
నట్టి యరుణోదయము నాయెను
చెల్లెనంతః కలహమనియెడు
చీకటది యెల్లన్. ॥ మేలుకో ॥

అంతటను నవశక్తి యనియెడు
కాంతి పుంజము తేజరిల్లెను
మంతనంబున నూతనోద్యమ
మారుతము వీచెన్. ॥ మేలుకో ॥

అందఱును నీకంటె ముందఱ
నడుగు వేయుచు మెలగుచుండగ
పందవలె నిటు నిద్రపోవగ
పాడియగునయ్యా ! ॥ మేలుకో ॥

పగటిపూటను నిద్రపోయెదు
వారియి టను లక్ష్మి నిలువదు
తగదు ఋషి సంతతికి బుట్టిన
ధన్యులకునిట్లు ॥ మేలుకో ॥

ఆర్యపుత్రుడవై జగంబున
నవతరించియు నీ విధంబున
ధైర్యమెడలి జడత్వమొందుట
ధర్మమగునయ్యా. ॥ మేలుకో ॥

భారతీయుడె సద్గురుండని
పాడుచున్నది వినుము భారతి
ధీర వరుడవు నీ స్వశక్తిని
దెలిసికొనుమయ్యా. ॥ మేలుకో ॥



# స్వరాజ్యగీతామృతము

## భారతమాత గీతము

(శ్రీ బాలకవి : వడ్డాది సీతారామాంజనేయులు,
శ్రీ పూడిపెద్ది కాశీ విశ్వనాథశాస్త్రి)

( "సిరిసిరి మువ్వ" వలె )

పండాలు దండాలు-భారతమాత
అవి అందుకుని దీవించు-భారతమాత
గాంధీ మహాత్ముండు - భారతమాత
నీ ముద్దు కొడుకుండంగ — ,,
మాకేమియును భయములేదు-,,
మాకేమియును కొదువలేదు- ,,
తెల్లోళ్ళుంటుండంగానె —— ,,
మాకు చిప్ప చేతికొచ్చింది - ,,
మూడు వందలేండ్ల క్రింద—— ,,
అలకుంపినోడు దిగినాడె — ,,
దిగి యూరకున్నాడా — ,,
మా దేశమంతా దోసుకెల్లె - ,,
కుంపిని రాజ్యమంతరింప - ,,
ఆలసీమ రాణి గద్దెకెక్కె - ,,

శ్రీముఖమును నొకటిచ్చె భారతమాతా!..
గంపెడాశతో చూస్తుంటె – ..
అది గాలి బుంగయై పోయె –..
నిరంకుశాధికార మొచ్చె– – ..
మమ్మేమ్రుకొని తినుచుండె – ..
నీ పాదాలొక్కటె తప్ప – ..
మాకిప్పుడింక దిక్కేది – ..
నీవు ఒత్తాల తల్లివే – ..
నీవు పైరు పంటల నిక్షేపంవే–..
మా పాలి కామధేనూ – ..
నీవు మా పాలి కల్పవృక్షం – ..
పాడిపంటల మహాలక్ష్మి – ..
మా మొఱలాల కింపు మమ్మ–..
కర్రలైన కొట్టకుండ – ..
మా కత్తికూడ లాగినాడె ..
భూమి దున్ని బ్రతుకపోతే ..
ఎంతో! పెద్ద పన్ను వేసినాడె ..
అది సందర మంత తవ్వినట్లు ..
ఉప్పుమీద పన్నంటా ..
కన్న బిడ్డలె శత్రులైరి ..
నీవు మన్నించి దిద్దుకోమ్మ– భారతమాతా!

*

# మేలు కొలుపు

(శ్రీ వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

మేలుకొనుడు ! మేలుకొనుడు ! మేల్మిబంగరు-ఉషస్సిది!
ఓ నిద్రామత్తుల్లార ! ఓ భద్రాప్రమత్తులార !
ఈ ప్రాభాతిక వేళను-మీ ప్రాంగణములు తెరువుడు
మేలుకొనుడు ! మేలుకొనుడు ! మేల్మిబంగరు ఉషస్సిది॥

o o o o

ఆకు కూడ మేల్కొన్నది, అశ్రద్ధకు అవని కదలె
ఉదయమలయ మరుదంకుర
వలయంబులు పారుచుండె.
మేలుకొనుడు ! ఒత్తిగిలుడు ! లేచి కండ్లు నలచి గనుడు॥

o o o o

పక్షిగూడ మేల్కొన్నది, వనదేవత ప్రాణమువలె
ప్రణయ జీవ మధురగాన
ఝురులు కదలి రెక్కవిప్పి
ఉరికెడి నుత్సాహ మొప్పె !
లెండు ! లెండు ! దేవ దేవు-లీల పికముపాడె వినుడు !

o o o o

గుడిగంటయు మేల్కొన్నది-అడకువ పూజారివోలె
దివ్యశంఖనాద ప్రతి
ధ్వనులు సుప్తికాంక్ష జెరిచె
జాగ్రదధి మధన మొరసె
లెండు ! నడుము గట్టిముందు-పొండు ప్రార్ధనలు బాడుడు !

ం ం ం ం

పిల్లపూవు మేల్కొన్నది-ప్రేమబాటసారి వోలె
అభయ మనః ప్రమదరహో
దళ శరీరములు విరిసెను
లలితలాస్యములు కురిసెను
లేవలె ఖేదంబు పడక-పోవలె గమ్యంబు జూడ।

ం ం ం ం

పథముగూడ మేల్కొన్నది-నిరపాయపు కాల్వవలెను
సహచర జనగణ విభాత
వనములు తలలూపుచుండె
గమనంబులు సాగుచుండె
లేవలె లేవలె మీరే-వెనుకబడితి రెంతొ జూడ!

ం ం ం ం

నిశగూడను మేల్కొన్నది - నిన్ను లేపు దాని వలెను
ఉద్బుద్ధ ప్రకృతి మనో
భూకంపంబదె దరిసెను
ప్రత్యూషంబదె మురిసెను
లెండిక స్వాతంత్ర్యమిదో-లెండు శ్వాస విడువుడటనె
మేలుకొనుడు ! మేలుకొనుడు- మిసిమిబంగరుల ఉషస్సిది!



# వందే లోకైక నుత మాతరం

( నారాయణ రాగం, రూపకతాళం )

పల్లవి-వందే లోకైక నుత మాతరం-
అనుపల్లవి-పూర్ణ సుందరతర వినిర్మల-భువన భూషిత వాహినీ
స్వర్ణ రజత వినూత్న మణిగణ—సంభృతాంచిత ఘనఖనీ!
చరణములు
రంగదఖిల భాషిణీ ! సుహాసినీ ! సజ్జన చూడామణీ
భంగరహిత శుభప్రదాయిని-భవ్యసభోధారిణీ
క్రూర విమత మదాపహారిణీ-ఘోర దుఃఖ విదారిణీ
తుంగకంధరధారిణీ ! సదావని-రంగత్ఫుల్లా ధారిణీ
తుంగభంగ భవద్యశోస్ఫుట-తోయధిత్రయధారిణీ
సర్వకుసుమ ఫలద్రుమశోభిని-సర్వజంత్వుపకారిణీ
భాసురగుణ వందినీ - జనరంజని- భరత జననీమణీ
వ్యాస గౌతమ యాజ్ఞవల్క్య మహా మునీశ్వర మాతృకా
రామ భీమ కిరీటి ధర్మజ-ప్రముఖ ధీర సమాజనీ ॥ వందే ॥

## వందేమాతరం

శ్లో॥ వందేమాతర మిందు సుందర సఖీం ఇందిందిరా ధారిణీం
హిందూనందన మానసాంబుజ స్వరాజ్యోత్సాహ సంవర్ధినీం
మందానంద కృతావదాత ముఖహృత మాసీమ అహీన ప్రభాం
కందర్పారి నమానపుత్ర ప్రసవీం ఆర్యాం సదా భారతీం ॥

## మాతృభిక్ష - భవతీ భిక్షాం దేహి

భవతీ భిక్షాం దేహి మాతా । భవ్య భిక్షాం దేహి భ్రాతా
సస్యసుశ్యామల వాసినీం । శుభ్ర తుషార కిరీటినీం
ఫుల్లకుసుమిత శోభినీం । భువనమనోమోహినీం ।। భవతీ ।।

త్రింశత్కోటి ప్రజావతీం । పరాక్రమ ప్రభావతీం
లోకనుత కళావతీం। పూతచారిత్ర యశోవతీం॥ ॥భవతీ॥

సర్వవిద్యాప్రదాయినీం। బ్రహ్మవిజ్ఞాన సంధాయినీం
నిత్య కల్యాణ ప్రసాదినీం । నిఖిలగుణ నివేదినీం ।। భవతీ ।।

ం ం ం ం ం

వందన మఖండ భారత వర్ష జననీ। జననీ వందనమ్
సుందరామల మందపవనానందదాయినీ । జననీ । వందనమ్

అశేష కుసుమదళ సువాసినీ । ఆర్యభూషణీ । జననీ వందనమ్
అఖిలదేశసుఖనికేతన-హర్షవర్ధినీ-ఆరోగ్యస్నాన పాయినీ। ॥వందనమ్।



# మాతృగీతా

('రాయప్రోలు')

నమో మంగళశ్రీ మహా మాతృభూమే
నమో భారత సవిత్రీలలామే ॥

నమస్తే హిమాహార్య ధమ్మిల్లతారా
నమస్తే త్రివేణీ భర శ్రీరధారా ॥

అలం దీవ్యతే తావకీనా పతాకా
త్రివర్ణాయితాశోక చక్ర ప్రతీకా ॥

జ్వలంతీ తవ క్షాత్ర శస్త్రాస్త్ర మాలా
వృణీతే స్వయం శాంతి సత్క్రూర లీలా ॥

ధ్రువంతే ప్రజా రామ రాజ్యం స్వతంత్రం
పరం తేహ్యహింసా ముఖస్వీయ మంత్రం ॥

ప్రశామ్యన్తు చాన్నాంబర క్షామభేదాః
వినశ్యన్తు రాష్ట్ర ప్రజా మిత్ర భేదాః ॥

అశోకం భవేదార్తి జుష్టం ప్రపంచం
చిరం వర్ధతాం భారతీయం చరిత్రం ॥



# ప్రబోధము

(చిలకమర్తి)

తే.గీ. భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

సీ. పన్ను గట్టుటయందు ప్రభువులో హాణుల
కేనాటికైనను దృప్తి లేదు
ఉద్యోగములు చేయు సున్మత్తులకు గార్య
నిర్వాహమందున నియతి లేదు
బహు పరీక్షల దేరి ప్రజ్ఞాఢ్యులగు మీకు
రవ్వంతయేని ధైర్యంబు లేదు
మితిలేని తమ చెడ్డగతినెల్లఁ దగ విన్న
వింపఁగ రయితుకు విద్య లేదు.

తే.గీ. తెలుఁగు తెలియంగ దొరలకుఁ దెలివి లేదు
దీనదశఁ బాపగల యట్టి దిక్కు లేదు
కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
సుగుణ ధనులార జనులార చూడరయ్య.

సీ. నేల దున్నుదమన్న జాల తరము పన్ను
నీరు గావలెనన్న నీటి పన్ను
వాణిజ్య మొనరింప వచ్చుబడికి పన్ను
సరుకు లమ్ముదమన్న సంత పన్ను
కఱ్ర లమ్ముదమన్నఁ గలప కింకొక పన్ను
పట్టణంబుల మున్సిపాలు పన్ను
పారిపోవు డిమన్న బండి హాసీల్ పన్ను
కొంపమ్ము కొన్నచో స్టాంపు పన్ను

తే.గీ. ఉన్నమట్టుకు తినకుండ నుప్పు పన్ను
ననెడు పన్నులె దిగదీసె జనుల నెల్ల
కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
సుగుణ ఘనులార జనులార చూడరయ్య.



# మాతృవిలాపము

(చెన్నాప్రగడ భానుమూర్తి)

చ. మతములు పొచ్చినిల్లు జనమాన్య చరిత్రులు పుట్టినిల్లు న
ప్రతిమ దయా శమాది గుణరత్న సమృద్ధికి రోహణాద్రి శా
శ్వత నిరపాయ మోక్షఫల భాసుర వేదలతాలవాలమై
యతుల విభూతిఁ బొల్తు విల నంబరొ నీ సరి ధన్యలుందురే!

ఉ. మాతరొ! నీ సుతుల్మునుపు మాన్యచరిత్రులమేయశేముషి
ఖ్యాతులునై యనారత మఖర్వగతిం ధన ధాన్య సంపదల్
ప్రీతికి మెండుగా గలిగి పేదరికంబున పేదలై కలా
చాతురి శౌర్య సంపదల శాస్త్ర పరిశ్రమ మించి రెంతయున్.

మ. అకటా! దేశ దరిద్రతం దలపగా నత్యంతము న్స్వాంతముల్
వికలం బయ్యెడు సర్వరత్న ఖనియై విస్తీర్ణ రసాఢ్యయై
సకలోర్వీమణి నూపురంబయిన యీ సర్వం సహాభాగ మం
దొక నూటన్పదికైన లేదు దిన సయ్యో తల్లి ముప్పొద్దులన్.

శా. గంగా సింధు మహా నదుల్ యమునయుం గావేరియు న్నర్మదా
తుంగభద్రలు బ్రహ్మపుత్రయు లసద్గోదావరీ కృష్ణలున్
బంగాళాంధ్ర కళింగ కోసలములం బాంచాలముం గొంకణం
బుం, గర్ణాట మరాట దేశములనున్ ముక్కాఱు ధాన్యంబు లో
లిం గాపించి యొసంగినం గుడువఁదల్లీ లేదు ముప్పొద్దులన్.

శా. రంగద్రత్నమయూఖ దీధితి సమాజాజ్వద్రీ భ్రాజి తో
త్తుంగక్ష్మాధర పంక్తులుం బరిలసత్ఫుల్లాబ్జ కాసారముల్
తుంగక్ష్మారుహ శోభి కాననము లెందున్ లోచనానందమో
లిం గావించుచు నుండు కూడొకెడ తల్లీ లేదు ముప్పొద్దులన్.

సీ. ప్రొద్దున లేవంగ పొయిరాజ వలెనన్న
నగ్నిహోత్రము స్వీడె నంపవలసె
నా బాల గోపాల మఖిలంబునకు
మాంచెస్టరు పుట్టము న్నేయవలసె
మునుమాపు వ్యాయామమునకు కందు
కములు లండను బంపుచుండవలసె
వ్రాతకు లేఖినీ పత్రము ల్వలయుచో
నాస్ట్రియా జర్మనీ లంపవలసె

గీ. చిన్న బిడ్డలు ద్రావంగ క్షీరములును
భాగ్యవంతుల పాలకు పంచదార
యూరిపేదల గంజికి యుప్పుగల్లు
నన్య దేశంబు లంపగ నయ్యెనకట!

ఉ. మాసె కలా ప్రవీణత, సమస్తము నస్తము నొందె శిల్పము
ల్మాసె నశేష భూషణ వాంఛిత భారతవర్ష సంపదల్
డాసె నవగ్రహంబు, ధనలక్ష్మి దొరంగి దరిద్రులై ప్రజల్
గాసిలి చిక్కి రెంతయును క్షామనిపీడితులై యజస్రమున్.

కం. నేతల పోతల చిత్తరు
వ్రాతల నిర్మాణములను వాసి గనిన యా
తాతల తండ్రుల వృత్తులు
చేతి పనుల్ దక్కి దిగిరి సేద్యమునం బ్రజల్.

ఉ. జాతి మతాది భేదముల సంస్కరణంబు మెయిం బరస్పర
ప్రీతియు భ్రాతృ భావమును వీడి యొకప్పుడు నేక దేశ సం
జాతుల మన్న మాటను బ్రజల్గణియింపక దేశవృద్ధికిం
ఘాతుకు లైరయో! జనుల కష్టము లెన్నఁడు తీరునో కదా ?

శా. ఏవాడం గన నెల్లవారలును నెంతే వృద్ధి గాంక్షించి యా
త్మావాసంబులు వీడిపోయి యఖిల వ్యాపారము ల్సత్కళా
ప్రావీణ్యంబులు సంగ్రహింపఁ దమ పూర్వఖ్యాతియే యెంచి మి
థ్యా వైరాగ్యముఁ బూని యుందురిట నత్యంతంబు సంతుష్టులై.

ఉ. క్షామము దీరునే ప్రజ నకాలపు మృత్యువు వోలెఁ దోఁచి వే
షామక దేశవాసులను మారి మసెంగెడు మారి యాఱునే
క్షేమమున న్సుఖింతురె యశేష జనంబులు స్వస్థచిత్తులై
బాములు దీరి నీదగు కృపారస వృష్టిని దేరి దైవమా.

ఉ. భారతవర్ష మందు మనవారలు పూర్వము బుద్ధిమంతులై
చార దుకూలధారులయి షడ్రసము ల్భుజియించు చున్నెడ
న్వారలు గట్టి కూర లశనంబుగ నుండిరి యన్యదేశపు
న్వార లటండ్రు; వారిపుడు భాగ్యము నందులఁదూగుచుండగాన్.

ఉ. బేరు ప్రతిష్ఠ యున్మఱచి పేదలమై వెడఁ గూడుఁ గూరయుం
జీరయు లేక చిక్కువడి చింతల పాలయి చెట్లు పుట్టలుం
జేరి వసించు మౌనిక్రియ జీర్ణ శరీరము లర్థభుక్తిచే
నీరసమై కృశింపఁ గడు నీచత నుంటఁ దలంప రేమియున్.

మ. మతివై శద్యము పాప భీతియును ధర్మస్ఫూర్తియు న్వేచెడెన్
మతవైషమ్యము లెచ్చె భక్తికడు సన్నంబయ్యె దుస్తర్కముల్

వితతంబయ్యె దయాశమాది గుణముల్మాంద్యంబు లయ్యెంగటా!
సతతధ్వాంతము గ్రమ్మె దేశజన ధీ సమ్మోహనంబై కడున్.

మ. ఉదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వి న్నిరాఘాట సం
పదనేకాతపవారణంబుగ మిథో మాత్సర్యము ల్మాపి దు
ర్మద శత్రు వ్రజమున్ హరించి కరుణం దాలింపుచో నైకమ
త్యదమున్ శ్రీదము నైన యాధునిక విద్యా కల్పవృక్షంబిటన్

మ. సదయత్వంబున నాటి సేతు రచనా నైపుణ్యమే పారఁగా
నదులన్ సాగర గాములన్ పథమునన్ బంధించి వంధ్యోర్వి స
స్యద గావింపఁగఁ గుల్య లేర్పరచి, రథ్యా శ్రేణి నిర్మించి సౌ
ఖ్యదమై పొల్చు స్వరాజ్య మీ యవని స్థైర్యస్ఫూర్తి వర్ధిల్లుతన్.

మ. వందేమాతర మంచుఁ జిత్ర లిపులన్ ఖాస్వత్పతాకల్ వెలుం
గం దేశాంతర సంగసర్వజల భాగ ప్రస్థితిం ధూమ నౌ
కాందోళంబులఁ దాఁగి వచ్చి నిజదేశాలోకనావాప్తి నా
నం దాంభోనిధి నోలలాడుదురు సన్మాన్య స్థితిన్నీసుతుల్.

గీ. పాఁడి దలఁచిన మనపాలి పాలవెల్లి
పైరు దలఁచిన మనపాలి పంట చేను
వసు సమృద్ధికి మనపాలి భాగ్యరాశి
భరతఖండము మన తపః ఫలము గాదె?.

గీ. నిరత సర్వర్తు సుమఫల భరిత మఖిల
దేశ మృగపక్షి రాజితోద్దేశ మమల
వారిపూరిత నదనదీ భ్రాజిత మిది
యఖిల ధాత్రికి నారామ మనఁగఁ దనరు.

గీ. ప్రజలు ప్రజ్ఞాన సముద్రులు భవ్యమతులు
విమల సౌజన్య యుతులు పవిత్ర చరితు
లఖిల శిల్పకళా రహస్యార్థ విదులు
నసదృశౌదార్య సాహస ప్రాంచితులును.

గీ. కూటికేమియు మనలకుఁ గొదువ లేదు
కోట్లు లెన్నియు బోయెడు గుడ్డలకయి
ఆ ప్రవాహము నాపంగ నాసకట్ట
యన స్వదేశోద్యమము నేఁటి కమరె మనకు.

[గా మనకు గల్గెగా బహిష్కార మరయ].

గీ. తంత్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి.
తంత్రి యొసఁగిన దివ్యసాధనము దీనిఁ
గొని గడంగుడు బాపంగ జననిదైన్య
మిట్లొనర్చిన మన కగు నిష్టసిద్ధి.

గీ. సన్న నూలున సరిగను జాతి పనులఁ
దోఁచు సంతోషమెల్లను దుచ్ఛమనుచు
దేశమాత యొసంగెడు లేశమయిన
మేరువంచుఁ దలంచుట మేలు మనకు.

గీ. ముతుక బట్టలుఁ గట్టుట మోటు దన మ
టంచు వెంగలులై మన మెంచఁ జనదు
హృదయ మందున నౌదార్య మెసఁగకున్నఁ
గల్ల మెఱుఁగుల నాగరికంబు రాదు.

గీ. తంఁడ్రి దైవంబు మనలకుఁ దల్లి ధాత్రి
యన్నదమ్ముల మగు మన కైకమత్య
మును నిరంతర సౌభ్రాత్రమును బొసంగు
నివి యొసంగిన మన కగు నిహము పరము.

గీ. మనము బుట్టిన మన్నును మనము గలియు
మన్ను నియ్యది, గావున మనకు బైట
వేష భాషల భేద మెవ్విధి నొదవిన
హృదయ సీమల సౌభ్రాత్ర మెనయ వలయు.

గీ. కాన దేశభిమానంబు కల్మి కైస్త్రి
వులు ముసల్మానులును హిందువులును బార
సీలు నొక్క- కుటుంబమై చేరి దేశ
మాత నుద్ధరయింతురు గాతఁ బ్రీతి.

గీ. శక్తు లభ్యాస-సహితమై జనుల యందు
ఘన వికాసము గాంచి ప్రకాశ మందు
శక్తు లభ్యాస రహితమై సన్నగిల్లు
చాల కాల మటులె పోవ సమసి పోవు.

కం. "రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మగాన రాజును బ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్."

భారత జనని

కం. అనునార్యోక్తిని మఱవక
ననవరతముఁ బ్రజలు ప్రభువులనురక్తి మెయిన్
వినుతైకమత్య భావము
పనుపద వర్ధిల్లుచుండ్రు ప్రాజ్ఞులు పొగడన్.

కం. వందేమాతర మను నీ
వందారు జనాళి కెప్డు వాత్సల్యము తో
డందేశమాత యమితా
నందం బొనఁగూర్చు గాత ! నానార్థదయై.



# జాతీయగీతము

("దూవ్వూరి")

జోహార్! జోహార్! భారతమాతా!
జోహార్! జోహార్! జోహార్!

శారద శుభ్రవియత్తల పథమున సంచరించు నీ రథము
నీ మృదు వీణాగాన ప్్రబుద్ధము—నిత్యము మా మనము
జోహార్! జోహార్!

ప్రత్యూషలక్ష్మి మకుట మణి ప్రభ—బాసె దమోగణము
నీ పదపంకజ నూపురఝంకృతి-నిద్రావిరహితము.
జోహార్! జోహార్!

విప్లవ ఝంఝూ విచలితజీవన-వీచినికాయమున
స్థిర విజయోడుపకర్ణధారణము-సేయుము శౌర్యమున
జోహార్! జోహార్!

ముకుళిత హస్తులు నీ ప్రియపుత్రులు-మోదదృష్టిగనుము
నీ కరుణామృత నిర్ఝరపూరము-నింపుమమ్మ సతము
జోహార్! జోహార్!

నీ పదపీఠిని ప్రాణసుమంబులు-నిల్పి భజించెదము
గర్హితదాస్యభరంబును మాన్పి-సుఖంబులు మాకిడుము
జోహార్! జోహార్!

*

# జన్మభూమి

("రాయప్రోలు")

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండుగౌరవము.

ఏపూర్వ పుణ్యమో, ఏ యోగబలమో
జనియించినాడ వీ స్వర్గఖండమున
ఏమంచి పూవులన్ ప్రేమించినావో
నినుమోచె యీ తల్లి కనక గర్భమున.

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరులింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక.

అందాకగల ఈ అనంత భూతలిని
మనభూమివంటి చల్లని తల్లి లేదు
పాడరా నీతెల్గు బాలగీతములు
పాడరా నీ వీర భావ భారతము.

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ
శౌర్యహారము రాజచంద్రులర్పింప
భావ సూత్రము కవిప్రభువులల్లంగ
రాగ దుగ్ధము భక్తరత్నముల్ పిదుక

దిక్కులకెగదన్ను తేజమ్ము వెలుగ
రాళ్ళ తేనియలూరు రాగాలుసాగ
జగముల నూగించు మగతనంబెగయ
సౌందర్యమెగబోయు సాహిత్యమలర

వెలిగిన దీ దివ్యవిశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర
పొలముల రత్నాలు మొలిచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట.

పృధివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమానమేలరా? అనుమానమేల?
భారతీయుడనంచు భక్తితోపాడ.

తమ్ముడా!

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలుపాఱిన భాగ్యసీమయి
వ్రాలినది యీ భరతఖండము
భక్తిపాడర; తమ్ముడా!

వేదశాఖలు పెరిగె నిచ్చట
ఆదికావ్యంబందె నిచ్చట
బాదరాయణ పరమ ఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా !

విపిన బంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపుల తత్వము విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా !

సూత్ర యుగముల శుద్ధవాసన
క్షాత్రయుగముల శౌర్యచండిమ
చిత్ర దాస్యముచే చరిత్రల
చెఱిగిపోయెనె చెల్లెలా !

మేలి కిన్నెర మేళవించి
రాలు కరగగ రాగ మెత్తి
పాల తీయని బాల భారత
పదము పాడర తమ్ముడా !

నవరసమ్ములు నాట్యమాడగ
చివుర పలుకులు చెవుల విందుగ
కవిత లల్లిన కాంత హృదయుల
గారవింపవె చెల్లెలా !

దేశ గర్వము దీప్తిచెందగ
దేశ చరితము తేజరిల్లగ

దేశ మరసిన ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా !

పాండవేయుల పదును కత్తులు
పండి మెఱసిన మహిత రణకథ
కండగల చిక్కని తెలుంగుల
కలసి పాడవె చెల్లెలా !

లోకమంతకు కాక పెట్టిన
కాకతీయుల కదన పాండితి
చీకిపోవని చేవ పదముల
చేర్చిపాడర తమ్ముడా !

తుంగభద్రా భంగములతో
పొంగి పొంగిన పౌరుష శ్రీ
భంగపడని తెలుంగు నాథుల
పాట పాడవె చెల్లెలా !



# మాతృస్తవము

(కాటూరి వేంకటేశ్వరరావు)

కొప్పున తారకల్ తురిమి, గోముగు మోమున జంద్రవంకతో
నొప్పెడి రావిరేక యిడి, యుర్విధరంబులు చేసి, పాలయే
ఱుప్పతిలంగ జేసి, పృథులోరు తలమ్మున జేర్చి బిడ్డలన్
బెవ్వల దేల్చి కన్మొగుచు దేవి భవత్పద మాశ్రయించెదన్.

పుడమికి పర్వతమ్ములును, భూమిధరమ్ములకెల్ల గాన, ల
య్యడవుల కెల్ల మేఘముల, నంబుధరంబులకెల్ల నబ్ధి, న
క్కడలికి సూర్యు, నిమ్మెయిని గాపులు పెట్టుచు వీని నన్నిటన్
గడుపున బెట్టి బ్రోచు నిను గన్గొను టెన్నటికో దయామయీ!

పలిత పాండురకేశపాశితో నొకమాఱు
ముత్తైదువంబలె బత్తి గూర్చి,
నవ వసంతారంభ పవమాన సౌరభ
మ్మునదేలు చొకపరి ముద్దులొలికి,
తారాకు రాల్చి తురషామ్ము మెయిగప్పి
జాలిగొల్పుచు నొక్కమాఱు నిలిచి,
ఉరుము మద్దెళ్ళతో మెఱుపు నృత్యము నల్పి,
యొకపరి నెమ్మది కుబ్బు గొలిపి,

దిన దినమ్ము క్రొ_త్తవేషమ్ము దిన దినమ్ము
క్రొ_త్తభావమ్ము దాల్చి క్రొంక్రొ_త్త సూపు
అక్షయ విలాసినీ యీ ప్రతిక్షణాంగ
హారముల దాచెదేల నిజాంతరమ్ము.

నిజయశశ్చంద్రికల్ నిఖిల దిక్కు_ల యందు
ప్రజ్జ్వల చేసిన ప్రాజ్ఞురాలు,
వీరాధి వీరుల విజయ ప్రతాపుల
ప్రియమారగన్న ప్రావీణ్యురాలు,
తన ప్రతాపము తెల్పి తనయుల మేల్కొ_ల్పి.
ఘనత గాంచగనున్న యనఘురాలు.
మత విపక్షత మాన్పివెతలు దీర్పగనున్న
పుణ్యాత్మురాలింక పూజ్యురాలు,

విమల విఖ్యాతి వడసిన వీరమాత
అట్టి భారత మాతను యనవరతము
తలచి, ఋణమును దీర్పగా తరలి రండు
జనని దుఃఖమ్ము మాన్పని జన్మమేల ।



# భారత జనని
(గురజాడ రాఘవశర్మ)

పల్లవి : జయ జయ భారత జననీ, పావనీ, జయ జయ ॥
అనుపల్లవి : జయ జయ సకలానంద దాయినీ, జయ జయ ॥

హిమాలయోన్నత - సమాదర్శిని
తమో దళన, విద్యా స్వరూపిణి. జయ జయ ॥

సంతత సస్యశ్యామల రూపిణి
సంచిత సకలైశ్వర్యదాయిని. జయ జయ ॥

పావన గంగా జీవన శోభిని
పతితోద్ధారిణి, పాప విదారిణి. జయ జయ ॥

మధుర కుసుమఫల మంద సుహాసిని,
మంజుల శుక పిక - మధుర సుభాషిణి. జయ జయ ॥

ధీర వీర వర - నారీ రూపిణి
వైర వర్గ సంహారిణి - తారిణి. జయ జయ ॥

సార్థక, ధర్మ-చక్ర పతాకిని
సకల సౌఖ్యరా - జ్యప్రదాయిని. జయ జయ ॥

వీరకుమార కుమారీ ధామ్ని
విశ్వకీర్తిశో - భిత శుభనామ్ని. జయ జయ ॥

విశ్వలోకహిత విజయ కిరీటిని
శాశ్వత మంగళ - శాంతిదాయిని. జయ జయ ॥

# భరత మాత

("జాషువా")

ప్రమథ నాథుని నీరు ద్రావింప జాలిన
　　　　వజ్రాల కొడుకుల బడసినావు.
నరకాధిపతి గుండెఁగరగింప జాలిన
　　　　వెలది మిన్నల కుగ్గుఁబెట్టినావు.
బ్రహ్మయంతటివాని వణఁకింప జాలిన
　　　　మునుల మూపున నిడి మోసినావు,
అంటినంతన పాపమణఁగింప జాలిన
　　　　తీర్థకోటుల ముద్గి తేలినావు.

యుర్వి పుట్టకముందె నీ వుంటివేమో
సకలశాస్త్రి పురాణముల్ చదివినావు
గొనబు సిరిగల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ నమస్కారమమ్మ !

జలకంబులాడించు చెలికత్తెగద నీకుఁ
　　　　గనకాంబుజాఢ్య గంగా భవాని
తలమీది గుండుమల్లెల దండ గద నీకు
　　　　నత్యున్నతోరు హిమాలయంబు.

పూత బంగారు బొమ్మల పెట్టెగద నీకు
సిరివెలంది చరించు సింహాళంబు,
ముద్దుగారెడు నిగ్గుటద్దంబుగద నీకు
నిండారు హిందుమహాంబురాశి,

ఇట్టి నిమజాచి విచ్ఛంబు బెట్టుమనుచు
అన్ని దిక్కులు యాచించు చున్నవమ్మ
ఐకమత్యంబుగల్గి నిన్ననుభవించు
కొఱత పూరింపవే మాకు భరతమాత!



# అగ్నిధార

("దాశరథి")

ఓ జనతా నతాంజలి పుటోజ్జ్వల కోష్ణనవోష్ణ రక్తధా
రా జలసిక్త పాద కమలద్వయ శోభిమనోజ్ఞ దేహా రే
ఖాజయ భారతీ! యుగ యుగమ్ముల పున్నెపుపంటవీవు నీ
పూజకు తెచ్చినాడ నిదెపొంగిన గుండియనిండు పద్దెముల్.

ఝండా, ఒక్కటె మూడు వన్నెలది, దేశంబొక్కటే భారతా
ఖండాసేతు హిమాచలోర్వర; కవీట్కాండమ్ములోనన్ రవీం
ద్రుండొక్కండె, కవీంద్రు, డూర్జిత జగద్యుద్ధాలలో శాంతి కో
దండోద్య ద్విజయుండు గాంధి ఒకడే, తల్లీ మహా భారతీ।



# మాతృభూమి

(కాటూరు వేంకటేశ్వరరావు)

పుడమి చేడియకు గొప్పనౌ మల్లెపూదండ
పోలుపుగల మా జన్మభూమి భారతధాత్రి
ఎంత చక్కని తల్లి వే! రాణివే! ఎల్ల భూములకు నీవు

ముక్కారు పంటచేలు మితిలేని
రొక్కములు మూల్గు నిధులు
చక్కనగు పూదోటలు – మాతల్లి! సౌభాగ్యవతివి, నీవు
దిక్కులన్నీ వెదకినా–నీవంటి దేశమేదీ! పుడమిపై
ఎంత చక్కని తల్లి వే, రాణివే! యెల్ల భూములకు.

ఇంత చక్కని చంద్రుడూ! చుక్కలూ,
ఇంత వెచ్చని సూర్యుడూ,
కారు క్రమ్మిన మిన్నులూ – తొలకు క్రొ
క్కారు మెఱుపుందీవలూ!
పులుగు పాటల జోలలూ, కలకలని
పులుగులా మేల్కొలుపులూ॥ ఎంత చక్కని......

ఒరగబండిన చేలకు - గిలిగింత
గరవు తెమ్మెర బాలుడు
పులక కెరటాలతో పొందు - భరతక్షితీ॥ ఎంత... ...

పూలా విరిసిన తీవలూ - తీవల్లు
పొదివికొన్న వికుంజముల్
కుంజ కుంజమున భృంగి కులములెత్తెడి పరువులూ
పరువు పరువున పాటలూ - సోనలై
పారు పూవుందేనెలూ
తేనెలానిన యళుల సౌఖ్యాలందే లేవు॥ ఎంతచక్కని ...

తల్లి బిడ్డల ప్రేమమూ, అక్కచెల్లెళ్ళ కమ్మని వలపులూ
చల్లనైన సరాగమూ అన్నద
మ్ముళ్ల కింకెచట గలదూ!
అందిమ్మ చరణ యుగము, తల్లిరో!
అద్దుకొందును కన్నులా
పిక బుట్టిన పున్నెమూ, ఫలియించు
పిలోన లయమందినా
ఎంత చక్కని తల్లివే! రాణివే, ఎల్లభూములకు నీవు॥



# ఉయ్యాలా! జంపాలా!

*('కవికొండల వేంకటరావు')*

ఉయ్యాలా! జంపాలా! భారత నవజీవన బాలా!
పూరిత సత్యాగ్రహ శీలా! పరిభవ దుఃఖిత పాంచాలా!
నీ పురుడు-ఏ నెలలో-వెన్నెలల-క్రొన్నెలలో
నీ పుట్టు-వెచ్చోట-మిన్నెట-మున్నీట. ఉయ్యాలా

తొలినాటి-వేదాలు-పులివోని-చనుబాలు
మఱునాటి-కావ్యాలు-కమ్మ గు-జ్జన గూళ్ళు. ఉ......

శ్రీరామాయణ కథలు-ఊకొన్న వాక్పథలు
భారత గీతా రుతము-చందాయి యమృతము! ఉ......

బుద్ధుడు నీ సంబుద్ధి-యవను లోకో నీ శుద్ధి
మొగల్ మరాటుల్ చేబంతుల్-రసపుత్రుల్ చేమంతుల్. ఉ......

పాశ్చాత్యమ్ మోహాంధమ్-ప్రాచీనమ్ ప్రియ బంధమ్
ఆధ్యాత్మమ్ కల్యాణమ్-స్వాతంత్ర్యమ్ శతమానమ్. ఉ......

నీ మెట్టు పీలాలు-నీ చుట్టు నీ రాలు
జడ దొట్టు తలఁబ్రాలు-ఒడిగట్టు మగరాలు. ఉ......

ముజ్జగపు దీవెనలు-ముప్పది కోటుల జనులు
జయ జయ వాద్యోన్నతులు-జేజేల హారతులు. ఉ.....



# జాతీయ గీతిక

(కవికొండల వేంకటరావు)

హిమగిరి శిఖరము-వింధ్య వనీంద్రము
కన్యాకుమారీ పద డిండీరము

స్ఫురితము-భరితము-చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే-స్వాతంత్ర్యముచే

స్వాగత మనవోయ్, కవి, పని వినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్ !
జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని,
కావేరి, నర్మద యమునా సింధులు

అహర్నిశాదులు-ఒకటే గానము
కలలో-అలలో-అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై-స్వాతంత్ర్యముకై

స్వాగత మనవోయ్, కవి, పని వినవోయ్
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్.
గుజరాత్, వంగ, అంగ, మరాటా,
త్రిలింగ, తమ్మిళ, కళింగమును జను

ల జరులు–అమరులు–అనామయులుగా
స్వాతంత్ర్యము హేయ్ ! స్వాతంత్ర్యము హేయ్ !

స్వాగత మనవోయ్, కని, పని వినవోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్ !
నౌరోజీ తిలకులు, లజప ద్దాసులు
దాని పథంబున, నలిగిన నొగిలిన

వెచ్చని నెత్తుటి దివిటీ వెలుగునె
స్వాతంత్ర్యంబదె !–స్వాతంత్ర్యంబదే !

స్వాగత మనవోయ్, కని, పని వినవోయ్
మనవోయ్, అనవోయ్. జయ్, జయ్, జయ్,
ఇంగ్లం డమెరిక, స్వీడన్, స్విట్జు,
జపాను, జర్మని, కీచు, పరాసు,

అంబ విశ్వకళ కభివాదన మిడు
స్వాతంత్ర్యమురా, స్వాతంత్ర్యమురా

స్వాగత మనవోయ్, కని, పని వినివోయ్,
మనవోయ్, అనవోయ్, జయ్, జయ్, జయ్ !



# జయ జయ భారత జన గణ మాతా!

జయ జయ భారత జన గణ మాతా !
సాధుజన స్తుత చరితా ॥జయ జయ॥
పావన హిందు బౌద్ధ తురుష్క
ప్రముఖ మతాలయ పూతా ॥జయ జయ॥
జగతిని శాంతి స్థాపకు డనియెడు
ఖ్యాతి వహించిన ఘనునీ ।
గాంధి మహాత్ముని-కరుణా సాంద్రుని
కన్న ధన్య జననీ ॥జయ జయ॥
గంగా యమునా గౌతమి కృష్ణ
కావేరీ జల పూతా ।
వింధ్య ముఖర పృధివీధర భరితా
ప్రకృతి విచిత్ర సమేతా ॥జయ జయ॥
సకల ఖనిజ సస్యముల బొదలు నీ
సాటి యెవరు లోకమునా
వేద శాస్త్రములు నాది కాలమున
వెలయించిన యమ్మా ॥జయ జయ॥
ముదమున ముప్పది మూడు కోటుల
ముద్దు బిడ్డలకు జననీ ।
సౌభ్రాతృత్వము స్వాతంత్ర్యంబును
సమకూర్పుమ సత్వరమ॥
జయ జయహ్ భారత జన గణ మాతా।
సాధు జనస్తుత చరితా॥

# మా తల్లి

(గౌతమకోకిల, మహాకవి, శ్రీవేదుల సత్యనారాయణశాస్త్రి)

ఆ యుషో దేవతా నయనాబ్జ మధువు
లొలుకు నీ శైశిర ప్రభాతోదయమున
గుర్తువట్టితి సంతాన కోటి తోడి
తల్లి నీవె పో! నా విశ్వధాత్రి వనుచు!

నీ కడ కాళులందె హిమ నిర్మల జీవన శాంతి నిర్ఝరుల్
నీ కడ కన్నులందె జననీ స్తనదుగ్ధ విముగ్ధ మాధురుల్
నాకు లభింప శైశవమునన్ నను పీడిన కన్నతల్లి పు
ణ్యాకృతి బోల్చుకొంటి భవదాకృతిలో నిపుడో కళావతీ!

నీ యమృత స్వరూప మెద నిల్చిన యంత గతానుభూతులున్
పోయిన పోకలుం దెమలి పోవని కాంక్షలు చింకి పాతలై
పాయగ, తల్లి నీవని భవచ్చరణమ్ముల మోకరించి య
మ్మా! యని పిల్చుకొంటి బహిరంతర శాంతి సుధల్ స్రవింపగన్.

ఈ సచరాచర ప్రకృతి కెల్ల రసైక వికాస జీవ మీ
వే! సతతాతిథం బరితపించెడు పేదలపాలి యన్నపూ
ర్ణా సతి నీవె! దుర్బలుల రక్షణకై యభయ ప్రదానముం
జేసెడి శక్తి నీవె జననీ! భవదన్యము లేద, యేదియున్.

నీ దయగల్గినన్ జరుగనేరని దేదియు లేదు తల్లి! పృ
ధ్వీదయితుండు భిక్షువగు, భిక్షువు రాజ్య ధురం ధరుండగుం
గాదన కింక నీ వభయ కంకణమూనుము నన్ను బోలు ని
ర్వేదుల పేదలం, జిర నిపీడితులం గృపమై భరింపగన్.

సోదర శోణితమ్ముఁ జవి చూచెడి క్రూరులు కార్మిక ప్రజా
స్వేద ఫలమ్ముతో నినుప పెట్టెల నింపెడి నిర్దయుల్ మతో
న్మాద నిరంకుశుల్ దురభిమానులు నిండిన లోకమందు అ
స్మాదృశ దుర్బల ప్రజల మన్పగ తల్లి! త్వదన్యమున్నదే!

ఆరని మంటగా బ్రతుకు నందు రగుల్కొనుచున్న దొక్క చే
కోరిక, నీ కృపావనికి కోకిలనై కొనియాడు కొందు మం
దార సుమారుణ ద్యుతి వితానము గొల్పెడి నీ మనోహరా
కారముతో మధూదయ వికాసము నింపుము తల్లి! నా యెదన్.

ఏ యనుభూతి లేక రసమెండి వివర్ణత దోగి, వాసనల్
పోయిన నా హృదంబుజములో నొలికింపు మొకింత సర్వ సం
ధాయకమైన నీ యడుగు దమ్ముల పుప్పొడితోడి తేనె త
ల్లీ! యదె చాలు! నాకిక ఫలించును ప్రోవిడుకొన్న నా కలల్!



# ప్రియ భారతావని

(గౌతమీ కోకిల 'వేదుల')

ప్రియ భారతావనీ! విశ్వైకపావనీ!
జయశాలినీ! మమ్ము దయచూడుమా! జననీ!
తెగలు తెగలై చీలి వగచు నీ సంతతిని
తెగని స్నేహమున బంధించి ఏకముజేసి ॥ప్రియ॥

కలుషితాచారముల కుల జాతి మత ద్వేష
ముల బాపి నీ సేవ సలుపు భాగ్యంబిచ్చి ॥ప్రియ॥

చెలిమితో జాతీయ బలముతో వైభవో
జ్జ్వల జీవనమ్ముతో విలసిల్ల దీవించి ॥ప్రియ॥

విలసద్యశమ్ము దిక్కులనిండ ఆసియా
తలమానికమ్ముగా విలుప నీ కేతనము ॥ప్రియ॥



# నమో హిందు మాతా!

నమో! హిందుమాతా! మాతా! సుజాతా!
నమో! జగన్మాతా!! నమో!!
అమోఘ దివ్య మహిమా సమేతా!
అఖండవర భరతఖండ మాతా ॥నమో॥

విపుల హిమాద్రులే వేణీభరముగ
గంగా యమునలె కంఠహారముగ
ఘన గోదావరి కటి సూత్రమ్ముగ
కనులకు పండువ- ఘటించు మాతా ॥నమో॥

గోలకొండ నీ రత్నకోశమట
కోహినూరు నీ జడలో పూవట
తాజమహాలు నీ దివ్య భవనమట
అహాహా! నీ భాగ్యము- మాతా!! నమో హిందుమాతా!



# జాతీయ గీతం

( దేవులపల్లి కృష్ణశాస్త్రి)

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రి, దివ్యధాత్రి,
జయ జయ జయ శత సహస్ర
నర నారీ హృదయనేత్రి
జయ జయ సస్యామల సు
శ్యామ చలచ్చేలాంచల
జయ వసంత కుసుమలతా
చరిత లలిత చూర్ణకుంతల
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా।
జయ జయ జయ ప్రియభారత ॥
జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ
జయ గాయక వైతాళిక
గళ విశాల పద విహరణ
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా॥
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్యధాత్రి॥ (కృష్ణా పత్రిక)

# జయ గీతి

( వానమామలై వరదాచార్యులు)

జయ భారతావనీ ! జయలోక పావనీ,
శాంతి సుఖదాయినీ ! జననీ ! నమస్తే !
సకల సంపత్ఖనీ ! సస్యనందనవనీ !
ఆసేతు శీతనగ హాటకావని జనని !
చత్వారింశత్కోటి-జయ ఘంటికాధ్వనీ,
సాశీతి కోటి భుజ బల మహావాహినీ ! ॥ జయ ॥

హిందూ ముసల్మాను ఈసాయి శిఖ్ జైన్
బౌద్ధ చార్వాక సుత బహుమత కుటుంబినీ !
సంస్కృతాంధ్ర ద్రవిడ వంగ హిందీ ఓఢ్ర
ఘూర్జర మరాఠ కర్ణాట కలభాషిణీ ! ॥ జయ ॥

గంగా మహానదీ గౌతమీ కృష్ణాది
రంగత్తరంగిణీ ! రమ్యామృతస్తనీ !
శాంత్యహింసా సత్య శస్త్రాస్త్ర ధారిణీ !
వీర నారీమణీ ! విశ్వహిత కారిణీ ! ॥ జయ ॥

వేద వేదాంత విజ్ఞాన ప్రదాయినీ !
బౌద్ధ సిద్ధాంత నిర్వాణ ప్రచారిణీ !
కాళిదాస వ్యాస కావ్యమందాకినీ !
సంగీత సాహిత్య సత్కళా మోహినీ ॥ జయ ॥

నీకు మువ్వంకులును నిలచి రత్నాకరుడు
వెలనురుగు తరగలను వింజామరలు వీచ
నీ హిమాలయ మకుట నిర్మాణమున దోచు
జీవమణులై సూర్య శశి తారకలు పూచు ॥జయ ॥

నీ మహోన్నతి హిమానీ గోత్ర శిఖరమ్మ
నీ పవిత్రత గాంగ నిర్ఝర ప్రవాహమ్మ
నీ చేతి సొమ్మెల్లోరా శిల్ప ఖండమ్మ
నీదు వాక్యమ్మ శ్రీ గీతోపదేశమ్మ ॥జయభారతావనీ ॥



# దేశమా! భారత మాతృ దేశమా!

దేశమా ! భారత మాతృ దేశమా !
నా కన్నతల్లి ! దేశమా ! బంగరు -
హిందూదేశమా ॥దేశమా॥

ప్రహ్లాద నారదాది భక్తుల గన్నతల్లి
వీరహనుమాన్ భీమ-శూరుల గన్నతల్లి ॥దేశమా॥
ఏలాగు చిక్కినావు-ఎందుకు డస్సినావు
చాలా నలుగూలు చెంది - సతమతమైతివి॥
ముప్పది మూడుకోట్ల —ముఖ్య సంతతి నీకు
ముప్పు తిప్పలుపెట్టి - మూల్గుచుంటివి బాధ॥
కన్నుల నీరు నీవు - ఎన్నాళ్ళు కార్చెదవు
కన్నకొడుకున్నాడు - గాంధిని చూడవేమి ॥
ఏడాదిలోన సమ-కూడు స్వరాజ్యము
ఏడువకమ్మ స్వేచ్ఛ-చూడు తప్పక వచ్చు ॥
ప్రబలాహింస దీక్ష-పట్టి సాగితిమమ్మ
ధర్మయుద్ధమందు-తప్పదు జయమింక॥
రాట్నలక్ష్మి-యింటి రాజ్య లక్ష్మి మాకు
వ్రతము బూనితిమి స్వరాజ్య లక్ష్మి కొఱకు ॥
హిందూ ముసల్మాను లేకమైయున్నాము
సందేహమేల, ని-శ్చయము స్వరాజ్యము ॥ ॥దేశమా॥

卐

# భారతాంబికా
(గరికపాటి మల్లావధాని)

ఉ॥ హాటక రత్న రాశులకు నాకరమై, పరదేశ వాటిను
ఘ్ఘాటల నూఅజేసి విగతోపమవై యలరారు నిన్ను నీ
నాటను గూటి గుడ్డల కనాధ విధంబునఁ గుందజేసి, యా
రాటము నొందజేసెఁ బరరాజ్య విధానము భారతాంబికా'

చం॥ పలు విధముల్ మృగింబులును బక్షులు భూమిజముల్లతావళుల్
గొలకులు వాహినుల్ వనధులున్ గిరులున్ దదుపాశ్రితాటవీ
స్థలులును క్షేత్ర తీర్ధములు సస్య సమన్విత భూమి భాగముల్
గలకలలాడు నీకు నిటు గారియ గూరెనె' భారతాంబికా!

చం॥ తరుగని భోగ భాగ్యములు, ధర్మమునన్ బరతత్వ బోధ మం
దురుతర సత్కళా ప్రతిభనూర్జిత సాహస ధైర్యవిక్రమ
స్ఫురణను నైతికంబునఁ బ్రభుత్వమునన్ జగదేక రాజ్ఞివై
పరగెడు నీవు నే డొరుల బానిసవైతివి! భారతాంబికా!

ఉ॥ పుట్టిన నీదు బిడ్డలమె, పొట్టకు బట్టకు లేక పెక్కు లి
క్కట్టుల వొందుచుండ, నధికారుల మంచు విదేశ సంభవుల్
నెట్టనఁ బీటలెట్టుకొని నీ సిరినెల్లను దోచుచుండ మే
మెట్టుల నింకజూచి సహియింపగలారమె! భారతాంబికా!

ఉ॥ సాధుజనాగ్రగణ్యు డతి శాంతుడనంజను నిమ్మహాత్ము స
ద్బోధల దప్పలేము సతముం బొనరించెడు, మాతృదేవతా
రాధనమే దురంత మపరాధము నందు రిదేమి! యెన్న దే
వ్యాధుల దుర్వ్యథల్ విరుగగడై సుఖియింతుమొ! భారతాంబికా!



# మాతృ గీతమ్

(వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

జయ జయహే మహాంధ్ర జననీ ! మధునాదవనీ !
జయ జయ హరిదంత వినత – మస్తకాగ్రతరుణ ఘృణీ !...
శ్రీగిరి వేణీ కృష్ణా –గౌతమి సుమణీ
భద్రా మేఖల రత్నా – పారిజాత సుమజ్యోత్స్నా ! ... జయ
ఆంధ్ర విష్ణు నియమతలీ – అర్చిత రాజనరేంద్రఫలీ !
కాకతీయ భుజసీమా–కృష్ణరాయ కృతి భూమా ... జయ
గోలకొండ కోశధనా–ఏకశిలా నగర ఘనా !
రాణ్మహేంద్ర రమ్యవిభా–రాజిత హంపీ శోభా ! జయ
నన్నపార్య సుందర శివ వదనా – స్నపిత గోస్తనీ
పోతన సదనా !
మొల్లకవిత్వోత్ఫుల్లహృదంతా–ముద్దుపళని ప్రణయలతాంతా
జయ॥
కోటిత్రయ జన సేవిత చరణా–కోమల జాతీ కుసుమా భరణా !
లలిత కౌముదీ సురభిళ కీర్తి–లావణ్య సుధా మాతృమూర్తి !
...జయ



# భారత జననీ

(మంగిపూడి వెంకటశర్మ)

(పూరికళ్యాణిరాగం-రూపకము)

నిన్ను నెన్న మాతరమా । నిరుపమాన భరతమాత
మిన్ననై యఖిల భూముల । కన్నతల్లి । కల్పవల్లి
॥నిన్ను నెన్న మా తరమా॥

కనక రత్న ఖనిజములును-గలిగిన పర్వతములు
వనములు పుణ్యనదులు-పా—వనులగు తనయులు గల
॥నిన్ను నెన్న॥

ఒకరి బిచ్చమెత్త నీకు-నొక్కింతయు బనిలేదు
సకలము నీలోన కలదు-సాయము నీ కొరులదేల ॥నిన్ను నెన్న॥

చిన్నబోవు వదనమ్ముల-ఖిన్నులై నినుజూచు చున్నవి
అన్నకీర్తి గన్నావని—వన్నెతక్కి పర రాజ్యములు
॥నిన్ను నెన్న॥

దాస్యవృత్తి నీకేల-త్యాగులు మహాత్ములగుచు
వాసికెక్కిన సుతులు గలరు-గాసిల నీకేమి కొదువ
॥నిన్ను నెన్న॥

# జయ జయ భారత
( మంగిపూడి వెంకటశర్మ )

జయ జయ భారత జన గణ మాతా
సాధుజన స్తుత చరితా
పావన హిందు బౌద్ధ తురుష్క ప్రముఖ మతాలయ పూతా
॥జయ జయ॥

జగతిని శాంతి స్థాపకుడనియెడు-ఖ్యాతి వహించిన ఘను నీ
గాంధి మహాత్ముని-కరుణా సాంద్రుని-కన్న ధన్యయే జననీ
॥జయ జయ॥

గంగా యమునా గౌతమి కృష్ణా కావేరీ జలపూతా
వింధ్య ముఖర పృథివీ ధర ధరితా—ప్రకృతి విచిత్ర సమేతా
॥జయ జయ॥

సకల ఖనిజ సస్యములు మొదలు నీ సాటి యెవరు లోకమున
వేదశాస్త్రములు నాది కాలమున-వెలయించిన మా యమ్మా
॥జయ జయ॥

ముదమున ముప్పది కోటుల-ముద్దు బిడ్డలకు జననీ
సౌభాతృత్వము స్వాతంత్ర్యంబును సమకూర్పుమా సత్వరమే
॥జయ జయ॥

---

# హెచ్చరిక

హిందు మాతా । నిన్ను వేడని-మంద బుద్ధిని మాన్పుమా ।
అందమైన స్వదేశ వస్తువు-లందు, మా మది, నిల్పుమా ।
వగవ వలదు ! కంటనీరు-వంచబోకు మమ్మరో!
భారతమాతా' ధన్యురాలవు-ప్రతిభా గాంచెద వమ్మరో!
వీర మాతా । సుతుల కలరు—వారి నందర బ్రోవుమా ।
జగతి నిన్నుబోలు వీరమాత లెవ్వరు । తెల్పుమా ।
నీతి బలము నిష్ఠ నియమము-లేనివారమైతిమి
ఐహికంబె శాశ్వతంబను-భ్రమను జిక్కి వొంటిమి॥
జాతి మతము, కులము, వృత్తి పూర్తిగా నిరసించితిమి
తెల్ల దొరలవలె మేము భోగులమై పోతిమి॥
నీదా కళలను శాస్త్రములను పూర్తిగా విడనాడితిమి
ప్రకృతి శాస్త్రముల్ పరమార్ధము-లని యెంచు చుంటిమి॥
ధనము కొరకై ధాన్యము పరదేశముల కంపుచుంటిమి
పూట తిండి లేక, ఆరు-కోట్లు మాడుచుండిరి॥
ఇంపు, సొంపు, గుడ్డలు, మా-కొంప గుల్లలు చేయుచున్నవి
దేశ దారిద్ర్యము బాప-స్వదేశ వ్రతమె బూనుకొంటిమి॥
ఉద్యోగముల జిక్కివడి—దాస్యమున నీ దాచలంటిమి
కాయ కష్టము, కర్మ విద్యల-యుదరమును బోషింప జాలరు॥
త్రాగుబోతు తనము హెచ్చి తన్నులాడుకొను చుంటిమి
సర్వ పాపములను బాపి-స్వతంత్రులను చేయుమమ్మ॥

# భరతమాత

('బలిజేపల్లి')

మేఘమండల మంటి మిహితాద్రి కబరీ భ
రంబు ముఖంబునై దంబుమీర
గిరి శిరంబున నుండి, యిరుదెసల్ జను సింధు
వును గంగయున్ బాహువులుగ దనర
సౌరాష్ట్ర వంగ దేశంబులు కటిహేమ
చేలాంచలంబులై చెలువు మీర
చోళ మండల మలయాళ తీరమ్ములు
అంఘ్రి ద్వంద్వమో యనుచు దనర

చారు హిందూ మహార్ణ క్షీర జలధి
తనరు సింహళ స్వర్ణ పద్మంబునందు
నిలిచి యున్నట్టి మహాలక్ష్మివలె దనర్చు
భరతమాతకు, నిత్యంబు వందనమ్ము.



# వందేమాతరం (1907)

(మట్నూరి వెంకట సుబ్బారాయుడు)
(మంగపూడి వేంకటశర్మ)

దేశాభిమానంబు, దీపింప జేయు మం
త్రంబు వందే మాతరంబు సుండు
సాహసౌదార్యమున్ సమకూరజేయు, మం
త్రంబు వందే మాతరంబు సుండు.

స్వాతంత్ర్య భాగ్యంబుఁ జేతి కందిచ్చు తం
త్రంబు వందే మాతరంబు సుండు
ఐకమత్యాధిక శ్రీకుల జేయు జం
త్రంబు వందే మాతరంబు సుండు.

హిందూ జనులార ! వాచాఫణీంద్రులార
నీతి పరులార, స్వాత్రంత్ర్య నిరతులార !
మన మనోరథములు దీర్చి మనుచు నట్టి
బ్రహ్మ మరయ వందే మాతరంబు సుండు।।

卐

# భరతమాత

(మఠ్నూరి వెంకట సుబ్బారాయుడు)
(మంగపూడి వేంకటశర్మ)

ఆ దయార్ద్రచేత! చిరకీర్తి విఖ్యాత!
చారుగుణ సమేత! వీరమాత!
భవమహాబ్ధి పూత! భద్ర భాగ్య స్ఫీత
భక్త పారిజాత! భరతమాత!!

బంగారు గనులు గలవో
రంగారెడు నదులు గలవు! రత్నంబులు చా
లం గలవు విలాతుల ని
బ్బంగినినో భరతమాత! భాగ్య సమేతా!

దేశ భక్తి గలాడె! సుధీశ్వరుండు
దేశభక్తి గలాడె ఓ! దివ్యమూర్తి
దేశభక్తి గలుగువాడె! దేవనిభుడు
వలయు దేశంబుపై భక్తి భరతమాత.

కృప "పరోపకారార్థ శరీర" మనుచు
దేహమె వ్యాదొసంగు స్వదేశమునకు
నట్టి, ధన్యతముని, నరుఁడనగ నేల!
సురల కన్నను, పూజ్యుండు భరతమాత!!

ప్రతి ఫల మాసింపక సం
తతమును లోకోపకార తత్పర చిత్తా
న్వితుఁడై క్రియలొనరించెడు
నతడె సుకృతి భరతమాత ! హర్ష సమేతా !

దేశ హితము గోరి దేహంబు గేహంబు
దినము జీవనంబు ధారవోయు
మాన్యులను ఘనవదాన్యుల ధన్యుల
గరిమ నెంతునమ్మ! భరతమాత!!

స్వసహాయమె సుశ్రేయము
స్వసహాయమె దైన్యహరము, సంపత్కరమున్
స్వసహాయమె, మానవులకు
వ్యసన హరము, భరతమాత ! భావాతీతా॥



# దేశదురవస్థ

(మంగిపూడి, ముట్నూరి)

రత్నఖనులకేది రమణీయ సదనంబు
జీవ నదులకేది తావలంబు
మేటి శైలంబుల కాటపట్టెయ్యది
గేహమెయ్యది, పంచలోహములకు
నిఖిల శాస్త్రములు, జన్మించిన నెలవేది
చక్రవర్తులకేది జన్మభూమి
సత్య సంధులకు వాసస్థాన మెయ్యది
ధర్మ దేవతకు నాధారమేది
దానమునకునేది నిలయంబు, ధైర్యశాలు
లైన శూరాగ్రగణ్యుల స్థానమేది!
అదియె మన హిందుదేశమే, అక్కటకట
మిగుల దారిద్ర్యదశనొంది పొగులుచుండె.

సకల దేశముల కాశ్చర్యమ్ము గలిగించు
కాశ్మీర శాలువల్ గంగ గలిగె
ఉర్వి యంతటను, నోహో? యనిపించు, ఢ
క్కా మేటి సెల్లాల నామ మణగె.
నిఖిల సీమలను, వన్నెకునెక్కి, మతిఁ గన్న

శిల్పశాస్త్రం బతి స్వల్పమయ్యె
సకల రాష్ట్రి సుధీంద్ర సమ్మానితం బైన
ప్రకృతి శాస్త్రిము స్మరింపంగ లేదు ॥

చేతి పనులెల్ల మిగుల నశించి పోయె
సిరియు విద్యయునుం గూడ, జెదరి పోయె
నాగరికతాభిమానముల్ నాశమయ్యె
హిందు దేశంబు గరిమంబు హీనమాయె॥

'సత్యంవద' యటంచు, సంతతంబును దప్పు
సాక్ష్యముల్ చెప్పు వాచాలుఁ డొకఁడు
'ధర్మంచర' యటంచుఁ దా నధర్మ పథాను
సారియై చరియించు క్రూరుఁ డొకడు
భువి 'నహింసా పరమో ధర్మ' మని యాగ
పశుహింస నేయు ధీవరుఁ డొకండు
వసుమతి 'నాస్తి తత్త్వం గురోః పర' మని
తూలిపల్కెడి గురుద్రోహి యొకఁడు.

ధరఁ "బరోపకారార్ధ మిదం శరీర"
మనుచు నపకృతుల్ నేయు దురాత్ముఁ డొకడు
వీరలందఱు దేశాన బెద్దలైరి
కట కటా! యిట్టిడుల నెట్లు గంటివమ్మ

ధీరుల గార్యశూరులును, దివ్యశరీరుల, విక్రమక్రమో
దారుల శ్రీవిహారులను, ధైర్యసమీరుల, విక్రమక్రమో
దారుల, భూరిసారులను ధన్యవిచారుల, సర్వ సత్కళా
పారుల, రూపశూరులను, వార్ధిగభీరులు సాహసప్రవి

స్తారుల, దుష్టమానవ విదారుల విశ్రుత వీరులన్, సదా
చారుల, సంహృతారులను సద్గుణధారులఁ, జారు కీర్త్యలం
కారుల, నిర్వికారులను గాంచిన గర్భమునం దసారులను,
గ్రూరుల భీరులన్ జననిరో! యెటుకాంచితివమ్మ మమ్ములన్॥

ధన సంతతులకు సుందర మందిరంబునా
గోహినూరు వజ్రమే గొప్ప సాక్షి
శౌర్య సంపన్నుల జన్మభూమి యనంగ
నల, శివాజియె నిక్కమైన సాక్షి
శిల్ప సద్విద్య కనల్ప ధామంబునా
మేలైన, దలఁ తాజ్మహాలె సాక్షి!
వస్తునిర్మాతృ ప్రశస్తసీమ యనంగ
భువన ప్రసిద్ధశాలువలె సాక్షి
కలిత దేశాభిమానంబు నిలయ మనఁగ
బ్రకటమైన స్వదేశ వర్తకమె సాక్షి
లోక విజ్ఞానమునకును బ్రోక యనఁగ
బ్రకృతి ముఖశాస్త్రి నిచయంబె ప్రబల సాక్షి.
కలిమి గాంచినావు కడుపెడు బిడ్డల
గాంచినావు గరిమ గాంచినావు
వీరమాతవగుచు, విఖ్యాతిఁగన్నారు
తక్కువేమి! నీకుఁ దల్లి! చెపుమ!

చం॥ కలములుఁ గాగితంబులును, గత్తులుఁ గత్తెరులున్ సిరాలు, మేల్
వలువలు, నగ్గిపెట్టెలును, ల్యాంపులు, నూనెలు, సూదు లద్దముల్
పలకలు, బలపముల్, సరిగబంతులు, గొడ్గులు, నింకనేది కా
వలసిన నన్యదేశముల వారివె, వేడఁగనయ్యె! నయ్యయో!



# నా భారతము

("పైడిపాటి")

కృష్ణతాదాత్మ్య సంకీర్తనములె, విన్పు
నవగళమ్మున యమునా స్రవంతి
శివ జటాజూటమ్ముఁ జింది చిందులు ద్రొక్కు
కవి పాపహరము గంగా స్రవంతి
వలగొన్న మున్నీటి పన్నీటి జలకేళి
నవకమ్ము మీఱు కన్యాకుమారి !
తెలిమంచుతో నచ్చు తెలివిభాసించు
నత్యున్నతమ్ము హిమాలయమ్ము

నీతి నియమంపుఁ బండు వెన్నెలలఁ గాచి
సత్ప్రభుండగు శ్రీరామచంద్రమూర్తి
గృహ గృహమ్మునఁ దానె శబ్దించు నెచట
శ్రుతి హితమ్ముగ, నట్టి భారతము నాది.



# జనయిత్రీ

(మల్లాది రామచంద్రశాస్త్రి)

జయ జయ జయ భా
రత జనయిత్రీ!
జయ జయ దివ్య
జ్ఞాన ప్రదాత్రి!
జయ జయ నిరుపమ
మహిమోపేతా!
జయ జయ జయ చిర
యశస్సమేతా!॥

అర్థ కామముల
నను శాసనమున
ధర్మ బద్ధమొన
రించిన సుకృతి
పురుషార్థ నిరూ
పణ విబుధ జగ
త్పూజ్యత గాంచిన
యశశ్చరిత్రీ!॥

అతులిత దివ్యా వేశ సంజనిత
విశ్వ శాంతి కాం క్షిత వచస్వినీ :
చతు రాశ్రమ జీవన విధాన ని
ర్దేశిత పథ దర్శిని తప స్వినీ :

ఇహాపర సమచిం తనమున వ్యక్తి వి
కాస మరయు జ్ఞా న స్రోత స్విని ।
సమహిత చిత్త మ్మున లోకమ్ముల
శ్రేయము గోరు మహా మన స్వినీ : ।।



రు. 3000/- లు జరిమానా వేసి, దానిని బ్రిటిషు ప్రభుత్వము వసూలు చేయుటకై ఆయన మోటారుకారు వేలమునకు పెట్టగా, యెవరు పాట పాడలేదు. దానిని పురస్కరించుకొని ప్రతి రాష్ట్రంనుంచి, జండా సత్యాగ్రహులు వేలకొలది ఉద్యమము సాగించారు. చివర దశలో వల్లభభాయి పటేలు నాయకత్వం క్రింద అది అఖిల భారత జాతీయోద్యమముగా పరిణమించి, జయప్రదమైనది. దానితో జాతీయ జండాకు ప్రత్యేక గౌరవ ప్రతిపత్తులు, ప్రాముఖ్యత లభించినవి.

1930లో సిక్కులు, జండా రంగులలో, తమ ప్రత్యేక రంగుకు స్థానంలేదని అలజడి లేవదీయగా, 1931 జూన్‌లో, ఒక ఉప సంఘము ఏర్పడి యీ జండా రంగుల ప్రాముఖ్యమును, వేఱుగా నిరూపించుచూ ఒక నివేదిక అందజేసింది. దానిని అఖిల భారత జాతీయ మహాసభ అంగీకరించింది. దాని వివరము లివి;

అదివరకున్న రంగులు, మత సంబంధమైన సంకేతాలు కలిగి ఉన్నాయి. వాటికి బదులు, కుంకుమ పువ్వు రంగు శౌర్యాన్ని, త్యాగ శీలాన్ని, ప్రతిబింబింపచేయుచున్నదని, ఆకుపచ్చ రంగు అకుంఠిత భక్తి విశ్వాసాలనూ, శూరత్వాన్నీ, (ఔదార్య భావాన్ని) చాటుచున్నదనీ, తెలుపు రంగు, శాంతి, సత్యం, అహింసలకు ప్రత్యక్షనిదర్శనమనీ, మధ్యనున్న రాట్నము ప్రజానీకముయొక్క స్వాతంత్ర్యాశయానికి చిహ్నముగాను, జెండా కొలత 3 రెట్లు పొడవు, రెండు రెట్లు వెడల్పుండవలెననీ-తీర్మానించిరి.

*రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన స్వాతంత్ర భారత జాతీయ పతాకము:-*

పతాకములో పూర్వమునుంచి యున్నట్టి రంగులనట్లేయుంచి, మధ్యనున్న చర్ఖా స్థానమున (సాంచీ జయ స్థంభములోని) అశోకుని

ధర్మ చక్రం నిర్ధారణ చేయబడింది. తదాది నేటివరకిదియే, మన భారత జాతీయ పతాకముగా నున్నది.

## ప్రత్యేకత

1908 ఆగస్టు 18వ తేదీని, భారత నారీమణి శ్రీమతి మేడమ్ కామా, జర్మనీలో, స్టుట్‌ఘార్డ్ నగరంలో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు కాన్ఫరెన్సులో, మన 'వందేమాతరం' జాతీయ జండాను ప్రప్రథమముగా ప్రదర్శించిన యువతి.



# ఝండా గాయన్

(శ్యాంలాల్‌గుప్త పార్షద్)

విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝండా ఊఁచా రహే హమారా॥ ॥ఝండా॥

సదా శక్తి బర్సానేవాలా
ప్రేమసుధా సర్సానేవాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన మన సారా॥ ॥ఝండా॥

స్వతంత్రతాకే-భీషణ రణమేఁ
లఖ్‌కర్ బఢే జోశ్ క్షణ క్షణమేఁ
కాఁపే శత్రు దేఖ్‌కర్ మనమేఁ
మిటజావే భయ సంకట సారా ॥ఝండా॥

ఇస్ ఝండేకే నీచే నిర్భయ
లేఁ స్వరాజ్య యహ అవిచల నిశ్చయ
బోలో, భారతమాతాకీ జయ్
స్వతంత్రతా హీ ధ్యేయ హమారా॥ ॥ఝండా॥

ఇస్‌కీ శాన న జానే పావే
చాహే జాన భలే హీ జావే
విశ్వ విజయ కరకే దిఖలావే
తబ్ హోవే ప్రణ పూర్ణ హమారా॥ ॥ఝండా॥



# జాతీయ జండా

(బేహాగ్‌రాగం బ్యాండ్‌స్వరం ఏకతాళం)
('గురజాడ' 1922)

ఇదియే జాతీయ జండా।
జాతి। కిదియే ప్రాణము మాన ॥మిదియే॥

ఇదియే స్వరాజ్య ధ్వజము-నదుము ఫరంగీల హాజము।
కదనమునకు దీనిబట్టి-కదలు శాంతి ప్రతిన బట్టి ॥ఇదియే॥

దేశ దాస్యము బాపు-దీన దరిద్రత బాపు
దేశ ద్రోహులమాపు-దీన, ప్రతాపము చూపు ॥ఇదియే॥

మతము లన్నిటికి, స-మ్మతము దీని క్రీడ
హితముకూడ శాంతి-యుతముగ పోరాడ ॥ఇదియే॥

హింధువులం దెఱ్ఱనై-ఇస్లాము మతమందు
పొందుగ పచ్చనై, యా-నందమును గూర్చ ॥నిదియే॥

ధవళమై, యితర-మతమ్ములకై వెలుగు
అవిరళ భాగ్య భో-గ్యములనీయ గలుగు ॥నిదియే॥

కోట్ల ధనము జనము-కొట్టి పొట్టను బెట్టు
కాటకములనెట్టు-రాట్నము గలట్టి ॥దిదియే॥

భారత జాతీయ-వీర రక్త మోడ్చి
చేరి నిర్మించు-స్వ-రాజ్య సౌధము దాల్చు ॥నిదియే॥

భారతదేశము, స్వపరి-పాలన గలదని నమ్మ
నిరుపమానమైన కీర్తి-నిండి వెలుగు నిజమ్మ ॥మిదియే॥

卐

# జండా

(దామోజీ)

ఖండాంతరముల ఖ్యాతి గాంచి-జయము గూర్చేడి జండా।- ప్ర
చండమైన పరాయి పాలన-పారద్రోలే ప్రజల యండా॥

హిందువులయెడ యెఱ్ఱనై-ఇస్లాము నందును పచ్చనై
జెందితర మతముల ధర్మమందున ధవళమై వెలిగేటి జండా ॥ఖండా।

మెండుగా స్వేచ్ఛ నొసంగ-దండియైన రాట్న చక్రము
నిండుగా ధరియించినట్టి-నిరుపమాన జండా॥ ॥ఖండా॥

ఇంచుకైన హింసలేక-ఇలను పశుబల మింత లేక
సంచలింపక ధర్మరణమున-స్వరాజ్య మొసగు జండా ॥ఖండా॥

పొందుగా నాగాపురమున- కందరికి నాహ్వానమంపి
వందలాదిగ చెఱకంపి- బందె భయము బాపిన జండా॥
ఖండాంతరముల ఖ్యాతిగాంచి॥



# స్వాతంత్ర్య పతాక

(సుంకర సత్యనారాయణ)

ఎగురవే వినువీధి-ఎగురవే జండా
శాంతి దూతగ నేడు-జాతీయ జండా
యుగ యుగంబుల జగతి నెగురవే జండా
సౌఖ్య ప్రదాతగా స్వాతంత్ర్య జండా॥

భారతీయుల మహా పోరాట ఫలితమా
వీరయోధుల రక్త ధారలకు చిహ్నమా
శాంతి మాత అశోక ధర్మ చక్రము దాల్చి
శాంతి విల స్థాపించ నరుదెంచితివి నీవు॥

పెను తుపానుల వెన్ని పెనవేసుకొన్న
దనుజులందరుగూడి, నినుదింపకున్న
కడ భారతీయుండు పడిపోవు దనుక
గగనాన ధ్రువ తార కరణి నిల్చెదవు ॥ఎగురవే॥



# జాతీయపతాకోద్ధరణము

(శిష్టా వెంకటసుబ్బయ్య)

కం. జాతీయ పతాకోత్సవ
జాత కుతూహల సముద్ర సలిల తరంగ
వ్రాతోన్నత డోలావళి
నాతత గతి నూఁగు కంటె నధికముగలదే?

గీ. ఖండ ఖండాంతరంబులఁ గ్రాలుచుండు
మేలి పెక్కెంబు లందెల్ల మేటి యగుచు
భరతమాతకు మణి మయాభరణ మగుచు
దనరుగాత! జాతీయ పతాక యెపుడు

సీ. అఖిల మతమ్ముల కైకమత్యముఁ గూర్చి
యింపు నింపుచు నుండు నీ పతాక
అన్ని వర్ణంబుల కమరు గమ్యస్థాన
మేకమే యని చూపు నీ పతాక
భారత స్వాతంత్ర్య భాగ్యమంతయు దీన
నెస లారునని చూపు నీ పతాక
గాంధి దేవునిచేతఁ గ్రాలు సుదర్శన
మిద్దియే యని చూపు నీ పతాక

గీ. శత్రు రాజుల గుండియల్ ఝల్లుమనగ
దేశ దేశంబులందునఁ దేజరిల్లి
బాల గంగాధర ప్రభా భాసి యగుచు
నెగురు నా చంద్రతారమై యీ పతాక।



# జాతీయ జండా

మోహనరాగం ఆదితాళం 1930

("గురజాడ")

జండా! జయ జయ భారత-పూర్ణ స్వరాజ్య జండా॥
దండిగ ముప్పది-రెండుకోట్ల జను-
లండజేరి కొలు-వుండగ వెల్గెడి జండా॥

ముక్కా-కల నారితేరినారు
చిక్క-నీయ రరి కరముల వీరు
లెక్క-సేయ రరివర్గము విసరు
యుక్కు- గుండ్లు కెద-నిత్తు రెదుర్తురు జండా॥

నిరంకుశత, ధి-క్క-రించి, వంచి
పరాధీనతా పాశము ద్రెంచి
విరాన స్వేచ్ఛా-పథి చరించి
స్వరాజ్య మందిర-మలంకరించు జండా॥

ఆర్య సమ్మతము లైన సాహసౌ
దార్య గుణమ్ముల-హరిత వర్ణమై
స్థైర్య, శాంతి, స-త్యముల ధవళమై
ధైర్య త్యాగము-లకు కేసరియా జండా॥

పెను దారిద్ర్యము-బాపగ దీన
జనశరణ్య-వజ్రాయుధమైన
అనాదివై, కా-మధేనువైన
ఘన వర్ణిని, రాట్న లక్ష్మి గల్గిన జండా॥

త్రివర్ణ యుతవై-త్రిభువన హితవై
దివిజస్తుతవై-తేజోయుతవై
భువిఁబవిత్రవై-ముక్తిదాత్రివై
కవిజన నుతవై కననగు జాతీయ జండా॥

సత్యాహింసా-సాధనములఁగొని
సత్యాగ్రహ కవ-చము, మెయిబూని
సత్యప్రేమ సుసరణుల శాంతిని
నిత్యము తిరముగ నిల్వ, నిల్తు, రని జండా॥

కాయము బుద్బుద-ప్రాయము, హేయము
ధ్యేయము మాకు సం, పూర్ణ స్వరాజ్యము
పాయని యశము-జగాన నింపెదము,
నీ యాజ్ఞల శిరసా వహించెదము జండా॥

జండా। జయ జయ భారత-పూర్ణ స్వరాజ్య జండా



# జాతీయ జండా 1940

("గురజాడ")

జండా యెత్తర- జాతికి ముక్తిర
నిండగు శక్తిర-నిల్వర కీర్తిర... జండా యెత్తర॥

దండిగ వైరులు-గుండులు ప్రేల్చిన
చెండుచు, నెత్తురు-కండలు రాల్చిన... జండా॥

ప్రాణమొండె, యభి-మాన మొండె, మన
ప్రాణములైనన్-బలి యొసంగి, మన...

జండా యెత్తర! జాతికి ముక్తిర॥

—:o:—

# జాతీయ పతాకం

(గౌతమీకోకిల 'వేదుల')

పవిత్ర భారత సవిత్రి కోహో
స్వతంత్రోత్సవం సాగింది
లాల్‌ఖిల్లాపై అశోక చక్రపు
త్రివర్ణ కేతన మెగిరింది పవిత్ర॥

మతం తలపక గతం తడవక
ద్వేషం రోషం సకలం మరచి
స్వతంత్ర భారత జయ పతాకను
సోదరులారా! మ్రొక్కండి పవిత్ర॥

నెత్తురు లోడ్చిన సత్తువ లూడ్చిన
పిశాచదాస్యం నశించిందని
ప్రపంచమంతా ప్రతిధ్వనింపగ
స్వతంత్ర శంఖాలూదండి పవిత్ర॥

పోరుల మ్రందిన కారల కుందిన
స్వతంత్రయోధుల స్మరించుకొంటూ
ముదశ్రు తర్పణ హృదంబుజార్పణ
సోదరులారా! చేయండి పవిత్ర॥

అమోఘ శక్తుల సమీకరించుక
సమస్త భారత సమైక్య మెంచుక
హిమాద్రి మొదలు కుమారి వరకు
భారత విజయం పాడండి॥ పవిత్ర॥

(1947 ఆగష్టు 15 రాత్రి 12 గంటలకు పేరూరులో చదివినది)

卐

# భారత పతాకము

జయ జయ భారత జాతి పతాకమ
నిత్య జీవికై నెగడు పతాకమ జయ జయ॥

రంగ భేద మేర్పడుట తెలిసికొని-రంగులు కలిపెడి రాట్నపతాకమ
భిన్న లక్ష్యముల భిన్న పడకుడని-ఏక లక్ష్యమేర్పరచు పతాకమ
కాయకష్టము-కష్ట సహిష్ణుత-తగునని తెల్పు-యా ధర్మపతాకమ
సర్వ ప్రాణులను_సమముగ జూచెడి-శాంతి సమరమున సాగు పతాకమ
సత్యమహింసా స్వాతంత్ర్యంబుల సారరూపమగు శాంతి పతాకమ
భారతీయులకు-ప్రాణాధారమౌ-ఖాదీ పతాకమ కాంగ్రెసు పతాకమ
జయ జయ॥



# జాతీయపతాకము

("బసవరాజు")

పతాకోత్సవము సేయండీ
స్వతంత్ర భారత-జాతి చిహ్నమౌ॥ పతాకోత్సవము సేయండీ॥

కొ త్త వన్నెలూ-కొ త్త చిన్నెలూ
కొ త్తజీవమూ-కొామరొాప్పంగా
నూతన భారత-జాతికి భువిలో
ఖ్యాతి విజయము-కలగాలంటూ॥ పతాకోత్సవము॥

వీరకేసరుల యెఱ్ఱని రంగూ-దేశ సేవకుల తెల్లని రంగు
భ క్తుల పాలిటి పచ్చని రంగూ-బీదల పాలిటి రాట్నము మెరసే॥
పతాకోత్సవము॥

అన్ని మతాలకు-అన్ని తెగలకు-ఆశ్రయ మీజండా ఒకటేనోయ్
ప్రాణము పోతే పోనీ జండా-మానము మాత్రము మంట గలపక॥

పతాకోత్సవము సేయండీ॥

—)o(—

# జాతీయపతాకము

("గురజాడ")

మ. అదె ఢిల్లీ పుర కోటలో నడుమ, సౌధాగ్రంబునన్ స్వేచ్ఛయై
కదలెన్ దివ్య సుదర్శనంబనగ, చక్రం బొండు బాసిల్లన
య్యదె, జాతీయ పతాక యెల్లరున్, జోహారుల్ సమర్పింపగా
సుదినం బియ్యది, చేరరండు, తరియించున్ జన్మ లీనాటితో,

—.o:—

# జండా

("గురజాడ")

చే యెగురవేయరా-జాతీయ జండా
హాయిగా స్వాతంత్ర్య-వాయువు లోన

దీనికై గద మహా-ధీరులు వీరులు
ప్రాణ ధనమ్ములు-బలి ఇచ్చినారు, చేయెగుర॥
స్వాతంత్ర్య జాతి కిది-చక్కని వెలుగు
జాతిపేరు జగాన-స్థాపింప గలుగు చేయెగుర॥
దీనికై గద దేశ-దేశముల బోరి
మానమ్ము నిల్పి, సరి-మానవులైరి చేయెగుర॥
దండి యశోకుని-ధర్మ చక్రాన
విందుగా వెల్గెటి-నీ జాతి జండా చేయెగుర వేయరా॥

—(o)—

## నమస్తే! హైందవ పతాకమా!

నమస్తే! హైందవ పతాకమా! సుశ్లోకమా !నమస్తే!
సమస్త లోక శాంతి సత్యసధర్మ సంస్థాపకమా ॥ నమస్తే॥
ఆనంద దాయినీ-ఆకాశ విహారిణీ ॥ నమస్తే॥
దీన జనోద్ధారిణీ! పరపాలన నిర్మూలినీ ॥ నమస్తే॥
భారత మహా ప్రతాప-త్రివర్ణ స్వరూపిణీ॥ నమస్తే! హైందవ
పతాకమా॥

## దేశీయపతాకంబిదె! పురవాసులార!

దేశీయ పతాకంబిదె పురవాసులారా! గాంధీ పతాకంబిదె॥
పురవాసులారా!
హిందూ మహమ్మదీయ సిక్ క్రైస్తు జైన బౌద్ధ మతముల చిహ్నం
బిదె పురవాసులారా!
దాసు నెహ్రూ రాయి ఆలీ సోదరులచే పూజలొందెనుగా యీ ధ్వజము
॥పూజలొందెనుగా॥
జగమున నిప్పుడున్న జనులలో శ్రేష్ఠుడైన-గాంధీ మహాత్మునిచే
స్థాపితంబు॥ దేశీయ॥
పనులెల్ల గట్టిపెట్టి చనుదెండు దేశభక్తి-మనమున నుంచివేగా-
పురవాసులారా ॥దేశీయ॥

జాతీయ జండా

## జండా: నవభారతవీర కుమారవందిత॥

జండా: నవభారత వీర కుమార వందిత। జండా॥
ఖండిత వైరి నికర ప్రియకర-అఖండ ఖండనా శశాంక మండనా
జండా॥

పావన స్వేచ్ఛా ప్రవిమలపద సం-చారిణి, తారిణి, ఆర్త విదారిణి
జండా॥

తరుణ భారత అరుణరాగోజ్జ్వల-ఐక్య భరణా శాంత వితరణా జండా॥
జయ జయ భారత భాగ్య పతాకా జయహే దివ్య నవోదయ రేఖా
జండా॥

—)(—

# జయ ధ్వజం

(వానమామలై వరదాచార్యులు)

అదిగో మన జయధ్వజం అదుగదుగో భద్రగజం
నదించునదొ జయహొందని నవయువ సోదరవ్రజం॥
పొండీ ఎత్తండి సురల్ పూలుగురియ జయధ్వజం
దండోరావేయ నదో తరలుచుండె భద్రగజం॥
ఇదియే మన జయధ్వజం ఇది మన యాత్మల తేజం
ఇదియే మన జాతి నిజం ఇది భారత సురభూజం॥
భారతీయ సమైక్యతకు మారురూప మీధ్వజమ్మ
నూరుకోట్ల కరములొకటిగా రూపొందిన భుజమ్ము।
నలుబదారుకోట్ల ప్రజల నగవుపూల నొల్కవోయు
పలుమతాల మన స్వేచ్ఛా-భావ పటము నెగురవేయు॥
సౌభాగ్యవతీ స్వేచ్ఛా జననీ హృదయ సరోజము
శ్రీభారత జనయిత్రీ శీర్షమకుట మణిస్రజము॥
ఆ ధ్వజమును తమి గాంచుడు-అతి భక్తిని తలవంచుడు
ప్రాంజలినిడి తనుధన హృత్ప్రాణమ్ముల నర్పించుడు॥
అదె మన తలపై తుఱ్ఱా-అద్దె జాతికి జీవగఱ్ఱ
ఆచంద్రార్కము దానికె-యంకిత మీ జాతికుఱ్ఱ॥
అదిగో మన జయధ్వజం॥

—o—

# జాతీయ జండా

("గురజాడ")

విహరింపనిమ్మా! —విహరింపనిమ్మా!
స్వాతంత్ర్య విను వీధి-జాతీయజండా॥విహరింపనిమ్మా॥

విశ్వవిఖ్యాతిగా-విజయ నాదాలతో
విశ్వమోహనముగా-వెలసిన జండా
వీర భారత జాతి-వెలిగిన జండా॥ విహరింపనిమ్మా॥

మూడు రంగులతోడి-ముచ్చటగూడి
తోడు నీడయి ధర్మ-చక్రమ్ము గూడి
క్రీడించు నీయండ-ప్రియమైన జండా॥విహరింపనిమ్మా॥

వీరుల రక్తమ్ము-ధారవోసి, యరి
వీరులనోడించి-పేర్గొన్న జండా
భారత వీరుల-జాతీయ జండా॥ విహరింపనిమ్మా॥

సాహస త్యాగాలు-శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు-ఔదార్య భావాలు
చక్కగా పాలించు-జాతీయ జండా॥ విహరింపనిమ్మా॥
సేతు శీతాచల-స్థిర భరత జాతి
ఖ్యాతినిల్పిన యట్టి-జాతీయ జండా
స్వాతంత్ర్య భారత-జాతీయ జండా॥ విహరింపనిమ్మా॥

—)(—

# జాతీయ జండా
("గురజాడ")

ఆడవోయి! మెగిరి-ఆడవోయి! విప్పి
హాయిగా, భారత-జాతీయ జండా॥ ఆడవోయి।

మబ్బు మసకలేని-మంచి మార్గాన
తబ్బిబ్బులేని, స్వాతంత్ర్య పీఠాన॥ ఆడవోయి॥

పరజాతి చేతి, లో-పల జిక్కి నలిగె
మరల విచ్చలవిడి-మసలగా, గలిగె॥ ఆడవోయి॥

వీరాధి వీరుల-వేడి నెత్తురులపై
విజయ స్తంభాలపై-వెలసిన జండా॥ ఆడవోయి॥

ధర్మ చక్రముతోడ-ధైర్యంపు నీడ
తా త్రివర్ణంబయి-తాండవించే జండా॥ ఆడవోయి॥

సాహస త్యాగాలు-శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు—ఔదార్య భావాలు॥ ఆడవోయి॥

ఈడుగా, జోడుగా-తోడిదేశాలలో
కూడి ముచ్చటలతో-క్రీడించు జండా॥ ఆడవోయి॥

సేతు సీతాచల-స్థిర భరత జాతి
ఖ్యాతి నిల్పిన మన-జాతీయ జండా॥ ఆడవోయి॥

...)(...

# స్వరాజ్యజండా

(శృంగవరపు శ్రీనివాసాచార్యులు)

ఎత్తండి స్వరాజ్య జండా। జండా
నెత్తండి ధైర్యము నిండ। నింక
స్వరాజ్య జయమును। సంధింతుమనుచును॥ ఎత్తండి॥

మూడు రంగుల జండ-ముద్దులొల్కెడి జండ
మునుకొని మనమున-యుండ-దాని
విడచిన మనకేది యండ-వట్టి
యెండమావులె చెంతనుండ-కుక్షి
నిండునె నద్దాని నిండ-గాన
తిండికి తలదాచి యుండుటకై యిక॥ ఎత్తండి॥

జాతి భేదములెంచి-యైకమత్యము వీడి
నీతి బాహ్యము బొందకండి। కుక్క-
వాదముతో నుండకండి। సంఘ
భేదముల నెంచకండి। గాంధి
యాదర్శముల నెంచి। యేకభావముగాంచి॥ ఎత్తండి॥

ఉప్పుపై పెనుదాడి-యొప్పుగ గాలించి
విప్లవ మొనరించినాడు। గాంధి

కప్పము లరికట్టినాడు। ఖద్ద
రొప్పుగ కట్టమన్నాడు త్రాగు
డొప్పమి మానుమన్నాడు। రాట్న
మెప్పుడు ద్రిప్పమన్నాడు। తాను
చెప్పిన చొప్పున, తప్పక మీరంత॥ ఎత్తండి॥

చల్లని మావాడ-పల్లి వెంకటేశు
కళ్యాణ సమయమ్మనందు-లారీ
ఫెళ్ళున మరి బస్సులందు-బహు
కల్లరి పోలీసులందు-మరి
అల్లరిగావించి యందు-పంచ
ముల్లార రండని-మూర్ఖత జూపిరి॥ ఎత్తండి॥

లా ఆర్డరంచును లాఠీ ఛేఠీవేసి
లాటీలతో తిరిగినారు। పట్టి
బూటకముల బన్నినారు। యుద్ధ
నాటకములు జూపినారు। జనుల
తూటాలతో గాల్చినారు। యంత
నిరాయుధుల బట్టి-నెట్టిరి-కొట్టిరి॥ ఎత్తండి స్వరాజ్య జండా॥

···)o(···

# లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణము

(జంధ్యాల శివన్నశాస్త్రి)

సీ. భారతోద్ధరణ సంభావితునకు రాజ్య
 తంత్రమె తారక మంత్రమయ్యె
దేశ ధర్మోప సందేశికునకు, చెఱ
 సాలయె, ప్రాసాదశాలయయ్యె
మాతృశోకోత్పాట నాతి దీక్షునకు, క
 ష్టాప్తియే, ఘనశుభావాప్తియయ్యె
స్వార్థతాదూర విశాల మతికి, ప్రపం
 చంబె, యాత్మీయ కుటుంబమయ్యె

గీ. ఆ మహాత్ముడు తిలకోప నామకుండు
బాల గంగాధరుండు, కృపాలయుండు
అవని నా బాల గోపాల మంగలార్పు
పాలుగాగదా. స్వారాజ్యమేల జనియె.

సీ. వితత మాయాదుర్గ భేదనంబునకు నీ
 ప్రాజ్ఞుని బుద్ధి ఫిరంగి గుండు

గుణలుబ్ధ హైందవ కోటుల కెవని నా
మమ్మ, త్ర్యక్షరమగు మంత్ర రాజ
మాత్మ సమున్నతి యౌదార్యములె వాని
కుగ్గుతో బెట్టిన యురుగుణములు
చాతుర్యమతులైన సామ్రాజ్య పతుల కీ
యనఘు సాహసము, భయావహమ్మ

సకల జన మిత్రుడును, కర్మసాక్షి, లోక
బాంధవుడు, జగచ్ఛక్షువు, పరమదుఃఖ
నిరత నిర్మగ్న ధరణి సంతరణ తరణి
యైన తిలక ప్రభాకరు డస్తమించె॥

సీ. నిఖిలలోకాభి వందిత పాదుడైన పా
కారి మంత్రిత్వము గోరినావ।
దేవతాగురు పదస్థిత బృహస్పతి తోడ
ధర్మవాదము సేయదలచినావ।
సనకాది దేవతా సంయమీంద్రులకు గీ
తారహస్యము దెల్ప దరలినావ
నీవు నాటిన మొక్క నిలుపుట కమృతమ్ము
నార్జింప దివమున కరిగినావ।

స్వర్గమున కన్న గొప్పది జన్మభూమి
యనెడు నీవు స్వరాజ్య లక్ష్మని ద్యజించి
యల్ల స్వారాజ్యమేలంగ నరిగి తేని
యనుచితంబంచు జెప్ప సాహసము దాల్తు॥

## తిలక్ నిర్యాణము

ఉ. దేశహితైషులార! సముదీరిత కర్మధురీణులార! యా
వేశము మీఱ, శ్రీ తిలక ధీరుఁడు, నాటిన కర్మ వృక్షమున్
బేశల మూలమున్గునయ విస్తృత వాతమునుండి కాచుచున్
నాశములేని శాంతిని బొనర్చుడి యాతని యంతరాత్మకున్॥

(తిలక్ నిర్యాణ దినము 31—8—1920 వానపాముల.)





# లోకమాన్య బాలగంగాధర తిలక్ నిర్యాణము

("జగన్నాథదాసు")

"చింతిలకమ్మా! మన శ్రీరాముని కొరకు మదిని" వలె-

పల్లవి. శోకింపకుమా। జననీ! మా సోదరుడు, మహాత్ముడుండ॥
శోకింపకుమా। జననీ॥

లోకమాన్య నిర్యాణము-లోపము మదితలపకమ్మా!
ప్రాకటముగ నతడిపుడీ-లోకమంత నిండియుండె
॥శోకింపకుమా॥

హిందు జనులు పందలనుచు-డెందమునను గుందనేల।
ముందు శుభములొసగుట, కా-నందమూర్తి గాంధి గలుగ
॥శోకింపకుమా! జననీ॥



# శాంతి పొందుమా లోకమాన్య

శాంతి పొందుమా! మహారాజ! ఆత్మ శాంతిపొందుమా!
దేహ మనిత్యమని-దేశము కొరకయి
బాములు పడిన-బాల గంగాధరుని! ఆత్మ ॥శాంతిపొందుమా॥

కారాగృహములు-కైలాసముగ గడపి
గీతా రహస్యము తెలిపి-కీర్తిగాంచినమూర్తి ఆత్మ॥శాంతి॥

చరమదశయనక-జనుల బ్రోచుకొరకు
జని బ్రిటీషు తావులందు-జయముగన్న తండ్రి ఆత్మ ॥శాంతి॥

నీదు తేజము నిలుప దలచి నాడు
గాంధి కర్పణజేసి-కాయము బాసిన ఆత్మ॥ శాంతి పొందుమా.

మహారాజ! ఆత్మ! శాంతి పొందుమా!

卐

# పాంచాల కేసరి

('కావి పాదుషా' పువ్వాడ శేషగిరిరావు)

'లాటీ దెబ్బల పోటులన్ మడిసితే లాలాజి! నీ' వంచు నా
రాటంబున్ బడు తల్లి జాడఁ గనుగో రారాపులై అంపపున్
గాటంపుం దెగకోఁతలై హృదయమున్ గాఱించు, సామ్రాజ్యమున్
గోటన్ మీటఁగ జాలు శక్తియుతునిన్ గోల్పోతె' పాంచాలికా!

ధూమ శకటాన సైమను దొరకు నెదుట
నల్లసిదములఁ గొని మున నడచి నిలుచు
లజపతి యురమ్ము బడితె వర్షమ్ము పట్టెఁ
దోడి పంచాననమ్ములు తూఁగి యూఁగ॥

పోటు మొనగాండ్రు దొరలపై బొడిచి నడవ
శాంతమూర్తి లజపతి కండ్లు సాఁచి యూఁచి
వలదు వలదంచు కనుసన్న మలఁచె బళిర!
జ్ఞానమున్న యెదిరికి లజ్జాకరమ్ము!

వనిత పాంచాలి కట్టు వల్వలను నూడ్వ
భీమన గదాప్రహార మాఁపిన దదేది?

భీమ నేత్రాంత బడబాగ్ని ధూమ పరివృ
తోజ్జ్వల జ్వాల లార్పిన యుదధి యేది?

ధర్మజుని కండ్ల తుదల శాంతమ్మె' కాని
యెవరివో యెప్పటి వాగఁ బ్రాఁతవడె మనకుఁ
గ్రొ_త్త పఱచి లాలాజి మెఱుంగు వెట్టె
జ్ఞానమున్న యెదిరికి లజ్జాకరమ్ము!

పాంచాల వీరులు పదను వెట్టిన క_త్తి, మొనలెల్లఁ దళతళ మనియెనేని!
పాంచాల కేసరుల్ పనివడి తమ కోర, మీసాల నొకచుట్టు మెలిపిరేని!
పాంచాలయోధ సంప్రార్థన కీవు కన్, బొమ లూఁచు పుణ్యాన బోయితేని!
పాంచాల హరిరాజి పాథోధి యలవోలె, నడతెంచి యొకమారు కడిగెనేని!

అంగలేయాళి కాదు దిగంత దంతు
లైనఁ బాంచాల సింహాల నాఁపగలవె!
మోటు లాటీల నీ తొమ్ము మోఁదినపుడు
శాంత మూనితిగాని పాంచాల సింహ!



# పాంచాలము

ముఖారిరాగం

("గరిమెళ్ల")

పల్లవి. కంట గుడ్డనుబెట్టి-కర్ణాన వేలెట్టి-వింటావటర। ఓరయ్యా।
ముండ। రింటిలో జరిగిన చర్య ॥కంట॥

మొన్న మొన్ననెసుమ్మ-మూడు సంద్రాల్దాటి-వారు
శత్రుల గెలిచొచ్చినారు-పాం-చాల దేశములోని వారు
సత్యాగ్రహమని-సర్వేశు బూజింప-కత్తితో, తెగ నరికినారు-
అయ్యో। కటికడెందపు తెల్లవారు ॥కంట॥

బడి పిల్లల నెల్ల-పది క్రోసులగు దవ్వు-పరుగెత్తమనిచెప్పినారు
పరవకున్నను బాదినారు-అగ్గి గుళ్ళకు బెట్టి-అదనకు వెయి
మంది-అశువులనిట్టె యార్పేరు-వారి-యుసురులనెట్టు లోర్చారో
॥కంట॥

కట్టుగుడ్డల విప్పి-కచబంధముల రొప్పి-ఇట్టట్టులుగ జేసినారు-
మన-చిట్టి కన్నెలను-సరకారు...
ఇట్టు లెందుకు జేసిరనుచును-గట్టిగ నిది తగదటంచును
పట్టి యడిగిన పెదవులను-ని-ట్టట్టుమెదపగ యూరకొనిరట॥కంట॥

వారుచేసిన యట్టి-వరుసల వర్ణింప-నోరేమినాకు నాడదుర-
మన-గౌరవంబే కూల్చి రౌర।
బారిషరుల నోళ్ళబట్టి-యుచ్చలుపోసి, నీరజముఖుల-వ-న్నెల
బయ్యట
లుదీసి దారిపోయెడి వారినెల్లను-నోరగిలి కడుపులను బ్రాకగ
ధీరులను తమ కేతనమ్ము-దెసకు దండము పెట్టజేసిరి ॥కంట॥
వింతలలో వింత వినరా। దీని-మంతన మందుంచుకొనరా
పంతముతో మన-పెద్ద లెల్లరు గూడి-పార్లమెంటునుజేరి-
పదముల బడివేడ। మాంసభుక్కు-లు-పాంశు చరితులు-
ధ్వంస నిశ్చయులైనవారు-ప్రశంసించి వారల నెల్లరను మ-
న్నించి, మనలను డించిరంట ॥కంట॥
అట్టి వారలతోడ-మనకు-ముం-దెట్టి సంబంధమెందులకు-
కత్తి బలము నణచె ననుచును-చిత్తవృత్తియె గొప్పదనుచును-
మత్తులెల్లను వీడుడనుచును-మొత్తు వాడముగా మటంచును
చెప్పరా।-నీ కన్నులిటపై-విప్పరా। ఆ ప్రభుత నింతట-
ద్రిప్పరా। లేకున్న-నీకగు ముప్పురా। మాయప్ప యిప్పుడు
॥కంట॥
దేవుడిట్టులను చెప్పేడు-నీవు-దీనిని బాగుగ నెంచి చూడు-
భావుకజ్ఞులు-పండితాఢ్యులు-వేవిధంబుల దేశభక్తులు
అవురావురు మనుచు నేడ్చెడి-అమ్మ మొరల సహింపనేరక
పట్టితిరి ఘన దీక్ష-వారికి-నెట్టి సాయము చేయమని-
ని-న్నట్టు వేడిరి, యింక జాలము-కాట్టివేగముట్ట సాయము॥
కంట గుడ్డనుబెట్టి-కర్ణానవేలెట్టి వింటా వటర। వోరయ్యా।



# హిందు మాతానురా!

"రాముభార్యానురా! రావణవినుర" వలె

(కొండపల్లి జగన్నాథదాసు)

పల్లవి॥ హిందుమాతానురా। డయ్యరు। వినర లోకమాతానురా।
హీనుడ। వినుర! దేశమాతానురా॥

నా డబ్బు తిని నీవు-నా బిడ్డలను జంప
చేతులెట్లాడెర! నీతి లేనివాడ ॥హిందు॥

డయ్యరసురుడ నీవు-దయ యెట్లు కలుగును
దనుజ భావమెనీకు-ధర్మమాయెనటర ॥హిందు॥

పంజాబు బిడ్డలను—పలువధల గావించి
బ్రతుక దలిచితివటర!-బ్రహ్మకల్పముదాక ॥హిందు॥

మానవతుల కయ్యో'-మాన భంగముజేసి
మానహీనుడ వగుచు-మనియెదవెన్నాళ్ళు ॥హిందు॥

గాంధి కొమరుఁడు, నన్ను-గావగ బుట్టెను
నా ఋణము దీర్చెదు—నా తండ్రి యతదేరా ॥హిందుమాతానురా॥



# కనుల నీరు కారునుగా

(బేహాగ్ రాగం చాపుతాళం)

పల్లవి॥ కనుల నీరు కారునుగా–కరుణలేక, యా–డయ్యరో నర్చిన
వధ వినిన ॥కనుల॥

రావణు మించిన-క్రూర రాక్షసుడు
రాణి వాసములు చెరచెనుగా
మానభంగ మొనర్చియు న్యూనపరిచి-మనుజుల లెక్క-గొనడు
కదా ॥కనుల॥

జలియన్‌వాలా బాగున చచ్చిన-జనము లెక్క-లేదుకదా।
అబలులు బాలకులెంద ఱీల్గిరో-అసలే తెలియదుగా ॥కనుల॥

మిడి మిడి యెండకు-కడువడి నడుడని
బడి పిల్లల తెగ-బాదెనుగా।
ఒళ్ళు తెలియకే-యెన్నో చేసెను-
కళ్ళు గానకే తులువ ॥కనుల నీరు కారునుగా॥



# రక్తాభిషేకము
("జలియన్‌వాలాబాగ్")

సీ. మల మల మాడ్చి, నుమ్మలి కంపుదెండలో
పసి కూనలను నిల్వబెంచినారు।
గుఱ్ఱాల దోలు పెన్‌గొరడాల దయమాని
ముద్దు కుఱ్ఱల జావమోదినారు।
ఘోరాలకోటి పొన్నూరు బోయినను, బ
ట్టించి కందులను బంధించినారు।
ఓర్వలేమింక మొఱ్ఱోయంచు వినక, ర
క్తాభిషేకమునంది యలరినారు॥

గీ॥ శక్తినంతయు జూపి, పంజాబునందు
నిండియా దొరతనము వారింక మీరు
గొడ్డువారుగాక, యనుంగు బిడ్డలున్న
మాన్పరారె సోదర్యావమాన భరము
పుణ్యగుణులార। భరతీ పుత్రులార॥

సీ॥ విదురవో మీ ప్రక్క నొదిగిన మగల, మీ
రేల యావలకు బోనిచ్చినారు
మీ రైకలను చించి-పారవైచి పోలీసు
గమి పరీక్షించు, 'వక్షమ్ము'లగుచు

ముసుగులు బలవంతముగ నూడదీసి, మా
తోరారె। గ్రమ్మరనూర, ననుచు
కొలుదోయిని కాళ్ళ క్రిందగా జొప్పించి
చెవులు పట్టుకొనుండి యువిదలనుచు

గీ॥ పశుబలము జూపి, యవమాన పరచినారు
చలము వహియించి 'దొరలు' పంజాబు సతుల
మానపురారెః మీకింతేని మానమున్న
అక్క చెల్లెండ్ర నెవ్వగ నన్న లార॥

సీ॥ అడుగంటెనె స్వరాజ్యము బ్రతిష్ఠించిన
ఘన శివాజీనాటి కార్య దీక్ష
ప్రమగ్గనేః కంపినీ మదమడంచిన హైద
రాలి సాహెబు మహానంద దీప్తి
బెదరెనేః వైరినొంచిన మహా టిప్పుసు
ల్తాను నాటి యఖండ ధైర్య పటిమ
పారదే। మా శరీరారామసీమ, నా
నా సాహెబు మనః ప్రణాద శక్తి।

గీ॥ చెడెనెః ఝూన్సీ మహాలక్ష్మి శీలమహిమ
లేశమేని మగంటిమి లేదె మీకు
చెదర కీ యభాగ్య పిశాచి నదమరయ్య
శూరవరులారః భారత సూనులార॥

卐

# పాంచాలి

("గురజాడ")

డ్రైయరు రాక్షసుండటు హడావిడిగా చనుదెంచి, నోటికిన్
గూయగరాని, పెన్ మొఱటు కూతలఁ గూయుచు, మాన
హీనమున్
జేయగ సాహసించె, నవనీతుల నూరక నింక సైపఁగా
న్యాయమె? శక్తిగల్గిన యనాధులమే! యిటు మిన్నకుండగన్.

ఒక పాంచాలిఁ బరాభవించుటను గాదో! మూల మట్టమ్ముగా
బెకలింపంబడెఁ గౌరవాన్వయ మిలన్ బేరైనలేకే, వినా
శకమున్గా కెటులుండు నక్కటా! దురాశా దుర్మదాహం కృతిన్
బ్రకటింపన్ వెనుదీయ నేరని ప్రభుత్వక్రూర దుష్కృత్యముల్.

లంకన్ బుట్టినవారు, రాక్షసులుగారా యన్నటుల్ పుట్టి, ని
శ్శంకన్, దేశము ద్రోచు, నీ ధనపిశాచా గ్రస్తులా, వీరి కే
వంకన్,మాటల,నచ్చ చెప్పినను, లాభం బున్నె? వీరల్ వెనన్
జంకున్, గొంకును,లేక, యిల్వెడల, యత్నం బాచరింపందగున్.

ముక్కోణములపైన, నెక్కించి, బాలుర
బెత్తాల గొట్టి, చంపిన ఫలమ్ము

మల మల యెండలో, నిలబెట్టి, క్రందిన
నోరు వాయియులేని, వారి యుసురు
పోటు మానిసులను, లాటీల మోదుచు
పొట్టలఁ బ్రాకించు, నట్టి జులుము
పర పురుషుల, కంటబడనట్టి, మాన వ
తుల, నవమానించు, దుర్మదంబు

లూరకేపోవు దయ్యమై, యూరు బేరు
నిల్పకయె వంశమెల్ల, గదల్పకింక
నే మహాసతి పున్నెమ్మొ! యింతవరకు
బ్రతికి నిలచిరి, వీరు భూభారమైన॥

ఈ దుశ్శాసనుఁ డీ దురాత్మకుఁడు, మా యిల్డూరఁగా వచ్చె, మ
ర్యాదల్ నేరని దుర్మదాంధులిటు, న్యాయాన్యాయముల్ గాంచు నొ
క్కొ! దుర్భాషలఁ మాలనాడి, మిపులన్ క్రూరమ్ముగా వర్తిలన్
లేదే! మా కిక దిక్కు నీవగద! తల్లీ! దుర్గ! కాత్యాయనీ!

క్రమతన్ మా మగవార లొక్కరుగా, గ్రామాంతరంబందుఁ గా
ర్యములన్ ముగ్గి భరించువేళ, పటు ధైర్యస్థైర్యులై, వే పరా
క్రమమున్ జూపఁగ సాహసించిరిక ధర్మంబేదొ యోజింపు! మా
నము గోల్పోయిన, ప్రాణమేటికిక, యెన్నాళ్ళీ ప్రజాపీడనల్.

'దయ్య' రైనను, మరివాని యయ్యయైన
'యెదయ' రైనను, మరి వాని యొదయఁ డైన
సిగ్గువిడి చేసినట్టి దుష్కృతఫలమ్ము
లనుభవింపక, యున్నె! నాయాన, తల్లి!

‘ఏలా యిల్లలుకంగ, పండుగగునోయీ! భీతి నీకేల! పాం
చాలీ దుస్సహశోక బాష్పకణ సంజాతాగ్నిలోనన్, మహాం
కాళుల్ రుద్రులు నుద్భవించెదరు లక్షల్ కోట్లు వేవేగ, పా
శాలన్ ద్రుంచి, స్వరాజ్యమున్ గొనెద,రిచ్ఛావర్తులై యందఱున్



## మహాత్మునికి ప్రియమైన ప్రార్థన గీతములు

వైష్ణవ జనతో తేనే కహియే-జే పీడ పరాయీ జాణేరే,
పరదుఃఖే ఉపకార కరే తోయే మన అభిమాన న ఆణేరే॥

సకల లోకమా సహునే వందే నిందా న కరే కేనీరే,
వాచ కాఛ మన నిశ్చల రాఖే ధనధన జననీ తేనీరే ॥వైష్ణవ॥

సమ దృష్టినే తృష్ణా త్యాగి పరస్త్రీ జేనే మాతరే
జిహ్వా థకీ అసత్య న బోలే పరధన నవఝూలే హాథరే॥వైష్ణవ॥

మోహ మాయా వ్యాపే నహి జేనే దృఢవైరాగ్య జేనా మనమారే
రామనామసూం తాలీలాగీ-సకల తీరథ తేనా తనమాంరే॥వైష్ణవ॥

వణలోభీనే కపటరహితఛే-కామక్రోధ న వార్యారే,
భణే నరసైయో తేనుం దర్శన కరతా కుల ఏకోతేరతార్యారే॥
వైష్ణవ జనతో తేనేకహియే॥



రఘుపతి రాఘవ రాజారామ్-పతిత పావన సీతారామ్
ఈశ్వర అల్లా తేరేనామ్-సబ్‌కోసన్మతి దే భగవాన్॥

॥రఘుపతిరాఘవ॥

—)(—

# అతడే వైష్ణవుడు

ధన్యాసిరాగం-ఆదితాళం

("దామోజీ")

ఇతరుల కష్టము లెవ్వండెఱుగునొ౹ అతడే వైష్ణవుడు
సతతము పరులకు సాయము చేయుచు
గతి తానే యని-గరువము పడదో ॥అతడే॥

సకల లోకముల-సన్నుతి జేయును
అపనిందలచే-యపచారము చేయడొ ॥అతడే॥

మనసున వాక్కు-న-నిశ్చలు డెవ్వడొ౹ యోగ్యురాలాతని
కన్నజననియె॥
సర్వము సమముగ-నెవ్వండెంచునొ-ఆశవీడి పరస్త్రీ-
మాతగ జూచునొ॥
నాలుక ప్రీలిన-అసత్యము పల్కడొ
పరధనములకై ప్రాకులాడడొ ॥అతడే॥

మోహము మాయయు-మనమున నుండవా
దృఢవైరాగ్యము-ధ్రువముగ కుదురునా
రామనామమున-లీనుడై పోవునో-రాజిలు వానిలో
సకల క్షేత్రములు ॥అతడే॥

కపట లోభములు-కదలిచి కామ-క్రోధశత్రుల నారిట గెల్చునా
సఫలము జన్మము-సర్వజనులకా-స్వామి సందర్శనా-నందముచే
॥అతడే॥



వైష్ణవ గేయము :

# వాడే వైష్ణవుడు

నరసిమోహతా-"వైష్ణవజనతో" అను గుజరాతీకీర్తన కనువాదము

(తుమ్మల సీతారామమూర్తి)

వాఁడే వైష్ణవుఁడని పలుకందగు, వాడే వలయును జగమునకు
ఇతర జీవులను బాధించెడు వెత, వెఱఁగి జాలి పడువాఁడెవఁడో
ఒరుల దుఃఖములఁ దీర్చిన పిమ్మట, గరువము నందనివాఁడెవఁడో
అణఁకువతోఁ బ్రజ కంజలి సేయుచు, నన్యుల దూరని వాఁడెవఁడో
తలఁపు పల్కు పని యొకటై తల్లికి, ధన్యత గూర్చిన వాఁడెవఁడో
సమత నంది యాశలు విడి పరసతి, జననిగ నెంచిన వాఁడెవఁడో
దబ్బఱ లాడక లాఁతివారిసిరి తాఁకక నిల్చిన వాఁడెవఁడో
మాయా మోహము లణఁగి విరాగము మదిలో నిండిన వాఁడెవఁడో
తెలిసి రాము పేర్విని విని తనువే తీర్థము చేసిన వాఁడెవఁడో
కపటము లోభము కామము క్రోధము కడచి మెలంగెడి వాఁడెవఁడో
కన్నవారి తరతరముల పాపము కాల్చివేయఁగల వాఁడెవఁడో
మేలు! మేలు' నేబా! సని నరసీ మెహతా మెచ్చిన వాఁడెవఁడో

వాడే వైష్ణవుఁడని......

...)(...

# వైష్ణవు డెవండు?

("గురజాడ")

చాటి చెప్పెద వినుము, వైష్ణవుడెవండో
ఒరుల బాధ లెఱుంగు-యోగ్యుండతండు.
పరుల కష్టములందు, తోడ్పడుచు, స్వాభి
మానమున్ ప్రగల్భమ్ములు-లేనివాడు;
నిందసేయడె వారిని-వందనమ్ము
సఁగు, తల్లి వలెన్ ప్రపంచమ్ము దెలిసి
తృష్ణ త్యజియించుచున్ సమదృష్టి కలిగి
పొందెడిన్ మనోవాక్కాయ-ముల ప్రశాంతి
పరసతుల మాతృ భావన నరయువాడు
జిహ్వ నెన్న డసత్యమ్ము-జేరనీడు
పరధనమ్ములకై యాస-పడనివాడు
వ్యాప్తి నొందదు మనము-మోహమ్ము, మాయ
చే, నెపుడు, దృఢవైరాగ్య శీలుఁడతడు,
రామనామ రసామృతార్ణవ, నిమగ్నుఁ
డతని తనువెల్ల, సకల తీర్థాలయమ్ము
కామమున్ క్రోధ మోహముల్ కడకు ద్రోయు

కపట రహితుడు, భక్తసంకలితు డతడు
వైష్ణవుడటన్న సరణి-న-భ్యాసనమందు
నడచు నీవంటి సహజ వైష్ణవుడు కలడె?
నిర్మల పవిత్ర చరిత, గాంధీ మహాత్మ!



# అవతరణ

(చెఱుకువాడ వెంకటనరసింహం)

దసరాపద్యము

సకల ధర్మోపేత-సౌఖ్య సంభరిత
ఆనంద సంధాయి-అయిన భూమాత
కాలకర్మంబుచే-గాసిలిజెంది
మలిన వస్త్రంబును-మలిన దేహంబు
కన్నీరు కాల్వలై-కారెడు కండ్లు
ముడి వీడి వీపుపై-బడి వ్రేలుకొప్పు
వంచిన మోముతా-నించిన చేయి
వాడి కృశించిన-వదనాబ్జకాంతి
కడు దుఃఖభరితమౌ-గద్గద స్వరము
తడబడు పాదముల్-దైన్యభావంబు
ఏర్పడ జనుదెంచి-యేకాంతముగను
అఖిలలోకాధీశు-డైన వైకుంఠు
పాదాబ్జములమీద-బడియిట్లు బల్కె-
"హా తండ్రి! జగదీశ! హా! దీనబంధూ!
భూలోకమంతయు-పుణ్యహీనంబై
నరకతుల్యంబుగా-నానాటమారె

బలవంతులగువారు-బలహీన జనుల
అగ్రవర్ణమువార-లంత్యజాతులను
ధనమదాంధులు-బీద జనులను బట్టి
శ్వేత జాతులు కాల- జాతులన్‌బట్టి
తమ ప్రయోజనమునకై-ధర్మంబు మాని
అస్వతంత్రులజేసి-అతిక్రూరముగను
మత ధర్మ స్వాతంత్ర్య-మను మాట లేక
చెలరేగి హింసలు-చేయుచున్నారు
ఇంద్రియలోలురై -యిది యది యనక
సకల పాపంబులు-సల్పుచున్నారు
నా మనస్సుకు శాంతి-నా స్థిమితంపోయె
స్వస్థ చిత్తములేదు-సౌఖ్యంబులేదు
పాప భారము నేను-భరియింపజాల
ఇందుకు పరిహార-మేమని వేడ
అపుడు నారాయణుం-డానతి యిచ్చె
శిష్ట రక్షణ దుష్ట-శిక్షణల్‌ జేసి
సత్య ధర్మంబులన్-స్థాపన జేసి
భూతలంబును స్వర్గ-భూమిగా జేసి
జగముల రక్షింప-యుగ యుగంబులను
బహురూపముల నేను-ప్రభవించుచుందు
బహు మార్గముల నేను-పనులు సాధింతు
నా లీలదెలియంగ-నరులకు దరమె
అని చెప్పియోదార్చి-అంతర్హితుండై
వెడలిన పిమ్మట-వెలసినాడనగ

గాంధీ మహాత్ముండు-కరుణ సాంద్రుండు
నిర్మల శీలుండు-ధర్మ స్వరూపి
భారత దేశంపు-పార తంత్ర్యంబు
ముందుగా నాశనం-బొనరించినపుడె
వరుస క్రమంబుగా-వసుధలో నున్న
సర్వ దుర్మార్గముల్-సమసిపోగలవు
అందుచే మన స్వరా-జ్య ప్రయత్నంబు
సంకుచితంబైన-స్వార్థంబుగాదు
భూలోక శాంతికి-మూల కారణము
అనియెంచి మాహాత్మ్మ-డాహావంబిపుడు
సాగించుచున్నాడు-సాహాసంబొప్ప
ఇందు పాల్గొనువారి-కందు మోక్షంబు
సత్య ధర్మంబులు-శస్త్రాస్త్రచయము
దౌర్జన్య విరహిత-త్వంబె కవచంబు
రాట్నమే చక్రమై-రక్షించు మనల
ఇట్టి గాంధి మహాత్మ-నిదె ప్రస్తుతింతు
జయీా విజయీాభవ దిగ్విజయీాభవ



# నవ్వవోయీ! గాంధి!

(సారథి. కృష్ణ 10-8-1940)

పల్లవి: నవ్వవోయీ! గాంధీ!

నా! బాపూజీ! గాంధి!

అను పల్లవి: మా యాంధ్య పరిపంధి

మా మహాత్మగాంధి!! నవ్వవోయీ!

చరణములు

తెలివి కెరటాలలో తేలియాడే నవ్వు

ప్రేమ సామ్రాజ్యాన, విహరించు నీ నవ్వు ॥నవ్వవోయీ॥

సత్య వ్రతంబులో-జననమొందిన నవ్వు

శమదమాదులలోన-శాంతి జెందిన నవ్వు ॥నవ్వవోయీ॥

బీదసాదల నెల్ల-నాదరించే నవ్వు

భేదవాదులకైన-మోద మొసగే నవ్వు ॥నవ్వవోయీ॥

సత్యాగ్రహాగ్నిలో-నృత్యమాడిన నవ్వు

ముత్యాల విరజిమ్ము-ముద్దయిన నీ నవ్వు ॥నవ్వవోయీ॥

పారతంత్ర్యమునెల్ల-పారద్రోలే నవ్వు

స్వాతంత్ర్యమున్ సదా వరలజేసే నవ్వు ॥నవ్వవోయీ॥

రాజ్య సూత్రాలలో-రంగు తేలిన నవ్వు
రాజ్య వేత్తలకైన-రక్షణిచ్చే నవ్వు ॥నవ్వవోయీ॥
రాట్నగానంబులో-లయము నొందే నవ్వు
కదురు పాటలలోన-గలిసిపోయే నవ్వు ॥నవ్వవోయీ॥
పూర్ణ స్వరాజ్యంబు-బోధజేసే నవ్వు
బోసినోటను వెల్గు-పాలుపైన నీ నవ్వు ॥నవ్వవోయీ॥
అరుణ కాంతినిగూడ-నవల ద్రోసే నవ్వు
చిత్తాబ్జములయందు-జిందులాడే నవ్వు ॥నవ్వవోయీ॥
సంఘ సంస్కారమ్ము-సమకూర్చు నీ నవ్వు
ప్రత్యక్షముగ దైవ-బలము జూపే నవ్వు ॥నవ్వవోయీ॥

卐

# గాంధీ ఋషి

"కళాప్రపూర్ణ" "మహాకవి" "శతావధాని" "ఆంధ్ర ఆస్థానకవి"

( చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి )

తురకలకు బాప పుణ్యము
లరయం బనిలేదు వారి యందును సచ్ఛీ
లురు గలరు శతమునకు నొ
క్కరు, తక్కినవారి జెప్పగా నేమిటికిన్.

నవకాళీ జిల్లాలో
శివ శివ రక్కసులు మున్ను జేయని అయ్యై
యవమానంబులు హత్యలు
ఘోరరుంబోతు లొనరింత్రిపుడు ఘోరముగన్.

అట్టియోగ్యులలో గలియంగ వలయు
నంచు జెప్పెడి గాంధి మహాత్ముకుండు
వాంఛతో జెల్మిమనకు స్వప్నమున నేని
సంఘటింపదు గాంధిజీ సర్వసముడు.

తురక మంత్రిత్వమున్నయందుననె, కాశి
ఘట్టమునకట్టి దుర్దశ గలిగె నేడు
వారితో మైత్రి గాంధిజీ గోరుకంచె
బండ గట్టుకు నూతిలో బడుట మేలు.

తురకల బాధలు పడి పడి
మరచితి మాంగ్లేయులు మన మహి నేలుటచే
మఱల జవి జూచితిమి నే
డటి ముఱిగ స్వరాజ్య భాగ్య మబ్బిన కతనన్.

స్త్రీల జంపిరి చెఱచెరి దేశమున, క
రాజకము సంఘటించిరి రాట్ప్రతినిధి
యూరకుండె గిక్కురుమనకొండు దిక్కు
లేక ప్రజ గ్రామములు వీడి లేచిపోయె.

బలవంతముగా నబలల
గలిపి కొనిరి తమ మతమున ఖడ్గపు దళ
త్తళలు గనజేసి, వారల
చెలిమికి బ్రార్థించు గాంధిజీ పిఱికియే.

కాదు పిఱికి కార్యార్థి, గర్వముడిగి
చేయవలయు యత్నంబని స్వీయ పౌరు
షంబు చంపుక యత్నంబు సలుపుచుండె
గాని వారలు మనతోడ గలసిరారు.

మన మెల్లరు దురకలమై
మనవలె గాదేని వారి బ్రమందింపవలెన్
గొని ఖడ్గంబును బ్రార్థిం
చిన లాభములేదు గాంధిజీ యేమనునో!

ఎల్లచోట లహింసలు నెల్లచోట
హింసయున్గూడ బనికిరాదేనిగాంధి
శిరము నొగ్గినయెడ *'జపా' నేయు దురక
కత్తిపీటకు బలియుట గలదె పండ్లు.

గాంధి కెంతటికోపమో కలదుగాక
అల్లనవకాళి సతుల యార్తారవంబు
విన్నదాదిగ దిగమ్రింగి వెరవులరయు
చున్నవాడు మహాత్ముండు ఖిన్నుడగుచు.

అట్టి వారలతో మైత్రి యలవడదని
యెఱుగు గాంధీ మహాత్మకుం డెఱిగికూడ
సలుప యత్నంబు వారితో గలిసిపోదు
మన్నవారల నాయన యడ్డబోడు.

గాంధి మహాత్మకుండనగ గారణ జన్ముడు తన్మనంబు దు
ర్గంధులపట్ల పూర్తి విముఖంబని లోక మెఱుంగునా కృపా
సింధుడు వంగదేశము నశించుటకెంత కృశించుచుండెనో
అంధమనస్కులౌ తురక లారయ నేర్తురెః గోపలాశనుల్.

గాంధి యల బుద్ధునింబోలుగాని, శంక
రాదులకు దీటుగాడీత డవతరించు
కతమున బురాణ ఋషుల వాక్యమ్ము లవి య
థార్థములు గావుటబ్బె శ్లాఘ్యగుణుడితడు.

---

* నఫా

నవకాళీ తురకలకున్
వివేక ముదయించుపొంచె వృద్ధ మహాత్మం
డెవియో సూక్తుల దెలిపెన్
జెవిటికి సంకూద ఫలము జేకుఱునె, కటా!

అంతియ కాని వేదమునకాతడె యర్ధము చెప్పు శాస్త్ర మా
ద్యంతమునాతడే యెఱుగు యజ్ఞములాతడె నిర్వహించు సి
ద్ధాంతము లాతడాడు నుడులన్నియు నంచు వచించువారు ధీ
మంతులుగామి, వారలు విమర్శకులంచు దలంచనేనెదన్.

భగవద్భక్తుండయ్యును
నిగమములం దాస్థయాతనికి లేదు మఱిన్
భగవద్గీతయు, యావ
త్తుగణింపడు త్రోసిరాజుతో సరిపెట్టున్.

ఆత డవధూత మార్గంబు ననుకరించు
నదియె బోధించు నితరుల కలదియగునె!
గేస్తులకు దాని తత్త్వమ్ము కేవల మొక
గాంధికే చెల్లె నాతడీకాలపు ఋషి.

అతని భుక్తియు మఱియు నల్లతని రక్తి
అతని భక్తియు మఱియు నల్లతని శక్తి
అతని ముక్తియు వేఱు, లోకాతిశాయి
యతని చరితం బితరులకు నందబోదు.

పాతుకపోయి దేశమునుబట్టి పలార్చు విదేశవాసులన్
నేతల సీతులన్ గఱపి నెమ్మదిగా దొలకించినట్టి యా
చాతురికెంత మెచ్చిన రసజ్ఞుకు దృప్తిజనింప దిట్టి వి
ఖ్యాతులు మున్నుపుట్టరు యుగంబుల నెవ్విట నెన్నిచూచినన్.

ఆస్తికుడయ్యు గాంధి కడు నాస్తికు భంగిని దోచుచుండు జే
దస్తములేని యాతని యుదారత దుర్గ్రహము మ్మనీషి వి
ధ్వస్త సమస్త భిన్నమత వర్తను డాయన తత్త్వమున్ యథా
వస్తుక మౌనటుల్ దెలియు వ్యక్తులుమృగ్యు లెఱుంగజెప్పితిన్.

చండాలుండేనియు బా
పండేనియు గురుడటంచు బలికిన ధీమం
తుండల శంకరు నట్టి డ
ఖండుడు గాంధియన నొరులు గారతని సముల్.

కాలానుసారముగ జం
డాలులు మన మొక్కఁ జేయనక తక్కఁనచో
బాలిశులు తురుష్కులు చండా
డాలుర గల్పికొను నెడన్ జిక్కొదవున్

ఏ యెండకు నా గొడుగును
ధీయుక్తి నెఱుంగు నా సుధీమణి గాంధీ
మాయావుల నిర్జించు ను
పాయ మఱసి చేర్చికొనియె పంచమ జాతిన్

ఒక్క బ్రాహ్మణ జాతిలో బెక్కు భేద
ములు గలట్టిరు భారతీయులగు కతన
గాదె ఖండాతరీయులు గళము నొక్కి
మనల నేలుట తుదకు సంప్రాప్తమయ్యె.

కాలినడకను బ్రతియూరు గాంధి యేగి
పడిన కష్టమ్ము నకు నొక పది దినములు
గూడ దిన్నగానుండరు "కుక్కతోక"
సామెతకు వారి నడత లక్ష్యముగనుండె.

త్వరలోనే తురకలు తె
ల్పిరి తత్త్వము గాంధిజీకి; వేదాంతమ్ముల్
మొఱకుల కడ బని సేయునె?
నఱకకతను విడుచుటది జనస్త్రవ్యమగున్

గాంధి ప్రాయోపవేశమ్ము గడగడమని
వణక జేయును సకల ప్రపంచ మది తృ
ణమ్ము సేయదు తురక కులమ్ము వారి
కెందుకో! గాంధి గారి కీయెడల వెఱ్ఱి.

నాకు దోచినమాట ఈ నాడు గాంధి
జీ యవతరింపడేని ఆంగ్లేయ పీడ
వదల దీ దేశమున కింత వాస్తవంబ
గాని లోకమ్ము చెడియె సకల విధముల.

అన్ని వస్తువులకన్నను బ్రాణ మెక్కు-
డట్టి ప్రాణమ్ము తృణముగా నఱయు గాంధి
అతని గొప్పదనము సర్వమందె కలదు
దాననే వందనీయుడై తనరె నతడు.

అక్కు-తమున కుల భేద మవలనెట్టి
పాఱనూకిన వచ్చినదారి బట్టి
తెల్లదొర లేగుదురు వారి దేశమున క
టంచు గాంధీ మహాత్ముకుం డెంచె నెడద.

ఆపద్ధర్మము నెఱిగిన
శాపాయుధులీ మహాత్మ వైదిక దృష్టిం
జూపుదు రుదార హృదయులు
దీపటిమము వలయు దీనితెఱ గెఱుగుటకున్.

వచ్చె స్వరాజ్యమన్న నుడి వచ్చి చెవింబడి గంతులేయగా
జొచ్చెను సంతసంబు పరిశుద్ధ చరిత్రుడు గాంధి నెంతగా
మెచ్చిన దన్వి తీరు నపమేయ.డతండు, జగన్నియంత యీ
పిచ్చితనంపు చెయ్యుల త్రివిక్రమలీలకు వన్నె వెట్టిడిన్.

(ఇటీవలి జాతక చర్యనుండి)



# శ్రీ గాంధీ స్తవ పంచకము

(హరి నాగభూషణం)

సదసద్వివేక మాజన్మ సిద్ధముగాగ
సాధు మార్గము పట్టు సచ్చరితుడు,
ఐహికాముత్ర భాగాదుల దెగనాడి
దీన రక్షాదీక్ష నూగువాడు,
శాంతి దాంతి తితిక్ష శ్రద్ధా సమాధులన్
పంచకంబును సంగ్రహించువాడు,
ఆత్మముక్తి కొఱకు యత్నింపకయె ప్రజా
స్వారాజ్య సిద్ధికై పోరువాడు,

నిత్య సత్యవ్రతుండయి నెగడువాడు
బ్రహ్మచర్యంబు సిద్ధించు పావనుండు
భూతహింసల దొలగించు పుణ్యపురుషు
డహహా! గాంధి మహాత్ముండు వ్యాప్రియుండు.

మాతాపితలయెడ మాన్యభక్తియెసంగ
శుశ్రూష నొనరించు శుద్ధకీర్తి,
ఏకపత్నీ వ్రతాధ్యైక చిత్తుండయి
కాముని గెలుచు నేకాంత శీలి,

హూణవిద్యారాశి నొడిగట్టు సుధీంద్రు
డయి విషయేచ్ఛల నడచుయోగి
న్యాయవాదియునయ్యు న్యాయంబు దప్పక
ధనము నార్జించిన త్యాగమూర్తి
పరుల కుపకృతి సలుపు దేశవ్రతుండు
దీన జనముల తాపంబు దీర్చు ఘనుడు
రాజనీతిని గ్రొత్త మార్గంబులందు
నడుపునేత మహాత్ముం, డనఘుడు గాంధి.

గీర్వాణులేనియు గేలోమ్రద్పకే వ చ
స్సంభాషి వాగ్మితా చక్రవర్తి.
రారాజు నంగవస్త్రముతోడ దర్శించు
ధీరసింహాసనాధిష్ఠితుండు.
సర్వదేవ ప్రజా సత్కృతులందు ప
రార్ధ సామ్రాజ్య ధురంధరుండు.
ప్రతిన రక్షింపగ ప్రాణము లర్పించు
తెగువరి యభయ ప్రతిష్ఠితుండు.
దైవభక్తియు సత్యవ్రత ప్రశస్తి
భూతదయయు నహింసావిభూతి మెఱయ
రాజనీతి విశారదుండై జనముల
చిత్తరాజ్యాభిషిక్తుడై చెలగు గాంధి.

బ్రహ్మ విద్యాగోష్ఠి బ్రహ్మిష్ఠతా వశి
ష్ఠాదులు చెలరేగు నంతదాక
సత్య సంధత హరిశ్చంద్రులు ధర్మరా
జాదు శోభించు నంతదాక

ఏకపత్నీ వ్రతాలోక సిద్ధులు రామ
భక్తులు వేనవేల్వురలుదాక,
పరమ పతివ్రతా వరవర్ణిను లరుంధ
తీ, జానకులె యుప్పతిల్లు దాక

అతిథి పూజా భరద్వాజు లమరు దాక
ఆర్తరక్షణ శిబి చక్రవర్తుల సము
లలరు నందాక వర్ధిష్ణువై వెలయుత
మమల యశు డల గాంధీమహాత్ము డెలమి.

రామచంద్రుడు శ్రితజన రక్షకుండు
సర్వలోక శరణ్యుండు సౌమ్యమూర్తి
పుణ్యశీలికి గాంధికి బుట్టె డాయు
వొసగి భూమమైశ్వర్యమ్ము బొసగజేయు.



# గాంధీ మహారాజ్

రవీంద్రుని కృతి కనుకృతి

(వేలూరి శివరామ శాస్త్రి)

గాంధీ శిష్యులలోఁ గుచేలులును, దిగ్వాసుల్ గలా రిట్టి మా
బంధు శ్రేణికి మేళనం బొకయెడన్ బాటిల్లు మే మెన్నడ
ర్థాంధుంగాఁచుచు మోకరిల్లము దరిద్రానీక కుక్షిస్థపీ
సంధిచ్ఛేదముజేసి మాకడుపు నించం జూడమే జాడలన్.

ఆంబోతుంబలె దూకినారు యములట్లై దండముల్ జూపుచో
బాబూ కన్నుల నెఱ్ఱజేసికొని లాభంబేమి? మీ చర్యకున్
లే బాపల్ వెఱపందుచో వెఱతురా లెండోర! మా కాభయం
బీ బూతంబను బారదోలితి మటం చేమందు మవ్వారితోన్.

సారళ్యంబున స్వచ్ఛతాగరిమకున్ సైరంధ్రి మా భాష తత్
స్వారస్యం బెరిగింప నేరికి నెడర్థంబుల్ పెడర్థంబులున్
బారం జూచెడి కౌశలంబు మఱి పీనల్‌కోడ్డు పీడించు నే
ర్పే రెండేటికి? సూటిగాఁ జెఱకు మమ్మీభాష కొంపోయెడిన్.

ఇల్లును వాకిలిన్ విడిచి యెవ్వరు లేటి దళంబునన్ జెఱం
గొల్లలు కొల్లలాచు గుమిగూడిరి వారల బంధశాపముల్
చెల్లెను వారి సంకెలలు ఛిన్నములాయె తమంత వారి యు
త్ఫుల్లములైన మోములను ముద్రితమాయెను గాంధి దీవనల్.

—X—

# మహాత్మా గాంధీ

"కళాప్రపూర్ణ కవిసామ్రాట్"
(విశ్వనాథ సత్యనారాయణ)

తండ్రీ! నీకు దిగంత భూములు తపస్తఃప్రాప్తముల్ నీకు నీ
యాంధ్రుం బిడ్డలు పేద సాదలొకటై యాత్మాభిరాముండవై
తీంద్రన్ దేశము కాలమున్ గెలిచితిన్ దివ్యుండవై నాదవున్
పుంద్రేశు ప్రదరాంత కోమలతనూ స్ఫూర్తే; నమస్తే నమః.

అసి శాంతంబని నీవు చేసిన రణ వ్యాఖ్యానముల్ మా, కుటీ
ర సముద్భూత శుక ప్రసంగములలో రాచెన్ మహార్థంబులా
దెస నీ పల్కులకున్ ప్రతిధ్వనులుగా, దివ్య ప్రబంధార్థ మ
భ్యసనం బింతయు లేకయుం దెలిసె నప్పా! నీ మహత్వంబునన్.

తొలి జన్మట్టి మహర్షి సంతతి మనోదోషంబు లాత్మ ప్రభా
దలితంబై చనురీతి చెప్పిరి మహాత్మా! నీవా లోకమ్ము నం
దలి రాజ్యాశలు దుష్టతల్ కలిపి, యాత్మాసిన్ విదారించు నీ
తులు సెప్పన్ సలుపన్ సమర్థుడయి తెంతో నూత్నవాచంయమీ!

నీ కనుసన్నలర్థములు నేరక చిక్కువడెన్ జగత్తు ఏ
వాకును చేయుచున్నయది భారత దేశము నీ యెడ న్విచి
త్రాకృతివైన నిన్నొకరు డౌనను గాదను నింక నొక్క డీ
పోకిళులెల్ల బట్టకయ పోవుచునుంటివి దివ్యవీధులన్.

నేతృత సూడ చంద్రునకు నీకును పోలిక కొంత యున్న, దు
ర్నీతల మంతయున్ గగన వీధి నిలంబడి యేలురాజు లీ
చేతనొ రాహులిద్దఱకు చెట్ట ఘటించును నూలు పోగుతో
బ్రీతుల యోదు రిద్దఱును, విశ్వజిగీషువు లిద్దఱున్ మునీ!

విరిసిన బోసి నెన్నగవు వెన్నెల లీ తొలినేల నల్దెసల్
కురిసి మహాసభాజన చకోరములం దనియించి పేదయై
బిరుసయి యెట్టవారి దురపిల్లిన మా వరిపంటచేలు కా
విరి తలలెత్త నీ కలమ వెన్నలనించె సుధాప్రవాహముల్.

దీప్రోల్లోక మతి ప్రభాహత వచస్తీ ప్రాంధ్యమే పాణినీ
య ప్రాగల్భ్య విధాన సూత్రతతి యల్లా నాడు నీనాడు సూ
త్రప్రాయమ్ములు దివ్య బుద్ధికములౌ త్వద్వాక్కులున్ భోగరా
జప్రౌఢోజ్జ్వల భాష్య దీప్తిబరితస్సంతృప్తి కల్గించెడిన్.

నిలువ నీడయు లేని నిరుపేద దీర్ఘ ని
శ్వాసమ్ము నీకు వింజామరమ్ము
కడుపాకటిని బీదవడు వాని జాలు
కన్నీళ్ల గ్రొంజడి నీకు వెల్ల గొడుగు,
సంఘదూషకుల దౌర్జన్యభిన్నాత్ముని
గుండె నీకును సభామండపమ్ము
ఆజన్మ సిద్ధ కారాగార వాసమ్ము
డంబు మీరెడు కిరీటంబు నీకు

తత దరిద్ర ప్రజాహృదంతరమ్ము
మొలుకు రతనాలు నీ కొలువున్న గద్దె
ఓ విచిత్ర సన్యాసి! నీ వాక్కరుడవె
రాజువన్న నిజమ్ముగా, రాజువయ్య!

అవును నిజము భర్తృహరి యన్నయట్లుగా
మహి బరోపకార మతులు సువ్వో
త్రవ్వియిత్తు రెందు దమయాత్మ దేహమ్ము
తమ కుటుంబకంబు తమధనంబు.

# గాంధీ ఉవాచ

(మహాకవి కాటూరివేంకటేశ్వరరావు)

హరి సృజించె నరుని అచ్చమ్ము తనపోల్కి
నరుడు తన్నుబోల హరి సృజించె.
ఇనుము పైడిజేయ నీశ్వరుండే నేర్చు
గాంధి పలుకు ధర్మగంధ మొలుకు.

కడలివోలె నెల్ల కడల నీశ్వరు డౌక
బిందువై వసించు నందు నరుడు.
కడలిబాసి బిందు వడగారు నిక్కము
గాంధి పలుకు ధర్మగంధ మొలుకు.



# బాపూజీకి నమస్సులు

(పురిపండా అప్పలస్వామి)

ఇతడు బాపూజి బోసినవ్వుల తపస్వి
భారత మహాస్వతంత్ర రణాంగణమున
సర్వసేనాని, సత్యాగ్రహా ప్రణేత
సర్వ సర్వం సహా పరిత్రాణ కీర్తి.

ఈ అవతారమూర్తి నొగి
లింపడు శాత్రవమానసమ్ము ద్వే
షింపడు ఆతతాయి నయి
నన్ పరపీడన సైపలేడు ప్రే
మాస్త్ర మదొక్కటే యితని
పాశుపతాస్త్రము, గెల్పెగాక ఎ
న్నండును ఓటమిన్ గురుతె
రుంగడు ఈతనికిన్ నమస్కృతుల్.



# నమోవాకము

(వెదురుపల్లి జమదగ్నిశర్మ)

తన తను వఖిల భూత నికాయమై స్పర్శ
సర్వమ్ము విస్పష్ట పఱుప
తన కన్నుగవ సర్వదర్శియై లోక మం
దలి మంచి చెడ్డల తఱచి చూడ
తన వీనుదోయి ద్విధాబద్ధజనుల కృ
తాకృత వేదన మ్మాలకింప
తననాస నరుల చిత్తముదూఱి దుర్గుణ
సుగుణ పుంజములు మూచూచి తెలుప

తనదు నాలుక నిఖిలభూతముల సేమ మిల
నిలువ శుభాపాది వాక్కులనె బలుక
తానుగా నుండి సర్వాత్ముడైన యట్టి
యా మహాత్మున కేను ప్రణామ మిడుదు.

జయ జయ భారతీయ మనసా పరిపూజిత ధర్మపాలకా
జయ జయ దేశమాతృపదపద్మ సమర్పిత సర్వజీవనా
జయ జయ జానకీరమణ చారు పదార్పిత చిత్త పంకజా
జయ జయ గాంధిదేవ భవసాగరవత్సర దాస్యమోచనా.

(1945 అక్టోబరు భారతి)



# గాంధీజీ

(పురాణం రాఘవశాస్త్రి)

ఆయన సత్యవాది, మహిమాన్వితు డుజ్జ్వల భారతీశ, తే
జోయుతమూర్తి, శాంతిరసశోభితు, డూర్జితసత్త్వుడున్, అహిం
సాయతివర్యు, డార్యజన సంస్తవనీయుడు, గాంధిజీ, స్వదే
శీయుల దాస్య శృంఖలలు చెచ్చెర ద్రెంచెడిమాట సత్యమే.

ఏ నలుసంత సిగ్గభినయించుటలేక అనంతమైన వి
జ్ఞాన మనాది సిద్ధమగు సభ్యత, సంస్కృతి గల్గు భారత
క్షోణికి చేయివాయి ఒక చొప్పున గట్టిన కూడ నీతి తం
త్రానుగ దుష్ప్రవర్తకుల కాయన ధీకృతియే కదా సదా.

ఈ యమృతైకమూర్తిని జయించెడి ఆటము బాంబులేదు, దీ
ర్ఘాయురుపేతు డీతడు, స్వరాజ్యరమాతరుణీ సుహాస రే
ఖాయిత చంద్రికా ధవళ కాంతి పరీవృత మాతృదేశ సు
శ్రీయది యెల్లమాకితని, చేఁచలువై లభియింపగావలెన్.

ఇతడీ భారత మోక్షదాయకుడు ప్రహ్వీభూతదేవాంశ సం
భృత దివ్యాకృతి, లక్షలాది ప్రజకేకైకాత్మ, ప్రాచీన భా
రత విజ్ఞాన సరస్వతీ నిలయు డార్యావర్త భానూదయ
స్థితికిన్ తూరుపుకొండ, వర్ధిలవలెన్ తేజస్వియై యబ్దముల్.

(భారతి, అక్టోబరు 1945)

卐

# గాంధీలాలీ

(కొండపల్లి జగన్నాథదాసు)

గాంధీలాలీ! మోహన గాంధీ లాలీ!
కరుణాసాంద్రా! మోహనదాస ॥గాంధీలాలీ॥

నిదురమాని హారముమాని-నీవు మా కొరకు
కదురు రాట్నమెన్నాళ్లీ గతి-ఖైదున ద్రిప్పెదవు ॥గాంధీ॥

ఎర్రవాడ చెరసాల నీకు-ఇల్లయి పోయినదా!
ఏలిన వాడవు నీదుమోము-ఎన్నడు జూతుమురా ॥గాంధీ॥

కల్లుమాని ఇల్లాలిని-గౌరవింతుమురా!
మల్లుమాని మాయషోకుల-మాటా మరతుమురా ॥గాంధీ॥

పంచమాదుల మరచినామని-పంతము బూనకురా!
పంచమ దోషము పాలింపకురా-పశ్చాత్తాపింతుమురా ॥గాంధీ॥

జగన్నాథ దాసపోషక-జగన్నాయక
నిరుపమాన నిర్వికార-నిదుర బోవేర ॥గాంధీ॥

# గాంధీ మౌనిని గొల్వరే

("కొండపల్లి")

గాంధీ మౌనిని గొల్వరే-పామరులారా ॥గాంధీ॥

అంధకారమునందు-బంధింపబడి యిట్లు
కుందగనేల మీరెందు హిందువుక ॥గాంధీ॥

కాలము వ్యర్థముగ-గడపక సన్నని
నూలు తీయగను రా-ట్నమును బెట్టుడివేగ ॥గాంధీ॥

సీమ గుడ్డలుగట్టి-సిగ్గెల్ల విడనాడి
సోమరులై తిరుగ-క్షేమము గల్గునె ॥గాంధీ॥

రాగలదు మనకు, స్వరాజ్యభోగము నేడె
త్యాగులై మీ మీ యు-ద్యోగములు మానండి ॥గాంధీ॥

మురిపెంపుతో శ్వేత-ముఖుల కొల్వునజేరి
తరియింపలేరు, య-థార్థము నమ్మండి ॥గాంధీ॥



# లెండి! మన గాంధిని కొల్వాండి!

("కొండపల్లి")

లెండి। మనగాంధిని కొల్వండి। వేగలెండి॥మనగాంధిని కొల్వండి॥
జండాలెత్తండి। మన-జండాలెత్తండి ॥లెండి॥

అసహాయోగమే మనకు-ఆధారమండి
అసలైన యోగమది-అభ్యసింపండి ॥లెండి॥

హిందూముసల్మాను సమ్మేళనంబె
సందేహమేల మన-స్వరాజ్యమండి ॥లెండి॥

దౌర్జన్య రహితమె-దారి యనుకొండి
తరియించుటకు వేరె-దారి లేదండి ॥లెండి॥

పంచమదోషము-పాటించకండి
కొంచెపు నరులాని-వంచింపకండి ॥లెండి॥

శాసన సభ్య మాట-స్మరియించకండి
సభలలో లేదండి-స్వరాజ్యమండి ॥లెండి॥

రాట్నము ద్రిప్పు నల-వాటు చేయండి
రమ్యముగ ఖద్దరు-రండి! కట్టండి ॥లెండి

కాలమెటు మారెనొ-గమనించుకొండి
గాంధి నామ స్మరణ-గావించుకొండి ॥లెండి॥

గాంధి నగరమంత-గాంధిమయమండి
కాకినాడ కాంగ్రెసు-ఖ్యాతి నిల్పండి ॥లెండి॥

అసహాయోగ మర్మం పు-టర్ధ మెరుగండి
వాస జగన్నాథదాసు నడగండి ॥లెండి॥



## సఖుడ! గాంధీమహాత్ముని చూచినావా? లేదా? చెపుమ
("కాండపల్లి")

సఖుడ! గాంధీమహాత్ముని చూచినావా? లేదా? చెపుమ ॥సఖుడ॥

నిన్న మొన్న వచ్చెనతడు-కన్నులార చూడలేదా?
వెన్నుడు శ్రీకృష్ణుడతడు-వెర్రివై చెడి పోక నీవు ॥సఖుడ॥

భారతీయుల కష్టములను-బాపుటకును బుట్టినట్టి
వాసుదేవుడైన కృష్ణ-స్వామి యతడె మోసపోకు ॥సఖుడ॥

ఒక్క యేడాదిలోపలనే-నిక్కముగ స్వరాజ్యము, మనకు
దక్కజేయునట్టి మా-ధవుండత డేరా! వినరా ॥సఖుడ॥

ఔర భగవంతు మనకు-నలవిగాదు తెలియుటకును
రామదేవుని కైక దెలియక-పామరత్వమున జెడియె॥సఖుడ॥



# గాంధీ శతకము
(మంగిపూడి వేంకటశర్మ)

నిరుపమ కళ్యాణ గుణా
భరణా జనకాభ యోగివందిత చరణా,
పురుషార్థ భరిత చరితా
కరుణామృత పూరితాత్మ గాంధి మహాత్మా!

నీ వవతరించుటను నా
ర్యావర్తము పూతమయ్యె నవని తరించెన్.
శ్రీ వైశ్యకులము మెఱసెను
కావంబడె భరతమాత గాంధిమహాత్మా!

నీ వేసువనుచు బుద్ధుడ
వీవనుచున్ రాముడనుచు కృష్ణుడ వనుచున్
భావింతురు, నీవందఱు
గావలయునటంచు నెంత్రు గాంధిమహాత్మా!

క్రూరులయి హింస జేసెడు
వారల ప్రేమించునట్టి వ్రత మూనితి వా
కారణమున క్రీస్తందురు
గారవముగ జనులు నిన్ను గాంధిమహాత్మా!

భూతములనెల్ల సహజ
ప్రీతిన్ గనుగొనుచు నొక పిపీలికకేనిన్
ఘాత దలంపని కతమున
గౌతమ బుద్ధుడవటంద్రు గాంధిమహాత్మా!

తిలకింప పరశురాముడు
తిలకై జన్మింప నతని తేజము గొనుచున్,
వెలసితివట కాదా మఱి
కలియుగ రామావతార గాంధిమహాత్మా!

సదయత వలువ లొసగి, ద్రౌ
పది బ్రోచిన కృష్ణుడనగ భావ్యమగున్, ము
ప్పది మూడుకోట్ల బ్రోచితి
గద మానము నిల్పి నేడు గాంధిమహాత్మా!

ఖండాంతర పండితులు, న
ఖండంబగు దివ్యశక్తిగల వాడనుచున్
ఖండితముగ బల్కెదు, రా
ఖండలనిభ నిర్మలాత్మ గాంధిమహాత్మా!

వైరులును మహాత్ముడ వని
పేరుగొనక మానలేరు భీతిన్ బ్రీతిన్
వారక యెల్లరు దలతురు
కారణ జన్ముడవు నీవు గాంధిమహాత్మా!

మహాత్మా గాంధీ

సత్యము నిత్యమట - చుసు
సత్యము విడనాడ వెట్టి సమయమునందున్
సత్యము నిను రక్షించు, న
గత్యముగా దోడు నిల్చి గాంధిమహాత్మా!

స్థానము ఋషికోటికి, వి
జ్ఞానము-లకు నెలవు భరత ఖండంబనగా,
దీని సరిదేశ మెందును
గానము గద లోకమందు గాంధిమహాత్మా!

భోగముల కాట పట్టిది
త్యాగములకు నిలయమిద్ది ధర్మంబులకున్
బాగగు నెలవిది, స్వర్గము
కాగలదా దీనికుద్ది గాంధిమహాత్మా!

గరితలకు, పుణ్య సంప
ద్భరితులకున్ సాధులకును భగవత్సేవా
నిరతులకు, సుచరితుల కా
కరముగదా! భరతభూమి గాంధిమహాత్మా!

(భారతినుండి డిసెంబరు 1923)

# గాంధీజీ

("దేశభక్త" కొండా వేంకటప్పయ్యా)

తరములదాటి యత్నముల దండిగ జేసిరి పూజ్యులంద రీ
తరమున జేసె గాంధి మహితాత్ముడు తాపసి దీక్ష తీవ్రతన్
వరల తపోబలంబుననె వచ్చె స్వరాజ్యవరంబు భోజ్యమై
కరములు మోడ్చి నమ్రతను గాంధిమహాత్మ నమస్కరించెదన్.

భారత మాత గర్భమున పండినపంట మహాత్మగాంధి యీ
భారత దాస్య శృంఖలము బాపగ బుట్టిన భవ్యమూర్తి యీ
భారత ధర్మమార్గముల భారతమందును లోకమందునున్
బారగజేయు కంకణము పట్టుగ గట్టెనుగాదె గాంధిజీ.

కొట్టగ కఱ్ఱలేదు, మఱి కోయగ ఖడ్గములేదు, శస్త్రముల్
పట్టగరాదు, శాత్రవులు పట్టిన గొట్టిన నేమిచేసినన్
రట్టును రద్దిచేయకను రమ్మని పిల్చినతోడ బోవుశే
యిట్టిది యుద్ధ పద్ధతి, మరెట్టుల గెల్వగ సాధ్యమయ్యెనో.

(భారతి, అక్టోబరు 1947)



# గాంధీజీ

('కవి సమ్రాట్' విశ్వనాథసత్యనారాయణ)

కామ క్రోధమదాది రాక్షస సమాక్రాంతంబులో లోకముల్
స్వామీ! నిశ్చల తావకీన నయన ప్రాంత ప్రశాంతాంశు మా
లా మార్గమ్ములకున్ స్వనాశ భయకీలావిహ్వలంబుల్ హాహా
హా, మోసాల పెడంబెడం బడి.యుడాయుంచున్ బడాదేశముల్.

జగతాళించు త్రయీశిఖా సకల మాహేయీ సుధా దోగ్ధ తా
నుగ గీతా పరమేశ్వరుండు ప్రభు! నిన్నుంగాంచి, యీ బోసి బెం
దుగ వైశ్యుండతి వర్ణ ధర్మపథమున్ నూత్నంబు గల్పించె నం
చెగడై స్వీయ దశావతార భరలజ్జానమ్రుడై పోయెడిన్.

లూన కర్మలు వామలూరు గుప్తా కృతుల్
వెలితి పొందనియట్టి నిలువ సరుకు
ఆత్మ ప్రచార దోహల మత కర్త లం
గడిలోన వృద్ధికై నడపు సరుకు
అల్పాల్పులైన వేదాంతు లమ్మెడు వోక
బుట్టలలో గ్రుళ్ళిపోవు సరుకు
నీవు శరీర యాత్రావాహినీ పరి
పోషకంబయి పారువోని సరుకు

ఓయి కొలఁతలేని కోమటి! యీ యనంత
మైన బ్రహ్మ పదార్థ నానా నిరంత
బాధ వినియోగ వీధుల బ్రాణధరణ
ఘనము నీ సరుకున వెలకట్టలేము॥

కల మజిద్, గఫూర్‌ఖానులు, కారు, వల్ల
భాయికాడు, రాజేంద్రబాబు కాడు
కాదనీవు బ్రాహ్మణ సంస్థ కాంగ్రెసందు
రాత్మగుణముల బలముచే నమరమూర్తి!

నుడు తావెల్గులు లుప్తదంత వదనుల్ సూర్యేందుమన్ నీవు, చం
ద్రుడు నీవున్ మఱి నూలు వోగునకు సంతోషింతు రయ్యగ్ని దే
వుడు నీవున్ సకలాహుతి ప్రకట సంభూతాత్ములే వెల్గు కా
వడులన్ వారికి జంటకుండ వగుచున్ బాల్మోసినావో మునీ!

కోరల్‌గాగఁ దుపాకులుఁ మర ఫిరంగుల్‌బాంబులున్ రాజ్య వాం
ఛా రూక్షత్వపుఁ బెద్ద నోర్తెఱచి తృష్ణాదేవి పూర్ణాహుతి
ప్రారూఢిం దిగమ్రింగుచుండ జనులన్ బట్టీక కంఠాంతర
ద్వారంబందున నిల్చి యడ్డుపడె దహో! స్నిగ్ధరజ్జ్వాకృతిన్।

తనకుం బట్టిన జాతి జీవన విధాతన్ నిన్నహో! వ్యక్తి జీ
వన సూత్రార్థ విచారమాత్ర దురహంభావున్ స్వకర్మచ్యుతుల్
మన యీ బ్రాహ్మణు లాడుచుండెదరు కామ క్రోధలోభాది దు
ర్గుణ వారంబుల జీవ గబ్బిలు విడాకుల్ ముక్తికాంతాళికిన్.

ఎట్లురాజో ప్రజయట్లన్న యర్ధమ్మునెఱిగి బ్రాహ్మణుడు నీకృషి నెఱుంగు
ధర్మసాధనకు నాద్యముశరీరమ్మంట యెఱిగి బ్రాహ్మణుడువిన్‌పరిగణించు
అసుర ప్రతారణార్ధవతార రహస్యమెరిగి బ్రాహ్మణుడు నీ తెఱగుదెలియు
తనవోలెసర్వభూతములంటబహుముఖమ్ములచూచి నీదారితెలియుద్విజుడు.

యుగ యుగాంతరముల మార్పులొందు నదియు
నాత్మ వచ్చరీ రాధీనమయిన యదియు
నయిన ధర్మంబు తనకు యోగ్యమగు వెడల
తనకు యోగ్యుల సృజియించు కొనును గాదె.

క త్తియులేని భారత జగత్తె యహింసకు మొగ్గదేని, నీ
యెత్తిన యెత్తికోలునకు హిట్లరులున్ మరి చర్చిహిల్లులున్
వత్తురె రక్తమాంసములు ప్రౌఢ చరిత్రులు, జాతిగర్వముల్
మత్తులు మైకముల్ మొదలు మాడినమోడు తుదల్ చిగుర్చుటల్.

నిన్నున్ మెచ్చరు నీతి మార్గగరిమన్ నిస్త్రింశ శాస్త్రాంబుధుల్
కన్నారన్నియు చేయనేర్తురుగదా కాల్పుల్ ఫిరంగుల్ గనుల్
మన్నున్ మిన్నును గానకుండెద రహింసా సాధు సూత్రంబులన్
విన్నారా! యిది తేలెనా! విధురితోర్వీశాసకాశాబ్దిలో.

(1940-రచన)



# మా బాపూజీ
(గౌతామీకోకిల 'వేదుల')

చేవదొరంగి సత్త్వ నశించి శతాబ్దుల నుండి దీర్ఘ ని
ద్రావశులై జడమ్ముల విధమ్మున నున్న యధీర భారతీ
యావళి మేలుకొల్పి, యసహాయ మహోద్యమ దీక్షతోజ్వల
త్పావకులం బొనర్చితివి, భారత భాగ్యవిధాత! బాపుజీ!

త్రాచుకోఱల సుధాధార జ్వాలారింప
జాలు బుద్ధుని యహింసా మహస్సు
శిలువ మీదను స్రవించిన జీసను హృదయాం
తర రక్తధారల త్యాగమహిమ
ఇసుక యెడారి కాసారహృదము మార్చిన మహ
మ్మదు జీవితంపు నమ్మకపు బలము
అస్పృశ్యతాగ్ని జల్లార్చ దారక సుధం
బంచు రామానుజు భక్తిరసము

వెరసి నీవైన నీ యాత్మచరిత యీ య
శేష దేశాల యెల్లల జెరపివైచి
పల్లెలకు బట్టణాలకు బచ్చతోర
ణమ్ము లీనాడు గట్టుచున్నది మహాత్మ

నెత్తుటి చుక్కయేని ధరణిం బడనీక స్వతంత్రతాధ్వజం
బెత్తిన శాంతి యోధుడవు, హింసకు నొదలలొగ్గి యొండొరుల్
కుత్తుక లుత్తరించుకొను క్రూరులె నీ కడకుం గటారులున్
గత్తులు దెచ్చి కైవసమొనర్చి రదెంత మహాతపస్వివో!

నీ వలన భారతమున బానిస తనమ్ము
అంటరాని తనమ్ము నేడంతరించె
భ్రాతృ రక్తాక్తమగు కురుక్షేత్ర సీమ
నిశ్చల ప్రేమశాంతి పండించి తీవు॥

నవ్వులోన గరుణారస మొలుకుచు
మాటలోన నిగమంబుల జిలుకుచు
చూపులోన ధీమా పురిగొలుపుచు
నడిపించితి వీ నవభారతమును॥

నేదగొన్న శ్రమజీవికి శరణము
పల్లెవాకిటికి బచ్చతోరణము
అంధజగతి కాశారుణ కిరణము
జయ మహాత్మజీ! జయ బాపూజీ!



# పర్యాలోకనం

(మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి)

మా బంధమ్ముల బాప బూనవో మహాత్మా యా నిరాహార దీ
క్షా బంధంబును నిర్వదొక్కటికి నుత్సర్జించి కస్తూరి బా
యీ బత్తాయి రసంబు నందుకొనవో స్వేచ్ఛామృతం బిట్టులే
నీ బంగారపుచేత మాకొఱకు నీవే యింక నందీయవో.

పడకంబారెను కాలుసేతులును యావద్భారతక్షోణి కె
ల్లెడ నీ నీరసమెంచి యా యమెరికా ఇంగ్లండులున్‌గూడ. ఆ
ల్లడమున్ తల్లడమందె దైవకృపవల్లన్ దండ్రి యీ నాడు నీ
యొడలన్ ప్రాణము తేరుకో తిరిగి మా యుల్లంబు చల్లంబడెన్.



# మహాత్ముఁడు

(తుమ్మల సీతారామమూర్తి)

సీ॥ ఉత్తమ వాగ్మి నా నొప్పారె సురక గ
ర్జించి యా కాదు వర్జించి నుడులు
అతిలోక బల సమంచితుఁడయ్యెఁ గండలు
పెంచి యా కా దలయించి యొడలు
చిర జయశ్రీ ధురంధరుఁడయ్యె రిపుల ఖం
డించియా కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించి యా
కాదు నిష్కామ యోగము వరించి

యతఁడు సామాన్యుఁడెట్లు? వీరత కపూర్వ
జీవములువోసి వాసి దెచ్చిన మహాత్ముఁ
డతని నడచిన బాటలయందు నడిచి
పందయును విక్రమాస్పందుఁడయ్యె.

గీ॥ రాజ దండము వలదు స్వర్గంబు వలదు
జనన మరణార్తులంటని జగము వలదు
తెలివి లేని దిగుళ్లతో దేవురించు
జనులఁదేర్చుట వలయు నాకనియె నతఁడు.

క॥ రాముని సత్యము కృష్ణుని
ప్రేమము గౌతముని కరుణ పెనఁగొని యోగి
గ్రామణి బాపూ ప్రతుకై
మామక కవితాలతా సమాశ్రయ మయ్యెన్॥



# గాంధీ మహాత్ముడు

(కొడాలి ఆంజనేయులు)

సత్యాన్వేషణ తత్పరత్వమున నీ సర్వస్వమున్ వీడి మా
కత్యంతమ్మును మేలుకూర్చితి మహాత్మా! నీదు సందేశముల్
నిత్యమ్మున్ స్మరియించి త్యాగపదసాన్నిధ్యమ్ములం జేరకే
అత్యాశామృగతృష్ణలంబడుట మా కాశ్చర్యముం గొల్పెడిన్.

మా పూర్వార్జిత పుణ్య హేతువున కామక్రోధలోభాది దు
ర్వ్యాపారమ్ముల బొంతబోక భవదాజ్ఞాయత్త స్వాతంత్ర్య దీ
క్షా పారమ్మును చూడగల్గితిమి నీ సత్యాగ్రహానీకశి
క్షా పాండిత్య మెఱుంగనట్టి యువ సంసారమ్ము నిస్సారమే.

ద్వేషాసూయ లనంగ నెట్టివియొ నీ దివ్య ప్రభావంబు చే
నీ షన్మాత్ర మెఱుంగ రప్డు తన సర్వేందు ప్రభావీచికల్
దోషధ్వాంతము లూడ్చిపెట్టినవి ఈ దుష్కాల మేమోకదా!
కాషాయాంబరధారి సైతము వృథా కాపాట్యమున్ బూనెడిన్.

నీ ప్రేమామృతవాక్య నిర్ఝరఝరీ నిత్యాభిషేకమ్ముచే
నీ ప్రాపంచిక భోగభాగ్యములు లెక్కపెట్ట రానాడు, వి
ద్యా ప్రావీణ్యములేని మూకయును దివ్యత్వమ్ము చెందెన్ ప్రతీ
చీ ప్రాచ్యప్రజ సౌఖ్యమొందె భవదాశీర్వాద భాగ్యమ్మునన్.

కారాగారము దివ్యసౌధముగ సంకల్పించి లారీ ప్రహా
రారంభమ్ములకున్ శతఘ్నుల కనాయాసమ్ముగా ప్రాణముల్
ధారల్వోసిరి భారతావనికి స్వాతంత్ర్యమ్ము చేకూర్పగా
ధీరాగ్రేసర చక్రవర్తులకు సందేశమ్ము నీ దెట్టిదో!

ఖాదీ గట్టినవాని పూర్వ చరితుంగా నెంచిరానాడు, నే
డేదో పాపము చేసినట్లతని నిందింపం గతంబేమి నీ
యాదేశమ్ముల విస్మరించి పదవీ వ్యామోహబుద్ధిన్ దురా
శాదౌష్ట్యమ్ముల కగ్గమై ప్రభులు లక్ష్య భ్రష్టు లౌటంగదా!

ప్రాయంబంతయు బుచ్చి కల్మిని తృణప్రాయంబుగా నెంచి ఆ
న్యాయత్తంబగు భారతావనికి కల్యాణంబు చేకూర్చుటే
ధ్యేయంబంచు దలంచి రప్పు డిపుడంధీభూత చేతస్కులై
స్వీయార్థ ప్రతిభావులైరి జనముల్ చిత్రంబు భావింపగన్.

ఊహాపోహలులేని వట్టి అధికారోన్మత్తులంజేరి, దా
సోహమ్మంచు భజించుటొక్కటియె దేశారాధనంబయ్యె వ్య
ర్థాహంకార దురాగ్రహ గ్రథిత నిత్యావ్యగ్ర సంభాషణల్
సాహిత్యంబయె దీని మించిన కుసంస్కారమ్ము వేఱున్నదే?

నీ పేరెన్నక నిన్నుతింపక భవన్నిర్మాణ కార్యక్రమ
వ్యాపారమ్ముల నుగ్గడింపక యుపన్యాసమ్ము సాగింపగా
నోపం డెవ్వడుగాని స్వోచ్ఛపద కాంక్షోన్మాదుతా వారికిన్
సోపానంబయె నీ చరిత్రమవురా! శుష్కప్రియాలాపమై.

నీ కారుణ్య మహింస ధైర్యగుణముల్ నీ నిత్య సత్యవ్రత
ప్రాకారమ్ములమధ్య భారత ప్రజారాజ్యమ్ము వర్ధిల్లి లో
కైకఖ్యాతి గడింప కోర్కెగలదెంతే మాకు నీ విశ్వ పూ
ర్ణాకారమ్ము మాకొక్కమారయిన ప్రత్యక్షమ్ము గావింపవే.



# మహాత్ముడు

('కరుణశ్రీ' జంధ్యాలపాపయ్యశాస్త్రి)

నలుబది కోట్ల తమ్ముల జీవితమ్ముల
కాయనమాట 'వేదాక్షరంబు'
భీరులనే కర్మవీరుల గావించు
ఆయన పిలుపు 'శంఖారవంబు'
సత్యంబు శాంత్యహింసలకు స్వాగత
ఆయన బ్రతుకు "మహాప్రయాగ"
కొల్లాయితో పిచ్చి పుల్లాయి వలె నుండు
ఆయన దీక్ష "లోకైక రక్ష".

అతడొక 'పవిత్ర ధర్మదేవాలయంబు'
అతడొక 'విచిత్ర విశ్వవిద్యాలయంబు'
ఆ మహాశక్తి అంత ఇంతంచు తూచ
జాలమాతడొక పెద్ద హిమాలయంబు.

—X—

# మా గాంధి తాత

(‘కరుణశ్రీ’ జంధ్యాలపాపయ్యశాస్త్రి)

అడుగు పెట్టినచాలు అవనీంద్ర రత్న రం
జిత కిరీటములు హారతులొసంగు,
బయలుదేరినచాలు ‘జయ జయ’ ధ్వనులతో
గ్రామాలు గ్రామాలు కదలివచ్చు,
కొంగు బట్టినచాలు కోటాను కోట్ల హ
స్తములు బంగారు వర్షములు గురియు,
పెదవియొకింత విప్పినచాలు లక్షల
కొలది తలల్వచ్చి కొలువు తీర్చు

నవ్వినంజాలు పతిత మానవ సమాజ
మానసమ్ములు దేదీప్య మానములగు
పట్టు పట్టినచాలు సమ్రాట్టులైన
తలలు వంతురు మా గాంధితాత ముందు.

అన్ని గుణంబులందున మహాత్ముడవే “యుగపూరుషుండవే”
యెన్ని విధాల జూచిన, ఇదే యనుమానము మాకు “తెల్గువా
డన్నది గిట్టదేమి” ‘ఇది ఆంధ్రుల పాపమొ’ చందమామలో
చిన్న కళంకముండుట విచిత్రముకాదుగదా! మహారథీ!



# బాపూజీ

('కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి)

మానవాభ్యుదయ సంకేతం
నీ జన్మదినోత్సవ జయగీతం
హిమాలయ
మహామహీధర
శిఖరాగ్రం మీదినుండి
స్వచ్ఛమైన అందం లాగున
స్వచ్ఛందచ్ఛందం లాగున
చెంగు చెంగుమని లంఘించే
చల్లని నదీమ తల్లుల
ఉదాత్త జీవనానికి
ఉజ్జీవనం.
బాపూజీ
నీ జీవనం.
నీ నిత్యోజ్జ్వల వదనంలో
నీ సత్యాగ్రహ కదనంలో
బుద్ధదేవు కారుణ్యంవలె
శ్రద్ధామయ కర్తవ్యంవలె

ప్రవహించిన. ప్రతిధ్వనించిన
ప్రశాంత జయఘంటాధ్వానం
ప్రపంచ నవయుగాహ్వానం
పరాధీన భారతదేశంలో
నిరాధార నిర్భాగ్య ప్రజలకు
తరతరాల చైతన్యం
నరనరాల కెక్కించే
భవ్య భవత్తపశ్శక్తి
భారత యుగదాస్య విముక్తి.
నీ అహింసామకుట మణికాంతులు
ఈ మహాప్రపంచ సుఖశాంతులు.
నీ ఖాదీ మా ఆజాదీ
నీ ధ్యేయనిష్ఠ
జాతి స్వాతంత్ర్య పునః ప్రతిష్ఠ.
నీ సత్యాగ్రహ సాధన
శాంతి దేవతా సమారాధన.
నీ కర్తవ్య మహాదీక్ష
లోకానికి శ్రీరామరక్ష.
నీ సర్వమానవ సమానదృష్టి
సత్యాహింసల సమిష్టి.
నీ బోసినవ్వులు
దేశమాత పూజకోసం
కోసి రాసి పోసిన పువ్వులు.

---o---

# హిమాల యోత్తుంగశృంగం

(అడవి బాపిరాజు)

హిమాలయోత్తుంగ శృంగం- నీ బ్రదుకు
ఉమాపతీ నృత్య రంగం
దేశాల వాంఛిల్లు
ఆశాహృదయముల్లు
నేలొదలి పోలేని
శీతలతలాలలో
జీమూత పంక్తిపై
వ్యోమ వర్త్మముజొచ్చి-ఓ। సామి!
తమోనుద స్వచ్ఛమా ॥హిమాలయ॥

సర్వపథ జనకోట్లు
సాగి యాత్రార్థులై
జన్మలు పవిత్రమై
చవులొంద-స్నాతులగు
సంగమానికి చేరు
నీ కళ్ల తళత్తళలు
నీమాట పాటలు
నీ నవ్వు రసముల్లు
వేణిత్రయమా చు

నీ నుండి వెడలెరా
అది మహా సత్యమ్మ ॥హిమాలయ॥

శిల్ప సూత్రార్థాలు
తెల్పు సౌందర్యాలు
స్వల్పమై మూర్తిలో
దేశదేశాల-ఆశాంతాల
వెలిగిస్తూ
నీ బోసినవ్వులో
నీ సృష్టి వాక్కులో
నీ కన్ను జంటలో
రేకలు తిరుగుతూ మహాత్మా!
లోక మోహనమయ్యె
హిమాలయోత్తుంగ శృంగం-నీ బ్రదుకు
ఉమాపతీ నృత్య రంగం॥

—x—

# మహాత్ముడు

(చక్కబొట్ల సత్యనారాయణమూర్తి)

కట్టుకొన్నది యంగ వస్త్రము
పట్టుకున్నది రాట్న చక్రము
పట్టుమని పది మెతుకులైనా
పట్టకుండు కృశోదరముగల
గాంధి కంటెను సామ్యవాదులు
కలరె। లోకములో

ధనము తృణముగ దలచి మెలగుచు
మనము నందైచ్ఛిక దరిద్రము
ననుభవించుచు దేశ సేవకు
తను వొసంగిన ఘన చరిత్రుడు
గాంధి కంటెను సామ్యవాదులు
కలరె। లోకములో—

మఱచిపోయిన త్యాగమును, సో
దరుల కాచరణీయ మొనరించి
స్వరాజ్య పథమునందు నడిపెడు
భరత మాతృసుత ప్రవరుడగు
గాంధికంటెను సామ్యవాదులు
కలరె। లోకములో—

రక్తపాత మొకింతలేక, స్వ
శక్తినే బలినొసగు భారత
భక్తులను కోట్లుగ సృజించిన
యుక్తిమంతుడు శక్తిమంతుడు ॥గాంధి కంటెను॥

ఎవరు తప్పొనరించి యుండిన
నేమియును పల్లెత్తు పలుకడు
ఎవరి లోపములున్న తానే
యాతనల పాలై కృశించునె ॥గాంధి కంటెను॥

అర్ధ హీనపు మాటలాడడు
వ్యర్ధముగ కాలమ్ము గడుపడు
స్వార్ధమన నేమో యెఱుంగడు
నిర్ధనులలో నిర్ధనుండగు ॥గాంధి కంటెను॥

కార్మికులకే-కర్షకులకే
వర్తకులకే-భూపతులకే
వర్గపతిగా వ్యవహరింపడు
వరుస ముప్పదియైదు కోటులు
భారతీయుల ప్రాణమాతడు ॥గాంధి కంటెను॥

దేశమే తన శరీరంబని
దేశహితమే తనకు హితమని
లేశమైనను భేదమెంచని
భాసుర చరిత్రుడు మహాత్మా ॥గాంధి కంటెను॥

సహన శీలము గగన పారము
మోయునదియా-దేశభారము
విశ్వమంతయు శాంతి బడయగ
నహింసా సత్యప్రచారము ॥గాంధి కంటెను॥

భూషణములకు తోషమందడు
దూషణములకు రోషమందడు
దోషభయమును కప్పిపుచ్చడు
ద్వేషమందడు శత్రువులపై ॥గాంధి కంటెను॥

మలగిపోయిన పురుష కారము
కలగిపోవు మత ప్రభావము
నిలువబెట్టగ దలచి భారత, జ
నులను వడిపెడి నాయకాగ్రణి ॥గాంధి కంటెను॥

అన్నిటికి దా వెలిగ నుండును
అన్నిటను దా గలిసి యుండును
అన్నివిధముల మిన్నయనదగు
సన్నుత చరిత్రుడు మహాత్మా। గాంధి కంటెను సామ్యవాదులు
కలరె। లోకములో॥



# ఏడిరా ! నీగాంధీ

("కొండపల్లి")

ఏడిరా నీ గాంధి యెక్కడున్నాడు?
దాసుల హృదయాల దగిలి యున్నాడు॥
ఎక్కడకు పోయినా-డేమి చేశాడు
ఉప్పు పన్నట్టుకొని-ఊడ దీశాడు॥
కాలినడకను యేల-కదలిపోయాడు?
గ్రామ ఉద్యోగాలు-కడతేర్చుతాడు॥
పల్లెటూళ్లకు యేల-పయనమైనాడు
కల్లు దుకాణాలు-గంగతోస్తాడు   ॥ఏడిరా నీ గాంధీ॥



# గాంధీ మహాత్ముడు

(ఆ. సోమనాధరావు)

శాంతి సత్యము భక్తియను శస్త్రములను
దాల్చి యీశ్వరు నాజ్ఞ నౌదల ధరించి
ధర్మ పక్షముబూని, యుద్ధమ్మొనర్చు
ధన్య భారత వీర రత్నమ్ము। గాంధి॥

ధనలోభులను మహాదాతలుగా మార్చె
సీ మహాత్ముని జీవితామృతమ్ము
భోగుల నతిశయ త్యాగులుగా మార్చె
సీ మహాత్ముని జీవితామృతమ్ము
రాగుల సత్కర్మ యోగులుగా మార్చె
సీ మహాత్ముని జీవితామృతమ్ము
పాపుల ధర్మ స్వరూపులుగా మార్చె
సీ మహాత్ముని జీవితామృతమ్ము

పావనతరంగ గంగా ప్రవాహమట్టు
లే మహాత్ముని సజ్జీవితామృతమ్ము
శాంతి నెలుపుచు నున్నవో సర్వదిశల
నతడు సద్గుణకంధి మహాత్మా గాంధి॥



# మహాత్ముఁడు

(కందుకూరి రామభద్రరావు)

రక్తసిక్త ప్రపంచ సామ్రాజ్యమందు
శాంతి కలశముతో నహింసా పయస్సు
అడుగడుగు పంచుకొనుచు మహాత్ము డొకడు
ప్రాగ్దిశాంగణ భూముల బయలుదేరె.

బ్రహ్మతేజోవిభాస్వర ఫాలమందు
ప్రతిఫలించు వినిర్మలాంబర ప్రశాంతి
తరళ దరహాస చంద్రికా ధవళకాంతి
కంతరంగాన ప్రేమ దుగ్ధాబ్ధిపొందు.

అతడు మెట్టినమేర పుణ్యాశ్రమంబు
అతని వాక్కులు వేదభాష్యాంతరములు
అతని మౌనము లోకభయంకరమ్ము
అతడు పూనిన దీక్ష బ్రహ్మాండరక్ష.

భారత స్వాతంత్ర్య మందిరాభ్యంతరమున
సత్యదేవత తనకు సాక్షాత్కరింప
పసుపు కుంకుమ లద్దిన వడుకునూలు
పాణిబంధము ధరియించె పరమ మౌని.

అంత తొలుకారు మెరపులే యంతరిక్ష
మంత మంగళతోరణ మందగించె
అణువణువుగూడ పులకించి అవనియెల్ల
మురిపెములు గుల్కు శాద్వలాంబరము దాల్చె.

ఆలమందలు లేగలు పాలనురువు
సెలవులం జారద్రొక్కెడు చిందుతోడ
వడిగ దిరిగెడు రాటాల విడును పాట
పల్లె పడుచుల సిగ పూల పసుపుతేట

జీర్ణ పర్ణ కుటీర సంకీర్ణ దేశ
చిరనివాసిని దారిద్ర్య శిథిలవాణి
గగనవాణిగ మార్మ్రోగె కడల కడల
అతని సందర్శనోత్సుక మావహించి.

పేద గుండెల నెత్తురు పీల్చి పీల్చి
మారణాగ్నుల నుమియు నున్మత్తభయద
యంత్ర భూతము లాక్రందనార్తి కదలె
అతని యడుగుల సవ్వడి కదలిపోయి.

సాట్టహాస కోలాహల స్వనులు నిండు
మృత్యు కింకర బీభత్స మేళనముకె
నవ్య జీవితనాట్య విన్యాస రంగ
మంగళోత్సవ వైభవమంటపములు.

ఎరుకగల పురంధ్రులు హారతెత్తి నిలిచి
జీవకళికా సహస్రంబు చిందు హృదయ
పుటక ముష్ణశోణితలాక్ష పూసి నార
లతని యుపదేశ లక్ష్మిపదాబ్జయుగళి॥

(1940 అక్టోబరు భారతి)

●●●●●●●●●●

# ప్రబోధం

(జంపాల వేంకటనృసింహము)

అఖిల ప్రపంచమ్మ నధ్యాత్మ బలమున
నజ్ఞూత లూపిన యుజ్జ్వలుండు।
భారత స్వాతంత్ర్య భాగ్య సంసిద్ధి న
హింసఁ జేకూర్చిన హిత చరుండు।
తన శాంతి సందేశతతి ఖండఖండాంత
ర ప్రజఁ దీర్చిన ప్రాజ్ఞవరుఁడు।
మత సామరస్య సంతత పరిశ్రమమున
న ద్వితీయుండగు నమల గుణుడు।

బ్రతుకు లోక సంసేవ కంకితము సేసి
దీనజన బంధుడైన గాంధీ తపస్వి
ధర్మబోధా నురోధ తత్పరత నాత్మ
దేశ శాంతిఁ గూర్పుఁడి భారతీయులార.

卐

# గాంధీ గీతావళి

(వేల్లిపల్లి అప్పారావు)

సూర్యు నెన్నడు మున్ను చూడని జవరాండ్ర
బయటకు లాగె నెవ్వాని పలుకు
ధనికుల బీదల నెనజేసి జైళ్లకు
వేనవేల్ పంపె నెవ్వాని యాన
గౌర్నమెంటు దొరల గడ గడ లాడించె
మాననీయముగ నెవ్వాని వ్రతము
ఖండఖండాలలో గణనకెక్కె మహాత్మ
డౌనన వెలయు నెవ్వాని ప్రతిభ

అట్టి పరమర్షి గాంధిజీ యార్యభూమి
జననమందుటె మన భాగ్య మనగ జెల్లు
నితని పూర్ణాయురారోగ్యయుతుని జేసి
యిలను సర్వేశ్వరుండు రక్షించుగాక.

త్రికరణ శుద్ధిగా మెలగి దేవునియం దసమాన భక్తితో
ప్రకటిత శుద్ధ సత్త్వగుణ రాశియునై ఋజు మార్గవర్తియై
సకల జనానురాగ సువిశాల మహోజ్జ్వల మూర్తియై ప్రపం
చకమున శాంతిదూత యన జన్మము నొందెనటన్న వింతయే!

అరిషడ్వర్గముచే పరాజితుడు కాడ న్యాయ మార్గంబునన్
జొరనీయండు మనంబు, నాశ్రమములన్ జోడించి ధర్మార్థ మీ
తెరగంచున్ వసుధైక గేహియయి వర్తించున్ దపోసిద్ధమై
పరముం డీ ఘనయోగి పుంగవుడు సంభావింప హిందూప్రజన్.

పశుబల గర్వ ధూర్వహులు పశ్చిమవాసు లొకళ్లొకళ్ల భూ
వశ మొనరించుకొంటకు నపూర్వ రణక్రియ దూరి చచ్చుచో
నిశిత వచో విలాస సరణిన్ జగదేక హితోప దేశముల్
యశ మెసగంగ బల్కెడు మహామతి నీక లభించె బాపుజీ!

మతమున్ రాజ్యము నర్థ సంపదను ధర్మంబున్ విసర్జించి, భా
రత దేశీయులు మత్తులో బడినవారై యుండ మేల్కొల్పి వి
స్తృత సామ్రాజ్య రమాధురంధరధరాధీశోద్ధతిన్ నైతమున్
ధృతిమై డీకొన నేర్ప గల్గితివి, గాంధీ! శస్త్రముల్ లేకయే.

(కృష్ణాపత్రిక 13-4-'40)

# మహాత్ముఁడు

(దుగ్గిరాల వేంకటకృష్ణమూర్తి)

పొందగు తల్లి నోముల యపూర్వమహత్త్వమొ "తండ్రి" శ్రీకరం
బందు తపఃఫలంబొ, మఱి జన్మకు స్థానమునై చెలంగు బో
ర్బందరు పట్టణంబు తొలి వాముగ జేసిన పుణ్యమేమొ పొ
ల్పొందగ నుద్భవించితివి లోకవశీకర గాంధిధీవరా!

మోహనదాస, నీ యశమమోఘము, పార్యవరమ్ము నీ జగ
న్మోహన సచ్చరిత్ర, కవి మోక్షము గోరెడి వారికెల్ల నీ
'మోహన' యక్షరత్రయము ముక్తియొసంగెడిమంత్రమయ్య నా.
లో హితమార నిన్ దలతు, లోక వశీకర గాంధిధీవరా!

తాలిమితో ప్రసక్తి, జగదంబ యెడన్ గడుభక్తి, సత్యవా-
గ్జాలమునందు రక్తి, నిజగిణ్యతయందు విరక్తిగల్గి, భూ
పాలురకన్న మిన్నవయి భాసిలి, బాల్యవయస్సునన్ ప్రజా
లోలుడవైతి విద్ధరను, లోకవశీకర, గాంధిధీవరా!

పూనిన కార్యమున్ విడక పూత మనోగత దృష్టిచేత న
న్యూతన సొంపు పెంపు కడునొప్పగ విద్యను రాజకోట సం
స్థానమునందు నేర్చితివి, తావక కీర్తి నుతించు శక్తి నా
లో ననలెత్త నిన్ దలతు లోక వశీకర గాంధిధీవరా!



# గాంధీ మహాత్మా

(దుగ్గిరాల వేంకటకృష్ణమూర్తి)

లోకంబున నెయ్యెడ గల
లోకోత్తర పురుష మణులలో నెల్లను, నీ
వే, కన్నాకు వటందురు
గా కల కవిలోకమెల్ల గాంధి మహాత్మా!

వింతగద నీ చరిత్రము
శాంతమె కన్పించు నీదు చర్యలయందున్
శాంత నిశాంతా సర్వ ది
గంత నటత్కీర్తికాంత! గాంధిమహాత్మా!

కామ క్రోధంబులు నీ
సామీప్యముజేర గొంకు జంకుజూమీ, నీ
కా, మదమాత్సర్యంబులు
కామాది వికారదూర, గాంధిమహాత్మా!

నీ భాగ్యమేమి చెప్పుదు
లోభము మోహమును నిన్ను లోగొనవయ్యెన్
నీ భవము తరించెను, గం
గాభవ విభ నిర్మలాత్మ, గాంధిమహాత్మా!

సంగర హితుడవు కావని
సంగ రహితుడనుచుగాదె సాధుజనులు నీ
సంగతి గోరుదు రఘములు
కంగారగు విన్న విన్న గాంధిమహాత్మా!



# మహాత్మా గాంధీ

(సాదలి రామస్వామి)

రాట్న స్వనంబు స్వరాజ్య గానంబని
సతము రాట్నము ద్రిప్పు చతురుడీవు
ఖద్దరు ధారణ ఘనకౌశలంబని
ఖాదీ ప్రచార ప్రకాశకుడవు
మధుపాన నాశంబు మహిభాగ్యదంబని
మధుపిశాచిని ద్రోలు మహితుడీవు
హరిజనోద్ధరణమే హరిసేవయని సదా
యస్పృశ్యతను బాపు యధిపుడీవు

నీవు బోధించు సద్బోధ నీవె సల్పి
దేశ దారిద్ర్య దాస్య విదీర్ణములకు
త్రికరణంబుల శాంతి సంధిల్లి పోరు
మార్గదర్శకుడీవెగా మాకు గాంధి.

గురు కార్యదీక్ష సద్గుణు భగీరథు సాటి
నిష్కామకర్మ శ్రీనిలయు సాటి,
నీతి ధర్మంబుల సీతారమణుసాటి
అతిశయభక్తి ప్రహ్లాదుసాటి

రాజకీయంబున రహి ధర్మజునిసాటి
సత్యసంధత హరిశ్చంద్రుసాటి
శాంత్యహింసానిష్ఠ శాక్యమౌనికిసాటి
ఇడుమ సహించుటందేసు సాటి

సాత్వికంబున శంకరాచార్యసాటి
మహితబోధల గురు మహమ్మదుని సాటి
సాటి నీ కేరు గాంధి యీ జగతియందు
అందుకొనుము మహాత్మ! భక్తివందనమ్ము

శాంతి సత్యాగ్రహ సాధన బూర్ణ స్వ
రాజ్యము నాశించు రాజయోగి,
రాజ్యాంగ పద్ధతుల్ రహి న్యాయచట్ట సం
గతు లెల్లరకు దెల్పు కర్మయోగి,
కులరూప భేదముల్ తొలగింప జాతి యై
క్యత పెంపు గనగ సంస్కారయోగి,
దేశ సేవార్థమ్ము దేహమే యర్పించు
స్వార్థ రాహిత్య ప్రశాంతయోగి,

సర్వసంగ పరిత్యాగి, సౌమ్యయోగి
నిమ్నజాత్యుద్ధరణ వ్రతనియమయోగి
ఆత్మశక్తి ధురీణ మహాత్మయోగి
యోగులకు యోగి గాంధి మహోపయోగి.

స్వాతంత్ర్య రాజ్య సంస్థాపనంబున సౌఖ్య
మానందముల గూర్చు నధిపుడీవె.

'వార్ధ' విద్యా పరివర్తసంబున నిరు
ద్యోగ సమస్య ప్రోద్దోలు దీవె
భరతమాత యాపత్పయోధి తరించి
ధన్యత గను కర్ణధారుడీవె
స్థిరచరాస్తుల దేశసేవార్ధ మర్పించు
ధర్మాచరణ మహోదారుడీవె

నిరత మాతృసేవాభాగ్య నీతి నిపుణ
ప్రబల గౌరవాసక్త సంపన్నుడీవె
సరసమానసవర్తి ప్రశాంతుడీవె.

దక్షిణాఫ్రికను సోదర భారతీయుల
నుద్ధరించు నుదార బుద్ధిఘనత.
హిందూ ముసల్మానులందైక్యతను నిల్పు
మత రాజకీయ సమత్వసిద్ధి.
ఉప్పు సత్యాగ్రహోత్తుంగజ్జ్వలదీక్ష 'యి
ర్విను' యొడంబడిక ప్రవీణతయును.
దేశ దేశంబుల దివ్య మహాత్ముడీ
తండను కీర్తి యధ్యాత్మశక్తి
బీదవారల రక్షించు విశ్వప్రేమ
పరహితార్థ సత్కార్య నిర్వహణదీక్ష
నీ నిరాడంబరమునకు నీవె సాక్షి
సాక్షులిక నేల గాంధి 'సాష్టాంగ' మిదిగో.



# మన మహాత్ముఁడు

(దూత విశ్వనాథం)

చెడ్డ మిత్రునియొక్క చెలిమి బలిమిచేత
మాంసము తిన నెవడు మొదలుపెట్టె
కన్నతండ్రి చెంత కన్నీరు గార్చుచు
తప్పుచేసి యెవడు యొప్పుకొనియె.

దొంగచాటుగాను యెంగిలి బీడీలు
పొగను బీల్చ నెవడు పట్టుబట్టె,
వేశ్య గృహముకేగి వెఱ్ఱిగా జూడగా
తరుణిచేత నెవడు తరుమబడియె.

రంభ యనెడు దాది రామనామము జెప్ప
భయముపీడి ఎవడు బ్రతుకజొచ్చె
మందుగుండుచేత మరణించు సమయాన
రామ రామ యనుచు రాలె నెవడు,

హింస పథమొదలి యహింసచే నెవ్వడు
సత్యమార్గమందు సంచరించె
దేశమాతయొక్క దాస్యమ్ము బాపగా
తెల్లదొరల నెవడు తరిమివేసె

అట్టి "జాతి పిత"ను యెట్టుల మరతుము
బాపు ఋణము మనము బాపుకొనగ
దేశ సేవచేయ దాసులుగా మారి
త్యాగబుద్ధి గలిగి తరలుదాము.



# మహాత్మా గాంధీ

('కవిశేఖర' గరికిపాటిమల్లావధాని)

తన భాషణములు వేద ప్రతిద్వంద్వముల్
ధర్మ కర్మ ప్రబోధములుగాగ
తన మందహాస చంద్ర ప్రభాపూరముల్
సాదిత్వైన స్తమశ్ఛటలు గాగ
తన వృత్తము లనూన ధర్మ సంసక్తముల్
ధరణి కాదర్శభూతములుగాగ
తన యపాంగములు సంతత కృపోత్తుంగముల్
నలి దీన జన తర్పణములుగాగ

అతడు రాజన్యమాన్య విద్యాను బంధి
శాంతి సౌజన్య ముఖ గుణ సారకంధి
ప్రశస్తపరి పంథి మోహనదాస గాంధి
అఖిలజన మాన్యుడై కీర్తి నందుగాక।

బోధించుటకుమున్నె పూని యాచరణంబు
చేసి చూపెడు ధన్యశీలు డెవడు
సత్యధర్మ ప్రతిష్ఠాపనంబున నధ
ర్మం బంతమొందించు మాన్యు డెవడు

అకలంకమైన ప్రేమానుబంధమ్మున
శత్రుభావము మాన్ప జాలు నెవడు
అతుల ప్రపూర్ణ కష్టానుభవంబునం
దానందమును జూపు నలఘు డెవడు

నిష్కళంక నిరాపేక్ష నిర్మమత్వ
బుద్ధి లోకంబు శాసింపబూను నెవడు
అట్టి లోకైకపూజ్య మహాత్మగాంధి
ఆయురారోగ్య విజయమ్ము లందుగాక॥



# గాంధీ

(పురిపండా అప్పలస్వామి)

నేనూ నీ రణోన్మత్త
గానం విని పులకరించి
రణోన్మత్త రణడిండిమ
ధ్వానం విని జలదరించి
జలదరించి కలవళించి
రణభూమికి పరువెత్తాను.
పాషాణ ప్రాకారం
మంటి బురుజు కంచుకోట
నేనూ ఒక కేసరినై
లంఘించాను.
నీ శంఖం వినదిస్తే
నీ కను లాదేశిస్తే
నీ తర్జని గర్జిస్తే
నేనూ ఒక ప్రళయాన్నై
ప్రళయాన్నై విలయాన్నై
బలిపీఠ ప్రాంగణాన
నిలబడ్డాను.

నా తమ్ముళ్లు కూడులేక
నా తల్లులు గుడ్డలేక
గుడ్డలేక కూడులేక
కూలిలేక విలపిస్తే
విలపిస్తే దిక్కులేక
దిక్కులేని కుక్కలులా
కుక్కలులా మరణిస్తే
నీ హృదయం నవనీతం
నీ హృదయం కలతపోయి
నీ నాడులు కంపమెత్తి
నాకోసం
ఓహో నా సేనానీః
నాకోసం ఈ నా తల్లులకోసం
ఈ నా తమ్ముళ్లకోసం
నీ శంఖం పూరించీ
నీ అరదం నడిపించీ
రణ రణ రణ రణ రణ రణ
ఝణ ఝణ ఝణ ఝణం ఝణా
రణోత్సవం రణోన్మాదం
ముల్లోకం పెల్లగించి
పెల్లగించి కుళ్ళగించి
రథివై సారథివై ఈ
నా దేశం నడిపీథిని
నవతేజం స్వాతంత్ర్యం

నా తమ్ముల సట్టింటను
నవతేజం వెలిగించావు.
నీ రథ క్రేంకారావం
హ్రీంకారం హుంకారం
గణగణ గణగణ గణగణ
నీ రథ ఘంటారావం
ఇది అక్షయ తూణీరం
ఇది రాక్షస విధ్వంసం
ఓ ఖండన విజ్ఞానీ!
ఓ విప్లవ సేనానీ!
ఇది
యుగోదయం
ఇది
నవోదయం
ఇది
శుభోత్సవం
ఇది నా విశ్వం
ఇది నా దేశం
ఇది నా సంఘం
ఇదీ ఇదీ
నా కాంక్షిత స్వర్గం
ఇదే ఇదే
నా సఫలిత స్వప్నం
ఇతడు బాపుజి, బోసినవ్వుల తపస్వి
భారత మహాస్వతంత్ర రణాంగణమున
సర్వసేనాని, సత్యాగ్రహ ప్రణేత
సర్వ సర్వం సహాపరిత్రాణ కీర్తి॥



# ఎన్ని జన్మల పుణ్యాఫలమో

(మామునూరు నాగభూషణరావు)

ఎన్ని జన్మల పుణ్య ఫలమో
ఈ జన్మమున గాంధి నెరుగ గలిగితివి॥

చురుకు చూపులు నన్ను-పరుగు పెట్టించెరా
బోసి నవ్వులు నన్ను-చూసి కవ్వించెరా॥

దివ్యతేజుడు దేవ-దేవు డీ మహనీయు
డవతరించెను నన్ను అలరింపనెంచి॥

రవి అస్తమించని-రాజాధి రాజుల
రత్న సింహాసనము- రాలి భూమిపడగ॥

సత్యాయుధమ్ముచే-సర్వలోకాలను
హింసా ప్రవృత్తుల-నెదిరించు ధీరుని॥



# జగద్రక్షకుడు గాంధి మహాత్ముడు

(మంగిపూడి వెంకటశర్మ)

జగద్రక్షకుడు గాంధి మహాత్ముడు-జనులందఱు మీరెరుగండీ
జగతిని ధర్మము స్థాపన సేయగ-జన్మించిన హరి యతడండీ ॥జగ॥

హిందూదేశము నుద్ధరించుటకు-హిందువుడై జన్మించెన్
హిందూ సోదరులారా! మీరిది-డెందములోపల దలచండీ ॥జగ॥

స్వరాజ్య మర్మపు సంగతి నెఱిగిన-శాస్త్రజ్ఞుండి తడండీ
విరాన మీ రా మర్మపు సంగతి-విశదముగా నెరుగండీ ॥జగ॥

అసహాయోద్యమ మంత్రము ధరలో-ఆ మహనీయుడు బోధించెన్
అసహాయోద్యమ గురు పదమ్ములు-అంది ముందు నడువండి ॥జగ॥

రాజకీయ వ్యవహారములో దిగి-రాజయోగియై తా వెలసెన్
రాజులలో నిత డగ్రగణ్యుడని-రంజిలుచుండెను భువిలో ॥జగ॥

హేమాహేమీ లేమిసేయుటకు-యేమియు తోచక నుండి రహా,
ఏమీస్వామీ నీ మహత్త్వమని-హిందువులుండగసందడిగ॥ జగద్రక్షకుడు॥

—x—

# మహాత్మా గాంధి

*(మంగిపూడి వెంకటశర్మ)*

మహాత్మాగాంధి-దర్శనమె పావనము-కలుష హరము-కలుగు ముదము
॥మహాత్మా॥

పావనము సేయు ఆ నామము-మహాత్మాగాంధి॥
దుష్టుల పోదోలెను-శిష్టుల రక్షించెను
ఇష్టపడి మనజాతికై-బహు-కష్టముల పాలయ్యెను ॥మహాత్మా॥

కాంతా కనకముల్ వీడెను-శాంతము నెలకొల్పెను
పంతముగల వైరినైన-సంతసము వడిగై సేసెను ॥మహాత్మా॥

భూభారము దీర్ప కృష్ణుడు-పోరాటము కల్పించెను
సేవా పరము దీర్ప గాంధి-చే, రాటము సంధించెను ॥మహాత్మా॥

*(డాక్టరు మరంగంటి శేషాచార్యులు)*

ఉ॥ స్వస్తి జగన్మహాత్మునకు, భారతదేశ నవ ప్రవర్తక
వ్యస్త నవీనరాజ్య పరిపాలన మార్గ విలాస వృత్తికిన్
న్యస్త సమస్త నాగరిగ నాయక మస్తక సత్య సూక్తికిన్
విస్తులభక్తి సంభరిత నిశ్చలతన్ మనసార మ్రొక్కెదన్.



# ధన్యుడవోయి! మహాత్మా గాంధీ

(డాక్టరు మరంగంటి శేషాచార్యులు)

నీవె ధన్యుడవోయి! మహాత్మగాంధి ॥నీవె ధన్యుడవోయి॥

నీదు మతమే-లోక హితమూ
నీదు పలుకే-నిగమ సమమూ
నిరతిశయమౌ-నీ తపమ్మే
నిఖిల జగతి-నడుపు శక్తి ॥నీవె ధన్యుడవోయి॥

భారత భాగ్య విధాయివి నీవే
భారత జాతికి భాగ్యంబీవే
భావి భారత జీవితమీవే
పావన హరిజన-బంధుడవీవే ॥నీవె ధన్యుడవోయి॥

సీ॥ అతడటే మొన మొన్న హైందవవ్యథ బాప
నూరూర నవకాళి నోర్మి దిరిగె
అతడటే యిస్లాము-మతము వారల గావ
నుపవాస మీ ఢిల్లి నుపగమించె
అతడటే లాహోరు నతివల రక్షింప
సరియైన మార్గమ్ము చక్క-దిద్దె

అతడచే యీ భారతావని జీల్పంగ
సరికాదటన్న నిశ్చయము దెలిపె

గీ॥ ఎల్లకాలంబు నైక్యంబు నెదను నమ్మి
దేశహిత కార్యముల్ సరిదిద్ది తుదకు
స్వీయ రాజ్యాంగ సన్యాస జీవితమ్ము
గడపి ప్రాణమ్ము లొడ్డిన ఘనుడ తండు॥



# జయ గాంధీ

(గరికపాటి మల్లావధాని)

జయగాంధీ। గుణకంధీ। జయ్ జయ్ జయ్
జయ్‌జిత పరిపంధీ।-ప్రేమ పంథీ గాంధీ ॥జయ॥

సకల చరాచర సమహిత వర్తీ-ప్రకటిత శ్రమగుణశుభకరమూర్తీ
అకలంక ప్రతిభాసిత కీర్తీ-ప్రేమమూర్తి గాంధీ ॥జయ॥

దీనజన ప్రతిపాలన లోలా-దేశహితంకరణోన్నత శీలా।
దివ్యత్కటతట భాసితచేలా—ధీ విశాలా, గాంధీ ॥జయ॥

సత్యశౌచశాంతాశ్రమరూపా-సమధిక సాత్త్విక బల సందీపా।
సంహృత భారతసుత పరితాపా-సత్యాకోపా: భూపా ॥జయ॥



# మహాత్మా గాంధీ

(మంగిపూడి వెంకటశర్మ)

("పాలకడలి శయనరారా"—వలె)

మమ్ము బ్రోవ మహిని వెలసితివి-మహాత్మాగాంధి॥
మమ్ము బ్రోవ మహిని వెలసితివి॥

క్రూరులైన దోయరుల-ఘోర కష్టముల బడిన
భారతీయుల బాములుడిపితివి-వారందఱి మొరవిని।
భారతీయుల బాములుడిపితివి ॥మహాత్మాగాంధి॥

పంటలన్నియు మంటగలియగ-పన్నులీయగ లేని రైతుల
విన్నపమాలించి బ్రోచితివి-ఆ కైరా ప్రజల
విన్నపమాలించి బ్రోచితివి ॥మహాత్మా గాంధి॥

సహాయనిరాకరణదీక్ష-సాధనము బూని నీవు
బానిసత్వము బాప నెంచితివి-మా భరతదేశపు
బానిసత్వము బాప నెంచితివి ॥మహాత్మాగాంధి॥



## రమారమణా! గోవిందా!

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

రమారమణ, గోవిందా హరి, యని రండయ్యా జనులు
సమస్తమును గాంధీ మహాత్మునకు-సమర్పించి శమదమాఢ్యులై
॥శ్రీమద్॥

నరుండుగా నవతరించినాడల- నారాయణుడు నేడు
దురాపదల నంతరింపజేయు-స్వరాజ్య ఫలమిది తరింపజేయును॥
రమా॥

నిరాయుధిని, గాంధి రాజయోగిని-నిరీక్షించి చూచి
దురాగ్రహంలు బ్రిటీషు రాజయోధులై, మొరాయింపు మాని
రిదేమి చోద్యమో।రమా॥

నిరాయుధుడు, దుర్నిరీక్ష తేజుడు, ధురంధరుం డితడు।
స్వరాజ్యలక్ష్మిని బిరాన నిచ్చెద-సరే రండనుచు ఖరారుచేసెను॥
రమా॥

అహోరాత్రములు, మహామహంలు బహు। సహస్రములు వచ్చి
జోహారు చేయుచు
సహాయపడగ నసహాయ యోగమున, వహించి మెచ్చెను॥
శ్రీమ ద్రమారమణ గోవిందా హరి యని రండయ్యా జనులు.

—X—

# మా గాంధీ

(బసవరాజు)

క్రొల్లాయి గట్టితేనేమి? మాగాంధి
కోమటై పుట్టితేనేమి?
వెన్నపూస మనసు, కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై -బ్రహ్మతేజస్సు ॥కొల్లాయి॥

నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక
నాలుగు వేదాల నాణ్యమెరిగిన పిలక ॥క్రొల్లాయి॥

బోసి నోర్విప్పితే
ముత్యాల తొలకరే,
చిరునవ్వు నవ్వితే, వరహాల వర్షమే ॥కొల్లాయి॥

కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రహ్మఋషి
నేడు కోమటిబిడ్డకూడ-బ్రహ్మఋషాయె ॥క్రొల్లాయి॥

చకచక నడిస్తేను జగతి కంపించేను
పలుకు పలికితేను-బ్రహ్మవాక్కేను ॥కొల్లాయి॥



# శ్రీ గాంధీ
(ఓలేటి చిరంజీవిశర్మ)

ఆ పన్నులయిన ప్రజలం
గాపాడగ విశ్వకర్మ కరుణామతివై
దీపించెడి తనయంశము
నీ పుణ్యాకారమందు నిలిపెను గాంధీ.

భారత స్వాతంత్ర్యోత్సవ
చరితాత్మకభూరి' లవణ సత్యాగ్రహ' సం
గర శంఖమూది' దండీ'
పురయాత్రను నడుపు విధిని బూనవె గాంధీ!

మురళీ నాదము వినగా
పరువున పరుతెంచు గోప పౌరులు వోలెన్
భరత క్షెత్రతల వాసులు
విరివిగ నీ యాజ్ఞ నలుప వెడలిరి గాంధీ.

పురుషులు, పడతులు వేలుగ
చెరసాలల కేగినారు చెల్లించిరి పల్
జరిమానాలను వేలుగ
భరతావని, పెద్దజైలు వాటిగ, గాంధీ!

జననం 'పోర్బందరు'లో
తను పుడుగుట భరత రాజధాని పురం బం
దున, యమునాదరి, ముందిక
నిను(బోలు మహర్షి, పుట్టనేర్చునె గాంధీ.



# ఈ జన్మమింక దుర్లభమురా

("జనవరాజు")

ఈ జన్మమిక దుర్లభమురా।
ఏ జన్మ సుకృతమో। ఈనాడు బ్రతికుంటి ॥ఏ జన్మ॥

ఈశ్వరుడె గాంధిగా-ఇల నవతరించాడు
అందులో మముగన్న-హిందూమాతా కడుపున ॥ఈజన్మ॥

ధర్మదేవత మూర్తి-తాల్చింది గాంధిగా
కళ్లార మన మతని-గాంచిధన్యులమైతి ॥మీ జన్మ॥

భారత లక్ష్మికి-భాగ్య రేఖా గాంధి
అతడె మన నాయకుం-డాయె, నెంతటి భాగ్య ॥మీ జన్మ॥

ఈ శోభగను భాగ్య-మే నోము పంటయో
ఈ యజ్ఞములదాపు-ఏపుణ్యఫలమో॥ఈజన్మమిక దుర్లభమురా॥

# స్వరాజ్య శంఖము

("ఏడనున్నాడో" వలె)

(నెల్లూరు వెంకట్రామనాయుడు)

ఏడ నున్నాడో! శ్రీ గాంధీదేవు ॥దేడనున్నాడో!
ఏడనున్నాడో! ఆ జాడ తెలియరాదు
నాడు కెయిరా ప్రజల-కీడు బాపిన తండ్రి ॥ఏడ॥

పాంచాలపుత్రికల-పరిభవంబుల గాంచి
మించి వేదన, ననుభ-వించిన ఋషితుల్యు ॥దేడ॥

ముప్పది కోటుల-ముద్దు సోదరులకై
చెప్పరాని గతుల-జెందిన శాంతుడు ' ॥ఏడ॥

నెట్టాల ప్రజల యి-క్కట్టుల జూచి తా
కట్టుగట్టి, వారి-గాచిన, సోదరు ॥దేడ॥

హిందూ మహమ్మదీ-యులకు మైత్రిని గలిపి
పొందొనర్చిన, జగ-ద్వందితుడగు స్వామి ॥ఏడ॥



# మా బాపు - బాపూజీ

("బసవరాజు")

పోర్‌బందరు కోమటింటా-పుట్టినాడోయ్
పురుషోత్తముడు, జగతి-మెట్టినాడోయ్॥
క్రొత్తయేసు క్రీస్తు-అవతరించినాడోయ్
కొట్టక, పగవాళ్ల-పొగరు, దించినాడోయ్॥
హిందూపైగంబర్-జన్మించినాడోయ్
అల్లాహో అక్బరంటు-అరచినాడోయ్॥
చీమను సింహాసన-మెక్కించినాడోయ్
రాతి నాతి జేసిన శ్రీరాముడేనోయ్॥
ధర్మముకై ప్రాణ-పందె మొడ్డినాడోయ్
తాళలేక ప్రజలు-తలకిందైరోయ్॥
చేతులు పైకెత్తి-జే జే లనండోయ్
బాపూజీ, ప్రపంచపు-మా బాబానండోయ్ ॥పోర్‌బందరు॥



# గాంధీ ప్రభ

("బసవరాజు")

గాంధిమహాత్ముడు-బయలుదేరగా
కలకల నవ్వింది-జగత్తూ ॥కలకల నవ్వింది ॥గాంధి॥

గాంధి మహాత్ముడు-చక చక నడువగ
కంపించిపోయింది-భూదేవి-కంపించి పోయింది ॥గాంధి॥

గాంధిమహాత్ముడు-కన్ను విప్పగా
గడగడ వడికింది- అధర్మము-గడగడ వడికింది ॥గాంధి॥

గాంధిమహాత్ముడు-నవ్వు నవ్వగా
కన్నుల గట్టింది-స్వరాజ్యం। కన్నుల గట్టింది ॥గాంధి॥

గాంధి మహాత్ముడు-గొంతు విప్పగా
గణగణ మ్రోగింది-ప్రణవము-గణగణ మ్రోగింది ॥గాంధి॥

గాంధి మహాత్ముడు-స్వస్తి చెప్పగా
కరముల దొరికింది-మోక్షము-కరముల దొరికింది ॥గాంధి॥



# ఎంతవాడ-వెంతవాడవో!

(“కొండపల్లి”)

ఎంతవాడ। వెంతవాడవో! ఓ। గాంధిదేవ। నీ
వెంతవాడ వెంతవాడవో॥
ఎంతవాడవయ్యా నీవు—వంతల నెగజిమ్మినట్టి
శాంత ధర్మసూత్రములను-వింతగాను నిల్పినాడ ॥వెంత॥
ఆదిపరబ్రహ్మమూర్తివో! లేకుంటే నీవు।
ఆది నారాయణుండవో।
ఏది! యేది। త్రోవయనుచు వాదులాడు హిందువులను
మోదముగా త్రోవజూపి-సాదరముగ బ్రోచినాడ॥

వెంతవాడ వెంతవాడవో। ఓ। గాంధిదేవ॥



# మహాత్మాజీ

("గురజాడ")

మిన్ను విఱిగి యెంత మీదబడ్డ రవంత
కదలని యచల సంకల్పమూర్తి
కంఠమ్ము ఖండిచు కటిక కసాయిని
దాసోహమనిపించు దండి తపసి
ప్రాణ పరీక్షయందైనను, బాసాడి
తప్పని, నిత్య సత్యవ్రతుండు
చంపదగినయట్టి శాత్రవునైనను
క్షమియింపదగు నహింసా వ్రతుండు

ఎఱిగియో, యెఱుగకయో, తానెదిరిచేయు
దోసఁగులన్ విప్పి, శిక్ష నొందుచు దనంత
ధర్మముఁ బ్రతిష్ఠ జేసెడి కర్మయోగి
యైన గాంధీమహాత్మునే నభినుతింతు॥

చిరదాస్య బంధమ్ము ఛేదించి, జాతికి
దానమ్ము జేసిన దాత యతఁడు
కట్టబట్టలేని యట్టి జాతికి వస్త్ర
దానమ్ము జేసిన దాతయతఁడు

గతి మోక్ష మెఱుగని పతిత జాతికిఁ బ్రాణ
దానమ్ము జేసిన దాతయతఁడు
చెఱపుజేసి వెడలు పరజాతి కభయ ప్ర
దానమ్మొసంగిన దాతయతఁడు

ధారుణి నహింసయె పరధర్మమంచా
తాల్మి బోధించు జ్ఞాన ప్రదాతయతఁడు
పావనఖ్యాత ధాత్రి, మా భారతమాత
కన్న బంగారు తండ్రి, మా గాంధి తండ్రి
సన్నుతించెద భక్తి నంజలిఘటించి॥

బోసి నవ్వుల మంచి ముత్యాల నొలికించు
తాత, మన్నన గన్న నేత యితఁడు
ఒక్కఁడయ్యు జాతినొక్కటి పెట్టునలేవఁ
దీసిన యసమాన ధీరుఁడితడు
బక్క జిక్కియు తపః ప్రాభవంబున, శాంతి
స్థాపించు, ఘన తపఃశాలి యితడు।
తా మానవుండయ్యు, వ్యామోహమున్ ద్రెంచి
పరము సాధించిన ప్రాజ్ఞుఁ డితఁడు

ఇతఁడె జాతికి ప్రాణ, మింకితఁడె ధనము
బంధుఁడీతఁడె, సద్దయా సింధుఁడితఁడె
యితఁడు లేకున్న లేదు, భారత ధరిత్రి
యట్టి, గాంధిమహాత్ము నేనభినుతింతు॥

ఇతఁడా గాఁధిమహాత్ముఁడీతఁడటవే! యెన్నాళ్ల కెన్నాళ్లకో
గతియున్ మోక్షమెఱుఁగకే-పతితయై గాసిల్లు, నీ స్వీయభా
రత జాతిన్ గడునుద్ధరించిన, మహాప్రాజ్ఞుండటే! యితఁడే,
యితఁడంచు న్నుతియింత్రు నిన్ దలచి, తామింటింట మున్ముం
దికన్.



# మన పాలిభాగ్యమే మందు!

ఆనందభైరవి ఆటతాళం

("మంగిపూడి")

మన పాలి భాగ్యమేమందు! హిందూ!
మహమ్మదీయుల-మేల్వాందు ॥మనపాలి॥
ఘనతర ధైర్యము-కల్గించు నాధుడు
గాంధిమహాత్ముడు-కైదండ యయినాడు ॥మనపాలి॥
విజయమునకు పెన్ని-ధానము-నేడు-బెజవాడ జరుగు విధానము
గజిబిజి లేకుండ-క్రమముగా వర్ధిల్లి
నిజరాజ్య లాభము-నిక్కము-చేకూరు॥
॥మనపాలి భాగ్యమేమందు॥



# అంతా గాంధిమయం

"అంతా రామమయం" వలె

("దామోజి")

పల్లవి॥ అంతా గాంధిమయం-యీ జగ।మంతా। గాంధీమయం॥

అంతరంగమున-మహాత్మాగాంధియె

వింతరూపమున-వెలసియుండగ ॥అంతా॥

ఇండియాలో-ఇంగ్లాండులో

ఆఫ్రికాలో-అమెరికాలో ॥అంతా గాంధిమయం॥

॥యీ జగమంతా, గాంధిమయం॥



# అంతా గాంధిమయం

("దామరాజు")

పల్లవి॥ అంతాగాంధిమయం—యీ జగమంతా ॥గాంధిమయం॥

శాంతి చక్రమున-సత్యము నడుపుచు
సత్యాగ్రహమును-సాధనజేయుచు
సుంతయు వెఱువక-పంతము విడువక।
గంతులు వేసెడు-గాంధి మహాత్మ్యము ॥అంతా॥

ప్రభు శాసనములు-నిరాకరించుచు
అభయహస్తమున-అందఱి బిలుచుచు
స్వరాజ్య మిదుగో-స్వతంత్ర మిదుగో
రారండనుచును-దండిగ బిలిచే-

దంతా గాంధిమయం-యీ జగమంతా గాంధిమయం॥



# బలశాలి గాంధీ

("దామరాజు")

కత్తులులేవు. శూలమును. గాండివమున్ మొదలే హుళక్కి. నో
రెత్తి ప్రచండ వాక్పటిమనేనియు జాటడు. వైరి మీద దం
డెత్తగ సేనలేదు. బలహీనము కాయము. కోపతాపముల్
బొత్తిగసున్న. యట్టి వరమూర్తి. మహాబలశాలి గాంధి (జే
యెత్తి నమస్కరించి, స్మరియించుదమెప్డు స్వరాజ్య సిద్ధికై ॥

卐

# శ్రీ గాంధినామం-మరువాం-మరువాం

("దామరాజు")

శ్రీ గాంధినామం-మరువాం-మరువాం
సిద్ధము జైలుకు, వెరువాం-వెరువాం॥
కూడి భారతమాత-గొలుతాం-గొలుతాం
నేడే స్వరాజ్యాన్ని-తెస్తాం తెస్తాం ॥శ్రీ గాంధి॥

దేశభక్తులు, మాకు-సారాం సారాం
దేశద్రోహులు, మాకు, దూరాం, దూరాం
వర గాంధి మార్గాన్ని-వదలాం, వదలాం
వేరే మార్గాలన్ని-వదిలాం, వదిలాం, ॥శ్రీగాంధి॥

లాటీ దెబ్బలకేము-బెదరాం, బెదరాం
మేటితుపాకీకి-చెదరాం- చెదరాం॥

శ్రీ గాంధినామం-మరువాం, మరువాం॥



# ఏంతో రుచియైనది

హంసధ్వని రాగం - ఆదితాళం

("దామోజీ")

ఎంతో రుచియైనది-శ్రీ గాంధినామం
బెంతో రుచియైనది-శ్రీ గాంధి నామం।
పగతముగల వైరికైన-చింతనేగద। గాంధినామం॥

బాపు నామము-గాంధి నామము
చూపు జనులకు-సన్మార్గము-
ఆపు పశుబలము, దు-ర్మార్గము
అఖిల మత సమ్మోదము ॥ఎంతో రుచియైనది॥

---

# జీవితమంటే నీదే గాంధీ!

(నబ్బవీసు గురునాధరావు)

జీవితమంటే-నీదే గాంధీ! నీ వ్వా
జీవన్ముక్తుడవనగ-చను, కరుణాకంధీ ॥జీవిత॥

దక్షిణాఫ్రిక దొరలు-దాక్షిణ్య రహితులై
ఈ చెంప వాయింపా-ఆ చెంప చూపించు ॥జీవిత॥

గోక్లే మహాశయుని-గుడ్డ లుతగ నతడు
మంచి చాకలివనిన-మించి యుప్పొంగిన ॥జీవిత॥

అంటరాని తన-మంటె, కంటగించి
ఉపోషా-పవాసములు-సలిపి, సగమౌచున్న ॥జీవిత॥

భార్య ప్రసవించితే-పరుల నాసింపక
పరువు నష్టమనక-పురుడు బోసికొనిన ॥జీవిత॥

కలకత్తా కాంగ్రెసులో-నిలువ వసతులు లేమి
గని, పాకీపనిచేయు-డ నిన, యాపనిబూను ॥జీవిత॥



# ఎవరు దూషించితేనేమి!

(ఉప్పలపాటి వెంకయ్యగారు)

ఎవరు దూషించితేనేమి! మహాత్మ!
ఎవరు భూషించితేనేమి!
అవతార పురుషుడని-ఆదర్శ ప్రాయుడని
దశ దిశలు మార్మ్రోగి-ధన్యాత్ముఁడైనాడు।।ఎవరు।।
చూపు చూచాడంటే-సమ్మోహనాస్త్రము
కరము జాచాడంటే-కనకమయ వర్షమే ।।ఎవరు।।
అవ్యాజమగు ప్రేమ-అంతులేని ప్రేమ
కళ్లజంటానుండి-సుళ్లదిరుగుచు పారు ।।ఎవరు।।
పండంటి తలలోన-కొండంత యూహలు
ఎండిపోయిన తనువు-బండపగిలే పట్టు ।।ఎవరు।।
మంచుగడ్డవంటి-మచ్చలేని మనసు
సూర్యకిరణము వలెను-సూటి తప్పని నడత ।।ఎవరు।।
అతిమృదులమె గాక-అమిత బహిరంగము
ఆకాశమును బోలు-ఆ యంతరంగము ।।ఎవరు।।
రాల రువ్వెడివారి-పూల పూజించెడి
మానవాతీతుడే-మా, మహాత్మాగాంధి ।।ఎవరు।।



# గాంధీ!

(గొన్నాబత్తుల మల్లికార్జునరావు)

ఏ తపము జేసియున్నదో
యే తన్వికిఁ దోచనట్టి, యే యాగమమో।
పూః చరితయగు కస్తూ
ర్మాతకు లభ్యంబుగాఁగఁ బ్రబలిన గాంధీ॥

ఖద్దరు ప్రాణము, మనలకు
ఖద్దరు దాల్చిననుగల్గు కలుములు మనకున్
యుద్ధిర మార్గంబనుచును
తద్దయు బోధించినట్టి తపసే! గాంధీ!

ఎక్కడి హిందూదేశము
యెక్కడి ఖండాంతరమ్మి కేదిశఁ జూడన్
నిక్కము నీ స్మరణేగా
కెక్కడ వెదకినను యూహలే మనగాంధీ॥

వందేమాతర మనుచును
మందేరాజ్యం బటంచుఁ మరి మరి దలపన్
సందేహ మింతలేదని
ముందే, పురిగొల్పినట్టి, మోహనగాంధీ॥



# గాంధీ సర్వలోకప్రియా

(అంబటి లక్ష్మీనృసింహారావు)

శ్రీనాథాంశజుఁడంచు నిన్నెఱుఁగ, సాక్షీభూతమౌ శాంతమున్
నీ నైపుణ్యము, నీ మహామహిమలున్ నీ దేశ సేవా రతిన్
నీ నిత్యవ్రత సత్యశీలముల వర్ణింపంగ నాశక్తియౌ
నే? నాతోచినరీచి నెంచెదను! గాంధీ! సర్వలోకప్రియా!

లలితుఁడు లోకమాన్యుఁడు, తిలక్ గతియించెడువేళ, నీకు, నొ
దలను, స్వరాజ్య సాధన విధాన భరంబు, విధించిపోయె, నా
వల దినమాదినుండియు మహాపదలంబడి, చిక్కి సొక్కి, దు
ర్బలగతి నూలువోగున, స్వరాజ్యము నొందితివో! మహాత్ముఁడా॥

నిగ్రహమన్న నీయదె మునీశ్వర! భారత సేవజేయ స
త్యాగ్రహమున్ బదంపడి, సహాయ నిరాకరణోద్యమంబు, సా
మగ్రి, యహింస శాంతము, సమగ్రము నాటి కుచేలుబోలు నీ
విగ్రహమున్, ముఖప్రచారవిగ్రహమున్ దగునో! మహాత్ముఁడా॥

పుట్టితివయ్య ద్వేషమను బుద్ధిజనింపక, శాంతవృత్తిఁ జే
పట్టితివయ్య, యన్య జనపాలురయుక్తిగ నుండకుండ పో
గొట్టితివయ్య, దిట్టవయి, గుట్టునెఱింగియు, పట్టుబట్టి నీ
యట్టి మహానుభావుఁ డెవఁడయ్య! ధరాస్థలినో మహాత్ముఁడా॥

రామునిసాటియన్న, రణరంగ విపక్షహారుండతండు, పై
రామునిసాటియన్న, నృపరాజి వధైకకురారి, రేవతీ
రాముని సాటియన్న, మదిరా రసపానరతుండు, లోకమం
దేమనుజుండు సాటి కలఁడే। యిల నీకికనో। మహాత్ముఁడా॥

పరగన్ బుత్తలిబాయి నీ జనని, కాబాగాంధి నీతండ్రి; యి
ర్వురికిన్ బుత్రుఁడవై జనించితివి, తత్పుణ్యంబగణ్యంబుఁ, క
స్తురిబాయీ సతి నీకు భార్య, కరుణాశూరుండవౌ, పోరుబం
దరు నీ సుందర మందిరంబట! మహాత్మా! గాంధి। లోకప్రియా॥

కపటంబన్నది లేదు నీయెడల, నిక్కంబౌను, శుక్లాబ్ద భా
ద్రపద ద్వాదశి కృష్ణపక్ష శనివారంబందు జన్మించి, నా
వపు దేయేగ్రహ మట్టులుండెనొ! మహాత్మా! నా స్తియోగమ్మె లిం
త పటాటోపములెట్లు చేకూతె మహాత్మా, గాంధి! లోకప్రియా॥

వేడుల వేడులే! తలగిరీట మదొక్కటి లేదుగాని యీ
రేడు జగాల నొక్కటిగ నేలు సమర్థుఁడవయ్య! నూలు పో
గేడ! మహోపవాసగతులేడ! నిరాయుధమేడ! శాంతిఁ బో
రాడి బ్రిటీషు ముష్కరుల, నావల ద్రోచితివో, మహాత్ముఁడా॥

కత్తులులేవు, సైనిక నికాయములేదు, రథంబులశ్వముల్
మత్తకరుల్ హిళక్కి, యసమాన విమానములన్న సున్న, నీ
యెత్తు లభేద్యమై దగు జయించి, గ్రహించితివీ, స్వరాజ్యమున్
సత్తయనంగ, నీయదియె సత్తెము సత్తెమిలన్ మహాత్ముఁడా॥

ఖాదీ దుస్తులనే ధరించెదవు, మోకాల్ దాకునందాక, నే
యేదీవైన మతొండు లేదనగ నీవే దేశమందేగి స
మ్మోదీ భ్రాంతుల జేతువందటిని, సంపూర్ణాను రాగంబుతో
దేదీప్యంబగు నీముఖాంబుజము, గాంధీ। సర్వలోకప్రియా॥

కొందఱు బుద్ధదేవుఁడని కొందఱు క్రీస్తువిభుండటంచు, విన్
గొందఱు ధర్మమూర్తివని, కొంద ఱశోక నృపాలుడంచు, వే
కొందఱు కేవలంబుగ, ముకుందుని ప్రత్యవతారమంచు, ని
న్నందురు,నీ విధంబుగని,యందఱు సందియమా!మహాత్ముఁడా॥

దిన దినమున్ మదిన్ 'రఘుపతీ! జయరాఘవరాజ! రామ! పా
వనచరితా' యటంచును, స్తవంబొనరింతువు రామభక్తి పు
త్రునకును, 'రామదాస'ని నిరూఢి సమాఖ్య విధించినావు యం
త్య నిమిషమందు వీడవుకదా। హరిభక్తినో హో మహాత్ముఁడా।

ఢిల్లి, గుభిల్లుమంచు, తలడిల్లెను, శోకరవమ్ముచేత, ఘూ
ర్ణిల్లెను, గల్లిగల్లికి ననేకులు ఝల్లులు పిల్లలెల్ల దుః
ఖిల్లిరి, యిల్లు నిల్లనక కిల్లున పిల్లున లొల్లి బుట్టె నం
గళ్ళ నగళ్ళ గళ్ళన కొకళ్లు నొకళ్ల నకన్ మహాత్ముఁడా॥

'పావనమూర్తి' యో జనక' భారత భాగ్యవిధాత' నేత' బా
పూ' వరశాంతిదూత'! యని, ఘోర విషాద విచారసాగరాం
భోవరణంబులోఁ బడిరి, హా యని యేడ్పులు మిన్నుముట్టె, నీ
సేవ దొలంగ నేటికిని చేవలు మానిరిగా మహాత్ముఁడా ॥

'నూటాయిర్వది వత్సరాలు, భువియందున్ నిల్తు' నన్నట్టి, నీ
మాటల్ నమ్మగ వ్యర్థమాయె, గనిపింపన్ రావు మాకింక, నీ
గాటంబైన ప్రపంచ దుస్థితులు లోకంబెల్ల కల్లోలతన్
బాటం దుప్పట రోసిపోయితొ! మహాత్మా! గాంధి!లోకప్రియా॥



# గాంధీ మహాత్మా
("మల్లావధాని")

గాంధీ మహాత్మ! నీ ఘనతను దెలియంగ
కైరా ప్రజలున్నారులే! మహాత్మా, కైరా ప్రజలున్నారు లే!
ఘనమైన-పన్నుల-కష్టము తీర్చావులే
మహాత్మా! కష్టముతీర్చావులే!

దక్షిణాఫ్రికాలో! శిక్షలబడి, శిష్ట-రక్షణ చేశావులే!
మహాత్మా! శిష్టరక్షణ చేశావులే!
శిక్షలగొని ప్రతి-పక్షులను సామ-పక్షము ద్రిప్పావులే!!
మహాత్మా!! సామపక్షము ద్రిప్పావులే!

సత్యాగ్రహోద్యమ-స్థాపనా చార్యత్వ
సత్కీర్తి గొన్నావులే!
సత్కీర్తి గొన్నావులే!
మహాత్మా!
సత్కీర్తితో సర్వజనులు సమ్మోదింప
జయశాలి వైనావులే!
మహాత్మా! జయశాలివైనావులే!

అరివర్గమైన, నీ యనుప,మాహింసచే-ననుయాయులైనారులే!
మహాత్మా! అనుయాయులైనారులే!

అనుయాయులై, ని-న్నడుగులకు మడుగుల
నర్పించి గొల్చారులే ॥
మహాత్మా। నర్పించి గొల్చారులే।

భారతమాతకు- దాస్య-భారము నడగింప
బ్రభవించి యున్నావులే
మహాత్మా। ప్రభవించియున్నావులే॥
ప్రభవించుటేకాదు, ప్రబలి యుద్యమమును పాలించుచున్నావులే
మహాత్మా। పాలించుచున్నావులే॥

త్యాగములోగల తత్త్వమంతయు దెలిసి, ధన్యుఁడ వైనావులే।
మహాత్మా, ధన్యుఁడవైనావులే॥
త్యాగమును దెలిపి-భోగులనైన వి-రాగుల జేశావులే
మహాత్మా విరాగుల జేశావులే॥

డెబ్బదివేల ప్రజల। నబ్బురముగ జైళ్లకు।
గొబ్బున పంపావులే
మహాత్మా గొబ్బున పంపావులే॥
అబ్బబ్బ, నీ మహిమ, నలవియె కొనియాడ
నవతారపురుషడవులే
మహాత్మా! అవతారపురుషుడవులే॥

అల్ల బార్డోలిలో-యెల్ల ప్రజలు భూములిళ్ల విడిచేశారులే
మహాత్మా! ఇల్లువిడిచేశారులే॥
కల్లగాదువారి_పిల్లా జెల్లా నిన్నె-కమలాక్షుడన్నారులే।
మహాత్మా। కమలాక్షుడన్నారులే।।

బ్రహ్మచర్యము నెఱిగి, బ్రహ్మతేజస్సుతో-భాసిల్లుచున్నావులే,
మహాత్మా భాసిల్లుచున్నావులే॥
బ్రహ్మాదులకును స। బ్రహ్మచారివగుచు। ప్రతిభను గొన్నావులే।
మహాత్మా ప్రతిభను గొన్నావులే।।
హింసకు ప్రతిహింస హేయమంచును దెల్పి।
ధ్యేయుడవైనావులే। మహాత్మా। ధ్యేయుడవైనావులే॥
హింస నహింసచే ధ్వంసముజేసి, ప్రశంసనందావులే॥
మహాత్మా ప్రశంస నందావులే॥

రవి యస్తమింపని-రాజ్యము నొకరీతి రాజీకి దింపావులే।
మహాత్మా! రాజీకి దింపావులే॥
రాజీ పద్ధతిలో, స్వరాజ్య లక్ష్మినిబొంది రాజిల్ల నున్నావులే
మహాత్మా। రాజిల్లనున్నావులే॥



# మహాత్మా బుద్ధ
("మధునా పంతుల")

కడుపార నినుఁగన్న కపిలవస్తు పురంబు
పరిచితి 'పోరుబందరు' నకొసఁగి
తెలివి వెల్గుల వెల్లువలుగ యాపురినుండి
పాటించి, వార్ధాకు వన్నెబెట్టి
కుశపురంబు నడుజావళమైన గుండియల్
ఢిల్లిలో యంత్రపు గుళ్లకిచ్చి
మకుట బంధనమున క్రమ్మగిపోవని యగ్గి
యమునా ప్రవాహతీరమున నొగ్గి
యుగయుగంబులు గడచిన బొగులు బొడని
పగులు గనని, యహింసావరస్వ తంత్ర
ధర్మ చక్రముతో–భారత ప్రసిద్ధి
చాటిన మహాత్మ! ఓ నాటి నేటి బుద్ధ!

—X—

# బాపూజీ శాంతి గీతాలు

వాకిటఁగాపుండ బాణున కానాడు
ఫాలనేత్రుడు పట్టువడిన యట్లు
తను గట్టవచ్చిన తల్లికి నాడు, గో
పాలకృష్ణుడు పట్టువడిన యట్లు
పాకశాసనువైరి బ్రహ్మాస్త్రమునకు నా
వాయుపుత్రుడు పట్టువడినయట్లు
గ్రహచార వశమున గ్రహణకాలంబున
భానుబింబము పట్టువడినయట్లు

పట్టువడితీవు, నీకు లోపంబు గలదె?
ధన్యతముడవు, నీకు బంధమ్ము గలదె?
నిఖిల జనలోక సంబంధి! నిహతరంధి!
సాంద్ర ధీకంధి! శ్రీ కర్మచంద్ర గాంధి॥

నిజ దేశమున్ బ్రోవ నిహతుడౌ వీరుని
స్వర్గంబు దరిజేర్చు స్యందనంబు
దేశ సేవకుడయి తేజరిల్లిన పేద
కున్ మండనంబగు కుందనంబు

ప్రజల బిడ్డలరీతి భావించు నృపునకు
చర్చింపగా దివ్యచందనంబు
శత్రులంగూడి దేశద్రోహి యైనట్టి
హీనుని పాపాగ్ని కింధనమ్ము

సత్య సంధునకున్ హరిచందనంబు
న్యాయమార్గైక పరునకు, సందనంబు
ప్రజలు సద్భక్తి నర్పించు వందనంబు
సాంద్ర దీకంధి' శ్రీ కర్మచంద్రగాంధి.



# నవఖాళి
("గురజాడ")

అది ప్రళయోగ్రగదారుణ భయంకర దుస్సహ పాపచిత్తదు
ర్మదజను లేచి, హైందవుల రక్తము వెల్లువ జేసినట్టి, తా
వదె 'నవఖాళి' మండలము. యత్నముచే, నట శాంతి నిల్పగాఁ
గదలె, మహాత్ముఁడంత, నవఖాళికి, మారణకేళి భూమికిన్.

ఆక్రోశన

హైందవులైననేమిక, మహమ్మదు సంతతి యైననేమి, మే
మందర మొక్కటేకద' గృహమ్మున నీ కృపబుట్టి, పెర్గి యా
నందమునన్ జరించితిమెః నాడును నేడును, లేనియట్టి, యీ
చిందరవందరల్, కలుగుఁ నేతలిసీః యెటు దాపరించెనోః

అకటాః సోదరు లెప్డులేని, దిటు క్రోధావేశులై, ఘోర నా
రకమున్ జేసిరి, పుణ్య భారతము స్వార్ధంబెల్లఁ బ్రేరేప, నూ
రక నీ వుండుట పాడిగాదిక, జగద్రక్ష స్వదీక్ష స్వరూ
పకయై వెల్గిన తల్లి ః నీ కిదె, నమో వాకమ్ము లర్పించెదన్॥

ఒకనాడుం గలగంటిమేః యిటులనయ్యోః పర్వెగాఁగీర్తి చం
ద్రిక లాశాంతము, నేడధః పతితయై, నిర్వీర్యయైపోయెనేః
యకటాః భారతజాతి, శాత్రవుల దౌష్ట్యమ్మంతమున్ జేయ నో
పక సైరింతురొకోః పతివ్రతల శాపం బూరకే పోవునేః

బలహీనంబుగ దోచుమేను, మొలఁద్రిప్పంజాలు వస్త్రమ్ము, నా
మొలపైనన్ గడియార, మొప్పగు, నురమ్మున్ దాల్చెకే పాదర
క్షలు; చేఁగఱ్ఱయుఁ గళ్లజోడుగని సాగన్ వచ్చె నాజాను బా
హుల సమ్మోహనవిగ్రహుండు; కనుమోహో! బ్రహ్మతేజోనిధిన్.

వైరిగృహాల రాత్రుల నివాసము; వార లొసంగు పండ్లె, యా
హారము, చెట్టునీడల విహారము, వెన్నెల రాత్రులందు సం
చారము, లూర నూరను, బ్రచార మహింసగురించి, హైందవా
చారమునన్ మహాత్ముఁడు విచారము లేకయె యాత్రమై చనెన్.

భయము రవంత లేదు, యరివర్గమటన్న యశంకు లేదు, ని
శ్చయము లవంత పీడదు, ప్రశాంతముఖమ్మది మారబోదు, సం
శయమది లేనెలేదు, తన సాధనలన్ సడలింప లేదు, ని
ర్భయముగ, శాంతిదూతగఁ బురమ్ములు బల్లెలుఁ జొచ్చియేగెడిన్.

విడువడు విశ్వరక్షకుని ప్రేరణచే చనుచున్నమార్గ, మిం
కడుగడు దేశ సైనిక సహాయ మొసంగెదమన్నగూడ, లో
నుడుగడు శత్రువర్గ విలయోగ్ర పథంబును మార్చు యత్న, మిం
కడుగడుగున్ గదల్చు, నభయంబిడు హైదవ మానరక్షకై.

తమ ప్రాణంబులకంటె ప్రాణమయి, భద్రంబై మహాస్వర్గ ధా
మమునై రాజిలు విగ్రహాలను, మతోన్మాదుల్ కడున్ రేగి, ఘో
రముగాఁ ద్రుంచు నుదంతమున్ దెలుపఁ జేరన్ బోయి చూపించి, దుః
ఖమునన్ హైందవులా మహాత్ముదరి మూగన్ లేచి యాతండనున్.

ఏమహాదాత తరించె నిర్మించి, సం
తతి వృద్ధినొందగా దర తరముల

నే మహాశిల్పి రచించి, జీవించెనో
తరుగని దివ్య చిత్రకళ దిద్ది
యే మహాభక్తుల హృదయ తంతులు విచ్చి
స్రవియించె చైతన్య సారమెల్ల
నే మహాసతులు సుఖించి రైదువులుగా
మంగళాక్షతల సన్మహిమ నొంది

యెంతయెంతలుగా నిట నింతగాక
జరిగె కోలాహలముగ, నుత్సవము లెన్నొ
కటకటా! యిట్టి దివ్య విగ్రహము లిపుడు
మహిమ బ్రకటింప విదియేమొ! మాతృభూమి.

సంజ నొకనాడు, బయట వృక్షంపు నీడ
శాంతరస ముట్టిపడ, నహింసావ్రతుం, డు
పన్యసింపగా విని, యొక-బాలకుండు
కన్నుగవ నశ్రులొల్కగా గదల కచట
నిలచి, తలపోయఁ దొడగె, నంజలి ఘటించి॥

అతడు మహాత్ముఁ డాతని పదాబ్జము సోకినదీ పవిత్ర భా
రతమిట జన్మ కల్గుట, పురాకృత పుణ్య మతండు, నిర్మలా
మృతమయమూర్తి, యాతని యమేయదయామయదృష్టిసోకి జీ
విత మిల సార్థకంబనుచు, వింటిని, కంటిని,మంటి నిత్తఱిన్.

అట్టి మహాత్ము పాదరజ మౌదలఁ దాల్చి తరింతు నంచుఁ జే
పట్టి, మహాత్ముఁడా దినము పాద తలమ్మును మోపినట్టి, య
ప్పట్టున గల్గుమట్టి, బయి వస్త్రమునన్ బిగగట్టి, సంబరం
బుట్టిపడంగఁ బర్వున, గృహోన్ముఖుఁడై చని, బాలుఁ డిట్లనున్.

అమ్మ! మహాత్ముడంట! మన హైందవులన్ బ్రతికింపఁ బంపెదై
వమ్మటు, పాదచారియయి, పల్లియకుం జనుదెంచెఁ గాంచఁగా
రమ్మొక యింతయే, నిసుము రాలనటుల్ జనతా ప్రవాహముల్
క్రమ్మెగదమ్మ! తన్మహిమ గాంచఁగ, రాగదవమ్మ! వెంబడిన్.

అమ్మ! నిజమ్ము నమ్ముమ! మహాత్ముల పాదరజమ్ము సోకి, ప్రా
ణమ్ములఁ దాల్చి, మున్ను శిల, నాతిగమారె, శిలాసదృక్ష చి
త్తమ్ముల మార్చుటేమి యరుదా! యిదె! తెచ్చితి నమ్మరో! పవి
త్రమ్ము తదంఘ్రిధూళి, చిరపాపహరమ్ము. ధరింపు మౌదలన్.

అను నిజపుత్రుఁగౌగిటఁ బ్రియమ్మునఁ జేరిచి, తచ్ఛిరమ్ము, మూ
ర్కొని, హృదయమ్ము వ్రాఁగ పలుకున్ 'శుభమయ్యెఁ
గుమార!' యమ్మహా
త్ముని గను భాగ్యమబ్బె నని, పుత్రకుఁడిచ్చిన పాదధూళిఁ దా
ల్చెను శిరమందు నంతఁదరలెన్ మహితుండు మరొక్క పల్లెకున్॥

తను వెన్నాడుచు రా, నశేషజనమున్, దండోప తండమ్ముఁ బ్రా
ర్థనలన్ గాలము బుచ్చుచుండుఁ దులసీరామాయణంబొండె, గీ
తనో, కాదేని కురానో, బైబిలునో, యధ్యాయమొక్క,
గేయమొక్క, దో
గిన, భక్తిన్ వినుచున్, సదా వడుకుఁదక్లీ, లేక రాట్నంబునో.

హింసాది పాపభూయిష్ఠులు వార, ల
హింసాఽగమ పరమహంస యితఁడు
జలతారు జిలుగు వస్త్రధరులు వారలు
ధవళ కౌపీన సుందరుఁడితండు

మద్య మాంసాహార మత్తులు వారలు
సాత్త్వికాహార భోజనుఁడితండు
సాయుధ భీకర కాయులు వారలు
దీపిత శాంత స్వరూపుఁడితడు
తామసులువారలితడు సత్త్వస్వభావు
డజ్ఞులలవారలీతడు ప్రాజ్ఞతముఁడు
సత్య ధనుఁడీతఁడును, వారసత్యరతులు,
దైవ మితఁడేమొ; వారు తద్భృత్యులెరి.

కుత్తుక నుత్తరింపఁ దమకున్ మనసాడక, లోన బత్తి రే
కెత్త. మహాత్మ సన్నిధికి నేగి, తురుష్కులు, వే కటారులున్
గత్తులు ప్రోవువెట్టి పదకంజములన్ బడి, సైపుమంచుఁ జే
యెత్తి నమస్కరించి, నుతియించిరి గాంధిని నాత్మ బంధునిన్.



# విశ్వమానవ సందేశము

(యమునా కళ్యాణి ఆదితాళము)

పల్లవి: స్వతంత్ర భారత-పౌరుడ వౌరా!
స్వాతంత్ర్యము-నీ- సొమ్మేరా!
అను : స్వార్థ పరుడవై-సోదర హక్కుల
భంగపరుపకే-పాలింపుమురా ॥స్వతంత్ర॥

చరణములు

ఎత్తిన తల యిక-దించకురా-చే
యెత్తి బానిసగ-చరియింపకురా!
పొత్తుగలిగి, సో-దరులతో-సమ భా
గస్థుడనుచు, జా-గ్రత్తగ-మెలగర ॥స్వతంత్ర॥
స్వీయ పరిశ్రమ-చేతనె హాయిగ
జీవించుటె-ధర్మమురా।
హేయముగా, సోమరివై, పరులేదో
చేయుదురని-యా-శింపకురా ॥స్వతంత్ర॥
పరదాస్యంబది-పనికిరాదురా।
పరపీడన, యొక-బ్రతుకేరా?
పరుడు నేననుచు-భావింపకురా
ప్రతివాడును-స్వ-రాజ్య భాగిరా ॥స్వతంత్ర॥

బలహీనుండని-ధనహీనుండని
భావముచే-గ్గ్రుశి-యింపకురా!
బలవంతులకు-బల మీ వేరా!
తెలియర, నీవు, స్వ-శక్తుడ వనుచు॥ స్వతంత్ర॥

ధర్మకర్తవై-యాస్తులన్నిటిని
ధైర్యముగా, పా-లింపుమురా।
ధర్మాచరణమె-నీ స్వ-ధర్మమని
దండిగ చాటర-లోకమున॥ స్వతంత్ర॥

నీలో శక్తుల-మేలు కొల్పర
ఆలోచనలన్-శుద్ధుడవగురా
తాలిమిచే, సద్గుణముల బెంచర!
దైవత్వము, సా-క్షాత్క-రించునుర॥ స్వతంత్ర॥

విశ్వమానవుల-కాదేశంబిది
వినుపించెడి-శ్రీ-గాంధి
శాశ్వతమగు, శాం-తిని వెదజల్లగ
సకల ప్రపం-చంబందు॥

స్వతంత్ర భారత-పౌరుడ వౌరా।
స్వాతంత్ర్యము నీ-సొమ్మేరా॥



# విశ్వయోగీశ్వరా

(పాటిబండ మాధవశర్మ)

భువనమ్ముల్ కలగుండు వెందినవి బాపూజీ నిరాహార దీ
క్ష వహింపన్, సచరాచరమ్ము భరతక్ష్మాఖండమందెల్ల నీ
రవమై స్తబ్ధమునైన.యీ ప్రకృతి మూర్ఛల్వోయె, స్వర్భూభువ
ర్భువ భూభూతతి యెల్లడిల్లవడెఁ దత్ప్రాయోపవేశమ్ములో!

ఈ దాస్యమ్ము సహించి, కల్పములుగా, నీరీతి నెట్లో యశః
శ్రీ దారిద్ర్య మతర్పిత క్షుధమధః క్షిప్తమ్ము నే జన్మతో
నా దారింబడి యొడ్డు జేరెదముగాని, నీ నిరాహార దీ
క్షా దార్ఢ్యం బుపసంహరించుకొను మింకన్ విశ్వయోగీశ్వరా!



# స్మితవృద్ధు

(ఖండవల్లి లక్ష్మీరంజనం)

గుప్పెడు దేహంబు, కొండంత ధైర్యంబు
దౌర్బల్య బలముల దాల్చువాని
వైశ్య కులత్వంబు విత్త వైముఖ్యంబు
సహజ భూషణములై చాటువాని
గార్హస్థ్య ధర్మంబు కలిత పటుత్వంబు
నేకమార్గము చరియించువాని
దోషంబుపై నేవ దోషిపై ననుకంప
కారిన్య మృదువయి గ్రాలువాని
సత్య శస్త్రప్రభేద సంజనిత వేద
నం బహింసామృత విలేపనంబుచేత
మాన్పి, యేడుపుమొగమున మలయునవ్వు
కలుగజేసెడి వృద్ధుని కలియ రండు॥



# గాంధీ మహాత్ముఁడు
(ఉమర్ అలీషా)

పూజితమై దిగంతముల(బ్రోయ సహాయ విదూర చారు వి
భ్రాజిత పుణ్య మార్గము, స్వరాజ్యరథంబున గాంధి యెక్కి రం
డో జనులార! యంచును, సముజ్జ్వల శైలినిబిల్చుచుండె, మీ
రా జనకున్ మహాత్మకుని వెంట పదండి కరంబు మేలగున్.

హిందూముసల్మానులు, లేకమైనారన్న
గాంధీ మహాత్ముని కతన గాదె?
మద్య మాంసముల మెక్క మానివేసిరటన్న
గాంధీ మహాత్ముని కతన గాదె?
అన్య దేశపు బట్టలంట మానిరటన్న
గాంధీ మహాత్ముని కతన గాదె?
దాస్య శృంఖల (ద్రెంచి, తల్లి గాచిరటన్న
గాంధీ మహాత్ముని కతన గాదె?

సత్యమున జయంబు, శాంతి జగంబున
సర్వసోదరత్వ సౌహృదంబు
సర్వతోముఖముగ బర్వి వర్ధిలెనన్న
కర్మచంద్రగాంధి కతన గాదె!



# బోసినవ్వుల బాపూజీ

(దొప్పలపూడి అనసూయాదేవి)

రత్నద్యుతులతో విరాజిల్లు మకుటముల్
తలదాల్చు చక్రవర్తులకు లేదు
జప తపోధ్యానముల్ విపరీతముగ జేసి
యున్నట్టి మౌనివర్యులకు లేదు
పలు భాషలన్ నేర్చి పల్కుచుండెడి యుప
న్యాసకర్తల ధాటియందు లేదు
శిక్షణంబుగ నేర్చి చేతి పరిశ్రమల్
ప్రజ్ఞగాంచిన శిల్పి ప్రజకు లేదు
ఇన్ని పదవులలో మెప్పుగన్న నీదు
ఆత్మ శక్తిని వర్ణింప నలవియగునె
బోసినవ్వుల బాపుజీ-పోల్చలేను
నీ విరాడంబరత్వమ్ము-నీకె చెల్లు॥



# మహాత్మా

("దాశరథి")

పాల సముద్రమే నడచి వచ్చిన రీతి, హిమాచలాగ్ర శృం
గాలు, కరాలుసాచి మనకై యరుదెంచిన భాతి, శాంతి స
త్యాలు మనుష్యరూపమును దాలిచి నేలకు దిగ్గినట్లు, గాం
ధీ లలితాత్ముఁ డుజ్జ్వల మతిన్ భరతావనిపైన కాలిడెన్.
కత్తిలేక దురాత్మ కుత్తుకల్ నరికెడి
నీ నేర్పు లే వీరునికి లభించు?
ఉపవాస వహ్నిచే యపకారి గుండెల
బూది చేయుట లన్యపురుషు తరమె?
తీయని యొకమాటచే, యావ దవనిని
చేపట్టు టెవ్వని చేతనగును?
గుడిసెలో కూర్చుండి గుడిలోని దేవుని
మహిమల మించుటే మనిషి వశము.

దుర్బలుడవయ్యు నెంతటి దోర్బలమ్మొ
పేదవై కూడ నెంతటి పెద్దతనము
ముదుసలివె యయ్యు నెంతటి కదన పటిమ
తాతవయ్యును మా కెల్లనేతవోయి.

బుద్ధుడవో! సకల తప
స్సిద్ధుడవో! శంకరుడవొ! శ్రీవిష్ణువవో,
వృద్ధుడవో! యువకుడవో!
సిద్ధాంతింపగ నీకెచెల్లు, మహాత్మా!

# మహాత్ముడు
(రామచంద్రశాస్త్రి)

సత్యాహింసలు శస్త్రాస్త్రమ్ములు
శమదమములు కవచమ్మును, డాలును
శ్రమ సహన మ్మనుపమమౌ శక్తి
శాంత వచనమే రణదుందుభి,
ఓ క్రాంతదర్శి ! నీ రణరంగమ్మున
చిత్రమైన నీ నిర్వచనమ్ములు
సత్యాన్వేషీ ! గాంధిమహాత్మా॥
ఉప్పుకల్లు ఘన విజయసాధనము
తప్పు నొప్పుకొనుటయ రణనీతి
యొప్పానరించుట శక్త్యార్జనము
ముప్పుతిప్పలై తోచెను చల్లగ
తప్పుకొనిరి, పాలకులు తమంతట
నిక్కడిదౌ–ధరమ్మో–నీదయ్యా !
మిక్కిలి నేర్పు ఘటించితివయ్యా !

ఘనమైనది నీ స్వదేశి దీక్ష
ధనము నీకు బ్రహ్మచర్య రక్ష
శాంతి తేజమున క్రాంతి దర్శనము
ఆర్ష ధర్మ యుక్తము, చిరసత్యము
నిజ జీవనమున నిరూపించితివి
దేశదాస్య తమ నిర్మూలక ! స్వా
తంత్ర్య ప్రదాతా ! గాంధిమహాత్మా !
రాట్నె చక్రమిల ధర్మ చక్రమై
రాణ వహించుట గననయ్యేడి, నీ
తను, మనములు బలియైనవి ప్రజకై
అనువౌనా ? దేశ శాంతి రక్షణ ?
వినయాంజలి గైకొనుము మహాత్మా !
అనవతరము శాంతి, పథము జూపుము
విశ్వశాంతి కాంక్షిత చరితా ! ఓ
సత్యాన్వేషీ ! గాంధిమహాత్మ ॥



# అసహాయోద్యమము

# ఉద్బోధన

# బహిష్కరణము

# స్వరాజ్య సమస్య

(బలిజేపల్లి లక్ష్మీకాంతకవి)

మ॥ తటి, గాంధీయుగ మేగుదెంచె, నిక, నేతద్భారతీయ స్వరా
జ్య రథం, బాతని సారథిత్వమున వే సాగించుడంచున్, జగ
ద్గురు డేగెన్ దివిలోకమాన్యుఁడవెయుద్ఘోషించెదూర్య ధ్వనుల్
ఉరు తద్దివ్యరథంబు లాగుటకు, రండోః భారతీయ ప్రజల్॥

మ॥ తరణోపాయము భారతీయునకు, నేత ద్భారతీయ స్వరా
జ్యరథం బూనుటగా కితఃపరము లే దాబాల గోపాల మం
దటికీ కార్య ధురంధరత్వము తగున్ దచ్చక్ర సంఘట్టనం
త్వరకున్ జచ్చిన నిల్చినన్ దొరకు జీవన్ముక్తి భక్తాళికిన్॥

సీ॥ పాంచాలికా పరాభవ సంభవంబైన
యాగ్రహమ్ము ప్రతిష్ఠితాగ్ని గాగ
ఆలీ సహోదరుల్ లాలా పటేలాది
దేశ బాంధవులు ఋత్విజులు గాగ
ఆసేతు శీతాచలాంతరస్థంబు భా
రత జాతి హోతృ వర్గంబు గాగ
ధర్మ సంస్థాపనార్థం బుద్ధరించు గాం
ధీమహర్షి యె,యుపదేష్ట గాగ

గీ॥ పటుతరాఒ ధర్మమే యిందుఁ బశువు గాగ
కాల పురుషుడె యాజిగాఁగదగు నీ మ
హాధ్వరమునకు నలుపుడో! యార్యులార!
యాగసామగ్రి కొఱకు, నాత్మార్పణంబు॥

సీ॥ పాంచాల దేశీయ భక్త హంతకులైన
చెడుగు ధూర్తులను శిక్షించువరకు
ఇస్లాం సహోదరాభీష్టానుగుణముగా
నిల ఖిలాఫతు నిర్ణయించువరకు
దేశీయ గౌరవాదేశ నాశకమైన
ఘోర రౌలటుచట్ట మారువరకు
జాతీయతా బహిష్కార సూత్రతములో
చిలిపి చట్టములు నశించువరకు

సీ॥ ఇవియు నవియని లెక్కింపనేల మనకు
ధన్య సంపూర్ణ నిర్నిరోధ స్వరాజ్య
పీఠికాను ప్రతిష్ఠ లభించు వఱకు
తగునె నిద్రింప భారత పుత్రకున కిపుడు॥

మ॥ పనిలేదాయుధముల్ శతఘ్నికల సంభావ్యంబులో మారణా
ప్రణిధానంబులు రాక్షసార్హములు తత్పాశ్చాత్యపుం జాతి శే
చను నేలా! మన కా పశుక్రియ లహింసా ధర్మ సంబద్ధ మౌ
మన యాధ్యాత్మిక శక్తియే భువి నధర్మం బెల్ల మాయించెడిన్॥

మ॥ హరిదంతంబుల ప్రాకి! బంధురతరంబౌ భారతీయ ప్రజా
పరమోత్సాహి మరుత్తరంగ వలయ ప్రాతంబులై దాటి సా
గరముల్ ఘోరున మ్రోగుచున్నవవిగో! ఖండాంతర క్షోణులం
దరి కర్ణ జ్వరకారి గాంధి విజయోద్యద్భేరి భాంకారముల్॥

卐

# మాకొద్దీ తెల్ల దొరతనము

(గరిమెళ్ల సత్యనారాయణ)

పల్లవి: మా కొద్దీ తెల్ల దొరతనము దేవ
మా కొద్దీ తెల్ల దొరతనము॥

అనుపల్లవి : మా ప్రాణాలపై పొంచి-మానాలు హరింయిచె॥మాకొద్దీ॥

చరణములు

పన్నెండు దేశాలు-పండుచున్నాగాని-పట్టెడన్నమె లోప మండి।
ఉప్పు। ముట్టుకుంటే దోషమండి।
నోట। మట్టికొట్టి పోతాడండి।
అయ్యో। కుక్క-లతో పోరాడి-కూడు తింటామండీ ॥మాకొద్దీ॥

వర్తకంబునకొచ్చి-పట్టణంబుల పట్టి-రాజ్యమొక్కటి అల్లినాడు।
దాన్ని। రాణి కప్పగించినాడు।
రాణి। వస్త్రమ్ము చించేసినాడు।
ఈ చిత్రమిదేమన్న-శిక్షిస్తానంటాడు ॥మాకొద్దీ॥

కోట్టులంటూపెట్టి-పార్టీలు పుట్టించి-స్నేహభావము చంపినాడు।
ద్రవ్య। దాహము కల్పించినాడు।
చెడ్డ। యూహలు కడు పెంచినాడు
మా। ఆహారములద్రుంచి-ఆహా। యనిపించాడు ॥మాకొద్దీ॥

ప్రజల క్షేమంకోసం-పెట్టిన సంస్థల-ప్రభులకోసం-మార్చేస్తాడు
వాటి। ప్రజల శత్రులు చేసుతాడు।
మమ్మ। గజిబిజి లాడ చేస్తాడు
వాడి। గడబిడ వర్ణింప-కాదు బ్రహ్మకైన ॥మాకొద్దీ॥

నూటనలుబదినాల్గు-నోటికి తగిలించి-మాటలాడ వద్దంటాడు।
మమ్మ। పాటపాడ వద్దంటాడు।
తనను। దాటివెళ్ల వద్దంటాడు।
అయ్యో! చేటు తెచ్చుకొ మమ్మ-చెడిపోవ మంటాడు
॥మాకొద్దీ॥

ఘోరశాసనాలు-కూడదీసి మాదు-సారములెల్ల పీల్చాడు।
సం।సారములెల్ల కూల్చాడు।
మా.చీరలనెల్ల వొల్చాడు।
బం।గారములెల్ల దోచాడు।
వాడు। ధనవంతులనుబట్టి (తైతక్క-లాడ్తాడు) దడదడ లాడ్తాడు
॥మాకొద్దీ॥

ధనముకోసం వాడు దారిచేసికొని-కల్లుసారా యమ్ముతాడు।
మాదు। ముల్లెమూటలు దోచినాడు।
ఆలి। మెళ్లో పుస్తెలు త్రెంచినాడు।
మాదు। కళ్లల్లో దుమ్మేసి-కాటికి దరిచేస్తాడు ॥మాకొద్దీ॥

పంటపోయినగాని-పన్నులు విడువక-వెంట కరణాలంపుతాడు।
వారి। వెంట తహశీల్దార్నంపుతాడు।
లే। కుంటే ఉద్యోగం తీస్తాడు।
మా ఇంటిలోపల యిట్లు-యిడుమల్లు పెడుతాడు ॥మాకొద్దీ॥

ఏడాది కేడాది-కెక్కువ సిస్తేసి-ఈ భూమి నాదే నన్నాడు।
మమ్మ కూలికి దున్న మన్నాడు।
కడుపు మంటతో చావ మన్నాడు
అయ్యొ బానిసలకు వాడు-ప్రభువౌతనన్నాడు ॥మాకొద్దీ॥

స్వరాజ్య మందిర-స్థాపితమైనట్టి-జండాలన్నియు పీకుతాడు।
దేశం ముండామొయ్య మంటాడు।
వాడు। బండతనము చూపుతాడు।
ఈ ఛండాలపువృత్తి-స్వీకరించెను నేడు ॥మాకొద్దీ॥

దండు పట్టుకవచ్చి-తగుదు నమ్మాయంచు దార్ల వెంబడి
త్రిప్పుతాడు।
జాక్ జెండా మీదికెత్తుతాడు।
దానికి దండం పెట్టమంటాడు
వాడి గుండుబలం క్రింద-కూల రమ్మంటాడు ॥మాకొద్దీ॥

కయ్యానికి ముందు-కాలు ద్రవ్వి వెనుక-దయ్యమై మము
మ్రింగుతాడు।
మాదు నెయ్యము చెడగొట్టుతాడు
నేన కయ్యొ పాపము గట్టుతాడు
అయ్యొ వెయ్యేల' పోలీసు విధులు-మరిపిస్తాడు ॥మాకొద్దీ॥

గాంధీటోపీ పెట్టి-పాఠశాలకుబోవ-రావద్దు రావద్దంటాడు।
రాట్నం బడిలో పెట్ట వద్దంటాడు।
టోపీ తీసి పీపుల బాదుతాడు।
వాడి రాజద్రోహామంత-రాట్నములో ఉన్నదట ॥మాకొద్దీ॥

నూరుమంది, మలబారు వాసులను-కూరినాడొక-పెట్టెలోన।
నోట నీరు పోయడు, దేవు నాన।
గాలి దూరనీయడించుకైన।
వాడి దారుణత్వమెట్లు-తరిమివైతువా దేవ ॥మాకొద్దీ॥

ప్రభువు గాంధితోడ-భారత దేశమాత-పరమ తపము చేసినాది।
ధర్మదేవత ప్రత్యక్షమైనాది।
కోరిన వరము లిస్తా నన్నాది।
ఆ దొరల గుండెలలోన-దడదడ పుట్టింది ॥మాకొద్దీ॥

చూడియావులకడుపు-వేడివేడి మాంసం-వాడికి బహు యిష్టమంట
మాదు పాడి పశువుల కోస్తాడంట।
మా మతము పాడు చేస్తాడంట।
మా చూడి యావులమంద-సురిగి, యింటికి రాదు ॥మాకొద్దీ॥

చిత్తరంజనదాసు-చిన్నారు కొమరుని-చెయి విరచి చెర బెట్టినాడు
అతని పెత్తనంబును బట్టినాడు।
వారి ముత్తైదువుల పట్టినాడు।
వాడి సొత్తుకు నిలమీద-చోటు లేదన్నాడు ॥మాకొద్దీ॥

మా చీరాలను యిప్పు-చేరినాడు-చూచి సిగ్గునుపొందబోడోయి।
ఇంక బీరాలు పలుకుతాడోయి।
మాదు సారము గ్రహియింపడోయి।
వాడి దూరాలోచనమెల్ల-ధూళిలో కలిసింది ॥మాకొద్దీ॥

వాడి తాతగారిముల్లె దాచిపెట్టినయట్లు-ధాటి చేస్తా డీదేశమున।
పో రాడా మాడ్తాడాపైన,
మో మోటము పడడు సుంతైనా।
వాడి పాటుపాడై పోను-మాట చెపితే వినడు ॥మాకొద్దీ॥

తెల్లదొరలసేవ-వల్ల బ్రతుకుట పెద్ద నల్లని మచ్చని
యెంచరోయి।
జాతి కెల్లా తప్పని యెంచరోయి
దైవ మొల్లడంచు తల్చరోయి।
భూమి తల్లి యేడ్పులు వినరోయి।
వారి యుల్లమెల్ల-సన్ని కల్లులై పోయాయి। ॥మాకొద్దీ॥

ఎవరి యనుమతిపైన-హిందూ దేశమునందు పరిపాలనము
పెట్టినాడు।
వీడు ఎవరికి జవాబు నీడు।
ధర్మ మార్గము నంటుకొని పోడు।
వీడి దారుణత్వముకింక తగిన యీాడేలేదు ॥మాకొద్దీ॥

వాడి శాసనాలు-మాడిపోను, వాటి గోడియె, మాకొద్దు తండ్రి।
ధర్మ దేవుడె మా రక్షసుండి।
ప్రజల ప్రేమయె మాకు దిక్కుండి
కష్ట కాండమె మా పాలు నుండి
ఈ సృష్టి మమ్ము చూచి-సుందరమన నిండి ॥మాకొద్దీ॥

దొరల బాధలు మాకు-తొలగించుమో తండ్రి నిరతము నిను
గొల్తుమయ్యా।
నీదు చరణధ్యానమె విడువమయ్యా।
మేము మరువము మా ధర్మమయ్యా।
మేము ఐకమత్యముతోడ అలరారుతామయ్యా ॥మాకొద్దీ॥

గుండు పట్టుకొ మమ్ము-కూల్చ వచ్చినగాని-కూర్చున్న చోటుల
విడము।
పాడు కొంటూ రాట్నం త్రిప్పుతాము
రాజ్య సూత్రము వడి, వడుకుతాము।
దేవ శాంతిని తప్పము-సంతసం విడువము ॥మాకొద్దీ॥

దేశభక్తులనెల్ల దోషు లంచును పెద్ద-మోసగ్రాండని యెంచు
తాడు।
శాంతి నాశకులని పిలుచుతాడు।
దొంగల తో సరిగ మము చూచుతాడు।
వాడి వూసు యెట్టిదో కాని-చూచి యోర్వలేడు ॥మాకొద్దీ॥

బ్రాహ్మణా బ్రాహ్మణ-పంచమబ్రాహ్మణ-భేదపు తెగలుమీకేల।
మీ భేదాలు వడి-కాల్చరేల।
చెడ్డ బోధలకు లొంగిరేల।
యీ మాధు కరపు వృత్తి-మరగినారదియేల ॥మాకొద్దీ॥

ఎవరెన్ని చెప్పిన హిందూదేశవాసు-లేక సోదరులె సుండీ
అంటూ దోషము మాకు లేదండీ
పాప మంటూ చాటుదామురండీ
ఈ కుంటివాదనలు-గూటిలో పెట్టండి ॥మాకొద్దీ॥

స్నానధ్యానము చేసి-రామకృష్ణయంచు-దేవుడి గుడిలోకి రండీ
అభిషేకమతనికి చేయండి
నిర్మలత్వ మాత్మను పొందండి
ధర్మ మార్గమును తగిలి, మాలలురండి ॥మాకొద్దీ॥

జయము నపజయమును-త్రాసులోపలబెట్టి-చక్కగ తూస్తామంటారు
ధర్మమె జయమని నమ్మతారు
దైవ నైజము గుర్తెరుగలేరు
పప్పు భోజనం కోసము-పుట్టామనుకొంటారు ॥మాకొద్దీ॥

రాట్నలక్ష్మినవ్వు-రంజిల్లుమోముతో-పాడుచున్నది నోటినిండా
కళవు మాడుచున్నది దాని యెండా
స్వేచ్ఛ తిరుగుచున్నది దానిగుండా
ఆ దొరల తేజంబెల్ల-తూల్చె జెండా యుండా ॥మాకొద్దీ॥

ఎన్ని జన్మములందు-ఏమి నేరము చేసి-కన్నుగానక తిరిగినామొ
ప్రజల అన్నమెల్లను క్రుమ్మినామొ
దైత్యుల కన్న చెడ్డగ మెలగినామొ
నేడు దున్నలవలె నిట్లు-దొరకితిమి దొరలకు ॥మాకొద్దీ

ప్రాపంచమెల్లను-పట్టి పిండేటంత పశుబలము వాడికుందంట
దాన వశ పరచుతాడు మమ్మంట
మమ్ము కసిదీర కొట్టుతాడంట
వాడి శషభిషలెల్లను చెపుతాడు మా యింట ॥మాకొద్దీ॥

స్వచ్ఛతేజముతోడ-స్వేచ్ఛావధూమణి- కారాగృహామున వేచి
యుంది
పూల గుచ్ఛములను దాల్చియుంది
మీకు ముచ్చటలను తెల్పుతుంది
యీ చచ్చు రాజ్యమువీడి సరిగ జైలుకురండి ॥మాకొద్దీ॥

విచ్చల విడిగాను విప్పి రెక్కలు మీరు-విహారింపవచ్చు-మీరచట
స్వేచ్ఛ నిచ్ఛ నెక్కగ వచ్చు నచట
దైవం మెప్పులందగవచ్చు నచట
తల్లి కచ్చియున్న ఋణము-నర్పింపగావచ్చు ॥మాకొద్దీ॥

సకల దేశములార-సత్యవర్తన తోడ సారించు డిటుల మీ దృష్టి
యింక కనుడి హైందవ పుష్టి
వేగ తెరవు దొరకుట క్రొత్త సృష్టి
ఎట్టి దండన లెదురైన-కాదు మాకు నష్టి ॥మాకొద్దీ॥

ధర్మపక్షము నేడు-దారుణమైనట్టి బడలిక పాలయ్యె నయ్యా
దాని వదలించుకొనలేదయ్యా
నీదు పదునగు ధారనీవయ్యా
నీదు పదములపై వ్రాలి-ప్రార్థించినామయ్యా ॥మాకొద్దీ॥

ప్రపంచమున శాంతి-ప్రేమ దీపంబులు వెలిగించె నీ దేశమంత
గాంధి తెనిగించె నీ క్రొత్త వ్రాత
స్వేచ్ఛ మొలిపించె మన శక్తిచేత
బలము దుర్బలమను-భేదమెచ్చటలేదు ॥మాకొద్దీ॥

మా పాపమునెల్ల బాపి రక్షించుమా-పాపనాశవ! ధర్మమూర్తి
యిటుల కోపముంచకు-న్యాయమూర్తి
ఆపదల బాపుమో చక్రవర్తి
నీ వ్యాపారమొకసారి-నెఱపుము పృథ్విపై ॥మాకొద్దీ॥

దీనుల పాలిటి-తేజమవీవని-వీనులారగ నేను వింటి
కోటి దీనుల మా భూమి కంటె
మము సమాన యుగముగ చూడుమంటి
మా ప్రాణాలైన నోర్చి-మానమిమ్మంటిమి
॥మాకొద్దీ తెల్లదొరతనము॥

# పాంచజన్యము

పశ్చిమ కృష్ణాజిల్లా సంఘ ప్రచురణ

(మంగిపూడి పురుషోత్తమ శర్మ)

భారత దేశము నాదేరా!
భారతీయుడను-నేనేరా ॥భారత దేశము॥

భారతదేశము ప్రజాస్వామికము
బడయగోరి నే-బయలువెడలితిని ॥భారత॥

పారతంత్ర్యమును-పారదోలుటకు
బద్ధ కంకణుడ-బయలుదేరితిని ॥భారత॥

శాంతి సమరమున-సత్స్వ రాజ్యమును
సత్వరముగనే-సమార్జించెదను ॥భారత॥

ప్రాణముపోయిన-మానము విడువను
మానధనుడ, వి-జ్ఞాన ధనుడనే ॥భారతదేశము॥

---

# శంఖారావము

(మునగపాటి విశ్వానాధశర్మ)

పాడండోయ్-పాడండి!
ప్రముఖుల గేయాల్- పాడండి ॥పాడండోయ్॥

నిరాధారులు-నిష్కళంకులు
విర్దోషులు మన-ఆజాద్ ఫౌజని ॥పాడండోయ్॥

సుభాసు బోసు-ఝాన్సీలక్ష్మి
సెబాస్ వీరా-గ్రేసరులంచు ॥పాడండోయ్॥

శాంతి స్థాపన-సౌభ్రాతృత్వము
స్వాతంత్ర్యంబును-సాధిస్తామని ॥పాడండోయ్॥

# లెండి - రారండి

(దామరాజు పుండరీకాక్షుడు)

మ॥ మరువంబోకు డహింసయే మనకు సన్మార్గంబటంచున్ నిరం
తర దాస్యానల మార్ప గోరునెడ శాంతంబన్న చన్నీరు, స
త్వరమే చల్లుడి-యగ్ని కాజ్య మటులన్, దౌర్జన్య మన్యాయమున్
పెరుగగజేసి, యనర్థకం బవనిలోఁ బెంపొంది పీడించెడిన్.

ఉ॥ రండిక శంకలేటికి, స్వరాజ్య రథంబు మహాత్ముడెక్కె భూ
మండలికిన్ శిరోమణిగ మాతృధరాస్థలి నిల్పు దీక్ష, రా
రండని పిల్చుచుండె సుకరంబగు శాంతి పదంబు బట్టి రా
కుండ, నిరాకరింపవలదో, భరతాత్మజులార! లెండికన్.

గీ॥ ధర్మమే రథము, మన యుద్యమమునందు
ధర్మమూర్తియె సారథి ధరణి మనకు
దేహ సేవలెల్ల త్యజించి, ధీరుఁడగుచు
సిద్ధపడువాడె పార్థుడీ యుద్ధమందు
శాంతమే దివ్య శస్త్రాస్త్ర సాధనములు॥



# కదిలింది - కదిలింది

(దామరాజు పుండరీకాక్షుడు)

కదలింది, కదలింది-కాంగ్రెసు రధమండి
చేయెత్తి యొకసారి-జోహారు సేయండి ॥కదలింది॥

దేశసేవకు మీరు-ధీరులై నడువండి
దేశ స్వాతంత్ర్యాన్ని-తెస్తామనండి
దాసోహమని గాంధి-దారినే నడువండి
వాసిగ భారత-ప్రతిభనే నిలుపండి ॥కదిలింది॥

ప్రభు సంస్థలన్నింటి-పడగొట్టి సాగండి
శుభమని స్వారాజ్య-సోపాన మెక్కండి
శాంతిని యేవేళ-స్వాంతాల విడకండి
సంతోషముగ అన్ని-త్యజియించి సాగండి ॥కదిలింది॥



# రండు హైందవులార!

(“దామరాజు”)

రండు హైందవ శూరు-లారి-కదలి రండోయ్
బాబు రథము లాగండోయ్॥
స్వేచ్ఛ చచ్చి చిందులాడే-పిచ్చి మానండోయ్
మీరుఁజైళ్లు నింపండోయ్॥
వడుకునూలు వలువ-నేసి-చేతివృత్తులు లేవదీసి
కల్లుసారా లెల్లరోసి-జైళ్లలోని కెళ్లివద్దాం॥
పాఠశాలలు పాడుపెట్టి-కోర్టులన్నీ కూలద్రోసి
సీమగుడ్డలు చింపివేసి-జైళ్లకెళ్లి జైజై అందాం ॥రండు॥

గీ॥ కాంగ్రెసు రథంబిదే సాగె-గాంచుడయ్య
రథమిక స్వరాజ్య సోపాన పథముబట్టి
ఆగకయె యవిచ్ఛిన్నమై యరుగగలదు
వెడలుడు స్వరాజ్య సౌధ ప్రవేశమునకు
ఈ మహోద్యమ వీరులే-యిపుడొ, రేపొ,
రాజ్య సౌధంబు నెక్కి వి-రాజిలెదరు॥



# స్వరాజ్య సాధన

(మద్దూరి అచ్యుత రామారావు, కాకరపర్రు)

లెండు హైందవులార లేమి, దుఃఖమువాయ
రండు రండు స్వరాజ్య-రాజ్యపాలన సేయ ॥లెండు॥
ఉండ కొంపయు లేక-పండ మంచము లేక
తిండి కడుపార లే-కుండి రెందటో కనుఁడు ॥లెండు॥
గుండె నిబ్బరముగా-నుండెనే అకట మీ
కుండినన్ చాలునే-ఉండవలదే ప్రేమ ॥లెండు॥
స్వాతంత్ర్య సమరాగ్ని-నమసి పోమేల్కాదె
జనుడ బానిస యగుచు-చరియింపబోకన్న ॥లెండు॥
మాతృదేశ విముక్తి-మాట మరచిన యెడల
మనుజుఁడౌనె వాడు మాన్యులారా వేగ ॥లెండు॥
నవఖండముల నేలు-నాయకులు మనదేశ
నరులనుచు మీరెల్ల-రరసి మీ మదిలోన ॥లెండు॥
అవసర మెఱిఁగి యభియాతి తతి హతమార్చి
యభిమానవంతులై-యైకమత్యముతోడ ॥లెండు॥
పాశ్చాత్య నాగరిక పాపసాగరములో
బడి మునగ బోకండి-భారత సుతులారా ॥లెండు॥
ఆశ్చర్యమయ్యయో! యజ్ఞానమును గాంచి
నిశ్చయము గుర్తించి-నేర్పుతో జరియింప॥లెండు హైందవులార॥

# శాంతి సైనికుడు
(మల్లాది చంద్రశేఖరం)

సత్య దీక్షాపరుడ వహింసా పరుండ
వీవె, సద్ధర్మ బద్ధుండ వీవె సుమ్మ
ఆలు బిడ్డలు లేరు, నాయన్నవారు
లేరు, నిన్ను పెంచిన తల్లిలేదు, నీకు
వారు వీరను భేద భావంబు లేదు
దేశ ముక్తికి తోడ్పడు ధీర మతివి
దానిస త్త్వంబు దాపెడివాడ వీవె,
ప్రేమ తత్త్వంబు బోధించు వీరపురుష
దైవమే నీకు తోడంచు దలచుకొనుచు
నాత్మ, పశుబలంబుల భేద మరసి నీవు
లోక కళ్యాణసిద్ధి గూర్తువు గదన్న
ఇంటిపై నుండు నాసల నెల్ల విడచి
యుద్ధరంగమ్మ విడనాడకుండ, జయము
గలుగునందాక నచ్చటే నిలువవలయు
ప్రళయమందైన, శాంతమే వలయు సుమ్మ
నిరుపమానంబు, సైనికా! నీదు సేవ
ధర్మపరులిచ్చు గంజియే త్రాగవలయు
కటిక రానేల నిద్రింప గడగవలయు

రాగి డబ్బైన పొందగా రాదుసుమ్ము
జోలియేగాని నీకిట్టి సొమ్ములేదు
కష్టములకోర్చి కాలమ్ము గడుపవలయు
విలువలేనట్టి మంత్రమ్ము కలదు నీకు
శాంతి సత్యాగ్రహంబను శస్త్రమదియ
కలుకు కత్తుల కేమియు కలత బడవు
మరఫిరంగుల కిసుమంత వెఱపు గొనవు
భళిరె వర్ణనాతీతమౌ వ్యక్తి నీవు
ఖండ ఖండాంతరంబుల గానరాని
ధర్మ యుద్ధంబు జేసెడి తరుణమందు
ప్రకృతి సౌభాగ్య లక్ష్మియే పరచు కృపను
నీకు విజయమ్ము గల్గుట నిశ్చయంబు
ఆలసింపగ బోమ్మింక నాంధ్రపుత్ర॥



# వేణునాదము
(బసవరాజు అప్పారావు)

వేణునాదము-మోగుతుందం దోయ్ ఓ భక్తులారా
వేణునాదము-మోగుతుందండోయ్॥
వేగుజాము కోడికూసె-వేగుచుక్క తూర్పున బొడిచె
వేగమె నిద్దురలేచి-రండోయ్-వేళమించి పోయెనండోయ్ ॥వేణు
నాదము॥

భారతదేశపు దాస్యము బాపగ
పయనమాయె మోహన గాంధి
చావో జయమో! తేలందే యీ
జన్మకు మళ్లీ-కనబడదండోయ్ ॥వేణునాదము॥

భార్యల విడచీ-భర్తలు రండోయ్
భర్తల విడచీ-భార్యలు రండోయ్
తల్లుల విడచీ పిల్లలు రండోయ్
పిల్లల విడచీ-తల్లులు రండోయ్ ॥వేణునాదము॥

పాపాలన్నీ పటాపంచలై
పరమేశ్వరు సన్నిధిలో జన్మము
ధన్యత జెంది ముక్తిని బొందే
తరుణము దొరికెను-మరి రారండోయ్ ॥వేణునాదము॥

# మత్తుమందు

(బసవరాజు అప్పారావు)

ఎవ రేశారీ-మత్తుమందు?
ఎన్నాళ్ల దాకాను-ఈ మొద్దు నిద్దుర ॥ఎవ రేశారీ॥
నల్లమందైతేను-నాల్గు గడియల వరకె
కల్లు మత్తైతే పది-గడియల వరకేను ॥ఎవ రేశారీ॥
తాచు విషముకూడ-తగ్గేను మంత్రముతో
ఏదివ్య మంత్రముతో యీ మత్తు తగ్గేనొ ॥ఎవ రేశారీ॥
గాంధీ మహాత్ముడు-కనిపెట్టినట్టి యీ
సత్యాగ్రహ మంత్రముతో-మత్తు వదిలేనేమొ॥
॥ఎవ రేశారీ మత్తుమందు॥

---

# స్వారాజ్యలక్ష్మి పెండ్లి

పోదాము స్వరాజ్య లక్ష్మి పెండ్లి జూడ రారే రమణులార॥
ముత్యాల ముగ్గులు-రత్నాల తోరణాల్
మాణిక్యాల మంటపము-మన లక్ష్మిపెండ్లి ॥పోదాము॥
సంద్రమే పెళ్లిల్లంట-సదస్యులు దేవతలట
ఉప్పే తలంబ్రాలట-మన లక్ష్మిపెండ్లికి ॥పోదాము॥
గాంధివశిష్ఠుండట-కస్తూరమ్మ ముత్తైదంట
పరమాత్ముడె-సాక్షిట-మనలక్ష్మి పెండ్లికి ॥పోదాము॥

---

# మహాత్మా గాంధీ

(*గరిమెళ్ల సత్యనారాయణ*)

వినురా ! నా ప్రియ సహోదరుఁడా సోదరుడా
భారతభావి భాగ్యశేఖరుడా !
గాంధి చెప్పినత్రోవ నడురా ! దేశ–ఘనుల పాలన మొక్క–
గడియచే వడురా॥ వినురా నాప్రియ సహోదరుడా॥
సామాన్యు డనుకోకు మతని–దైవ–సంకల్పమురా వాని–
ఆనవ మీయవని ॥ వినరా ॥
కాయంపు రుచి యెఱగ ద్రొక్కి–ఆత్మ–కళ చేతపట్టెను
కడగండ్ల దక్కి ॥వినరా ॥
పరమతపమున కాని రాదు–కార్య–పరత మాత్రనె దాని–
గాంచె నీ జోదు ॥ వినరా ॥
కత్తిని నిరసించు:సతము–స్వస్థ–చిత్తవృత్తియె వాని–
చేతి యాయుధము ॥ వినరా ॥
చేతితో నూలు వడుకుమురా ! జరి–నేత గుడ్డలు కట్టి–
విరతముండుమురా ॥ వినరా ॥
కోర్టు సంబంధము విడురా ! ఆ–కూపంబులోపల–
కూలిపోకుమురా ॥ వినరా ॥
నిమ్నజాతుల నెత్తుమోయి–వారు–నిరసించిన యెడల–
నిక నీకు గోయి ॥ వినరా ॥
కాంగ్రెసు కమిటీలు పెట్టు–దేశ–గతిచెప్పి ప్రజనెల్ల
కలవరము పెట్టు ॥ వినరా ॥

# మహాత్ముని సందేశము

(గరిమెళ్ల సత్యనారాయణ)

వినుడీ! వినుడీ! ఓ ' జనులార ' విని—
ధన్యత నొందుడి—జనులారా ॥
పతితపావనుఁడు-పురుషోత్తముడగు
గాంధి మహాత్ముని—ఘన సందేశము ॥ వినుడీ వినుడీ ॥

ఖద్దరు కట్టుడి జనులారా మన
కలిమి బలములది జనులార!
రాటము గొని, యా-రాటముడిగి పో
రాటము లేకను-పొంది సుఖాంతము॥ ॥వినుడీ వినుడీ ॥

గ్రామోద్ధరణకు-జనులారా ఇక గడగుదమండీ జనులారా!
నిప్పచ్చరముల- నిలయములాయెను-పడిన వృత్తులను-
పైకెత్తియుదము ॥ వినుడీ వినుడీ ॥

పంచమజాతిని-జనులారా మన- పక్షము గొందము-జనులారా
మతమనగను మన-యాత్మోన్నతికే-మానవైక్యతను
మాపనేర్పడదు ॥ వినుడీ వినుడీ ॥

చేతిపనులుడుగ-జనులారా! మన-ఖ్యాతినశించెను జనులారా!
హస్తనిపుణతను ధ్వంసముచేసిన-పరుల చేతలకు
బానిసలగుదుము ॥ వినుడీ వినుడీ

శాంతము తగునో జనులారా-అది శ్రేయమన్నిటికి జనులారా !
ప్రేమచేతనే-పగతుని గెలుతుము-రక్తపాతములు
రాక్షస మతమగు ॥ వినుడీ వినుడీ ॥
సత్యమహింసలు-జనులారా ' మన-శస్త్రాస్త్రములో-జనులారా !
సమయము కనుగొని-సత్యాగ్రహమున స్వాతంత్ర్యంబును
సంపాదింతుము ॥ వినుడీ ! వినుడీ ॥ జనులారా ॥



# వీరగంధము

ఎదురుకోలు

(కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరి)

పల్లవి॥ వీరగంధము తెచ్చినారము-వీరు డెవ్వడో తెల్పుడీ
పూసిపోదుము-మెడను వైతుము-పూలదండలు భక్తితో ॥వీర॥

తెలుగు బావుట కన్ను చెదరగ-కొండవీటను నెగిరినప్పుడు
తెలుగు వారల కత్తిదెబ్బలు-గండికోటను గాచినప్పుడు ॥వీర॥

తెలుగువారల వేడి నెత్తురు-తుంగభద్రను గలసినప్పుడు
దూరమందున్న సహ్యజ-కత్తినెత్తురు కడిగినప్పుడు ॥వీర॥

ఇట్టి సందియమెన్నడేనియు-బుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నలు నడుగువారలు-లేకపోయిరి సుంతయున్ ॥వీర॥

వడుముగట్టిన తెలుగుబాలుడు-వెనుక తిరుగందెన్నడున్
బాస యిచ్చిన తెలుగుబాలుడు పారిపోవం డెన్నడున్ ॥వీర॥

ఇదిగో యున్నది వీరగంధము-మైనలందుము, మైనలందుము
శాంతిపర్వము చదువవచ్చును-శాంతి సమరంబైన పిమ్మట॥వీర॥

తెలుగునాటను వీరమాతను-జేసి మాత్రము తిరిగి రమ్మిక
పలు తుపాకులు పలు ఫిరంగులు-దారికడ్డము రాక తప్పవు
వీర గంధము తెచ్చినారము-వీరుడెవ్వడో తెల్పుడీ॥



# ఎందుకు ! జన్మమెందుకు !

రాగము ఆనందభైరవి

ఎందుకు జన్మమెందుకు॥
తన దేశమేకదా ! తనకు జీవమిచ్చె
నమచు దేశభక్తి-యతిశయిల్లకున్న ॥ఎందుకు॥
తల్లుల తల్లి, యా-తని దేశమే తల్లి
తల్లి ఋణమొదీర్ప-నొల్లకున్న భువి ॥ఎందుకు॥
తనకు నీడనిచ్చు-తరువుక్రింద జేరి
వెనరు విడచి నరుకు-నిర్భాగ్యులుండిన ॥ఎందుకు॥
వరిచర్య సలుపక-స్వదేశమున కింత
పురుషార్థమెఱుగక-పుట్టిన గిట్టిన ॥ఎందుకు॥
నిత్యము ధర్మమ నిత్య మధర్మము
సత్య ఖడ్గమూని-సమరము సలుపక ॥ఎందుకు॥
తనువెత్తు ఫలమిల-ధర్మ జీవితంబె
తన దేశమునకు సక—లంబు సమర్పింప
॥ఎందుకు ! జన్మమెందుకు॥

卐

# స్వాతంత్ర్య రథము

(దువ్వూరి రామిరెడ్డి)

గీ॥ అంబుదంబుల నమృత పూరంబు లొలుక
నింద్రచాపపుఁదోరణ మింపుగులుక
గాలిమెఱుగులు నెల్లెడ గడలుకొనఁగ
వెడలె, స్వాతంత్ర్యరథము, విన్వీథియందు॥

చ॥ జలధరమాల జీల్చికొని, స్యందనకాంతి సభోంతరాళ ము
జ్జ్వలితము జేసి యంధత మనంబులు నాటిన మూలనైన శో
భన ననలెత్తఁజేయుచుఁ, బ్రభాతవిభాకర బింబమట్లు సొం
పిలుచు నవీన జీవనము వేడ్కఁగ నిండె సమస్త సృష్టిలోన్.

ఉ॥ ఆ రథమందు దీప్తిమయమై, కనుపట్టె నిజ ప్రభావ దు
ర్వార పవిత్రమూర్తి కనుపండువు సేయుచు ధర్మజీవ నా
కారము శాంతిబింబమొ, యకల్మష సత్యనికేతనంబొ సం
సార ఫల స్వరూపమొ,ప్రజాహృదయంబొ యనన్ వెలుంగుచున్.

మ॥ ఒక చేతన్ రుధిరంపుఁబాత్రికయు, వేఱొక్కంట బీయూష పా
త్రికయుం బూనుచు, సభ్యతామిషమునన్ దేశంబులందెల్ల నిం
తకు ధర్మంబులు గాగ నెన్నబడు, నన్యాయంబు లీనాటితో
వికలంబై చనుగాక యంచు గరుణావేశమ్ము దీపింపగన్.

గీ॥ పచ్చనెత్తురు నమృతంపు బాత్రఁబోసి
దివ్య దుగ్ధంబు గామార్చె దేవి మహిమ
హాల హాల గర్భమందైన నమృతరసము
సంభవించు నటంచిల జాటనేమొ॥

చం॥ నిలువదు స్యందనంబు, ధరణీపతిపాలన దండభీతిచే
నిలువదనాథబాష్పములు నిల్చిన పల్లపునేల మొనగిం
పుల మఱపించు, గ్రించుదనపుం జతురాత్మల కాగబోఁ దన
ర్గళ జవమొప్ప నేఁగెడిని, గన్నులకుం గనరాని చోటికిన్॥

గీ॥ పూర్వ సింహాసనంబులు, బ్రోజ్జ్వలంపు
మణిమయ కిరీటములు, భోగమందిరములు
చక్ర సంఘర్షణంబున జదిసి పోయి
అవియివి యనంగరాక, రూప ఱడినేడు॥

గీ॥ లేవు దివ్యతురంగముల్ లేవు గరులు
ప్రజలె యాతేరు మోకులు పట్టువారు
వాయుజవమున దారకాధ్వమున నేఁగు
నంతరాయశతంబులనైన దాటి॥

గీ॥ తేరుజాడల నెత్తురు పాఱిపాఱి
బంగరుబంటఁ బండించె బక్కనేల
జక్రనేములు దాఁకిన స్థలములెల్ల
సస్యలక్ష్మికిఁ గల్యాణ శాలలయ్యె॥

గీ॥ అనుచు మంజుల గానంబు నలరజేసి
నవ్యనక్షత్ర వీణాస్వనంబులందు
మేళవించెను, జనులు విస్మితులుగాగ
... ... ... ... ... ॥

# ఏకైక నేత

(యడ్లపల్లి కోటయ్య)

సీ॥ ముకుటమొక్కటె లేదు మహనీయు డీతడు
భరత సామ్రాట్టని ప్రజలు గొల్వ
ముమ్మతంబుల సారమును పిండి త్రావిన
ఘనుడని పండితుల్ గారవింప
ధైర్యహిమాద్రి యీతని పట్టుదలముందు
తలవంచు ననుచు, యోద్ధలు వచింప
తండి క్షమంబున ధాత్రిని మురపించు
ననుచు యువతీ జనుల్ హర్షమొంద

పరమ పూజ్యుండు, భారతావని జనించె
పీడితావని ప్రజకెల్ల ప్రేమదాత
ఘనుడు, గాంధీ మహాత్ముడేకైకనేత
భరతనైతిక సద్గౌరవ ప్రదాత॥

సీ॥ సర్వభూతంబుల సమముగా ప్రేమించు
హితున కాచెఱసాల హీనశాల
తనకాలమెల్ల బీదలబ్రోవ శ్రమపడు
తండ్రి కా కరిన రాద్దండనమ్ము

హింసను ద్రోసి, యహింసఁ బ్రతిష్ఠించు
 శాంతున కా కష్టసంచయమ్మ్మ
భారత స్వాతంత్ర్య చిరపిపాసువున కా
 కలిసీళ్ల యంబలి, కరినళయ్య
బ్రతికియే భూములేలెదో! భారతపుత్ర!
ఇంతకంటె హీనస్థితి యెందుగలదు?
గాంధి దేవుని రక్షింప కదలివత్తొ
చచ్చెదో! కొమ్ము స్వాతంత్ర్య సమరదీక్ష ॥



# ఏమయ్యో! యువరాజ!

(కొండపల్లి జగన్నాథదాసు)

ఏమయ్యో యువరాజ-ఎందుకొచ్చావయ్య
ఏమి తెచ్చావయ్యా-ఎమి యిచ్చేవయ్యా ॥ఏమయ్యో॥

జార్జికుమార మా-ఛార్జివిగోనయ్యా
చిత్తగింపుమయ్యా-చిన్ని నా యువరాజ ॥ఏమయ్యో॥

మాయదారి సేవకులు-మాయ జేసినారు
మాయమాటలకు-మరి మోసబోకయ్య ॥ఏమయ్యో॥

ఆరుకోట్ల జనము-అన్నము లేకుండా
అమలు జేసిరి-మీ అయ్యలు వినవయ్య ॥ఏమయ్యో॥

కల్లొద్దు బాబని-కాళ్లట్టు కుంటేను
తాగండి మీరని-తన్నూచున్నారండి ॥ఏమయ్యో॥

పంజాబువధలకు-పరిమితి లేదయ్య
రక్తపుజాడల-రంగుజూడవయ్య ॥ఏమయ్యో॥

అల ఖిలాఫతు మాట-ఆ విధముగా జేసి
మత ధర్మములనెల్ల-మంటగలిపినారు ॥ఏమయ్యో॥

మీ తాతయెడ్వర్డు-నీతి మరచినావ
ఖ్యాతి నిలుపుమయ్య—ఘనమైన నారాజ ॥ఏమయ్యో॥

ఏ పాపమెఱుగక—పాపాల బడ్డాము
మము దుఃఖపెట్టుట మరియాద గాదయ్య ॥ఏమయ్యో॥

ఎన్నెన్నో విధముల-కిన్న జేసేరు
యెన్నటికోయు క్తి-యెఱుగ జెప్పుమయ్య
మా గాంధిదేవుని మంత్రము పరియించి
శాంతియుద్ధమందు-చావ నిలచితిమయ్య ॥ఏమయ్యో॥

మముజూడ నీకింత-మనసు బుట్టినదయ్య
మా బాధలను దీర్చి—మరి నీవు పోవయ్య ॥ఏమయ్యో॥



# భరతమాతా పిలుపు వినుమన్నా

(కొండపల్లి జగన్నాథదాసు)

భరతమాతా పిలుపు వినుమన్నా' యిక తడవు లేదు
మరణమైనను-సిద్ధమగుమన్నా
భరతమాతా పిలుపు విని,పరి-భవంబుల తలచుకొని, ము
ష్కరపు దాస్యపు శృంఖముల, ని-ష్కర్షగా తెగద్రెంపవలె నిక
॥భరతమాతా॥

మాటలకు సమయమ్ముగాదన్నా (శ్రీ) గాంధి పల్కెడు మాటవిని
రంగమున దూకన్నా
మాటలకు సమయమ్ముకాదు, స-మాన ధైర్యముబూనిశాంతము
దాటకను మన వైరిమోహపు-కోటలను పడగొట్టవలె నిక
॥భరతమాతా॥

కడుపుకోసము చూచుకోకన్నా-మృగములకు సైతము-కడుపు
నింపును దేవుడోయన్నా
కడుపుకోసము మనసు జంపక-పడుపు వృత్తిని మానివేసియు
కడుకు మానవ కోటిలో వెలి-బడెదవని గుర్తెరిగి యిప్పుడె
॥భరతమాతా॥

గుండెదెబ్బకు జంకబోకన్నా-చొక్కాను దీసి-గుండె దానికి
పందెమిడుమన్నా
గుండు దెబ్బకు జంకితేను, అ-ఖండ తేజము పోయి పిరికి
గుండె వాడని పదగురును, ప్ర-చండ తరముగ తూల జూతురు॥
భరతమాతా పిలుపు వినుమన్నా॥



# ఇక నేమందురా సోదరా

(కొండపల్లి జగన్నాథదాసు)

ఇక నేమందురా సోదరా! మనవారికి మనమీద నేమో యలుక
॥ఇకనేమందురా॥

హిందూదేశాన బుట్టి-హిందూదేశాన బెరిగి
ఇంకా యజ్ఞానము కా-సంతైన వదల రిక ॥నేమందురా॥
బానిస నౌకరియే-బంగారమని యెంచి
బానిస బ్రతుకే బహు-బాగాయె నందు రిక ॥నేమందురా॥
తన వ్రేలితోడనె-తన కన్ను పొడిచినట్లు
తనవారమని యెంచ-కను మనల బాధించె
నిక నేమందురా సోదరా॥



# వద్దురా మనకొద్దురా

(గరికపాటి మల్లావధాని)

వద్దురా మనకొద్దురా! పరపాలనం బిక ||వద్దురా||
హద్దుపద్దులేని పన్నుల-రుద్ది పీల్చుచున్నుండెరా ||వద్దురా||

కఱ్ఱలాగి కత్తిలాగి-గొఱ్ఱెలను చేశాడురా
వెఱ్ఱిమొఱ్ఱి 'లా' యటంచును-విఱ్ఱ వీగుచునుండెరా ||వద్దురా||

వెండి బంగారములనెల్ల-దండిగా లాగేశాడురా
ముండమోపి కాగితాలకు-దండమిడు మన్నాడురా ||వద్దురా||

లేవరా యిది వేళరా మన జీవితంబిక నేలరా
కావలేవా కన్నతల్లి-గౌరవము కాపాడరా ||వద్దురా||

మాన ప్రాణములకు మహా-మ్మారియై యున్నాడురా
దీనయై మనదేశమాత-దేవులాడుచు నుండెరా ||వద్దురా||

ఏడుకోట్ల ప్రజలు గుడ్డ-కూడులేకున్నారురా
మాడగొట్టి ప్రజల సొమ్ము ఓడ లెక్కించాడురా ||వద్దురా||

కుఱ్ఱలకు పెద్దలకు-వెఱ్ఱులెత్తించాడురా
బుఱ్ఱ తిరుగుడు మందుబెట్టి-వెఱ్ఱులను జేశాడురా ||వద్దురా||



# మనసా ! నీదేశగౌరవము గనుమా

(సుబ్రహ్మణ్యం)

మనసా నీ దేశగౌరవము గనుమా
మానము పోయిన ప్రాణం బేటికి ॥మనసా॥
ఘనమగునట్టియె-గాంధిమహాత్ముడు
మనముతో దెల్పిన-వాక్యము మరువకు
నిరపరాధులగు సతుల శిశువులను-పురుషులు వందలు మడిసిరి గుండ్లకు
మందుగుండు ఆఖరుగాకున్నను ఎందఱు జనులిక మడసియుం దురొ ॥మనసా॥
కోరితివేనియు ఆత్మగౌరవము నిరాకరింపుము సహాయమెంతయు
పలుదేశముల నాయకులందఱు కలసి దేశసభ తీర్మానించిరి
సలలితశాంతుడు గాంధిమహాత్ముడు-తెలిపిన సందేశం బిది మరువకు ॥మనసా॥
పలువిధంబుల-పాంచాలపురమున-క్రూరుడు డయ్యరు చేసిన క్రూరము
దేశదేశముల నాయకులందఱు-బంధనములకు పాలై యుండిరి ॥మనసా॥

పరపర గొంతులు కోయుచు దీనిని-మరచి పొమ్మనిన-మరచు
పెట్టులిక
అరయగ యిరువదియవ శతాబ్దమిది-నిరంకుశ మార్గంబెటు
సాగును ॥మనసా॥

ముసల్మాను సోదరులకు గల్గిన-వ్యసనముగని నీవెటుల
సహింతువు
పంచాయతీకోర్టుల నెలకొల్పుము-మంచిది ప్లీడరువృత్తిని
మానుము
శాసనసభలో చేరెడివారికి ఆశదీరగన్తైవోట్లనివ్వకుము
విదేశవస్తుల బహిష్కరింపుము-స్వదేశి వృత్తులవృద్ధికి దెమ్మిక
॥మనసా॥



# దేశమాతా సేవ చేయండీ

'భజనచేసే విధము తెలియండి'వలె

(కొండపల్లి జగన్నాథ దాసు)

దేశమాతా సేవచేయండీ! జనులార! భారత
దేశదాస్యము తొలగ జేయండీ॥
దేశభాగ్యము చూరగొనగా-లేశ మనుమానింపకను, పర
దేశవాసులు చేయు, మాయా-పాశములబడి-నాశమొందక

॥దేశమాతా॥

దేశవస్త్రంబులనె-తాల్చండీ! జనులార! మీరు, వి
దేశవస్త్రము లంటబోకండీ
దేశ నాశనకరములగు, నీ-వేషభాషలరోసి, మోహా
వేశమును బరిమార్చి,'గాంధ్యు'ప-దేశమును మీమదిని నిల్పియు

॥దేశమాతా॥

భోగముల కాసించబోకండీ-స్వరాజ్య ప్రాప్తికి
త్యాగమును గావింప బూనండీ
అఖిలభారత సభలలోపల-బాగుగా మన భారతులచే
కనుగొనంబడు-కార్యసాధన-సాగజేయుట గుర్తెరింగియు

॥దేశమాతా॥

సందియంబులు జెందబోకండీ-స్వరాజ్య మదిగో
తొందరగ చేకూరగలదండీ
అందఱును దౌర్జన్య రహితం-బైన సత్యాగ్రహామహోద్యమ
మందు జేరియు భక్తితోడుత-'వందేమాతర'మని పఠించుచు
॥దేశమాతా॥

మనకు గౌరత లేనెలేదండీ-పాశ్చాత్యమోహా
ద్మునను మున్గియు-తెలియలేమండీ
'కనడా' మరి 'యాఫ్రికా'ది-ఖండములలో నుండు వారలు
మనల బానిసలనుచు-డెందము నను దలంచి, హింసింతురంట
॥దేశమాతా॥

ముందువెనుకలు చూడబోకండీ-శ్రీ భరతమాతకు
నందనులుగా బ్రతుకగోరండీ
క్రందుగా, సర్కారువా రతి-క్రౌర్యవృత్తిని మిమ్ముబట్టుక
బందిఖానల నుంతురేనియు-భావమందున నేవగింపక ॥దేశమాతా॥

అంటరానీ తనమె లేదండీ - మన దేశవాసులు
నందరిని నొకరీతి చూడండీ
కంటికగుపడు నిమ్నజాతుల-నంటికొన్నను దోసమనుచును
కంటకింపక కూర్మిమై, మీ-వంటి వారని-మది దలంచుచు
॥దేశమాతా॥

పాలు మాలిక జెందబోకండీ-జాతీయ విద్యా
పద్ధతిని యోచింపరేమండీ
చాలగను జాతీయవిద్యా - శాలలను ప్రతిచోట నిల్పియు
బాలబాలికలకును చదువు-బాగుగా నేర్పించి,మీరట ॥దేశమాతా॥

తగవులన్నీ మానవలెనండీ-సర్కారు కోర్టుకు
తగుదుమని యిక సాగిపోకండీ
తగిన పెద్దలు చెప్పుపగిదిని-జగడముల వేదీర్చుకొనుచును
జగతిమెచ్చగ నైకమత్యము చాల సంపాదించి మీరలు
॥దేశమాతా॥

ధర నహింసావ్రతము బూనండీ-శ్రీ గాంధి దేవుని
పాంచజన్యము పిలుపు వినరండీ
గరిమతో సారాయి మొదలగు కైపు వస్తువు లన్ని విడచియు
స్థిరమనంబున మీ ధనంబు స్వ-రాజ్యసమరంబున కొసంగియు
॥దేశమాతా సేవచేయండి॥

# గాంధి మహాత్ముని తత్వము

(మంగిపూడి వేంకటశర్మ)

గాంధిమహాత్ముని తత్వమెరిగి- కష్టపడి పని చేయుడీ
బంధనము వదలెడు స్వేచ్ఛ-వృత్తికై-అందఱు సమకూడుడీ॥

విదేశవస్తు విసర్జనకంటే-వేరు విధము లేదు చూడుడీ
స్వరాజ్య సంపాదనకై-సమయమిదే-తెలియండీ ॥గాంధి॥

కోట్లకొలది ధన మిచ్చుచుంటిమి-గుడ్డలకై మనము, మన
పొట్లుచూచుకొని రాట్నము బెట్టి-బట్టల నేయింపుడీ ॥గాంధి॥

కొల్లగాను ధనమిచ్చుచుంటిమి-కల్లుసారాయికి మనము
మెల్లగాను మన ముల్లెయంతయు-బోవుచున్నదకట ॥గాంధి॥

మేలుగాను యేడాదికి వచ్చును యేలుబడి మనకు
చాలుచాలు పరరాజ్య సంబంధము-వీలులేదు మనకు
గాంధిమహాత్ముని తత్వమెరిగి_కష్టపడి పనిచేయుడీ॥



# సహాయ నిరాకరణము

"వరాకుసేయుట పాడిగాదురా" వలె

(కొండపల్లి జగన్నాథదాసు)

నిరాకరణమను మిఠాయి యిదుగో బిరాన రుచిచూడండీ
వేరే పోయి కొనబని లేదిక-చీరాలపురిలో కొల్లగ దొరకును
॥నిరాకరణ॥

సత్యాగ్రహమను గోధుమపిండిలో-సఖ్యసారమను-ఆద్యముపోసి
సాత్త్వికమను పెద భాండములోపల-సత్యాగ్రహులు పాకము
బట్టిన ॥నిరాకరణ॥

శాంతంబనియెడు శనగపిండిలో-శౌచంబనియెడు జలమును కలిపి
స్వధర్మమనియెడు పంచదారతో-స్వార్థత్యాగులు పాకము బట్టిన
॥నిరాకరణ॥

మానుషమను బియ్యపు పిండిలో-జ్ఞానంబనియెడు తేనెను కలిపి
ముని గాంధీయను చెఱకు బెల్లముతో-మున్సిపాలిటీ పాకము
బట్టిన ॥నిరాకరణ॥

దేశభక్తియను గోధుమనూకలో-దేశముక్తి యను వెన్ననుగల్పి
దేశభక్తి జగమంత నిండగ-సత్యాగ్రహులు-తయారు చేసెడి
॥నిరాకరణ॥



# స్వ రా జ్య ము

(గిరిమెళ్ల సత్యనారాయణ)

అన్నలార రండీ మన అమ్మ నుడి వినండి ముం
దున్న పని కనండి-ఏ-మన్న జడియ కండి ॥అన్నలార॥

పరప్రభుతను ద్రోల-యల-బాధ్యత సుధగ్రోల
వర సిరులను నేల-యను-వైన యదను చాల ॥అన్నలార॥

ఆంగ్లబిరుదు మాని-అల ఆంగ్ల కోర్టుమాని
ఆంగ్ల సేవ మాని-మరి ఆంగ్లప్రభుత మాని ॥అన్నలార॥

ఆంగ్లవిద్యమాని-అల-ఆంగ్ల దుస్తుమాని
ఆంగ్లకల్లు మాని అల-ఆంగ్లేయత మాని ॥అన్నలార॥

కొట్టతిట్టవద్దు మరి-గొణగ సణగ వద్దు
పట్టుదలను బూను-డల ప్రభుతనెల్లమాను ॥డన్నలార॥

కత్తిభయము మాని-పశు-శక్తినూత మాని
ఆత్మబలము బూని-గైకొనుడి మాతృముక్తి ॥అన్నలార॥

కాంగ్రెసు మనతల్లి-కాంగ్రెసె మన గురువు
కాంగ్రెసె మన దైవంబును-దానిమాట వినండి ॥అన్నలార॥

---

# ఆంధ్ర ఉద్బోధ

విద్యార్థులకు

(బలిజేపల్లి లక్ష్మీకాంతకవి)

శా॥ మీసైదోడులు వంగదేశమున నెమ్మిన్ మాతృదేశైక దీ
క్ష సంకల్పమునన్ నిరంకుశ సముత్సాహంబుతో దాస్య వి
ద్యా సన్యాస మొనర్చువార్తలు దిగంత శ్రాంతమ్రోయ, ఛీ
ఛీ సిగ్గేటికి లేదొ, ఆంధ్రయువకోజ్జీవంబు నిర్జీవమో,

మ॥ అనుమానింపకు దొక్క యేటినె, స్వరాజ్యంబేను సాధింతు నె
ట్టిన, నా మార్గము బట్టి రండని ధరన్ ఢంకా బజాయించి, చా
టిన గాంధీభగవాను వాక్యముల సూటిన్ నమ్మి దీక్షమతిన్
చనుదెండాదట నేమిలాభము, పరీక్షాభ్రాంతి యింకేటికిన్॥

శా॥ మన్నిశ్చేయమిదే ప్రపంచమున, ధర్మస్థాపనార్థంబు సా
క్షాన్నారాయణమూర్తియే మరల, నీ గాంధీ స్వరూపంబు గై
కొన్నా, డా జగదేక నాయకుని వాక్కుల్ వేదముల్ భక్తిమై
తన్నామం బొకమారే స్మరింపుడ మితోత్సాహంబు మీకయ్యేడిన్॥

సీ॥ అమ్మ! జాతీయ విద్యా భారతీదేవి
కదలి రావమ్మ! స్వాగతము నీకు
నిన్నుపేక్షించిన నీచాత్మల మటించు
నీను గొన కనుగ్రహింపవమ్మ

నీ సేవ విడి జాతి నిర్జీవికంబయ్యె
జీవం బొసంగి పోషింపవమ్మ
విమల భాషావేష వివశీకృతంబైన
దేశంబు మరల సాధింపరమ్మ

గీ॥ దివ్య గాంధీవచోగాంగ తీర్థమాడి
కసటు వాసిన పుత్రవర్గమున కిమ్మ
సారజాతీయ విద్యాసుధారసంబు
దేశశోభారతీ భారతీ సవిత్రి॥



# ఇక నైన మానవేమిరా

"నిగమగోచరశౌరి రంగయ్య రంగ" వలె, రాగం కమాచి ఆటతాళం

(కొండపల్లి జగన్నాథదాసు)

పల్లవి: ఇకనైన మానవేమిరా! యీ మాయచదువు ॥ఇకనైన॥
యీ మాయగొలువు ఇక-యీ మాయకోర్టు ॥ఇకనైన॥

అనుపల్లవి : అన్నయ్య! అన్న! ఇక పెద్దన్నయ్యా! ఇక॥
అన్నా! అన్నా! అన్నయ్య! అన్న ॥ఇకనైన॥

చరణములు

రావణుడే మంచి-రాజనుపించు-రాజుల కొలువు
రా! రారా! వినర! మానర నీవు ॥ఇకనైన॥

జానెడు పొట్టకు-మానెడబద్ధము-నాడెడు బ్రతుకేలరా
ఔరా సోదరా - ఇక

మానవతులయొక్క-మానము చెరకొను
హీనుల కొలువేమిరా పరికింపవేరా ॥ఇకనైన॥



# వద్దని నేనంటిగదా!

కాపీ త్రిశతి "వద్దని నేనంటిగదా వానిజోలి నీకుచెలీ", వలె

(కొండపల్లి జగన్నాధ దాసు)

పల్లవి: వద్దని నేనంటిగదా! వాని జోలి మనకు నింక
వారి చదువు మనకు నింక వారి కొలువు మనకు నింక॥

అను పల్లవి : సఖుడ రక్కసి పాలనమని–సమ్ముఖమున బాసజేసి॥వద్దని॥

చరణములు

మనదేశమునందు జేరి- మన సేమమునకు రోసి
మన పీకల గోయుచుండు-ఘనదొరతన విధానము॥వద్దని॥

నల్లవారి బానిసలని–యుల్లమునను దలచి తలచి
చిల్లిగవ్వ నేయరనెడు–చిల్లరి పరిపాలన విధి ॥వద్దని॥

కల్లుపోసి, కైపుజేసి-కొల్లగొట్టి ధనము లాగు
తెల్లవారి మాయదారి–చిల్లర పరిపాలన విధి॥
॥వద్దని నే నంటిగదా॥

---

# రాచబిడ్డవునీవు - రైతుపస్తేమెఱుక?

ఓటు ఓటనియేవు-ఓటు నిమ్మనియేవు
ఓటు నీకెటులిత్తుమో! రాజా! ఓటునీ కెటులిత్తుమో!

కాడుడిపి—పాడుడిపి-కష్టనష్టాలోర్చి
పండినా యెండినా దండుగో ధర్మమో
పస్తు పడుకున్నాము-శిస్తు నీ కిచ్చాము ॥ఓటు॥

ఒళ్ళు దున్నాము-మేటి-పొళ్ళు దున్నాము
గొడ్డు బిడ్డగోడు-గోడుమని పెంచాము
వడ్డితోనే సొమ్ము-తెచ్చి నీకిచ్చాము ॥ఓటు॥

పూటొక్క ప్రొద్దుగా-పొద్దుల్లు పుచ్చుతూ
కాటకాలుదాటి-యేటివరదలు దాటి
చేటుదప్పి ఒక్క-వోటు గడియించాము ॥ఓటు॥

చీని చీనాంబరాల్-సిలుకు రవసెల్లాలు
సరిగవల్లెల కొడలు బరువెక్కు- దొరబిడ్డ
నిరుపేద రైతు వెత-లారునే నీ చేత ॥ఓటు॥

మట్టిలో మాతోడ-బుట్టి మట్టిలో పెరిగి
మట్టి మాతో పిసికి—మాకు చేదోడుగా
చెట్టు పట్టాల్ మాతొ పట్టు రైతుండగా ॥ ఓటు ॥

ధొడ్డదొరబిడ్డవని-దోసిలొగ్గుతాము
పెద్ద పీటేస్తాము-వద్ద నిలబడతాము
ముద్దుచేస్తే పెద్ద గద్దెక్కి—తానంటూ ॥ఓటు॥

ఎండ కన్నెఱుగవు-యేడుమేడల మీద
పండుకొని కారులో-పరవళ్లు పోతావు
రాచబిడ్డవు నీవు-రైతు పస్తే మెఱుక ॥ఓటు ఓటనియేవు॥

(కృష్ణా పత్రిక)

# దేశ చరిత్ర

నాదనామక్రియ

(గురుజాడ రాఘవశర్మ)

తెలియుము దేశ చరిత్ర
తెలిసి దేశదాస్యముబాపు-మో భరతపుత్రా!॥ తెలియుము॥
పదహారువందల-పంద్రె డవయేట
భారతదేశ కర్మమున-
వీడు మొదట బందరు పట్టణమున
చల్లని పాదం పెట్టెను-వర్తకమున
కనుచు పట్టణంబులకు-శీఘ్రమున
తరలి వర్తక దొంగతనమున
కొంత రాజ్యము హరించెను మన
దేశీయ ప్రభువుల-జీల్చి-కయ్యమున
నౌకరి పక్షము-జేరి-రాజ్యమున
కొంత భాగము హరించె లంచమున
ఇట్లై భరతదేశమంత-పరప్రభుత పాలాయె
తెలియము, దేశ చరిత్ర-తెలిసి
దేశ దాస్యము బాపుమో! భరత పుత్ర॥

---

# జయభేరి మ్రోగింది

(మల్లాది చంద్రశేఖరరావు)

జయభేరి మ్రోగింది—జనులార లేవండి
జయము పొందెడిదాక—శాంతమూ లేదండి॥

జంకు గొంకూ లేక—ఛంగుఛంగున రండి
దేశసేవను జేయ—ధీరులై నిలువండి।

కాంగ్రెసు రథమిదె—కదలెను చూడండి
శక్తివంచన లేక-సాయమూచేయండి ॥జయభేరి॥

కాంగ్రెసు పరువును—కాపాడ దలచండి
కాంగ్రెసు బావుటా—కదలక నిల్పండి।

భారత జాతీయ—గౌరవం నిలుపండి
ఆశపెట్టెడువారి—కమ్ముడు పోకండి ॥జయభేరి॥

కాసుబేరానికి—కక్కుర్తి పడకండి
బానిసత్వము బాపు—బాసలు చేయండి।

మానవ సేవయే—మదిలోన దలచండి
ప్రాణాలు మానాలు—బలియిచ్చి రారండి జయభేరి॥

హెచ్చుతగ్గులులేవు-యెవరికెవరండి
కాలినడకన మీరు-కదలిరారండి।

సత్యశీలుడు గాంధి-స్మరణ చేయండి
తబ్బిబ్బు పడక మీ-ధర్మము తెలియండి॥
జయభేరి మ్రోగింది, జనులార లేవండి॥



# మా దేశం

(వానమామలై - వరదాచార్యులు)

పరదేశీయులు తొలగండి - యీ భారతదేశం మాదేశం
వినండి వినండి విశ్వప్రజలూ - వీరభారత సందేశం॥

ఆసేతు హిమాచల పర్యంతం - బా సర్వస్వము మాదేశం
ఆచంద్రార్కం బా నందనవన మంకితమయ్యెను మాకోసం॥

శాంత్యహింసలను సత్యధర్మముల - సంరక్షించును మాదేశం
సహజీవనమును సహకారమ్మును - సంబోధించును ననిమేషం॥

హిమాద్రి మొదలుగ కుమారివరకు-హిందుస్తానం మాదేశం
సమస్త భాషా జాతి మత సరిత్సంగమ జలనిధి ఈ దేశం॥

భారతదేశ స్వాతంత్ర్యమ్మును - పరిరక్షించుటె మాలక్ష్యం
భారతదేశపు రక్షణకై మా- ప్రాణాలన్నియు తృణతుచ్ఛం॥

---

# స్వాతంత్ర్య శంఖారావము

(మామునూరు నాగభూషణరావు)

భారత సోదర! పరుగిడి రారా!

ధీరుడవై స్వరాజ్య ప్రాప్తికి వీరకంకణము దాల్చుమురా॥

భారతసోదర॥

బానిస బ్రతుకుగ బ్రతుకకురా॰

భారతసోదర పరుగిడి రారా!

పారతంత్ర్యమును - బారద్రోలగ

బద్ధకంకణము దాల్చుమురా॥

జీవన మరణము రెండే మనకిక-లేదుర వేరొక దారి ॥భారతసోదర॥

దండి కేగె మన పూజ్యబాపుజీ దరి జేరగ రండీ

ఉప్పునుగొని మన-యుసురుల నిలుపగ నున్నాడిక భయపడకండి

తెల్లదొరలు మన-దేశమెల్లను-కొల్లగొనిరిక-లేవరా

కుడువను కూడు-గుడ్డకట్టుకొన-కరువైనవిరా మనకు

ఎంతకాల మీ బానిస బ్రతుకును-భరియింతువురా నీవు

చావో బ్రతుకో వరియింపగనటు-సాగుము ముందుకులేచి॥

భారత సోదర! పరుగిడి రారా!

---

## మన బాట
(బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి)

కదలి రావోయ్ తమ్ముడా!
కదలవేమోయ్ తమ్ముడా!

తూర్పు కనుమల
తొగరు రంగుల
తెరలు కదలెను చూడవా!
తెలివి దెచ్చుకు కూడగా!...॥కదలి॥

రెక్కలారని
బిక్క మొగముల
పక్షులే పరువెత్తిరా!
పదము నెత్తర కత్తుగా!...॥కదలి॥

పూల యెదలును
పొంగి పొరలీ
దారి బత్తెము విప్పెరా!
స్వారియై కడుగొప్పగా!...॥కదలి॥

భ్రమర యువకులు
పారతంత్ర్యపు
చెఱలు విడి గీతింత్రురా!
స్వేచ్ఛ్రమోగెడు తంత్రిగా!...॥కదలి॥

తోడి వారలు
కూడినారలు
పోరు దులిపి చూడవా!
పొత్తు గలిపే జోడుగా!...॥కదలి॥



# వీరగంధము

(బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి)

వీరగంధము తెచ్చినారము-వీరులెవ్వరో తెల్పుడీ?
వీరగంధమలంది, పాడెడి-విమల కంఠము నెత్తుడీ!

పాండవేయుల పదును రణకధ-మాట జ్ఞప్తికి యున్నదా?
ఆంధ్రవిష్ణుని అంపవానలు-అప్పుడే స్మృతి దప్పెనా?
బాలచంద్రుని బ్రహ్మనాయని-బాకుసోకులు మరతురా!!
కాకతీయుల కత్తి తళతళ-కనుల నేటికి మెరయదా!
కృష్ణరాయల కరము గరువమూ-కీర్తి సౌధము గట్టదా!
బొబ్బిలీశుల బొబ్బదెబ్బలు-భూనభంబులు గప్పవా!! ॥వీర॥

సిపాయీల చిచ్చుకలహాము-చెవుల మ్రోగుచు నున్నదే!
ఖిలాఫత్ సమరంపు హైక్యత-ఖులాసాగా నున్నదే!
జలియన్‌వాలాబాగ్ ధైర్యము-చలన మొందగ లేదదే!
సైమన్ కమిషన్ ద్రిప్పుళూరత-చల్లబడనే లేదదే! ॥వీర॥

దండి సత్యాగ్రహపు దండే-దసలలేడటు జూడు డా!
విదేశ వస్త్రాల నిరసన-వీరకార్యము జూడు డా!
వ్యక్తి సత్యాగ్రహపు వ్యక్తీ-వద్దనున్నది దలపుడా!
క్విట్ ఇండియా ఉద్యమమ్మూ-పటుత్వమ్మును బట్టుడా! ॥వీర॥

మహాత్మాజీ అహింసావ్రత—మాన్యధీరత మసలగా!
జవహర్‌లాల్ త్యాగపౌరుష—బుద్ధివరవడి దిద్దగా!
సుభాష్‌చంద్రుని శూరభారత·కిరీటంబును నిల్పగా!
ఆంధ్రకేసరి ఆత్మ ధైర్యము—అలంకారము జేయగా!
శ్రీ సరోజిని స్వాతంత్ర్యపు—జీవగానము కరుగగా!
భోగరాజుని భోగవిరమణ—పూర్ణ ధీమతి మ్రొక్కగా! ॥వీర॥

రాట్నచక్రము రంయి రంయని—రాజ్యచక్రము ద్రిప్పదా!
మాతృసేవా మహితధర్మము-మధురదుగ్ధము లియ్యదా!
అహింసావ్రత సహనశక్తి-అమృతము వర్షింపదా!
సత్యకంకణ ధారణమ్మున—స్వాతంత్ర్యము సాగదా! ॥వీర॥

దేశసేవకు అసువు లొసగిన—ధీరవర్యుల దెలియుడీ!
తల్లిచెఱ విడిపింప తరలిన—ధర్మవీరుల దలపుడీ!
దాస్యబంధము ద్రెంపు మార్గము—దీసినాత్మజు మ్రొక్కుడీ
ఐకమత్యమె బలమటన్నా—అమర మూర్తికి సాగుడీ! ॥వీర॥

కత్తికన్నను కలము శక్తే—గాథమనగల రెవ్వరో!
పోరుమాన్పి పొత్తుగలపగ—పారిపోగల రెవ్వరో!
నూలుపోగున జేసిదేశము—నేలగాగల రెవ్వరో!
కష్టజీవుల కరుణకావ్యము-గాన మొనరుతురెవ్వరో!
స్వేచ్ఛకోసము జీవితంబును—ధారవోయుదు రెవ్వరో!
మరణమైనను భయములేదను—మాన్యచారితు రెవ్వరో!! ॥వీర॥

---

# సైతాను ప్రభుత

(గరిమెళ్ల సత్యనారాయణ)

దండాలండోయ్-మే ముండలేమండోయి బాబు
ఈ సైతాను ప్రభుతనింక-సాగనీమండోయి బాబు ॥దండాలు॥
వర్తకానికంటూ యింట్లో-పాదమెట్టినాడు బాబు
పాదంపెట్టి దొంగతనం-ప్రారంభించాడండి బాబు ॥దండాలు॥
పాలకడలి వంటి రాజ్యం-బ్రద్దలయిందండి బాబు
కూలిజేసుకున్నా పొట్టకు-కూడులేదండోయి బాబు ॥దండాలు॥
ఛప్పన్న శాస్త్రాలు-చెప్పుచుండే భూమి బాబు
నూటికొకడికైన ముక్క-నోట లేదండోయి బాబు ॥దండాలు॥
ఘోరశత్రువులను నేల-కూలజేసినాము బాబు
శవముతోటి కూడ మేము-చాలరేమండోయి బాబు ॥దండాలు॥
పలక్కట్టి పులకూ్కడ-పన్ను వేసినాడు బాబు
పిలకబట్టి జైళ్లబెట్టి-పిండుక పోతాడండి బాబు ॥దండాలు॥
ఉప్పుపన్ను పప్పుపన్ను-ఊరికెళితె పన్ను బాబు
కొప్పుకాస్త దేముడికి-మొక్కుకుంటె పన్ను బాబు ॥దండాలు॥
కల్లుసారాయితెచ్చి యిల్లు-గుల్లచేశాడండి బాబు
పెళ్ళాంమెళ్లో పుస్తెలుకూడ-వెళ్ళిపోయాయండి బాబు ॥దండాలు॥
అన్నదమ్ముల్లోన భేద-మాడు పెట్టాడండి బాబు
ఉన్నదల్లా ఊడదన్ని-ఊరుతున్నాడండి బాబు ॥దండాలు॥

ఘోరమైన శాసనాలు-కూడదీశాడండి బాబు
కూడదీసి నోళ్ళలోను-గుద్దకుక్కినాడు బాబు ॥దండాలు॥

కదలకూడదు మెదలకూడదు-కష్టమైన సెప్పకూడదు
పదిమందిలోన కాస్త-పరువుగలిగి తిరుగకూడదు ॥దండాలు ।

చెన్నపట్నంనుండి ఆడి-సీమకెళ్ళేదాక బాబు
డబ్బుకాలువ గట్టినాడు-దాన్కి-కాపు పెట్టినాడు ॥దండాలు॥

పంచాయతీలు మానిపించి-కోర్టులెట్టినాడు బాబు
కోర్టులెట్టి రైతువాడి-కూడుతన్నినాడు బాబు ॥దండాలు॥

ఆడి తాతగారి దేశమట్లు-ధాటీచేస్తాడండి బాబు
జీతాలిచ్చి మాలోమాకే-చిచ్చుపెడతాడండి బాబు ॥దండాలు॥

దేశభక్తితోడమేము-తిరుగుతుండగానె బాబు
రాజద్రోహాలంటు మమ్ము-రచ్చపెట్టుతాడు బాబు ॥దండాలు॥

పంజాబు హత్యలకు-బదులు న్యాయమిమ్మంటే
మరచిపొమ్మటందు దొంగ-మాయమాట లాడుతాడు ॥దండాలు॥

ఆడితప్పిపోవడము-ప్రజలకొంప ముంచడము
ఆలోసించకుండ ఆడి-కలవాటయిందండి బాబు ॥దండాలు॥

సేతకాని ప్రభువనని-సెప్పబోడండి బాబు
సితిశాలినంటూ బలే-నిక్కుతాడండోయి బాబు ॥దండాలు॥

నూలుపోగుమీద రాజ్య-మూగుతున్నదండి బాబు
సీమనూలు తెంచితేను-సితికిపోవునండి బాబు ॥దండాలు॥

పాలించలేక బుఱ్ఱ-బ్రద్దలౌతుంది బాబు
చేతకాదటంచు పైకి-చెప్పుకుంటెసిగ్గు బాబు

దండాలండోయి బాబు-మే ముండలేమండోయి బాబు॥

—X—

## ప్రజాశక్తి ప్రబోధము
(యడ్లపల్లి కోటయ్య)

ఎదురులేదు ప్రజాశక్తి-కెదురులేదురా!
కలసి యండదండ యౌచు-కదలిరమ్మురా ॥ఎదురు॥
పరప్రభుత్వము వేగ-పారద్రోలరా!
ప్రాభవమున మనదేశము-పల్లవించురా ॥ఎదురు॥
పాపభారము మోయలేక-భరతమాత, నీ
ప్రాపుజేరె, కన్నతల్లి-భరము మాన్పరా ॥ఎదురు॥
లెమ్ము! లెమ్ము! భరతసుతా! లెమ్ము రమ్మురా,
లేచి ధర్మమెరిగి జాతి-కాచుకొమ్మురా ॥ఎదురులేదు॥

— o —

## వద్దురా! మన కొద్దురా!
(యడ్లపల్లి కోటయ్య)

వద్దురా మనకొద్దురా-పరదేశ పార్టీలొద్దురా!
హద్దదే క్విట్టిండియా తీ-ర్మానమని-ఘోషించరా॥
కుక్కగొడుగులవంటి పార్టీ-లెక్కడొచును నుండెరా
నమ్మబోకుము నమ్మిననునీ-నాశనమె ఘటియిల్లురా॥
ద్వేషముల నెలకొల్పునయ్యవి-దోషభూయిష్ఠములురా
మోసబోకుము, మోసపడ మన-మొదటికే చేటౌదవురా!
ఒక్కటే మన సంస్థరా, అది, నిక్కముగ కాంగ్రెసురా
ఒక్కటే త్రివర్ణ జండా-తక్కుగల వౌత్తేలరా॥
ఒక్కడే మన నేతరా! అత-డెక్కుడగు ఆ గాంధి రా
జై మహాత్మాజై యటంచును జయధ్వానము సేయరా॥

# రాజ్యమేలుదాము రారా

(గరిమెళ్ల సత్యనారాయణ)

రారా! పోదాము-రాజ్యమేలుదాము।
రాజ్యంబునేలుచును-రంజిల్లుచుందాము ॥రారాపోదాము॥

తెల్లదొరలనుండి_ఇళ్ళెల్ల కాపాడి
ముల్లోకములకీర్తి-ముట్టించి వేదాము ॥రారా॥

దొరల జీతాలెల్ల-విరగద్రోయుదాము
క్లుప్తముగ మన-గేహముంచుదాము ॥రారా॥

ప్రతినిధి ప్రభుతను-పాదుకొల్పుదాము
విరంతుశత్వము-నీటగల్పుదాము ॥రారా॥

దేశకళలనెల్ల_తేజరిల చేదాము
పాటకజనమునకు_పనులు కల్పిద్దాము ॥రారా॥

ద్రవ్యంపు పేరునకు-దారడ్డు నిలుదాము
సవ్యమ్ముగా నిల్లు-సవరణము జేదాము ॥రారా॥

ఉత్తమ విద్యల_నుద్ధరించుదాము
చిత్తవిభ్రమముల-చెలగిచెండుదాము ॥రారా॥

కల్లుకుండలగొట్టి కలుష వృత్తులగట్టి
సలలితాహింసా-శక్తిచేతనుబట్టి ॥రారా॥

గాంధివారి పాద-కమలములనుముట్టి
వందేమాతర మంత్ర-వరము నాల్కనబెట్టి ॥రారా॥

ఇస్లాము కీర్తిని-ఇగురెత్త జేదాము
విశ్రమముగను నీ-విశ్వంబు సుంతాము ॥రారా॥

జయిలే స్వర్గము, దేహ-శిక్షణంబే యాట
హాయిలేస్వరాజ్య మ-హోత్సవందే పాట ॥రారా॥

రారాపోదాము-రాజ్యమేలుదాము॥



# కొయ్యోడ గీతము

(గరిమెళ్ల సత్యనారాయణ)

కొయ్యడ' కొయ్యడః యిలాగ రారాః కోటి వింతలు-సెపుతానో!
రయ్యో! కొయ్యాడః
నువు కయ్యాలాడక చెప్పే కధను-కడదాకాను వింటవరో
॥రయ్యో కొయ్యడ॥
నే చెప్పినదల్లా విని తర్వాత తప్పులు ఉంటే తిట్టారో
॥రయ్యో కొయ్యడ॥
కొయ్యాడంటే కోపంవస్తే-కొరడా దెబ్బలు కాస్తావో
ఆ కొయ్యకంటె-గొప్పోడవైతే-కొరడా దెబ్బలు కాస్తారా
సీమనుంచి పబువులొచ్చి-సేతు లిరిసి గట్టారో ॥రయ్యో కొయ్యడ॥
సేతులతోడి రాయకూడదు-సెప్ప కూడదు నోటితో
॥అయ్యో కొయ్యడ॥
కాళ్ళతోటి యో వూరొదిలి-పొరుగూరెల్ల కూడదురో
॥రయ్యో కొయ్యడ॥

ఒత్తిలంగ మనకు వింక-నేది త్రోవ లేదురో!
కత్తిబలము హేయంబంటు- గాంధి చెప్పినాడురో
వానిమాట బ్రహ్మమాట-దాని మీర రాదురో!
మొత్తినగాని బుర్రవంచి-మోదంబంధు చుండురో

చిత్తంబందున నెచ్చగు జీతం-చేదటంచు నెచంరో
మానవజన్మం బెత్తినావు-మనిషి రక్తం త్రాగకురో,
పొరుగువాని మాంసం తింటే-పొట్ట పగిలి పోతుందో
ఎచ్చు జీతం చేసిరని-హెచ్చరింప బోకురో
వెచ్చనైన బాష్పములను-వేగం వేగం కూర్పరో
పచ్చనైన హిందూరాజ్యం-బద్దలయిందివో ॥రయోధ్యా కొయ్యాడ॥
దేవతలొచ్చి సీటికి మాటికి-తిరుగుచుండే రాజ్యమురో
కిన్నరలొచ్చి పాటలు పాడే-కీర్తివంత రాజ్యమురో
విద్యాధరులు వీణలుపాడే-వీనులవిందు రాజ్యమురో
గంధర్వులకు సుందరమైన- కన్నుల పండుగ రాజ్యమురో
వెండికొండ పసిడికొండ-వెలసినట్టి రాజ్యమురో
ముమ్మూర్తులకు ముఖ్యమైన-మూలస్థానం రాజ్యమురో
కమ్మనిగాలి వీచే మంచి-గంధపుకొండ రాజ్యమురో
అది వన్నెవాడి సన్నగిల్లి-చెన్నుతరిగి యున్నదిరో
॥అయోధ్యా కొయ్యాడ॥



# ఉప్పు కొనండయ్యా

(మంగిపూడి పురుషోత్తమ శర్మ)

ఉప్పు కొనండయ్యా, స్వరాజ్యపు-ఉప్పు కొనండయ్యా!
ఉప్పుచట్టమును-ధిక్క-రించితే తప్పక మనకు స్వరాజ్యమువచ్చు ॥ఉప్పు॥
బానిసతనము బాపేమందిది-భారతీయుల భాగ్యఫలంబిది
పేదలపాలిటి-పెన్నిధానమిది-సాధులుచేసిన సంజీవిని యిది
శాంతిసైన్యములు చేసిన ఉప్పిది-శాంతిశుభమ్ములు జగతికిచ్చునిది
గాంధి మహాత్ముడు కనిపెట్టినదిది-బంధనంబులను బారదోలునిది
గవర్నమెంటుకు కనువిప్పంగా-కాంగ్రెసుయోధులు కలసి చేసినది
॥ఉప్పు॥

— o —

స్వరాజ్యలవణము తయారుచేయరె! సహోదరులారా,
నిరాకరణ మంత్ర రాజగురుడగు-నరోత్తముడగు గాంధీయోగి చెప్పిన
॥స్వరాజ్య॥

పరప్రభుత్వము పారదోలుటకు-తురాయి మంత్రమిది
స్వరాజ్యపథమును సరాసరిని జేర్చు-రాజమార్గము మరేది లేదిక
స్వరాజ్యమెఱుగక-హతాశులగు భారతీయులకు నేడు
జితేంద్రియుడు గాంధి తాను స్వయముగ స్వతంత్ర రథచోదకుండయ్యె
నిదె॥

కుతర్కములు మాని-తెంపుకొని దీక్షితాత్ములై రండీ
సుతారముగ పారతంత్ర్య భూతమహాత్వంబగును సుస్వతంత్ర
మబ్బును
మతాంతరులె మన మహర్షి కధవిని మహాత్ముడని తలచి
మదిం గొలిచి జన్మతారకంబని కృతార్థులై ఆశ్రయించుచుండిరి
॥స్వరాజ్య॥

# స్వరాజ్య లవణము

ఉప్పుచేశామిదిగో! చూడండి! గాంధీమహాత్ముని
ఉప్పు చేశామిదిగో చూడండి॥
ఉప్పుచేశామిదిగో దేవతలుప్పరంబుననుండి హర్షము
లుప్పతిల్లగ పుష్పవర్షము గుప్పుచును ఆశీర్వదింపగ ॥ఉప్పుచేశా॥
జర్మనీ అమెరికా మొదలగు సకలదేశపు ప్రతినిధులు మన
కర్మవీరుని శాంతియుద్ధపు కధలు ఫిలుములు చేసిచూపగ ॥ఉప్పుచేశా॥
ఉప్పుగనులను చవిటినేలలు గొప్ప సాగర తీరముండగ
ముప్పువచ్చెను గంజిలోపల కుప్పులేదని జాలి జెందుచు ॥ఉప్పుచేశా॥
ఎక్కడను ఏకాలమున రాజెవ్వడైన కట్టినాడా లెక్కచేయక
ఉప్పుపన్నును ధిక్కరింతము రండు రండని ॥ఉప్పుచేశా॥
గొప్పభోగులు యోగులై పెనుగుంపులై కనుసన్న నిల్వగ
రెప్పపాటున ఉప్పుచట్టము టుప్పుటుప్పున నెగరగొట్టుచు ॥ఉప్పుచేశా॥
దండి పుణ్యక్షేత్రమున ను ద్దండ సాహసుడగు మహాత్ముడు
దండిబలవతు లాంగిలేయులు బెండువడి తెలతెల్లవోవగ
॥ఉప్పుచేశామిదిగో చూడండి॥

# మరచిపోవద్దోయి! మరచిపోవద్దు

(కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి)

పగవారు మనపైకి వచ్చి పడ్డారు,
కోయంచు మనయీాళ్ళు కొల్ల గొట్టారు,
గూటిలో పిట్టల్ని కూల్చివైచారు,
పొలములో పసిలేళ్ళ పొడిచి వైచారు,

మరచిపోవద్దోయి! మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!!

కారుకోనలు దూరి కలిగి పొయ్యారు,
దుంపకూరల తిండి ద్రుంగిపోయ్యారు,
గోచిపాతలు కట్టి క్రుంగిపొయ్యారు,
ప్రొద్దెల్ల మనవారు పొగలి పొయ్యారు,

మరచిపోవద్దోయి మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!

పంగిళ్ళ కయ్యాల పంత్రించినారు,
పసిపాప యుయ్యాల పారదన్నారు,
నిదురపోనీకోయి! నీ చేతికత్తి,
త్రాగించు! పగవారి రక్తంబు నెపుడు,

మరచిపోవద్దోయి! మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!



# స్వరాజ్య సమస్య

(బలిజేపల్లి లక్ష్మీకాంత కవి)

సీ॥ గతియింపలేదు లోకఖ్యాతమైన, థ
క్కాకామల్లు నేతమగ్గముల పనులు
కడముట్టలేదు బంగాళమ్ములోని మే
ల్వలిపంపు పట్టు దువ్వలువ పనులు
చెడిపోవలేదు వాసింగన్న యస్వాము
మరఫిరంగి పరిశ్రమముల వృత్తి
నశియింపలేదు నానాసాగరముల లో
గ్రాలు హైందవ నాలికాచయంబు

గీ॥ ప్రబల మొగలాయి సామ్రాజ్య భానుబింబ
మస్తమించెడి నందాక నస్తమింప
కుచ్ఛదశనున్న దేశ భాగ్యోదయంబు
సమసె నీస్టిండియా వణిక్సంఘ శక్తి॥

సీ॥ దుర్గంబులుగా మారి తొలుత వాణిజ్యంబు
కొఱకుగట్టిన సరకుంగొటార్లు
మందుసామగ్రిగా మారె గిడ్డంగులం
దుంచు వర్తకవస్తు సంచయంబు

వీరసైన్యముగా మాఱె గర్మాగార
ములగాచుచుండు కావలి జనంబు
చారలోకంబుగా మారె వ్యాపారంపు
టాసుగండియలు దుబాసుగాండ్రు

గీ॥ రాష్ట్రపతులైరి యిచట వర్తకమునడుపు
ప్రతినిధులనంతరము ప్రాచ్యాభారతీయ
సంఘ కర్తలె మనకు రాజ్యంబునకును
భర్తలైరిట బహువిధోపాయములను॥

సీ॥ రాటముల్వడుకు నా-రాటమ్ములుడి పోయె
ముసలమ్మలకు బనుల్ మూల బడియె
నేతమగ్గముల సంగాతంబు లరుదయ్యె
సాలెగాండ్రల పొట్ట సన్నగిల్లె
కొలిమి తిత్తి దుకాణములు క్షీణమైపోయె
గమ్మరి కంపు బింకమ్మడంగె
నానా పరిశ్రమల్ నాశంబులై బోయె
గూలినాలి జనంబు గూలిపోయె

గీ॥ చేతిపనులెల్ల మిల్లుల చేతసాగు
పాపి నాగర కంబిందు దాపరించి
కోట్ల పనివాండ్ర స్వేచ్ఛతో గూడవోయె
కలవు మనకయ్యె బరులకు గాలమయ్యె॥

సీ॥ తిరిగి యెప్పటికి వత్తురవి తల్లులచేత
బలికించు పెండ్లికూతుల దొఱంగి
వినువెంటc జనుదెంతుమని మూపులచెనుగు
తొలికాపురంపు బడంతుల దొఱంగి

నీరాడు తర్వాతనేని పోఁగూడదాయని
బతిమాలు లేత చూడాంగ్ర విడచి
చనసీక కాళలన్ బెనగు చిన్నారి బి
డ్డల చేత నింత మిరాయిబెట్టి
భావముసి రూఢమగు రాజభక్తి కతన
బుత్ర మిత్రాదులను మాతృ భూమి విడచి
ఖండన క్షోణి దుమికిరి భారతీయ
వీర యోధులు శత్రుసంహారమునకు.

మ॥ నిజసామ్రాజ్యయశః పతాకలకు నున్మేషంబుగా భారత
ధ్వజనీయోధులు నేనునేనని ప్రభున్ బ్రార్థించి యేతజ్జగ
ధ్వజ సంక్షోభ మహావహంబున సముత్సాహమ్మునన్ దూకి, వి
శ్వ జనీనంబగు కీర్తి గాంచిరి రణ వ్యాపార పారంగతుల్॥



# జాతీయ పద్య రత్నావళి

(దువ్వూరి శేషగిరిరావు)

కం॥ నాదేశమునా జనులని
లేదేని యొకింత జాలి లేదని ఫలం
బీ దైన్యపు బ్రతుకేయని
రోదించెదు వెనుక మిగుల రోసి కుమారా॥

కం॥ ఏక పతాకము క్రిందను
నేకంబైన భారతీయులెల్ల సమస్యల్
డీకొన జాలిన నాడే
యాకటి చిచ్చణఁగి బ్రదుక నవును కుమారా॥

కం॥ పచ్చని పైరుల బంటల
హెచ్చుగ మన భరతమాత యెసక మెసఁగు
బచ్చని తోరణములతో
నిచ్చలు గల్యాణమొంది నెగడు కుమారా॥

కం॥ పచ్చని పంటల తల్లీ
ముచ్చటఁ గొలుపు తల్లి ముద్దుల తల్లీ
లచ్చిని గూర్చెడు తల్లీ
మచ్చికతో జూచి మమ్ము మనుపుము తల్లీ॥

# బోసు వీరుడు

దసరా గీతము

(శాస్త్రి వెంకట నరసయ్య)

మూడురంగుల జండ-ముఖ్యపతాక
వేడినెత్తురుపొంగు-విరజిమ్ముదాక
ఏ జపానయినను-ఏ రష్యయైన
ఏ జర్మనీయైన-ఏదేశమైన
స్వాతంత్ర్య పథములో-వచ్చినిల్చినను
ఖ్యాతిగా పోరాడి-కసిమసంగగను
శపథంబులనుబూని-శౌర్యంబు మీర
కపటంబు లెఱుఁగక-గట్టిగా పోర
ఎత్తిరండిక దండు-ఇంఫాలుపైన
పరబలమ్ముల మొత్త-చరచరాబలిమి
పగఅబారులు చీల్చి-పసమీర మీరు
సగమంబుగా ముందు-జొరబారి రండు.

卐

# పదరా! ఢిల్లీ! వేగపట్టుకొందాము

(గురజాడ రాఘవశర్మ)

పదరా! ఢిల్లీ! వేగపట్టుకొందాము
స్వాతంత్ర్య ధ్వజమట-స్థాపించుదాము.
నెత్తురు వరదల-నిలచిన గడ్డ
సత్తువ గలదేని-సాగుమో! బిడ్డ!
మరఫిరంగులజూచి-మరలిపోబోకు
పరప్రభుతకంటె, మేల్-మరణము నీకు
అల యుగంధరు కష్ట-మాలింపలేవు
ఫలము జాఱవిడచు-భాగ్యహీనుడవు
నెమలి సింహాసనము-నిలచిన తావు
నమిలిమ్రింగినవారి-నణచి, చేకొనవు!
మొగలాయిలే మేలు-మహలులన్ గట్టి
మనసంపద హరించి-మరలరే కొట్టి
నడిగడ్డమనకు, ప్రాణము మానమదిరా!
తడయక నీశక్తి-ధార వోయుమురా!
భీష్ముడేలిన సుప-విత్రమౌ భూమి
కౌంతేయులేలిన-ఘనమైన తావు
పృథ్వీరాజేలిన-సాధ్వీలలామ

రాణిసంయుక్తకు-రాణివాసమ్మౌ
అక్బరు పాదుషా-ప్రాణధనమ్మౌ
షాజహానునికీర్తి-చంద్రకీలకమ్మౌ
స్వార్థపరులై వృథా-చచ్చిపోకండి
సార్థకజన్ములై-సాగిరారండి.
హైందవరక్తము మీ-యందుకలదేని
వందే మాతరం, జై-హిందనుచు, బూని॥

పదరా। ఢిల్లీ వేగంట్టుకొందాము॥

---

# అవభృథోత్సవము

(కాటూరి వెంకటేశ్వరరావు)

28—3—31 గాంధీ ఇర్విన్ ఒడంబడిక విమ్మట

హుంకరించెనొ! అగస్త్యుఁడు, నేడు నహుషునొ
ద్ధత్యమ్ము వమ్మొనరుచు ధరణిఁద్రెళ్ళ
ధృతవ్రజమగు దివస్పతి హస్త స్తంభ
మొనరింప జేయెత్తెనో బవనుఁడు
తాల్చెనేమొ వసిష్ఠతాపసి బ్రహ్మదం
డమ్ము కౌశికుని గర్వము హరింప
అలికనేత్రుండు వెల్వెల బాఱ నఱకాల
గమ్ము చూపించెనో గౌతముండు

అంతకును మీదు మిక్కిలి యద్భుతమ్ము
లేమిపొడమెనో! కాక యీరేడు జగము
లేల తలయూచు, ముక్కుపై వ్రేలితోడ
బాపురే! మేలు! మేలు! నేబా సటంచు॥

అల్పకాయమ్ము బోసిన వ్వంగ వత్స్రు
మూతకోలయునొచు, నుట్టూతలూచె
చూడ్కిలోన ద్రివిక్రమస్ఫూర్తి దాల్చి
మూడు జగములు నెవ్వడీ మొదుక తబిసి!

అనహాయోద్యమము

సత్యశౌచదయాజ్ఞాన శాంతిరాశి
ఆత్మయజ్ఞ దీక్షితుఁడైన యవసరమున
యజ్ఞకుండాన, 'నేను నే' నని దుమికిన
సమిధలకు మీకునెల్ల నాశాస్యమిద్ది.

యజ్ఞపావకతప్తమై, ఆత్మతేజ
మినుమడింపఁగ గళలుదేఱిన పదాఱు
వన్నె మేలిమి మీ తనుప్రభలు కర్మ
ధరణికెత్తు నివాళియై వఱలుగాత॥

సవన తంత్రమ్ము. తుదిముట్ట జరుగకుండ
దేవదానవుల్ మాయావిధి ప్రవీణు
లామయమ్ములు ఘటియింతు రన్నలార।
సవదరింపుడు నిర్విఘ్న సవనదీక్ష.

ఆత్మపదభంగభీతి నయ్యమర విభుఁడు
చతుర సల్లాపములొకింత సలుపునంత
నవభృధస్నాన సంభ్రములైన మీకు
నిచ్చగావుతనిష్ఠ యజ్ఞేశ్వరుండు.



# ఆగస్టు 15
(కాటూరి వేంకటేశ్వరరావు)

మ॥ తెలవారెం దెలవారె బీడకలయై త్రెళ్ళెన్ బరాధీనతా
కలుషంబాలయ గోపుర ధ్వజములన్ ఘంటాఘణాత్కారముల్
చెలగెన్, నల్వదికోట్ల గొంతుల, జయశ్రీ గీతివిస్ఫారె, మం
గళతూర్యమ్ములు మ్రోసె భారతము మింటన్దోచె మువ్వన్ని
యల్.

ఉపలాలించుచు, భోగభాగ్యములతో నుయ్యేల లూగించి, గా
రవు దేవిం బలినేలి, దాసిని బలిన్ రారాపులం బెట్టు పృ
థ్వీపులన్ రోసి, నిజప్రభన్ భరతధాత్రీదేవి పట్టాభిషే
క పరీతం బొనరించుచున్నది, జగత్కల్యాణ సంధాత్రియై.

చిరకృశీభూతధర్మమై, శిథిల దేహ
యష్టియై ప్రాణముల్ గన్నులందు, నిలిపి
మరల 'స్వగృహే' యటంచు సంకల్పమునకు
దొడఁగె; నీయవ్వకున్ జేవ యుడుగలేదు.

తండ్రి తాత ముత్తాతలు దరతరమ్ము
చేసిన తపస్సు పండి నీ చేతికందె
పాడి మొదవట్లుచేసె, నీభరతధాత్రి
పాలుపొంగించి పంచిరా పాయసమ్ము.

కడుపునిండ గూడు, నొడలునిండగ గుడ్డ
ఎండవాన సోకకుండ గీము
పాపపుణ్యములను బరికొంచుకొను తెల్వి
పంచుమన్న! మేలు పంచరన్న!

పరుల కలిమి కాసింపదు
ఒరు కష్టము దినెడు పైచ్యమొల్లదు, పరులన్
జెరపి బ్రతుకుట, ప్రాచ్య
మ్మరసి బ్రదుకుబాట కెత్తరన్నా! దివియల్,

కర్మఫలదాత దైవమ్ము కలిమి నమ్మి
కుడుచుటకు మిన్న విడచుటన్ గుఱుతెఱింగి
నడపరా, భోగ సంసక్తిఁ జెడు జగమ్ము
ధర్మచక్ర సంకీర్ణ పథమ్మునందు.

పాడియు బంటయున్ గలిగి, పాడిదొరంగక, కల్గినంతలో
వేడిన రిత్తపుచ్చక నివేదనసేయని భుక్తినొల్ల కె
గ్గాడక, సర్వలోక హితయౌ శుభశీలకు స్వస్తి గీతముల్
పాడరె పల్లెపల్లెలను, వాడలవాడల బుణ్యగేహినుల్.

కోరను రాజ్యభోగములు, గోరను స్వర్గసుఖమ్ము, మోక్షమున్
గోరను నాకునై, వెతలగుందెడియార్తుల దుఃఖనాశమున్
గోరెదనన్న ప్రాక్తనుల, కోరిక తీవల కల్లుకంబమై
భారతధర్మ దైశికతపై గుసుమార్చన గ్రొత్తసల్పరా.

నరమాంసాదులు యంత్ర యంత్రికులు సంపన్మోహమత్తుల్ తమః
పరతంత్రుల్ పరమాణు గర్భదళనోపాయజ్ఞులై, మర్త్యమున్
జెరుపంబూనిరి ధర్మరక్షిత జయంతిన్ దాల్చి చేయెత్తి చె
ప్పర 'ఓంశాంతి' పురాణభారత ధరాపత్యమ్మ! స్వస్త్యస్తుతే!

---

# ప్రబోధము

(గడియారం రామకృష్ణశర్మ)

సీ॥ సకలాంధ్ర సామ్రాజ్య శాసన దక్షమౌ
కాకతీయుల ఖడ్గ గౌరవంబు
పరబలం బగ్గింపఁ బవరానఁ గూలిన
పలనాటి వీరుల పౌరుషంబు
ధృతి వినాశకులైన మలికుల మాయించు
రామరాయల రణప్రాభవంబు
స్వాతంత్ర్యముం గోరి స్వారాజ్యముం జేరు
బొబ్బిలి జోదుల భుజబలంబు

గీ॥ మరచి జీవచ్ఛవముఁబోలె తిరుగు నీదు
స్మృతికిఁ గొనివచ్చి నీ శక్తి నెఱుక పఱచి
విజయ దుందుభి మ్రోగించు విజయదివస
మరుగుదెంచె భజింప లెమ్మాంధ్ర పుత్ర॥

సీ॥ పలికించినారు శత్రువులు తల్లడంబందఁ
గత్తులపై వీర గాథలెల్ల
చిలికించినారు చంచల చిత్తులకుఁ బ్రీతి
నుపనిషద్ వాక్య పీయూషవృష్టి

విన్పించినారు దర్పిత పండితాళికి
వీరాంక విజయ భేరీరవంబు
గఱపినారలు రాతి కఱకు గుండియలకు
మందార మంజరీ మార్దవంబు

గీ॥ వింగికె త్తించినారు విర్ణిద్రశౌర్య
సాహసౌదార్య వినయ రక్షాధ్వజంబు
పూర్వ జాతీయ గౌరవాభ్యుదయమైనఁ
దలఁచి నడుము బిగింపవా ' తెలుగువాఁడ !॥

సీ॥ గ్రీకులదాడికి చీకిన నీతితో
సర్వ విజ్ఞానంబు సమసిపోయె
పరమతాసహనంబు వాపిన బుద్ధితో
వేదవేదాంతాల విలయమయ్యె
తురకలు గూల్చిన దుర్గాలతోఁ బాటు
మత శిల్పశాస్త్రముల్ మంటఁగలసె
ఆంగ్లేయులార్పిన ఐకమత్యంబుతో
రాజ్యాంగ తంత్రంబు భ్రష్టమయ్యె.

గీ॥ కొంప గాలినదని మొత్తుకొనుచు నుండ
దొంగ జొరఁబడి దోచిన భంగి నున్న
మన పరిస్థితి సరిజేసికొనుటకైన
చేయి గల్పుఁడు! ఆంధ్ర దేశీయులార!

సీ॥ భావదాస్య పిశాచి పట్టి పల్లార్చుచు
పాయలుగా విడదీయుచుండ

మత శిల్ప విజ్ఞాన మారణతోఁ దృప్తి
వడక మ్లేచ్ఛులు పైకి వచ్చుచుండ
ప్రతిచిన్న పనికిని పైపోటిగా వచ్చి
అన్యులు మనశక్తి నదుముచుండ
కాలానుగుణ్యంబుగా నాకు మాన్యత
నిండంచు 'హిందీ' వేధించుచుండ

గీ॥ ఇట్టి చెడు వేళనా మన ఇగ్గులాట
పారవేసిన పుల్లాకుఁ బంచికొనఁగ
తగవులాడెడి కుక్కల పగిదిఁగాక
లేచి ముందంజవేయగ లేవె! ఆంధ్ర॥

సీ॥ అధ్యాత్మ విద్యా సుధాంబోధి మథియించు
స్వాములత్యాచార సారులైరి
స్వప్రజారక్షణాసక్తిప్రాణము లొగ్గు
రాజులు మూషక రాజులైరి
సార్వభౌముల యింట్ల స్వర్ణాభిషేకంబు
లందిన కవిరాజు లర్థులైరి
విద్రోహ రక్తంబు వెల్లువల్ గట్టించు
వీరాగ్రణులు సూప కారులైరి

గీ॥ ప్రకృతి శోభారమా విహారస్థలంబు
తెలుగు నేల అభాగ్యుల నిలయమయ్యె
ఈ విపర్యయ మొక్క నాఁటిని గాని
తలఁచి కన్నీరు విడుతువా! తెలుగువాఁడ!

సీ॥ నీ మాతృభాష రానేరాదె చక్కఁగా
పరభాషలకు పాట్లు బడెదవేల?

నీ మతాచారాల నియతినే యెఱుఁగవే
పరసంప్రదాయ సంభ్రమ మదేల?
నీవారి వేసాలు నీచంబులందువే
పెఱవారి విపరీత వేషమేల?
నీ సోదర క్షుధాయాసంబుఁ దీర్పవే
బరులకై కన్నీటి నోద్దు వేల?

గీ॥ ఇంటి పరమాన్నమును మాని ఇతరులింటి
గంజికై దేవులాడెడి కర్మమేమి?
భావదాస్యము నికనైన పాఱఁద్రోలి
లేచి ముందంజ వేయఁగరేవె ఆంధ్ర॥

సీ॥ అలవడ్డ రాజకీయ జ్ఞానమంతయు
'వర్దింగు' కై వ్యర్థపరచువారు
ఉరుదులో నొకరైన నొక్క రింగ్లీషులో
తమ విదగ్ధతఁ జాటఁ దలఁచువారు
మితవాదులై కొందరతివాదులై కొంద
రేటికిఁ గాటికి నీడ్చువారు
త్యాగంబు జూపించు తరి దాపురించిన
చల్లగా మెల్లగా జారువారు

గీ॥ పాలుకొకసారి జరుగు 'జల్సా'లలోన
వివిధ వేషాలతోడ దీపించువారు
ఈ ప్రజాపతులందరు ఇంకనైన
త్యాగదీక్షను వహియించి తరలరాదె?

---

# "మా గోడు"

(గడియారం రామకృష్ణశర్మ)

(పోలీసు చర్య తరువాత అధికారమునకై స్టేట్ కాంగ్రెస్ రెండు చీలికలైన నాడు మిలిటరీ ప్రభుత్వకాలమున వ్రాయబడినది)

ఉన్నావ లేవయ్యః ఓ జగన్నాథః
విన్నావ మాగోడు వీనులారంగ

పదమూడు నెలల ప్రవాసంబు దీరె
కొదవలు తీరె మా కొదవె మేలంచు
చితికిన విరిగిన సిరిసంపదలను
వెతమాని కూర్చికో వీలౌనటంచు
అక్కలు చెల్లెండ్రు అమ్మకూతుండ్రు
ఒక్కచో చల్లగా నం దుమటంచు
కాందిశీకతరోసి కడు వేక్కతోడ
చిందులాడుచుఁ గొంపఁ జేరికొన్నట్టి
నైజాము ప్రజల బన్నాలు విన్నావః
నీ జాలిగుండెతో నిలిచి కన్నావః ॥

తలదాచుకొనలేక, తనువుపైలేక
తొలిపూటకే లేక తోడేగలేక

పాలనా మారినా పద్ధతి పోక
ఆలకించుటలేక, ఆదృతిలేక
'స్పెష'లధికారుల చీదరింపులకు
విషమించు పోలీసు వేసరింపులకు
కలఁచు కమ్యూనిస్టు కల్లోలములకు
తలయెత్తు గుండాల దౌర్జన్యములకు
'లేవీ' వసూళ్ళఁ గల్గిన కుదింపులకు
'తావాన్ బకాయీల' దండతింపులకు
ధృతిఁమాలి గతిమాలి దిక్కేది యున్న
వెతలఁతో పొరిపొరి విలపించుచున్న
తెలగాణ ప్రజలకు దిక్కెవడయ్యా
నిలిచి కష్టము దీర్చునేత యేడయ్యా॥
గారాబు ఒక బిడ్డ గణికయైనట్లు
మా రాజకీయాలు మలినంబు లయ్యె
మమ్మేల వలసిన మా ప్రజాపతులు
దొమ్మిలోదిగినారు దుర్విధి వలన
చందా వసూళ్ళకై చరియించుచున్న
నిందాస్త్రులతోడ నినదించుచున్న
పక్ష ప్రచారాలె పాటించుచున్న
కక్షలే ఫలముగాఁ గలహించుచున్న
దేశ ప్రజాక్షేమ దృష్టి లేకున్న
క్లేశంబు లేవియు లక్షింపకున్న
మా నాయకుల తప్పు మన్నింపుమయ్యా
జ్ఞాన మందఱకుఁ బ్రసాదింపుమయ్యా॥
ఉన్నావ లేవయ్యా! ఓ జగన్నాథ!
విన్నావ మాగోడు వీనులారంగ!



# పిల్లంగ్రోవి పిలుపు

(కాటూరి వెంకటేశ్వరరావు)

5—3—1921

మృదులమ్మై మధురమ్మునై మసృణమై మృద్వీక మాధ్వీకమై
ఉదిత ప్రస్ఫుట సప్తసామనిభమై ఉద్ఘూర్ణితోద్ఘోషమై
అదె! బృందావనవీధి మాధవుని దివ్యద్దివ్య వంశీస్వనం
బుదితంబయ్యెను గోప బాలకులు రారో! తండ తండమ్ములై ॥

హరివంశీస్వన మాధురిన్ గరగి బృందారణ్య మొక్కమ్మడిన్
శిరమూబెన్ యమునా తరంగిణియు వీచీహస్తముల్ సాచి త
త్పరిరంభం బొనరింప నూగెడి నికన్ సందేహముల్ మానుడీ
పరువుల్ వారుడి! గోప బాలకులు నిర్వాణ ప్రదున్ జేరగన్॥

బృందారణ్యము శీర్షమూపుచు రసావేశమ్ము నందింప గా
లిందీవాహిని వేణుగానలహరీలీనమ్ముగా తత్సుధా
స్యంది ప్రస్ఫుట దివ్యవాహిని దిశాచక్రమ్మునన్ నిండె మీ
మందల్ మేయుటమాని అయ్యమృత రోమంథమ్మునన్ జొక్కె
డిన్॥

పిడుగుల్ రాల్జడిగా బదిరంబదిగ దా పీడించినన్నిమ్ము మీ
ర్విడువంబోరు సురాధిపాగమములన్ వేరందు! విశ్వాత్ము డ
ల్లడుగో! విశ్వము మాధురీపులకితమ్మౌ రీతి గానమ్ము స
ల్పెడి చాలింపుడికేని మీ చదువులాలింపుండు గోపార్భకుల్॥

తన పూజల్ విడనాడినన్, త్రిజగదాధారుండు, దేవేంద్రుఁడే
మనునో, కిన్కవహించి వెండియును కాలాంభోధముల్ గూర్చి, రా
ళ్లను రిప్పల్ గురియంగలాడొ! మన యిళ్లన్ వాకిళుల్
గూల్చ, సా
గునొ, యంచేటికి భీతి! చేరఁ జనరే! గోవర్ధనోద్ధారకున్॥

వాలుంగన్నుల నల్లనల్ల వికసింపజేయు లేనవ్వుతో
మౌళిన్ బచ్చని నెమ్మి పింఛియముతో, మా కందపున్నీడ వం
శీలాలిత్యము జూపుచున్ బిలిచెడిన్ శ్రీకుండు మిమ్మెల్ల, నా
లీలామానుష విగ్రహున్ దరియఁగా లెం, డేల! సందేహముల్॥

చదువులు తుదముట్ట చదివినవారల
కందుకోరాని యానంద పదము
నీటిపై వ్రాతలౌ మేటి సంపదలచే
సాధింపరాని స్వేచ్ఛాపదమ్ము
ఆత్మ శోషణఫలమౌ జపతపముల
బడయగారానట్టి బంధముక్తి
చిల్లర వేల్పుల సేవించుమాత్ర, చే
పడనట్టి దివ్య కైవల్య పదము

సరవిదనుజేరవచ్చిన సాధువులకు
పంచెదనటంచు మురళి, మ్రోయించు నదిగొ
రండు తద్గానలహరిలో దాండవింప
ప్రాలుమాలక గోపాల బాలులార॥



# విజయతోరణము

(కాటూరి వేంకటేశ్వరరావు)

10—11-1924

పటుదండ హతుల పాల్పడుచు నాబాల వృ
ద్ధమ్ము తాల్చిన సాహసమ్ము పండి,
బంధనాలయములఁ బలువింత క్రూర క
ర్మములోర్చుకొన్న తాలిమి ఫలించి,
తలిరు బోండ్లెల్ల నంతర్గేహములు వీడి
తాల్చిన వీర వ్రతమ్ము పూచి,
ధనము మానము ప్రాణమును వ్రేల్చు ధన్యుల
జన్మంపు ఫలము సాక్షాత్కరించి

సత్య శాంతుల పేరియశ్వముల వల్గు
వల్గనముల కనర్గళత్వమ్ము గఱప
విషమతలములు చదునుగావింప నదిగో
వెడలె, కాంగ్రెస్సు రథమున, విజయలక్ష్మి.



# ఉద్బోధ

(బద్దిరెడ్డి కోటేశ్వరరావు)

ధరణి నహింసావ్రతమె జీవనంబుగ
నెంచి ధర్మములు సాధించు కొఱకు
'అన్నమో! రామచంద్రా!' యంచు నడలెడి
బీదల జీవనోపాధి కొఱకు
పిల్ల పిప్పిని జేసి, బిచ్చమె త్తించెడి
సారాయి కల్లు నాశనము కొఱకు
తెరిపెమె త్తించు, విదేశ వస్త్రంబుల
నింక మీదటను, దహించు కొఱకు

గాంధి, కృష్ణావతారమై, కలియుగమున
ధర్మ పరిపాలనము, నార్య ధర్మములను
స్థాపన మొనర్ప, కాయకష్టములకోర్చి
యున్నవాడింక, వెఱపేలనో మదంబ.

శాంతులై ప్రజల కష్టమూ లిట్టులున్నవి
తొలగించుడని వేడదోషమాయె
ధీరులై భారత దేశీయ పాలనా
ధర్మమిట్లని చెప్ప దప్పులాయె

యోగ్యులై మధుసేవ యోగ్యంబు గాదని
యూరూర జెప్పుటే నేరమాయె
త్యాగులై, ఖద్దరు, ధరియించి, పరదేశ
వస్త్రములఁ గాల్చుట బంధియాయె

రాయబారములెల్ల నరణ్యరోద
నంబగుట దేశభక్తులు నాడు నేడు
హితవు గఱపంగ సభలు జేయించుచుండ
ముప్పులాయెను, చెఱసాల తప్పదాయె.

వినబడుచున్నవి వీనుల కింపుగా
దేశీయ గీతముల్ దిశలు మ్రోయ
సూచింపుచున్నవి శుభసూచనంబుగ
సత్యాగ్రహులు చెఱసాలబడుట
పల్వొత్తుచున్నవి పరమేశునాజ్ఞగా
గాంధీ నినాద మఖండముగను
కనబడుచున్నది కనుచూపు మేరనే
పూజ్యార్హమైన, స్వరాజ్య రథము

తద్రథంబును, యున్నత స్థలముఁజేర్ప
దండు వెడలిరి, పుత్ర రత్నములు, రిక్త
హస్తములతోడ, సత్యాగ్రహమ్ము నమ్మి
'విజయులగుగాత' యనుచు, దీవింపుమమ్మ.



# జ్యోతి

(భవనా శ్రీనివాసరావు)

వెలిగించరా! జ్యోతి వెలిగించరా!
కటిక చీకటులెల్ల మటుమాయమై తొలగ

పగలెల్ల శ్రమచేసి పరుగు పరుగున వచ్చి
పూరింద్లలో జెలగు కారుచీకటి నడుమ
జీవనాశాకిరణ చిహ్నాల దడివికొని
ఏడ్చు తమ్ముని బరువు ఎదలోని సొద దీర, వెలిగించరా॥

అధికార సంతమస మావరించిన కుటిల
విశ్వమానవ శాంతి విభవంపు సభలలో,
చినిగిపోయిన పేలికల మేన ధరియించి
ఎముకలన్నిట మృత్యువెగసి తాండవమాడ
కడుపు మంటకు గంజి గతిలేక సలగు నీ
వెర్రి రైతును జూపి విసిగింప నొకసారి, వెలిగించరా॥

అంతమెరుగని పారతంత్ర్యాంధకూపాన
మునిగిపోయి వెలుగు కనలేక లోలోన
పలవించి పలవించి వాలిపోనున్న మన
యనుగుదమ్ముల బెంగ నణచ గా పలుమారు, వెలిగించరా॥

తల్లి నిలయము జేరు దారులన్నిట మూసి
సవతి తల్లుల పాలు చవిజూపు కాంక్షతో
బలిమిమై లేగదూడలబట్టి లాగు నా
గురువంపు ఎదలోని కారుచీకటి దొలగ, వెలిగించరా॥

మలిగి పోయిన జ్యోతి వెలుగుగాంచక లోన
చెట్టుపుట్టలు బెరిగి చిమ్మచీకటు లలమ
పేద చూపులగుండె బెకలింపజేయు నీ
దేవళంబును నేటి తెలివెల్గులోనింప, వెలిగించరా॥

కలలోన నిజమేదో గనలేక సోదరులే
భేదభావముతోడ పెనగులాడెడి నేటి
కాళరాత్రిని వికా వికలుగా నొనరించి
ఎడద యెడదకు జ్యోతి నెత్తి చూపుచు మరల, వెలిగించరా॥



[అది 1947వ సంవత్సరము. భారత దేశము స్వతంత్రమైనది నైజాము సంస్థానము భారత సమాఖ్యలో చేరదని ప్రకటించినది నాటి నైజాము ప్రధాని లాయఖు అలీ తన ఒకనాటి ఉపన్యాసములో, "మాకు ధర్మబలము, నైతికబలమున్నది ఇండియన్ యూనియన్ తన ఏజంట్లను పంపి సరిహద్దు జిల్లాలలో అశాంతిని రెచ్చగొట్టుచున్నది ఋజువర్తనులు, ప్రజాసేవకులైన మా రజాకార్లు గ్రామాలలో శాంతిని స్థాపించుచున్నారు ఎవరేమన్నా పైన మాకు 'అల్లా'తోడు నీడలున్నవి"-అని ఉద్ఘాటించిన సందర్భము.]

# నీతులు నియమాలు

(ధవళా శ్రీనివాసరావు)

''సాహితీమేఖల''

లాయఖలీ! నీ నాలుక ఏ
లా నిర్మింపబడెనో?
పచ్చిబూటకపు నీతులు
బలుక సాహసించెను టో
నరములేని దగుటచేత
వెలుపులేక వాగుచుండె—అదిగో! నీ నైతికబల
మదిగో! నీ ధర్మబలమ్॥

హైద్రాబాదు గ్రామాలలో
కుళ్లిచచ్చి పురుగులు బడి
కళ్లజూడ భయముగొలుపు

నీ గుండా పాలనలో
కాలిన గ్రామాలవిగో!
కూలిన సౌధాలవిగో! —అదిగో నీ నైతికబలము॥

చితికిన పౌరుల గుండెలు
చిందిన నెత్తురులవిగో!
తల్లుల గానక ఏడ్చెడి
పిల్లల రోదనలవిగో!
తడియారని బాలెంతలు
పడిన భంగపాటులవిగో! —అదిగో నీ నైతికబలము॥

ఇళ్లూ వాకిళ్లు వదలి
ఝల్లుమనెడి గుండెలతో
సెలవు లేక అడవులలో
తలలు దాచి పలవించెడి
నిరుపేదల నిరాయుధుల కంటనీరు
వొరలి పారుచున్నదదిగో! —అదిగో నీ నైతిక బలము॥

మా తల్లులు మెడదాల్చిన
మంగళసూత్రాలు గూడ
దోపిడీలు చేసిన నీ
దురంతపాలన మదిగో! —అదిగో నీ నైతికబలము॥

నీ రక్కసి గుంపులచే
నోరులేని మా పశువుల
ఆహారము కాల్పించిన
అత్యాచారాలవిగో! —అదిగో నీ నైతిక బలము॥

జైలుఖానలో జిక్కిన
జీవుల బరిమార్పించిన
నీచుడ! నీకేటికోయి
నీతులు నియమా లిప్పుడు?
అల్లాపేరున లోకపు
కళ్లమూయ దలపకు నీ
పళ్లు రాలదన్ని జూచు
పటేలు సింహంబదిగో! —అదిగో నీ నైతికబల
మదిగో నీ ధర్మబలం॥



# మతమౌఢ్యము

(ధవళా శ్రీనివాసరావు)

[నవకాళీలో హిందువులపై బడి ముస్లిములు జరిపిన దురంతముల సందర్భమున]

కటిక మనసు నీదోయీ!
కరుణనీకు లేదోయీ!

మతము పేరుతో మానవజాతిని
హతము జేయుటే మతాదర్శమా?

పసికూనల లేప్రాయపు మొగ్గల
మసిజేయుటె నీ మతాదర్శమా?

కన్నతల్లి పాలిచ్చిన చన్నుల
కసాయిదనమున ఖండించెదవా?

కన్న కడుపుకే కన్నము వేసెడి
పన్నాగములకు పాలుబడెదవా?

తోడబుట్టువుల మానము దోచి
దొరనని మురియుచు గరివించేవా?

మానవ సభ్యత మానవ సంస్కృతి
మంటగలుపుటే మతాదర్శమా?

మతమను రాక్షసి మానవజాతిని
హతముసేయ నే యవతరించెనా!

మతావేశమున మానవరక్తము
గతికి వేయుటే కనీస ధర్మమా?

కూటికిలేని ఆకటి బాధలు
తల్లుల వీడిన పిల్లల రొదలు
కడుపుకోతలో పొడిచిన సళువులు
ప్రాణతుల్యమగు మానము బోయిన
పడచుల గాల్చెడి పరిభవాగ్నులు
మృత్యు తాండవపు నిత్యయాతనలు.

నీ మతమందున లేనేలేవా
నీదొక మానవ మతమేకాదా?

కటిక మనసు నీదోయీ
కరుణ నీకు లేదోయీ!

—: x :—

# గాంధిమహారాజు-కొలిచేం-గొలిచేం

("దా మ రా టూ")

పేదసాదల ముల్లె-ముడువాం ముడువాం
సంపన్నులకు మేము-జడియాం జడియాం

గాంధి మహారాజు-గొలిచేం గొలిచేం
గాంధి నడచేబాట-నడిచేం నడిచేం॥

దుడ్డు కర్రలెత్తి-గ్రుడ్లెర్రజేసి
బూకరించినమేము-నవ్వేం నవ్వేం ॥గాంధి మహారాజు॥

బూచి చూచి వఱచే-పసిపాపలము గాము
భయమేమమ్ముచూచి-వఱచేన్-వఱచేన్॥గాంధిమహారాజు॥

మనసు మర్మము లేము-యెఱుగాం-యెఱుగాం
మాట సూటిగమేము-పలికేం-పలికేం ॥గాంధిమహారాజు॥

పెడదారిబడి జైలు-బాటలు పట్టిస్తే
బందిఖానకేమేము-మూగేం-మూగేం ॥గాంధిమహారాజు॥

కేరిగెంతుచు జైలు-దారిమూగినమాకు
అవమాన కలుషమ్ము-లడగేన్ అడగేన్ ॥గాంధిమహారాజు॥

తాతలనాటి కట్టు-త్రాళ్లు సడలించేం
గాంధి దీవన తలల-దాల్చేం-తాల్చేం ॥గాంధిమహారాజు॥

(కృష్ణాపత్రిక 22-3-1941)

# పద, పద, ఢిల్లీ

(మల్లాది రామచంద్రశాస్త్రి)

పద పద ఢిల్లీ పరుగున పోదాం
పగర వేగమే, పార ద్రోలగా

భారతదేశము పరాధీనయై
ప్రాధాన్యము చెడి, ప్రాభవముడిగి
పరువు గోల్పోయి, పరివేదనతో
పొగులుచున్నదిక, ప్రమాద మొసగన్॥పదపద॥

పురాతనమ్ముగ, ప్రసిద్ధి నందిన
భారతీయమగు, భవ్య సంస్కృతియె
ప్రాతిపదికగా, ప్రపంచశాంతిని
పాదుగొల్పియిక, పరిరక్షింపగ ॥పదపద॥

జయ్ అజాదుకు, నేతాజీకి
జయ్ జహ్వారుకు, జయ్ ప్రకాశముకు
జయ్ పటేలుకు, జయ్ పట్టాభికి
జయ్ గాంధీకి, జయ్ హిందంటూ॥

పద పద ఢిల్లీ పరుగునపోదాం
పగర వేగమే పారద్రోలగా॥

# ఆహుతులు
(మల్లాది రామచంద్ర శాస్త్రి)

లెండోయి లెండోయి, తండోప తండాలు
రండోయి రండోయి, జండాలచేబూని॥

క్రూర పరపాలనను, కూల్చివేయుటకు
దాస్య బంధాలన్ని, త్రెంపివేయుటకు
స్వాతంత్ర్య పాలనము, స్థాపించు కొఱకు
త్యాగాన్ని నాహుతులు, గావలయువే వేగ ॥లెండోయి॥

దేశ సేవకుల మన్నించి కాపాడుటకు
వీరకేసరుల నర్చించి పూజించుటకు
భరత ఖండైక్యతను, బాగుగా నిల్పుటకు
త్యాగాగ్ని నాహుతులు గావలయువే వేగ ॥లెండోయి॥

దేశ దారిద్ర్యమును, తొలగింప జేయుటకు
మద్యపానము మాన్పి, మాన్యతను గూర్చుటకు
సర్వ మానవ సమత్వమును నెలకొల్పుటకు
త్యాగాన్ని 'నాహుతులు' గావలయువే వేగ.

లెండోయి లెండోయి, తండోప తండాలు
రండోయి రండోయి, జెండాలు చేబూని॥



# వేగరండు

(మల్లాది రామచంద్ర శాస్త్రి)

వేగరండు వీరులార!
విప్లవం బొనర్పగా
విప్లవం బొనర్పగా
విశ్వశాంతి గూర్పగా॥
విగత జీవ వీర వరుల
కాత్మశాంతి గూర్పగా
నుష్ణశక్తి ధారలన్
తర్పణమ్ము విడువగా
తృప్తి నొదవ జేయగా ॥వేగరండు॥

కన్నతల్లి బంధనముల
గాసినందు చుండగా
మిన్నకుండి చూచుచుండ
మిమ్ము పరులు మెత్తురా?
సన్నుతింప వత్తురా? ॥వేగరండు॥

కుటిల రాజనీతి మీదు
మతసఖ్య మడంపగా
ఘోరమైన యాపదలను

కోరితెచ్చు కొందురా?
నోరు మెదపకుందురా? ॥వేగరండు॥

వైరి పాశములను జనని
వేదన పడుచుండగా
నూరకుండి చూచుచుండ
వైరు లపహసింపరా?
భీరులంచు దలపరా?

వేగరండు వీరులార,
విప్లవం బొనర్పగా
విప్లవం బొనర్పగా
విశ్వశాంతి గూర్పగా॥



# సమరాహ్వానము

(మల్లాది రామచంద్రశాస్త్రి)

స్వాతంత్ర్య సమరమ్ము
　　సాగింపగా వేగ
సహచరులతో గూడి
　　రావోయి,
సాగి పోవలె త్వరగ
　　లేవోయి!॥
స్వాతంత్ర్యమునుగోరి
　　సామరస్యమ్ముగా
సల్పిన ప్రయత్నముల్
　　సకలమ్ము చెడెనింక　　॥స్వాతంత్ర్య॥
పారతంత్ర్యము బాప
　　పగతురతో పోరాడి
ప్రాణముల్ వీడిన
　　ప్రథిత వీరుల దలచి॥　　స్వాతంత్ర్య॥
విజయమును కాంక్షించి
　　వేవేగ రావోయి!
విజయమో గాకున్న
　　వీర స్వర్గము నీకు　　॥స్వాతంత్ర్య॥



# విఖ్యాత చరితా!

(మల్లాది రామచంద్రశాస్త్రి)

లాలి విఖ్యాత చరితా! నా తండ్రి
లాలి విజ్ఞాన కవితా!
లాలి సువిశాల నేత్రా! నా తండ్రి
లాలి సుకుమార గాత్రా!
అన్న వస్త్రముల కొఱకు-ఎన్నడే
యారాట మెరుగనట్టి
అన్నపూర్ణయై యాకటన్-దీనయై
యలమటించెడు చూడరా! ॥
తనువె శాశ్వత మంచును-తనదైన
ధనమె సర్వమటంచును
తబ్బిబ్బులై పోవు-ఆజాతికిక
సద్గతియె కఱవేనురా! ॥
సాహ సౌదార్యములను ప్రకటించి
సామరస్యము గూర్పరా!
సమరసము జేకూరగా-విశ్వమున
శాంతి సుఖములు కల్గురా! ॥



# విజయము నీదే

(మల్లాది రామచంద్రశాస్త్రి)

విజయము నీదేరా, రా, రా
విప్లవ భారత వీరకుమారా!

భారత స్వాతంత్ర్యమ్ముకనై పో
రాడిన శ్రమ నీదేరా, వీరా
భారత వీరుల ప్రాణమ్ముల గా
పాడినట్టి ధీరా, రేరా, విజయము॥

పగతుర నందర పారద్రోలగా
పరుగున రావలెరా, వీరా,
పర పరిపాలన బాపుకొనంగా
ప్రాణము లేవలెరా, ధీరా! ॥

విజయము నీదేరా, రా, రా!
విప్లవ భారత వీరకుమారా, ॥



# భారతీయుడనేను

(మల్లాది రామచంద్రశాస్త్రి)

దేశ ధర్మ సంరక్షణ
ధారవోసితిని రక్తము
జ్ఞానఫల ప్రాప్తికి నా
తపము ధారవోసినాను,
సౌభాగ్యము కొరకై నే
చాలగ శ్రమనందినాను,
పరిపోషణమును సలుపగ
చరమసీమ గాంచితి క్షమ,
వ్యక్తి మోక్షమునను జగ
త్కల్యాణము వాంఛించితి,
విశ్వశాంతి కిరణముల న
విరళముగా ప్రసరించితి,
భారతీయుడ నేను
భాగ్యాన్వితుడ నేను,
ప్రాభవాఢ్యుడ॰ ప్రథిత
మౌ విశ్వమానవుడ॥

ధరణీ నిర్మల పంక సంజాత పద్మరజ
మనవి నిర్మితము నాతనువు పార్థివమయ్యు॥
భాగీరథీ పయస్సంజాత చైతన్య
విలసిత పవిత్రమ్ము సలలితము గాత్రమ్ము॥
బాలారుణ ప్రభా జాలప్రభావిత
భాస్వంతములు గాత్రరుచులు సురుచిరములు॥

# రాట్నము

(కాటూరి వేంకటేశ్వరరావు)

నేను మీ యిలవేల్పునే చెల్లీ' నా తోడ నాడుకోనవే
నేను గృహలక్ష్మినే తల్లీ, నను మరచిపోతివటే
పూయరే పసుపు నాకు, కుంకుమపుబొట్టు నా నుదుట నిడరే
చేయరే యుపచారముల్ మరచుటకు చెంపలను వైచికొనరే
దీపమై వెలిగినానే, దివ్వెనై వెలిగినానె
కాపుదలగా నుంటినే మును మీకు నాపదల్ తొలగిస్తినే
మీపెరటి కల్పకమునై మీకెల్ల ఆపదలు బాపినానే
మీపాలి వేల్పుటావై యమృతమ్ముచేసి మీ కొసగినానే
నీ నెత్తురున చుక్కనై చెల్లిరో! నీ మాంసమున కండనై
నీ ఎమ్ముకను మూలుగై తల్లిరో నీవె నేనైయుంటినే
ఇలవేల్పు పూజమాని పెఱవేలుపుల పూజ సేయబూని
కలుములకు దవ్వైతిరే! ఈనాడు కష్టముల పాలైతిరే
మీరు నన్ను మఱచినా, తల్లిరో! మిమ్ము, నే మఱవగలనా?
పారజూచి తెలియరే మీ పాలి పత్తిరాట్నమును నేను.
నేను మీ యిలవేల్పునే చెల్లీ, నాతోడ నాడుకోనవే
నేను గృహలక్ష్మినే, తల్లి నను మఱచిపోతివటే!

—X—

# రాట్నము-చేతినూలు

రాట్నము చేతినూలు-రయమున వడుకుడీ!
రాట్నమె బంగారుమూట యనుకొనుడీ ॥రాట్నము॥

మనదేశ భాగ్యము-మనచేతి రాట్నమందె
అనిశము నిమిడియున్న-దని మది నమ్మడీ ॥రాట్నము॥

కుదురాడినచోట-కవ్వమాడినచోట
కరువు లేదనుమాట-కల్లగాదు నమ్మడీ ॥రాట్నము॥

మల్లు పంచెలు మీరు-మరపున చెందుడీ
తెల్లమాయకు మీరు తెల తెల్లబోకుడీ ॥రాట్నము॥

ఏడేటిరువది కోట్ల రూపాయలు
బైట దేశంబులపాలు కానివ్వకుడీ
రాట్నము చేతినూలు రయమున వడకుడీ!



# రాట్నము ద్రిప్పుడిక-రమణులారా

రాట్నము ద్రిప్పుడిక-రమణులారా!

రాట్నమె మనపోరాటము దీర్చును-యేటికి యోచింప॥రాట్నము॥

భారతమాతకు బిడ్డలమై యిటు-బానిస లగుటేలా ॥రాట్నము॥

ఈటికి గుడ్డకు కొదువ లేకున్నను-కోటికి యున్నటులార ॥రాట్నము॥

అరువదికోటుల ద్రవ్యము మిగులును-మనకాధారంబుర॥రాట్నము

ఘనుడగు సద్గురు గాంధిమహాత్ముడు-మనకుపదేశించె ॥రాట్నము॥

ధరణిని కొండమాచుపురంబున వెలసిన-వరదుని కృపగనుడీ
రాట్నము ద్రిప్పుడిక-రమణులారా!



# అమ్మా ! నా మనవి వినుమమ్మా

అమ్మా' నా మనవి వినుమమ్మా!
రాట్నము గొనుమమ్మా' నూల్వడికెదమో యమ్మా!
ఘనపుణ్యుడు సద్గుణుండు-గాంధిమహాత్ముండు
సబర్మతీ యాశ్రమమున సందేశము మనకంపెను
త్రిప్పుమా రాటం-తీయుమా దారం-నేయుమా
నేతగుడ్డ-ధరి యింపు మమ్మా ॥అమ్మా॥
పరదేశపు మల్లుగుడ్డ-పరువాయెనటమ్మా, మనకు
పరమ పతివ్రత సీతా-భామామణి యేది తాల్చె
కొల్వులోన ద్రౌపదిని కాపాడిన-కోకలెవ్వి
నలుడు, దమయంతులిద్దరు
చెరిసగమున ధరియించిన చీర, ఖద్దరుకాదా!
మర్యాదా! యిది మనకు పీడ॥

అమ్మా! నా మనవి విను మమ్మా! రాట్నము గొనుమమ్మా॥



# జననీ! రాట్నము బెట్టుమా!

జననీ రాట్నము బెట్టుమా, భారతభాగ్య జననీ!
రాట్నము బెట్టుమా!

రాట్నము బెట్ట, స్వ-రాజ్యమొచ్చు ననుచు
నేటికి గాం ధీమ-హాత్ముడు వచియించె ॥జననీ॥

కదురు కవ్వము తిరుగ-కరువులేదందురు
అది వదలిన నాడె-వదలె మనల లక్ష్మి ॥జననీ॥

అరువదికోట్ల మీ హ_స్తముల్ ధరియింప
పరుగున వచ్చు, క-న్పడదె స్వరాజ్యము
జననీ! రాట్నము బెట్టుమా॥

భారతభాగ్య జననీ రాట్నము బెట్టుమా॥

---

# పెట్టరే రాట్నము
(నెల్లూరు వెంకటరామానాయుడు)

పెట్టరే రాట్నము-బెట్టరే! ఓ తల్లులారా! పెట్టరే రాట్నము.
పెట్టరే మీ రింక నైనను-పేదతనమున తల్లి వ్యధచే
కట్టుకొనుటకు బట్టలేకను-కడు విచారము నొందుచున్నది
॥పెట్టరే॥

కనుల బాష్పపు-కణము లలరగ కడు విచారపు మోముతోడ
కన్న సంతానమ్ము దలచుక-చిన్నబోయెడి, తల్లి మొర విని
॥పెట్టరే॥

కాటకంబులు తొలగు, దాస్యము-కడల కేగును, భాగ్యమబ్బును
బూటకంబగు నాగరికమీ నాటికైనను తొలగు గావున ॥పెట్టరే॥
మూడుకోట్ల రాట్నములు ఆ-నాడు గల్గిన దేశమకట
నేడు చిత్రముదోచు నొక్కటి-గూడ లేదిది యేమి పాపమొ
॥పెట్టరే॥

ఇట్టి రహస్యంబు బైటం-బెట్టి మనల స్వదేశి బట్టల
గట్టుకొనునటు జేసినట్టి-గాంధి ఋషికిని చేతులెత్తి ॥పెట్టరే
దండము॥

తల్లి! యింకను మాను మీ వ్యధ-తల్లడిల్లకు మేము దాస్యము
నొల్లనేరము స్వేచ్ఛ దెత్తుము-కల్లగాదని చెప్పి యిప్పుడె
పెట్టరే రాట్నము-బెట్టరే, ఓ తల్లులారా! పెట్టరే రాట్నము॥

# రాట్నము

(వెన్నెలకంటి రాఘవయ్యా)

ఏకులు కావలెనా? దాస్యపు-మోకులు కావలెనా?
లోకులతో సరితూగుచు నిచ్చట-వ్యాకులతను విడినాడి
భుజించుట కేకులు కావలెనా ?

కదురులు కావలెనా! కొరడా-బెదురులె కావలెనా!
అదరక బెదరక నలజడి నొందక-కుదురుగ స్వరాజ్యంబును
పొందుట కేకులు కావలెనా !

పడుగులె కావలెనా సేవకు తోడుగులె కావలెనా !
అడుగడుగునకును హరి భజియించుక కడుగో గంజో
కమ్మగ త్రాగుట కేకులు కావలెనా !

వెన్నెల కావలెనా? రాజుల-మన్నన కావలెనా!
వెన్నెలకంటి రాఘవరాముడు-కన్నులదెరువ
మిమ్మెల్లర వేడెడి ఏకులు కావలెనా ?

---

# రాట్నము

(కోమాండూరి పార్థసారథి అయ్యంగారు)

రాట్నపు పాటను-పాడగ నందఱు-రండీ జనులారా
రాట్నము వలననె కల్గెడు మనకు స్వ-రాజ్యము కన్గొనుడీ॥

పేదజనంబుల కన్నము పుట్టెడు-పెన్నిధి-ఖేదము మానుడికన్
సాదరబుద్ధిని రాట్నము త్రిప్పుచు-చప్పున సంకెలు లూడునికన్॥

సీమవస్త్రములు వాడమటంచును-నేమము పూనుడికన్
సామముచేతనె రాట్నప వల్లనె-సాధింపుడుస్వాతంత్ర్యమ్మున్॥

రాట్నమె దివ్య సుదర్శన చక్రము-రమ్యముగా తిరుగన్
కాటకముల పోద్రోలి, స్వరాజ్యము క్రమ్మఱ మన కందించున్॥

రాట్నము పాటను పాడగనందఱు-రండీ జనులారా!



# వద్దురా, మనకొద్దురా పరదేశ వస్త్రము

(గరికపాటి మల్లావధాని)

పద్దురా మనకొద్దురా పరదేశ వస్త్రము ॥వద్దురా॥
వద్దురా చేతివృత్తి-పనుల నెల్లను చితుకగొట్టెను సోదరా ॥వద్దురా॥

కదురుచూచి బెదరిపడుచు-కఠిన పద్ధతి దాల్చెరా
ఓర్వలేని చుప్పనాతిగ-నుర్వి పైన నుండెరా ॥వద్దురా॥

ప త్తియంతా జేరదీసి-బొ త్తిగా లాగేసెరా
పేదవారి అన్నమంతా-కుక్కమాడ్కి తినుటజేసి॥ వద్దురా॥

లేవరా మన రాట్నదేవత-జీవితంబిక నేలరా
ప్రోవ ప్రోవ కన్నతల్లి-గౌరవము బూజింపరా ॥వద్దురా॥

ఏడుకోట్ల ప్రజలనోట-మట్టిగొట్టుచు నుండెరా
కూడుగుడ్డ లేక పేదలు-గోలపెట్టుచు నుండగా ॥వద్దురా॥

బాబుకన్ను ప్రాణమెల్ల-పట్టితీసిన బట్టరా
చిరుత కుర్రల నసువులెల్ల-చిచ్చు బెట్టిన బట్టరా ॥వద్దురా॥



# రాష్ట్రమంజరి

(చెలికవాడ వేంకట నరసింహం)

"స్వరాజ్య దసరా-పద్యము"

మా పాలి మహాలక్ష్మి- మా యన్నపూర్ణ
మా సరస్వతీదేవి_మా రాజ్యలక్ష్మి
మా కామధేనువు—మము గన్నతల్లి
దేశంబునందు సు-స్థిరవాసియైన
క్షామదేవతకు నమ—స్కారముజేసి
సాగనంపగలట్టి—శ్యామలాదేవి
ఆకలి బాధచే-అల్లాడుచున్న
బిడ్డల కన్నమ్మ—పెట్టుకొను తల్లి
కట్టుగుడ్డయు లేని-కడు హీనదశను
బాపి మా మానమ్మ-కాపాడు తల్లి
మారి మహామ్మారి- ఘోర జాడ్యములు
నిర్మూలమొనరించి-నిండుదయతోడ
బిడ్డల బ్రతికించు-దొడ్డయిల్లాలు
విమతుల శిక్షించు—విష్ణుచక్రంబు
కోరి చేరినవారి_కొంగుబంగారు
సన్నగా నున్నగా-చౌకగానున్న

పై మెఱుగులు చూచి-భ్రమచెంది మేము
పరదేశ వస్త్రములు-ధరియింప మరిగి
నిన్ను మూలకుద్రోసి-నెత్తిపై ముప్పు
తెచ్చుకొంటిమి తల్లి-తెలివి హీనులమై
పరదేశ వస్త్రముల్-పాప రాసులుగ
భావించి దహనంబు గావించి నీకు
ధూప దీపము లిచ్చి-దోషహీనులమై
మన నించినా మింక-మాతరో మేము
నీవుండు నట్టిల్లే-నిండిన యిల్లు
నీవు లేకుంటివా-నెరి వల్లకాడు
నిన్ను ముట్టెడుచెయ్యి-పున్నెంపు చెయ్యి
కొయ్య తెల్లనవచ్చు-కొదువ హస్తములు
పాడి పంటల నిచ్చి-భాగ్యమ్ము లిచ్చి
అన్నవస్త్రము మిచ్చి-యారోగ్య మిచ్చి
ఆత్మగౌరవ మిచ్చి-యభిమాన మిచ్చి
సౌఖ్య శాంతము లిచ్చి స్వాతంత్ర్య మిచ్చి
రక్షించు మాతల్లి-రాట్నమా నీవు
మా తప్పులు మన్నించు-మమ్ముద్ధరించు
దండముల్ పదివేలు-దండముల్ నీకు
జయాభి జయ భవ-దిగ్విజయ భవ-



# సీమగుడ్డ

(కొండపల్లి జగన్నాథదాసు)

"పాలకడలి శయన రారా" అనే వరుస

సీమగుడ్డ కట్టబోకుమురా! నాచిట్టి బిడ్డా
సీమగుడ్డ కట్టబోకుమురా॥
సీమగుడ్డ కట్టినీదు-సీమమెల్ల పాడుజేసి
నా-నామమే లేకుండచే_స్తివిరా! నాచిట్టి బిడ్డా ॥సీమగుడ్డ॥
రాట్నములను పొయిలో బెట్టి-రమ్యకళను మంటబెట్టి
చేటు నిట్లు తెచ్చుకొంటివిరా! నాచిట్టి బిడ్డా! చేటునిట్లు
తెచ్చుకొంటివిరా!
ప్రాణతుల్యమైన స్వేచ్ఛ-పాడుచేసికొనుచు నీవు
మానజాలవేమి మోహాముసు-ఆ సీమపైని-ఆ సిల్కుపైని
మానజాలవేమి మోహాముసు
నా చిట్టిబిడ్డ! సీమగుడ్డ కట్టబోకుము రా!
మూడునెలల ము_క్తికోసం! పాడుగుడ్డలు వదలలేని
నీ-మూర్ఖత నేమంచు వగతుమురా! నాచిట్టిబిడ్డా
సీమగుడ్డ కట్టబోకుమురా॥



# రాట్నము

(వంగనామముల రామచంద్రరావు)

సీ॥ జరరాగ్ని కీలికా జర్ఝరితాంగులౌ
భారత ప్రజల జీవాతు వనగ
దుర్వార దుస్సహా దుర్భిక్ష శాకిని
యేపార్చు హనుమత్స్వరూప మనగ
దేశీయ సంపదుత్సేక మహాలక్ష్మి
యవతరించు కుశేశయం బనంగ
పాశ్చాత్య కార్మిక ప్రాణానిలంబెల్ల
నాహరించు బిలేశయం బనగ

గీ॥ వైభవాభోగ మాన దీవ్యత్ప్రతిష్ఠ
లతుల సుఖజీవనంబు కామిత ఫలంబు
సరిగ సవరించు దేవతా సురభియనగ
దనరు "రాట్నంబు" భక్తసుదర్శనంబు॥



# నూలువడికే విధము తెలియండి

(కొండపల్లి జగన్నాధదాసు)

"భజనచేసేవిధము తెలియండి"—వలె

నూలువడికే విధము తెలియండి—జనులార—మీరు
విధము గనుగొని—లాభమొందండి
నూలువడికే విధము తెలియక—సాలు కరువది కోట్లరూపా
యీలు వ్యర్థముగాను పరదేశాల పాలుసేయబోకను ॥నూలు॥

రాటమే మన మూట యనుకొనుడు—రత్నాల యేకుల
రాటమే మనమూట యనుకొనుడు
రాటమే మనమూట యనుకొని—పాటుపడుచు నూలువడికిన
కాటకము లెన్నింటినైనను—దాటగలమను మాటనమ్మిచు
॥నూలు॥

సీమ బట్టల కాశపడకండీ—జనులార మనకది—
క్షేమమార్గము కాదుసుమ్మండీ!
సీమబట్టల కాశపడమను నీమముంగై కొనుచు నిత్యము
రామణీయకమైన యేకుల—రాటము మీచేత ద్రిప్పుచు ॥నూలు॥

మల్లుపంచల మాట మరువండి జనులార మీరు
తెల్లమాయకు-తెల్లబోకండీ!
మల్లుపంచల మాట మరువక—తెల్లమాయకు తెల్లబోయిన
చిల్లిగవ్వయుకూడ మిగులదు—కల్లకాదని యెదను దలచుచు
॥నూలు॥

ముతుక నూలని మూతిముడువకుడు-జనులార సతతము
వడుకుచుండిన సన్నమగునండి।
ముతుక నూలని మూతిముడువక। బ్రతుకు దెరవికనైన
జూడుడు
పతితపావనుడైన గాంధి—మౌనిజేసెడు బోధలను విని
నూలువడికే విధము తెలియండీ-జనులార-మీరు

—

# రాట్నము

(నెల్లూరు వెంకటు రామానాయుడు)

"గోదారి తల్లికి—గొజ్జంగిపూదండ"—వలె

నాతల్లి రాట్నమా। నాపాలి భాగ్యమా।
నా దేశమును వీడ—న్యాయమే? చెపుమా।
మాదు కాటకముల—మాన్పెడి కల్పకమ!
మాదరిద్రత దీర్ప—మరల రావమ్మా
కట్ట గుడ్డలనిచ్చి—పొట్టకు కూడిచ్చి
వట్టి తల్లివె నీవు—ఇట్టె రావమ్మా'

---

"అల్లో నేరడల్లో"—వలె

వడుకు వడుకు కదుర—వడుకవే కదురా
వడికి మాదారిద్ర్య—మెడపవే కదురా
రాణి వాసస్త్రీల—రక్షించు కదురా
మానంబు కాపాడి—మన్నించు కదురా
సిరాగ దీధితుల—నెలకొన్న కదురా
మా భోగభాగ్యాలు—మరలవే కదురా
నిన్ను గుర్తిడ లేక—నిన్నాళ్ళు కదురా
నిత్య దారిద్ర్యంబు—నిలిపితిమి కదురా
కట్టుగుడ్డకు కూడ—కఱవాయె కదురా
పొట్టకూటికి వగల—బొందితిమి కదురా॥
వడుకు, వడుకు కదుర : వడుకవే కదురా॥

---

# కట్టుకుమా! సీమబట్ట

(నెల్లూరు వెంకటరామానాయుడు)

"రారాపోదాము" వలె

కట్టకుమా సీమబట్ట-పెట్టకుమా వానిపొట్ట
కట్టకట్టి కడకు దేశమిట్టి గతికి దెచ్చితివి ॥కట్టకుమా॥

త్రిప్పుమ-రాట్నము-మనసు ద్రిప్పుమా ఆగుడ్డనుండి
త్రిప్పకున్న నింక కడతేరలేము లేమినుండి ॥కట్టకుమా॥

మంచి మంచి కాపురాలు—మంటల పాల్జేసి-కడకు
కొంచెమైనలేక కొంప గుల్ల చేసినట్టి ॥కట్టకుమా॥

కదురు చల్లంగుంటె కదలదా మాంచెస్టర్, నీ
కదురు వదలిననాడె-కదలిపోయె రాజ్యలక్ష్మి ॥కట్టకుమా॥

తగులబెట్టు సీమగుడ్డ-మిగుల గట్టు దేశగుడ్డ
వగవవలదు దీనము క్తి-వచ్చునండి కల్లగాదు ॥కట్టకుమా॥

卐

# కట్టుకురా సీమగుడ్డ

(కొండపల్లి జగన్నాథదాసు)

"పాలించరా పాండురంగ" వలె

కట్టకురా సీమగుడ్డ యిటుపై కట్ట ననుచు నొట్టు పెట్టరా బిడ్డ॥
మనజాతి మన మతము-మాటను మరపించి
మత భ్రష్టజేసెడి-మాయ సీమగుడ్డ ॥కట్టకురా॥

అన్నదమ్ములనక-ఆలు బిడ్డలనక
ఐకమత్యము జెఱచు-నా సీమ చెడుబట్ట ॥కట్టకురా॥

వడుకు నూలుబట్ట-వడుపైన యేడిబట్ట
వదలిపెట్టి తెల్ల-వారి మైలబట్ట ॥కట్టకురా॥

మానముగాచెడి-మన బట్టలను మాని
మానము జెరచెడి-మాయమల్లు బట్ట ॥కట్టకురా॥

గాంధీ మహాత్ముండు-కరుణా సాంద్రుండు
కరివరదుసిబోధ-కనుల నద్దికొని ॥కట్టకురా॥



# రాట్నము

(మోహన-ఏకతాళము)

[ధాసరిగగ-గాగగగగా-రిరిసస-ధాసారిరీ
గాగసాధ-సాససాన-సాధపాగ-ధపగరిసా : ధా :]

భారతుల కవాటము, సం-పదలకు బాహాటము
పారతంత్ర్యమునకయః కవాట మీరాటము॥

మోసగించి కోట్లధనము-పొట్టబెట్టుకొనెడు నా
మోసగాండ్ర కెల్లరకు-జ-పేట మీ రాటము॥

నీటుచూపు దొరలతో-జెరలాటము కోలాటము
నేటి కలిమిలేములకు-బోరాట మీ రాటము॥

రాయివెట్టు దొరల కారాట మీ రాటము
కాటకముల మీటు విరా-ఘాటముగ నీ రాటము॥

భారతీయ శాస్త్రసూక్తి పారమీ రాటము
నే రచించు మోక్ష రాజ్య-పీఠమీ రాటము॥



# కొనకుమా! యీసీమబట్ట

కొనకుమా యీ సీమబట్ట-నీవు కొంటివేని,
మనము కోల్పోనుపెట్టా॥ కొనకుమా॥
రంగురంగుల బట్ట చూచి-పలుభంగుల కాపురమెనసి
కాపుర మెల్లదోచి॥ కొనకుమా॥
నీ కొంప కూల్చినదిదియే-పై కానీకు దెలియనీక
నేర్పు నున్నాయె ॥కొనకుమా॥
నీ చేతి రాటమువదలి-పరుల మోచేతి క్రింది తొత్తువు-
యెంతజాలి ॥కొనకుమా యీ సీమబట్ట॥



## సీమగుడ్డను మాన-వెంతటి సిగ్గురా ! ఓ సోదరా !

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

సీమగుడ్డ మానవెంతటి-సిగ్గురా! ఓ! సోదరా!
ఈ మహావ్యామోహమెంతో-ఎగ్గురా! నా సోదరా ॥సీమ॥
నిగనిగలు ధగధగలుచూచి-నీవు భ్రమపడ బోకురా
సొగసు కనుగొని మురియబోకుము-షోకె పెను మరమేకురా॥ సీమ॥
ఏటి కరువది కోట్ల రూపాయీలు సెలవయి పోయెరా!
పాటకపు జాతులకు కూటికి గుడ్డకే కరువాయెరా ॥సీమ॥
జిలుగు నూలే పోయెరా! మన చేతిపని చెడిపోయెరా
వలువలకు పరదేశజుల-బ్రతిమాలు గతి మనకాయెరా ॥సీమ॥
మానరక్షణ గాదురా-అవమానమిది గానరా,
మానుషము గాదీ యకార్యము-మాని రాటము పూనరా ॥సీమ॥
సద్దులేటికి నీ వీటుండిన-సుస్వరాజ్యము రాదురా
ఖద్దరు ధరియించి, దేశము-నుద్ధరింపరా ॥సీమ॥

# రాట్నము

(బసవరాజు అప్పారావు)

సిగ్గులేదా నీకు-శరములేదా?
అన్నమైనలేక బీద-లల్లాడుతుంటేను
సీతాకోక చిలుకలాగ—సీమగుడ్డ కట్టితిరుగ ॥సిగ్గులేదా॥

పూట కూడులేని ప్రజకు-రాట్నమొకచే పెన్నిధాన
మోటంచు పవిత్రమైన-రాటం ఖద్దరు వెక్కిరింప ॥సిగ్గులేదా॥

అంగడులన్నియుంటే-అల్లుడినోట శనున్నట్లు
భాగ్యరాశి భారతభూమి-పరదేశ సరుకులేల ॥సిగ్గులేదా॥



(కొండపల్లి జగన్నాథదాసు)

జంఝూటి త్రిశ్రగతి

వల్లవి: సుందరమ్మైన రాటమె-పసదుం బాంబురా
సందేహమేల దానిలోన—స్వరాజ్యమున్నదిరా॥ సుందరమ్మై॥

ముతక గితక 'జాంతానై రా'-బ్రతుకుతెరువదిరా
సమువడుకుచున్న నీకు-సన్నమువచ్చునురా॥ సుందరమ్మై॥

ఆరుకోట్ల పంచములకు-అన్నము పెట్టునురా।
మాల సూలు మాట నీవు-మరచినావటరా ॥సుందరమ్మైన॥

# ఖాదీప్రబోధము

(మునగపాటి విశ్వనాధశాస్త్రి)

రాటము వడుకుము-మాయమ్మా! మన
కాటకముడుగును-వినుమమ్మా ॥రాటము॥

మహాత్ముఁడేగద-జయమ్మః దీని
మహిమ దెలిపెను-వినుమమ్మా ॥రాటము॥

సిరులనిచ్చును-మనరాటం-చిర
కీర్తుల నొసగును-ఈ రాటం ॥రాటము॥

నూలుపోగు జగదాధారం
మూలసూత్రమిది యుపదేశం ॥రాటము॥

జై మహాత్మయని పాడుచునూ
సన్నని దారము వడుకుచునూ ॥రాటము॥

దేశదేశముల మన ఖ్యాతి
తేజము నిల్పుము-ఓసుదతి ॥రాటము॥

# రాట్న గీతము

(గురజాడ రాఘవశర్మ)

యమునాకల్యాణి ఆదితాళం

వడుకుమురా! వడుకుమురా!
వడి వడి–స్వేచ్ఛా–వాయువుబీల్చి ॥వడుకుమురా॥

తెలివి గలిగి వే–వడుకుమురా–నీ–దేశోద్ధరణకు–తెరగదిరా !
కలిమి–బలిమి–యీ–కదురే గదరా!–క్రమ్మఱరాజ్యంబియ్య
సూత్రమురా ॥వడుకుమురా॥

ధర్మసూత్రముల–దారము దీయగ
మర్మములను వి–ధ్వంసము సేయగ
నిర్మలమగు, శాం–తిని వెదజల్లగ
యోర్మిగల్గి మా–నసమున వడిగా ॥వడుకుమురా॥

పరాధారమా–బ్రతుకెందుకురా!
విరాన నీ శ–క్తిని దెలియుమురా!
స్వరాజ్య మిదె, నీ–రాట్న చక్రమున–
సాధింపగ–శాంతి–న–హింసాపథమున॥

వడుకుమురా! వడుకుమురా!'

# కల్లు

(గరిమెళ్ల సత్యనారాయణ)

కల్లుత్రాగి నీయిల్లునెల్ల-గుల్ల చేయకు
నీ వళ్ళు రోగాలకెల్ల-వడ్డి కీయకు ॥కల్లుత్రాగి॥

పిల్ల జెల్లలనుతెచ్చి—వీధిపెట్టకు-ముసలి
తల్లి తండ్రులనుబట్టి—తన్ని కొట్టకు ॥కల్లుత్రాగి॥

త్రుళ్ళి త్రోవలను నీవు-తూలి పాడకు
బుద్ధికాలుగలిపి యవమాన మొందకు ॥కల్లుత్రాగి॥

తెల్లవాడి చూపులు—అది తిరుగును రంక
నీవు కల్లుమానితేను చాలు కట్టుర శంక ॥కల్లుత్రాగి॥



# మరువబోకండి

("రారాపోదాము."—వలె)

మరువబోకండి మమ్ము- మళ్ళి మళ్ళి రాము
మరచిపోవండి-యీ మలినం-పఠ్యాసంబు ॥మరువ॥

కలవు లియ్యేది తెచ్చె-కష్ట మియ్యేది తెచ్చె
దొరలకు కల్గిన-దోర్బల మిది యిచ్చె ॥మరువ॥

కాపురంబులు చెరుపు-కన్నబిడ్డల చెరుపు
పాపాలన్నియు గలుపు-పరము మంటను గలుపు ॥మరువ॥

గాంధిగారి యాజ్ఞ-కమలాక్షుని యాజ్ఞ
సందేహంబులుమాని-సాగించుడీ యాజ్ఞ ॥మరువబోకండి॥

— x :—

# కల్లు త్రాగబోకురా

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

కల్లు త్రాగ బోకురా, నీ యిల్లు వళ్ళుకూడ—గుల్లలౌతాయిర
కల్లు తాగి బాగ కైపెక్కి తెలియక అల్లరిచేసిన-వల్లరి పడతావు
కల్లు సారాలమ్మి-కొల్లాగొట్టి సొమ్ము-
కల్లారి సరకారు- ఖైదిలో పెడతారు॥ కల్లుత్రాగబోకురా॥
గంజి నీళ్లకైన-కాసు చేతలేక-గుంజు వచ్చే గొడవల తెచ్చు
కల్లు
నలుగురిలోపల-తలవంపు వచ్చుర-చెలిమి కలిగినచోట చుల
కన హెచ్చుర
నీ రక్త మాంసాలు-నిలువున హరియించి, ఘోర రోగాలచే-
కుందించి చంపుర,
కల్లు సారాయీల-వల్ల ఫకీరులై—తల్లడిల్లే వారి
కళ్ల చూడలేదా ॥కల్లుత్రాగబోకురా॥

—x—

# త్రాగుడు పిశాచమా! ఇంక తరలిపొమ్మా

(గురుజాడ రాఘవశర్మ)

మొగలాయి పాదుషాల, గులాములుగ జేసి
స్వైరవిహారమ్ము సల్పినావు
సంపదోన్మత్త రాజకిరీటముల డించి
శివిగా, నాట లాడించినావు
ఆంగ్లేయాదేశ మర్యాద, మర్యాద, య
టంచు, మాయించి, పాలించినావు
లాలించి. పేదల రక్త మాంసమ్ముల
ద్రావి తాండవరూపు దాల్చినావు

ఎంత మాయాస్వరూపిణి, విపుడు దెలిసె
నౌర నీ గుట్టు; మా పొలిమేర విడచి
వెడలు మిటనుండి, యింక, త్రాగుడు
పిశాచమా! నిశాచర! పెనుభూతమా! వెడలుమ॥

పర ప్రభుత్వముక్రిందఁ పడియుండుటన్ జాతి
నిన్ సాగనంపగా నేరదయ్యె
చిరదాస్యమున జిక్కి దెలివమి కన్నులు
నిన్ రూపుమాపఁగా నేరదయ్యె

పెద్దల మాటల పెడచెవిన్ బెట్టుటన్
నీ ద్రోహమెరుగగా, నేరరై రి
దేశదారిద్ర్య విధిన్ నీ స్వభావమ్ము
లెంత చెప్పిన, తలకెక్కవయ్యె

ఇపుడు, స్వాతంత్ర్యమున్ గడియించినారు
భరతఖండాన నిల్వ గాపాడి
కదలు మిటనుండి, యాళల వదలుమింక
త్రాగుడు పిశాచమా! యింక తరలిపొమ్మ.



# హరిజనులు

(నెల్లూరు వెంకటరామానాయుడు)

''హరినామ స్మరణచేయండి''—వలె

పల్లవి : మాల మాదిగ వారమండి మమ్ము
చాలగ ప్రేమించి-కాపాడరండి॥
కూలి జేసెడి వారమండి-ఎండ
గాలివాన లనక యే ప్రొద్దుసుండి ॥మాల॥
పాలు మాలని వారమండి-పట్టి
పాలైన కోరకే పండింతుమండి ॥మాల॥
దిక్కుమాలిన వారమండి-మేము
పెక్కు బాధల పడి పొక్కితి మండి ॥మాల॥
కష్టించి పనిచేతుమండి మీతో
సృష్టి పుట్టినపుడె-పుట్టితిమండి ॥మాల॥
హీనపు మాలలనకండి-ఎల్ల
మానవులందొక-యాత్మే కదండీ ॥మాల॥
పశువులవలె జూడకండి-మమ్ము
విసిగెంచిన గాని-కసి బూనమండి ॥మాల॥
గాంధి బోధలవిసరండి-మాకు
బంధవిముక్తికి-బని బూసరండి ॥మాల॥



# మాల మాదిగల మొఱ

(బసవరాజు అప్పారావు)

గాంధిమహాత్మ-గాంధిమహాత్మ
కాచి రచ్చించు-గాంధిమహాత్మ!
సరకారవోరు-కరుకైనవారు
ఉప్పేరితేను-తప్పేసి నోరు
డబ్బుగలోరు-దరికి రానీరు
ఈ గోరమేమి-మా నేరమేమి
మాలమాదిగలం-మనుషులంగామా
కుక్కలకన్నా-తక్కువయ్యామా
మా మొఱాలించ-సామీరె దిక్కు
ఆసామివారి-అవుతారమైన

గాంధిమహాత్మ-గాంధిమహాత్మ
కాచి రచ్చించు-గాంధిమహాత్మ.



# మాలలు

(మహాకవి గురుజాడ అప్పారావు)

మలిన వృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియు రాక; దే
శమున కొందరి వెలికి దోసిరి
మలినమే మాల?
కులము లేదట వొక్క వేటున
పసరముల హింసించు వారికి;
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూరకర్ములకున్॥
మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే,
అనెడు నిశ్చయ మాత్మదోపగ
"వినుము కన్నియ!" యంటి యెదురై
"జనులు తెలియక పలుకు మాటకు
జనదు వగ వంగన్."
మంచి చెడ్డలు మనుజులందున,
యెంచిచూడగ, రెండె కులములు
మంచియన్నది, మాలయైతే,
మాలనే, అగుదున్!

మాల యను వారున్న, వారల
మంద బుద్ధికి వగవ వలె; తన
యందు లేని కొరంత కలదని
వగవగా నేలా?

మలిన వృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము;
పల్లె కలదిట; ప్రాజ్ఞు లందలి
ప్రజలు మావారల్ !

పాడి పంటలు గలవు, తామర
తంపరలు మా పశుల మందలు:
జంతు హింసను చేయ నొల్లము
భూతదయ మతము !

మాలనైనను మలిన వృత్తులు
మానుకొంటిని గురువు దయచే;
పొలములోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్.

కాని, మనుజుని బుద్ధిలోపల
కలవు తన మే లొరుల కీడును
తలచు వృత్తులు కానబోయిన
కలచు నెవ్వారిన్.

మాన్పగలిగితి కత్తికోతలు :
మాన్పవశమే, మాటకోతలు
కత్తిచంపును మాట వాతలు
మాన వే నాడున్!

# దరిద్రనారాయణీయము

బొబ్బిలి పాట మాదిరి

*(కోడేటి రంగాచార్యులు)*

రామ రామ రామాభిరామా శ్రీరామా
లోకనాయకా పావననామా లోకైక రామా
జయము జయము శ్రీ గాంధిమహాత్ముని జయము దిగ్విజయము
జయము జయము మాభారతజాతికి జయము దిగ్విజయము
పంచముడని మనసాటి మానవుని, బహిష్కరించెదరా
పంచమ సహకారము లేనిచో, బ్రతుకు గడుపగలరా
కొట్టిన తిట్టిన మననేమంటే కోరును పంచమడండి
యెట్టులైన మనమేలు కోరి, తా, నిబ్బందులు పడునండి
ఊరికి వెలుపల పూరికొంపలోనుండును కాపురమండి
దారిద్ర్యమునకు ముద్దుబిడ్డడై, తంటాల్పడతాడండి
నూతినీరు తోడకూడదంటే, నోరు విప్పబోడండి
జాతిభేదమెంచి తొలగుమంటే, సర్దుకుపోతాడండి
గుడిలోనికి రావలదనియంటే, గుడిదరికే రాడండి
బడిలోనికి రానీమనియంటే, భయపడిపోతాడండి
వద్దనియంటే యేపనినైనా వదలివేసుతాడండి
కొద్దివాడనని యనుకుంటూ, మనగొప్ప యెన్నుతాడండి

పుట్టుట మొదలుగిట్టేవరకూ, పూర్తిగ తోడగునండి
పట్టి నిందలకు శిరమునొగ్గి మన, వాంఛ తెలిసికొనునండి
యిట్టి పంచముని యెడల పెద్దలకు, నెట్టి ప్రేమమో కనుడు
ఉట్టిగట్టుకొని ఊగేటట్టులు, తిట్టుటమేలా వినుడు
పంచమదర్శనమైతే ఒక్కడు, పళ్ళుకొరకుతాడండి
పంచమస్పర్శకు పాముకరచినటు, బాధనొక పడునండి
ఇతర దేశముల కేగిన తెలియును, ఎవరో పంచములంటే
మతమునకింతటి విపత్తుదెచ్చిన, మనమే పంచములంటే
ఒక తెగవారిని త్రొక్కివేసి మన, ముచ్చు స్థితికనగలమా?
అకటా యీదోషమెగాదా మన, కంటిన దనుకోగలమా?
కూలికివచ్చెడివాడు పంచముడు, మేలును కోరెడివాడు పంచముడు
బాటను కాచేవాడు పంచముడు, కాటనుగాల్చెడివాడు పంచముడు
అట్టివాని నాదరించకుండా, అవల గెంటుతావా
ఇట్టి నిన్ను భగవంతు దేమనునొ యెంచుకొనగలేవా॥రామరామ॥
గాంధిమహాత్ముని యుపవాసమునకు, కారణమేమో కనుడు
సంధియముల విడనాడు దేకమై, సాటి నరుడు పంచముడు
బావినీరు పంచముడు త్రాగితే, బావియేపాడౌతుందా?
బావిలోనపడు పక్షులరెట్లకు, బావిబాగుపడుతుందా?
దేవుని గుడికై పంచముడొస్తే, దేవుడు పాడౌతాడా?
నీవు నేననే భేదమునీకా? దేవునికుందంటావా?
ఆచారము, సాంప్రదాయమనుచును, హడలిపోకురా బాబూ!
ఆచారముపాడని తోచినచో, అతిక్రమించరా బాబూ!
సాంప్రదాయమని యంటే చెడుపని, సాంప్రదాయమేయౌనా?
సాంప్రదాయములకే మనసుంటే, సాటిమనుజుడిట్లౌనా?

శంకరాచార్యు లద్వైతమత, స్థాపనచేస్తూఉంటే
శంకరుడే పంచముడై యడ్డుగ, శంకలేక నిలుచుంటే
తప్పుకుపోయిన ఆచార్యునిగని, తప్పుబట్టగాలేదా ?
తప్పుతెలిసి శంకరాచార్యుడా, తప్పుదిద్దుకోలేదా
శ్రీమద్రామానుజులాళ్వారుగ, జేయలేదె పంచముని
శ్రీమానులు తిరుపాణాళ్వారుని, జేరి మ్రొక్కి రాఘవుని॥
మతప్రవక్తకు బ్రాహ్మణపంచమ, మర్యాదలతోనేలా ?
మతము సకలసమ్మతము కానిచో, మనుజులకామతమేలా?
అంటరానివాడని యొకమనుజుని గెంటివేయునా మతము ?
పంచమ దుర్గతి కంతకుమనమే, పట్లనైన కారణము
పంచమ సద్గతికై పనిచేయ ముపేక్షించుట దారుణము
భరతదేశమంతయు మేల్కొనినది, పంచమ గానమువినుము
భరతమహాఋషిపూనా ఖైదున పాడు చుండెరా కనుము
పరమ పదవు సోపానమైనయీ, భరతజాతి పడినావు
పరమపవిత్రపు హిందూమతముకు, వరపుత్రుడ వైనావు
సాటి మానవుని పంచముడనుచును, సందేహించుట తప్పు
వర్ణ భేదముల మరచి ప్రజల నీ వంకకురమ్మనిచెప్పు
చాటినట్టులిది గ్రామపట్టణపు, జనపదంబులనుచెప్పు
స్వర్ణయుగము రానున్నది దానికి, సర్వసమత్వమెయొప్పు
జయము జయము శ్రీగాంధిమహాత్ముని జయము దిగ్విజయము
జయము జయము మా భారతజాతికి జయము దిగ్విజయము

(సంకలితము)



# సవర్ణ గర్విష్ఠి

(తాటుకూరు సత్యానారాయణరావు)

నా యభాగ్య దేశంపు సంతానమైన
ఓః సవర్ణ గర్విష్ఠి! పేరాస వీడి
దులిపి వేయును నీ గొప్పకులపు నీటు
ఎవరిపైన ఘృందా తిరస్కృతుల పేర
బెఱుగుచుంటివో ఆ పుష్ప కరదు లెల్ల
కుప్పలై వచ్చి నీ తల కూలునోయి!
మానవుడనంచు తలయెత్తి మసలకుండ
ఘొదిగితివి గాదె కడజాతి బండకొయ్య।
నీచపుంగతి కన్నుల చూచిగూడ
మనసు కరుగని పెడసరితనపువాడి
తీర దొకనాడు యీ యప్రతిష్ఠకీవు
అన్నిటను వానికి సమానమగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

అన్ని విధముల నీకు తోడైన వాని
కాకకమటంచు వెంటాడి తరిమినావు
సృష్టికర్తనే తుద కీసడించినావు

అది సహింపక ప్రభువు శాపానలమయి
కాని కాలాన డొక్కల కఱవు వచ్చి
తూలిపడి...వాని పంచ గల్లాలో నీళ్ల
త్రాగెదవా యేమొ దప్పిక కాగలేక
తీర దొకనాడు యీ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్ప దీమాట గుండెలో దాచుమన్న॥

కలబలంబెల్ల నొక్కచో కదియ దీసి
కర్కశంబగు నీ పాద ఘట్టనముల
తమ్ము డనకుండ పైబడి తన్నినావు
వాని లజ్జాకరంబైన బ్రతుకు వోలె
అంతదుర్దశపాలు గానంత వరకు
లేదు నీ కిక రక్షణే లేదు నిజము
తీరదొకనాడు యీ యప్రతిష్ఠనీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

నీ యభాగ్య దేశంపు సంతానమైన
ఓ సవర్ణ గర్విష్ఠి ఏ యూహ తోచ
ఇంత సంతోషముగను త్రుళ్లింత పడుచు
ఎవని నీ కాళ్ల తో మట్టగించుచుంటి
వతడె తన నల్పునిగ జేసినట్టి వోటి
కచటికే లాగి పడద్రోయునయ్య విన్ను
కోరి యజ్ఞాన గాఢాంధకుహరమందు

యెవని బలవంతముగను త్రోయించినావో
అదియె యజ్ఞాన మవధులనంటి వెడలి
అనుకొనని యంతులేని బ్రహ్మాండమైన
కారు చీకట్ల, నెందును దారి లేక
బాగుపడకుండ నీ కడ్డుపడిన దోయి,
తీరదొకనాడు యీ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

కులము గొప్పకు నింత సిగ్గును త్యజించి
ప్రభువు బిడ్డలకే తలవంపు దెచ్చి
యెన్ని యుగములు నిట్లు వేధించినావు
వానితో స్వామి నెలకొన్న వాడటంచు
యిప్పటికినైన సాష్టాంగ మేలపడవు?
గొంతులను గోయు నీ కులగోత్రధాటి
కా దరిద్ర నారాయణో యనాధ
నాధుడే ధూళి గరచి సంతాప పడుచు
ఎట్లు పొరలాడుచుండె వీక్షింపు మింక
తీరదొకనాడు యీ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

నా యభాగ్యదేశంపు సంతానమైన
ఓ సవర్ణ గర్విష్ఠి! ఇంకొక్క మాట

తేరి చూతురె నా బలాదూరు వీర
లన్న నేరాలనే పట్టుచున్నవాడు
కలడు యమకింకరుడు నీ తలుపుముందె
కలత పెట్టె నా పాపిష్ఠికులముగాదె?
ఇప్పుడైన గ్రహించి ప్రేమింవేవి
తగవు బొమ్మావలకు బొమ్ము తగవు నీవు
పై బటారపు గర్వగంబళపు చింకె
నీవె నిన్ను చుట్టుకొచి బంధించుకొనుము
చచ్చి కాటికి బోయి తక్షణమునందె
నీవు బూడిదయగునాడు నిక్కవముగ
అన్నిటను వానికి సమానమగునపుడె
తప్ప దీమాట గుండెలో దాచుమన్న॥



# పొలి పొలీ : బలి బలీ

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

పొలి పొలీ బలి బలీ !
కలకలా రాగదే
కలికి బంగరు తల్లి !
కనుల పాల్గారుతూ
మా స్వరాజ్యదేవతా!
మా తల్లి
మా భరత రాజ్యలక్ష్మి!
హిందూ ముసల్మాను
లందఱము వచ్చాము
బౌద్ధ సీఖులు ఏక
భావులై వచ్చాము,
పారసీ క్రైస్తవులు
పరుగున వచ్చాము
బ్రాహ్మణ పంచముల్
కలిసి కలిసొచ్చాము
మా భేదభావములు
మంట కలిపేశాము
మమ్ము మన్నింపవమ్మా

మా తల్లి!
మమ్మాదరింపవమ్మా
పొలి పొలీ బలి బలీ!
ఋగ్యజుస్సామాలు
గ్రంధ త్రిపిటకాలు
జెందవెస్తఖొరాను
జెహోవ కీర్తనల్
పాడుతూ ఆడుతూ
వేడుకల్ మీరుతూ
నీ గుడికి చేరినామే
మా తల్లి!
నీ నీడ నిల్చినామే
పొలి పొలీ బలి బలీ!
రామ భీమ కిరీటి
రాణ ప్రతాప శివాజి
కృష్ణరాయ మహాంధ్ర
విష్ణు యుగంధరుల్—
వీర విక్రమ కళా

విశ్రుతోదారుల
వేడి నెత్తురమాది
వాడికత్తులు మావి
వీరభారతులమమ్మా
మా తల్లి!
కోరి జాతర వస్తిమి
పొలి పొలీ బలి బలీ!
నవజీవన ప్రభల్
దివి నుండి పర్వగా,
నవ యుగోదయలక్ష్మి
నాట్యముల్ సలుపగా
నవరాగ మాధురుల్
సమలి గుండెలు లాగ
పరుగు పరుగున నీదు
అరుగు దరికొచ్చాము.
తరుణారుణోద్ధుర
స్ఫురణోగ్రతేజులము
తరుణ భారతులమమ్మా
మా తల్లి!
కరుణమా బలిని గొమ్మా
పొలి పొలీ బలి బలీ!
అతుల శుభ చరితలై
సతుల సిగ పూవులై
చితుల నెక్కిన ఆర్య
సతుల సంతతులము,

పతిత భారత ఘోర
పరిభవానల మార్ప
వ్రతులము, నవ్య భా
రత వీర సతులము,
వితత సర్వార్పణో-
ద్యత మతిని నీ దరికి
కుతుకమున వచ్చినామే
మా తల్లి!
అతికృపను మమ్మగనవే.
పొలి పొలీ బలి బలీ,
పాలబుగ్గలనాడె
వాలాయమున సమిత్
కేళీ వినోదులై
వాలి యరి శిరములను
గోలీలుగా జేసి
హేలచూపిన మహా
శాలివాహను భేటి
బాలచంద్రుని ధాటి
మా కండనెత్తురుల
మరల మేల్కాంచంగ
ఏలుకొన వచ్చినామే
మా తల్లి!
బాలభారతులమేమే.
పొలి పొలీ బలి బలీ!
చిరదాస్య బంధ బం

ధురవేదనల నలగి
కలగి మ్రొక్కిన నీదు
గారాబు బిడ్డలము,
కడిది ముప్పదికోట్లు
పొడవు చెడియున్నాము
కాలు చేతులు నోళ్లు
కట్టువడియున్నాము
దీనులము నీ కృపా
ధీనులము నీకిదే
కానుకగ మా తను
ప్రాణముల్ తెచ్చాము;
వేళ ఇక రాగదమ్మా
మా తల్లి
వేగ బలిగొన గదమ్మా.
పొలి పొలీ బలి బలీ!
మామనోరాజ్య వి
భ్రాజన్మహారాజ్ఞి!
మా ముక్తిరూపిణీ!
మా శక్తిదాయినీ!
మా కష్టవారిణీ!
నీ భక్తవరులము
నీ దాసజనులము
నీ గద్దె సన్నిధికి
నేడు బలివచ్చాము
రాగదే స్వరాజ్యలక్ష్మీ!
మా తల్లి!
రావె మా స్వర్గలక్ష్మీ!
పొలి పొలీ బలి బలీ!
మమ్ముకని పెంచేటి
మాయమ్మ దుర్గమ్మ
మమ్ముకాపాడేటి
మా మహాలక్ష్మమ్మ
మమ్ము మాయంచేటి
మా మహంకాళమ్మ
మాకంటి నీడలై
మాయింటి పడుచులై
మాయిలవేల్పులై
మాయూరికాపులై
మమ్మెపుడు బ్రోచేటి
మహిమకల ముక్కోటి
మా దేవతల్లార
మాతల్లులల్లారా!
రారమ్మ వేగమే
రారమ్మ పొలికి!
రారమ్మ వేగమే.
రారమ్మ బలికి.
పొలి పొలీ బలి బలీ!
మాకమ్మ నూర్పు తె

మ్మెరల ధూపమ్ములు,
మావాడిచూపు మెఱు
పుల గండ జ్యోతులు,
మా పొంగునెత్తురుల
మధుర పానకములు
అందాలతోవచ్చి
అందుకోరమ్మా!
మా గుండియలు చదిపి
మా మర్మములు కదిపి
మాలోభములు చిదిపి
మా రాగముల మెదిపి
మా జీవకుంభాల
మఱి మఱీ నింపుకొని
భూరి సంతృప్తిగా
ఆరగించండీ!
మా ప్రేమములు కంఠ

మాలికలుగా దాల్చి,
మాకామ గంధముల్
మైనిండ నలదికొని,
మీ కోటి కంఠాలు
మేఘవీధిని మ్రోయ
ప్రళయాంక గీతాలు
పాడగదరమ్మా!
చెట్ట పట్టాల్ గట్టి
అట్టహాసాలతో
గట్టిగా ఉప్పరము
దట్టితారలు చెదర
గొట్టి భువి యదరంగ
నట్టువలు త్రొక్కి మీ
ప్రళయ తాండవకేళి
ప్రకటింపరమ్మా!
బొలి బొలీ బలి బలీ!

(1930 సెంట్రలు జైలు రాయవేలూరు)

---

# ఆత్మ బలి

(బలిజేపల్లి లక్ష్మీకాంతకవి)

అది హేమంతము భారతోర్వి నిఖిలాశాంతంబులన్ గ్రమ్మ కొ
న్న దరిద్రస్థితి రీతిగా విరి స్వతంత్ర్యజ్యోతి వారించె స
త్వదయా సాయక నాయకోత్తములు మంత్రద్రష్టలై జాతి క
భ్యుదయార్థంబు దొడంగి రధ్వరవరంబున్ దొల్త ముంబాపురిన్.
సామామ్నాయ విదుల్ పురోధసులు యాచ్నాదైన్యలేఖాహవి
స్తోమం బర్వదియేండ్లు "రాష్ట్రపతయేతుభ్యం నమోస్తు"ంచు స్వా
హామంత్రంబుల నెంత వ్రేల్చినను స్వాహాభర్త మందార్చియై
వైముఖ్యంబె భజించె ప్రాఙ్ముఖమభావంబయ్యె నానాటికిన్.
జాతీయ ప్రభవీర్య మంత్రములచే సందీప్తమై ప్రాఙ్ముఖ
స్వాతంత్ర్యాగ్ని జ్వలించుగాకని ప్రతిజ్ఞాయాజి నౌరోజి వి
ఖ్యాతిన్ వ్రేల్చె స్వరాజ్యమంత్రమున దివ్యంబైన నవ్యాహుతిన్
జాతీయద్యుతిమత్తిలఙ్ముఖ మహాస్వాహా నినాదంబులన్.
ఆవిర్భావము జెందె నంతనొక దీవ్యచ్ఛక్తి విద్యుద్ద్యుతిన్
యావద్భారతమున్ సహస్రముఖజిహ్వల్ సాచి, ప్రాచీ ప్రతీ-
చీ వీధీ చయమెల్ల మార్మొరయ నార్చెన్ 'త్యాగ వీరాంకు లే
వో వెందీయగ నాకు నాత్మబలి నిండో'యంచు జంచద్ధ్వనిన్.
స్వదీపకానన క్ష్మాధరాం భోధింకం
బుర్వీ కరండ ముఙ్ఖాత లూగె,

స్రుక్స్రువంబుల బాఱజూపి ఋత్విక్కోటి
చీకాకునన్ గాందిశీకమయ్యె
"కిమితిబ్రువాణ" సంభ్రమ పరిభ్రాంతమై
పౌరాణిక శ్రేణి పాఱిపోయె,
కలగి రాష్ట్రాధికారుల రాతి గుండియల్
తటమటంబడి తప్పుదారి బడియె,
'బలి బలి'యటంచు నిటు, మహార్భటుల నఱచు
నా పరాశక్తి పటుధాటి కాగలేక
మొదటి మితవాది హోతలు ముచ్చముణిగి
దొరల మూల దివాణాల దూరుకొనిరి.
అపుడా యధ్వరవేది నొక్క మహనీయ వ్యక్తి ఆ దివ్య శ
క్తి పదాబ్జంబుల మోకరిల్లి 'జనయిత్రీ' 'భూతధాత్రీ' ఇదే
అపచారంబని స్వాత్మ జీల్చి బలిగా నర్పించె 'జై గాంధి' య
న్న ప్రశంసాజయ సాధువాదము లజాండంబెల్ల నిండారగన్.
రావోయి త్యాగవీర కుమార గాంధి నా
వీరమాతృఖ్యాతి విశదమయ్యె
మహి నహింసా మాధురాజ్యంబైన
ప్రేమ రాజ్యము సమార్జింపవోయి
విమత నాగర విషావేశ మూర్ఛితుల నీ
ప్రియ సోదరుల నుద్ధరింపవోయి
అపగతాడంబరంబగు ప్రశాంత గ్రామ
జీవనస్థితి బ్రతిష్ఠింపవోయి
సమధికాధ్యాత్మిక క్రియా శక్తిమూల
కీలకము రాట్న మిదె శ్రుతుల్ మేళవించె
పాడవోయి కుమార! విశ్వ ప్రపంచ
తారకజ్యోతి శాంతి స్వతంత్ర్యగీతి.
(25-4-1936 కృష్ణాపత్రిక)

# ఆగస్టు విప్లవజ్వాల

(సాంబశివరావు శాస్త్రి)

ఉబుకుచు వచ్చే-ఉద్రేకంలో-రాలిపోయినై-రత్నాలెన్నో
ఉరకలు వేసే-ఉత్సాహంలో-కూలిపోయినై-హృదయాలెన్నో
ఉవ్విళ్లూరే-ఉబలాటంలో-మంటగలిసినై ప్రాణాలెన్నో

వీరభారత యువకుల్లారా
విజయోత్సాహిత మూర్తుల్లారా
విన్నారా, మనవీరుల చరితం!
కన్నారా! ఆగస్టు విప్లవం.

ప్రాణంపోతే, పోయిందీ, మన భారతమాతకు, స్వాతంత్ర్యం
భుగభుగమంటూ భూమ్యాకాశాల్ అలుముకున్న ఆవిప్లవజ్వాలలు
యువతీయువకులు పిన్నలుపెద్దలు బలియైపోయారా జ్యోతుల్లో.

వీరభారత, యువకుల్లారా
విజయోత్సాహిత, మూర్తుల్లారా
విన్నారా, మన, వీరుల, చరితం
కన్నారా, ఆగస్టు, విప్లవం!

విప్లవజ్యోతుల, కిరణకాంతిలో, ఉదయించాడు, స్వతంత్రభానుడు
విప్లవవీరుల నెత్తురు నదిపై, ప్రసరించిందీ, స్వతంత్రవాయువు
విప్లవనేతల త్యాగజలధిలో వెలుగొందింది, స్వతంత్రభారత్.

వీరభారత, యువకుల్లారా!
విజయోత్సాహిత, మూర్తుల్లారా!
విన్నారా, మన వీరుల చరితం!
కన్నారా, ఆగస్టు, విప్లవం!



# జాతీయవీరుడు-తోట నరసయ్య మగటిమి

(తుమ్మల సీతారామమూర్తి చౌదరి)

మం॥ జాతీయ చైతన్య జననియై వెలయు
బందరుపురి మధ్యభాగ మందపుడు
త్రిచ్ఛాయమగు జయంతి నెగుర్వనెంచి
కొంకు జుంకులు లేక కోనేటికడకు
దూఁకెను నరసయ్య తోఁటాన్వయుండు
పోలీసు లీపని పొసఁగ నీ మనుచు
నడ్డిననేమి సత్యాగ్రహవీర
శార్దూల మీ నరసయ వారి నుఱక
యెక్కెఁ డెక్కెము మీదికెత్తెఁబతాక
మ్రొక్కెను జండాకు మూరినభక్తి
నించె మహాత్మాగాంధికి జే యటన్న
రవళి హరిత్కందర ములు మార్ మ్రోయ
దిగివచ్చు నిప్వీరు ధీరులవోలె
బలపి డెందముః లేని భటులు లాటీలఁ
గొట్టిరి వందలకొలది దెబ్బలకు
వ్రయ్యలైనది తోఁట వంశజు నొడలు

కాల్వలై యితని రక్తము పాఱి పాఱి
ముంచిన దారుణ్య మునఁ దటాకమును
జనులయో! నరసయ్య చచ్చెనటంచు
గగ్గోలు పెందిరి గాని పేర్గన్న
మల్లుఁడీతడు మంజు మందహాసమున
వేచి రాకాసి పోలీ సుల నరసఁ
జని సార్ధవత్సర సత్కారమంది
చేరెఁగోరాపుట్టి చెఱసాల గదికి
నల్లవో! మున్ను చిన్నాపురినుండి
యిత డుప్పు దేరఁగా హేమా హేమీల
వంటి రక్షకభటుల్ పదునార్వురెంత
పెనఁగియు నితని గుప్పిలి ప్రయ్యవార్చి
లవణమ్ము లాగఁజాలక విన్నఁబోయి
కసిదీఱ కీ జెట్టి కన్నాకు నిలకు
ద్రోసి మోఁదిరి జగా దుడ్డుఁగోలలను
దుదకు వీరే లజ్జఁ దోగిరి గాని
నరసయ్య కడిమి చిన్నము జాఱదాయె
నితనికి నోనమా లేనిరా వచ్చు
కాఁపుగా బాగోలు గడ్డనుబెరిఁగి
కుస్తీలునేర్చి పల్లరకు నేరిపిన
నెఱసరి యితఁడు; గాంధిమహాత్మభేరి
సాబర్మతి సరస్వతి తీరమందు
మ్రోఁగినంతన పట్టములు గడించిన మ
పిషలు వెఱఁగంద నిర్భర బాధ

లోఁగిచి సత్యాగ్రహోద్యమ సమర
యోధులుగా నెందఱో యిట్టివారు
వెడలిరి భారతోర్విని బల్లె పల్లె
నోరుల మెప్పునకు వీ రోలాకుపడరు
పదవులకై వీరు బందికిఁజనరు
నిస్స్వార్థసేవకు నిరవద్య సేవ
కవతరించిన పురుషాగ్రణుల్ వీరు
మనదేశమున నెంతమంది నాయకులు
పుట్టరు మున్ను, బాపు వినా యెవండు
మేల్కొల్పె నిట్టి గ్రామీణ ప్రజాళి
నద్వితీయ త్యాగ మవిరత సేవ
దంభదూరగ జీవితము నేర్పి నేర్పి
యింతకు జాలినాఁ డెరవాడయోగి
మంతర మీ తండ్రిమాట పల్లెలకు.

—x—

# భవ్య భారత భాగ్యరాశీ :

(కాశీ విశ్వనాథం)

ప్రార్టీ కక్షలు మతవిభేదము-మందుకైనా ముందు వలదని!
మాయమాటల మబ్బుతెరలను-మంటబెట్టి గంటుగొట్టా!
ఓ భవ్య భారత భాగ్యరాశీ !

ఇండ్లుగాల్చిన గుండ్లుపేల్చిన-గుండెలిచ్చిన దండి యోధుల
సమాధులన్నీ సమరభూమిలో-సాగి నిలబడ సలహాలిచ్చుట!
ఓ భవ్య భారత భాగ్యరాశీ !

స్వేచ్ఛ కొరకే చచ్చువరకూ-సమరభూమిలో సంచరించిన
వీరయోధుల వీరమరణము-విలువలే నీ విభూతి పాలు!
ఓ భవ్య భారత భాగ్యరాశీ !

దేశమందున ప్రజ్వరిల్లిన-పావనంబగు ప్రశ్నలన్నీ
తరచి చూచీ తరలిరమ్మా సమర భూమికి సాహసంబున
ఓ భవ్య భారత భాగ్యరాశీ !

ఇవరముంటే హిందుదేశం-వీడిపోవుడు వేగమను నా
వీరయోధుల వీరవాక్కే-సమరగీతిక సారమగుటా
ఓ భవ్య భారత భాగ్యరాశీ !
విషయమే విధి విస్మరింపకుమా!

---

# ప్రేల్చుడీ

ప్రేల్చుడీ! హోమమున లోభము,
కాల్చుడీ! భూకలుష మెల్లను,
ప్రేల్చుడీ! స్వార్థంబు నెమ్మది
దాల్చి ప్రేమంబున్.

హవ్యజాలపు ఆర్ద్ర ధూమము
దివ్య గంధము కడల జల్లగ
నవ్యకాంతుల పూతలోకము
భవ్యముగ వెలుగన్.

మొక్కలులు రక్కసుల గుండెలు
గ్రక్కదలి కడు స్రుక్కుచెందగ
పిక్కటిల్లెడు దేవగానము
దిక్కు లలరింపన్.

ఒక్క తేజోమూర్తి, చలువల
యిక్క హోమమునుండి వెలువడి
గ్రక్కునను తారాపథంబున
చుక్కవలె ప్రాకున్.

ఒక్క ప్రక్కను లక్ష్మి, మఱివే
రొక్క ప్రక్కను వాణిగొల్వగ
క్రిక్కిరిసి ఋషిగణము స్వస్తులు
కీర్తనలు చేయన్.

లేదు లేదు ప్రశాంతి భువిలో!
లేదు లేదు ప్రశాంతి దివిలో!
ఆధి నొందుచు దాసుడొక్కం
డడలు నన్నాళ్లు.

రెండు రెండో శాంతి పుత్రులు
రండు ముందుకు ధర్మయోధులు
పొందు యోగ ప్రవృత్తికై! చే
కొందు మోక్షంబున్.

వలదు వలవదు బలు ఫిరంగులు-
తొలగ ద్రోయుడు కఱకుటమ్ములు
నిలుపుడీ ధీరతయె తొడుగుగ
కలహరంగమునన్.

అంటుకొన్న మహాచితాగ్నిని
ఆరకుండగ బట్టి నిలుపుడు!
అంటువోవ రగుల్చుడందుల
ఆత్మకణమొండున్.

అసమ పావన శుభ చరిత్రులు
ఋషులు చెప్పిన సామిధేనులు
కొసరి కొసరి పఠించి జ్వాలలు
దెసలు ముట్టంగన్.



# శాంతి

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

శాంతి! శాంతి! యటంచునేమో
రంతు లెల్లెడ చెవుల జొచ్చెడు!
సంతసింతునొ, కాక-మఱి, యీ
చంద మెఱుగనుగా.

విశ్వశాంతియటంట! ఓహో!
విశ్వమానవ మోక్షమట! మఱి
విశ్వసోదర భావమట! ఆ
విశ్వమదియేమో?

శ్వేతభూమియె విశ్వమంచును
శ్వేతముఖులే మనుజులంచును
శ్వేతమే సర్వంబనుచు భళి!
చెలగి చాటుదురో?

కాలజాతుల కుత్తుకలపై
కాలుమోపియు నేలమట్టుచు
జాలమైనను తీయనొల్లని
జాతులే నొక్కొ-? శాంతికి
దూత లియ్యెడల!

రెండు ముప్పదికోట్ల తనువులు
ముండ్ల గొలుసుల గాయపడి యు
ద్దండవేదన గొలుప తల్లికి
ఉండునే శాంతి ?

రెండు ముప్పదికోట్ల కడుపులు
దండియాకలి మండుచుండగ
బెండువడి, నిట్టూర్పు తల్లికి
ఉండునే శాంతి?

రెండు ముప్పదికోట్ల నోరులు
చండవృత్తి, బిగించి కట్టియు
చెండనాడగ విశ్వజననికి
ఉండునే శాంతి?

ఒక్క యంగముబట్టి తల్లిని
ముక్క ముక్కగ తరుగుచును వే
రొక్కయంగ మలంకరించిన
చిక్కునే శాంతి?

చాలు చాల్! ఈ, యాగడమ్ములు
మేలు మేల్! దయ్యములె నవ్వేదు!
ఏల ఈ వంచనలు? దేవుం
డెదుట లేడొక్కొ?

-------

# స్వాతంత్ర్యం

మూల రచన తమిళం .
సుబ్రహ్మణ్యా భారతి
తెలుగు సేత :
(చల్లా రాధాకృష్ణశర్మ)

ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్యం దాహం?
ఎప్పుడు మడియు మా అడియరిమోహం?
ఎప్పుడు మాతల్లి సంకెల లూడిపోవు?
ఎప్పుడు మా యిక్కటులన్ని తీరిపోవు?

అందరిదీ ఒకే కులము
అందరిదీ ఒకే జాతి
అందరూ భారతీయులు
అందరూ ఈ దేశపు రాజులు

వేదము వెలసిన దేశమిది-మేటి
వీరులు పుట్టినదేశమిది
అఖండ హిందూస్థానమిది-దైవ
మచును పూజింపుము దీనిని పాపా!



# ఉప్పు సత్యాగ్రహము

(గరికపాటి మల్లావధాని)

చం॥ ఉడుగడు మధ్యలో ఫలితమొందక వెండియు నాశ్రమంబు నం
దడుగిడ నియ్యెడన్ విజయమందుటొ నాశవ మంబురాశిపై
నెడపక దేలుటో జరుగు నింతయు సత్యమటంచు ధీరుఁడై
కదలెఁ బ్రభుత్వధిక్కృతికి గాంధిమహాత్ముఁడు భారతాంబికా.

ఉ॥ రండిదె యుప్పుచట్టము తిరస్కృతి సేయుఁడటంచు జైత్రపున్
డిండిమ ఘోషణం బెసఁగ డెబ్బది యేడ్వుర దండుతోడ ను
ద్దండిత 'దండి' కేఁగి రిపుతండము లొత్తిలి చూచుచుండ బ్ర
హ్మాండముగాఁ దిరస్కృతి మహాత్ముఁడొనర్చెను భారతాబింకా.

ఉ॥ పాయని వేడ్కమైనపుడు పశ్చిమ గౌతమి మండలంబునన్
జేయని 'యేలురం'దుటుము జేర్చిరి నీ ప్రజ లంతఁ దచ్చమూ
నాయక పట్టభద్రునిఁ బొనర్చిరి మేరుగధీరు దండు నా
రాయణ రాజశేఖరు నరాతి భయంకరు భారతాంబికా.

ఉ॥ అందముగాగ మోమున జయావహ కుంకుమరేఖ దీర్చి యం
దందు బురాంగనా మణులు హారతులీయగ నాత్మకూరి గో
వింద సుధీవరుండు తనవెంబడి బాసటనిల్వ సేనకున్
ముందుకు సాగె రాజకులభూషణుడమ్మయి భారతాంబికా.

చం॥ వెడలె భవచ్ఛమూతతులు వీర పరాక్రమ ధైర్యశాంతముల్
ముడివడ దేవదుందుభులు మ్రోగ విరోధి కదంబకంబు త
ల్లడపడి డిల్లవోవ జటులక్రియ మాటికి నూత్నాయోధుల
లైడపక రానుగాది తటినే ప్రియలాదిని భారతాంబికా.

ఉ॥ స్నాత సమస్త సాధుజన సంచయ పాపవినాశ కృద్వశి
ష్ఠాతటినీ తటాంతర లసన్మహితాశ్రమ నిర్మితంబు లౌ
నాతత శాలల న్విడిసి రయ్యెడ యోధగణమ్ము శత్రు సం
ఘాతము లబ్బురంబును వగంబడి చూడక భారతాంబికా.

ఉ॥ సేనలు తూర్పు తాళ్లకడఁ జేరిన వెన్కను సర్వతోటలో
స్థానము నేర్పరించుకొని తద్దయు వేడుక మళ్లగట్టి పె
న్భూనిక నుప్పుజేసి కొనిపోయి పురంబు నంతలన్ జన
స్థానములందు నమ్మిరి కదా కడుధీరత భారతాంబికా.

ఉ॥ ధీరుడు బాపినీడు గడితేరిన శూరుడు వియ్యనార్యుడున్
వీరుడు పురుషోత్తముడు విశ్రుత ధీమణి రామచంద్ర రా
వారయ రామకృష్ణ విబుధాగ్రణి జోగయశర్మ కన్న యా
ఖ్యోరుబలుండు మున్ను గలయోధులు గూడిరి భారతాంబికా.

ఉ॥ మాయురె శౌర్య ధైర్య విభవ ప్రథితాత్ముడు దంతులూరి నా
రాయణ రాజచంద్రుడును త్యాగధనుండగు ముష్టిలక్ష్మినా
రాయణ కొమ్మరెడ్డి సుకులాభరణంబన నొప్పు సత్యనా
రాయణ పైడిపాడి కులరత్నము వేంకటశోభ నా
రాయణ సూరిశాస్త్రి ముఖు లర్చన జేసిరి భారతాంబికా.

ఉ॥ అద్రి సామాన ధీరుడును నాశ్రమనాధుడు, సుబ్బరాజు నీ
లాద్రి వదాన్య శేఖరుడు హాస్యవచోనిధి సుబ్బరాజు ని
ర్జిద్రయశుండు జగ్గనమనీషి బుద్ధుండు ప్రకాశ రాయడున్
మాద్రికి మించి నీ పద సమర్చన జేసిరి భారతాంబికా.

చం॥ అలఘుడు రంగశాయి సుగుణాఢ్యుడు ధీరుడు, కృష్ణమూర్తి ని
శ్చలుడగు గంగరాజు నతిసాహసుడౌ నల వీరభద్ర రా
వెలమిని రామమూర్తి ఘనుడీ శనివారపు సుబ్బరావు నుం
బొలుపుగ నీ పదాబ్జములఁ బూజలొనర్చిరి భారతాంబికా.

చం॥ బెలుపెసగ న్మొదుంబ నరసింహ మనీషి నృసింహశర్మయున్
ములుపురి రంగయాఖ్యుడు ప్రబుద్ధుడు కొవ్వలి గోపమంత్రి ని
శ్చలపటు ధైర్యదౌపసలసత్కుల చంద్రుడు కృష్ణమూర్తియుం
జెలువలతోడ నిన్గొలిచి శిక్షల నొందిరి భారతాంబికా.

ఉ॥ ఎందఱో శర్మలున్ మఱియు నెందఱొ వర్మలు గుప్తలెందఱో
యెందఱొ చౌదరుల్ మఱియు నెందఱో కాపులు రెడ్డులెందఱో
పొందుగ మాతృదేవతకు బూజలొనర్పగ జేరినట్టి యా
యందముచాలె తావక మహత్వ విశేషము భారతాంబికా



# ఆగస్టు విప్లవము

("కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రి)

సీ॥ లేచిపోయినవి పోలీసుల టోపీలు
వందలు వేలు రాబందులట్లు
కాలిపోయినవి సర్కారు కచ్చేరీలు
ఖరదూషణాదుల కాష్ఠమట్లు
తెగిపోయినవి తంతి తీగెలు భారతీ
యుల పారతంత్ర్య శృంఖలములట్లు
తరలిపోయినవి క్రిందకు రైలుపట్టాలు
పాశ్చాత్య రాజ్య సౌభాగ్యమట్లు
ఒకటి యనుటేమి నాటి మహోద్యమమున
రేగిపోయిన ప్రజల యుద్రేకమునకు
అల్లకల్లోలమై దద్దరిల్లిపోయె
తెల్లదొరల ప్రభుత్వ మందిరములెల్ల॥

ఉ॥ భారత వీర విప్లవ విపంచిక భావి చరిత్ర కారుఁడే
తీరున మేళవించునొ గదే యువ యోద్ధుల వేడి రక్త పుం
జీరలు చూచి యశ్రువులు జారవొ! కన్నుల వేడి వేడి ని
ట్టూరుపు లెట్టులాపుకొనునో! ఎటులన్ స్వరముంబెకల్చునో!

సీ॥ నేరమెంచిన వేళ-ధీరుడై వెఱవక
ధీరుఁడై నిలచిన శూరుఁడెవఁడు
జైలు కేగుమటన్న జంకు గొంకును లేక
వేడ్కమై తరలెడి వీరుఁడెవఁడు
ఉరిశిక్ష వైచిన-వెరపింపుకయు లేక
ధైర్యమూనినయట్టి ధన్యుఁడెవఁడు
మాతృభూమికి ఋణము మన్నన దీర్పఁగా
ప్రాణమర్పించిన త్యాగి యెవఁడు

అట్టి సర్దార్భగత్సింగు ననఘుమతిని
రాజగురు శుకదేవుల పూజితులకు
భారతీయులకున్ దేశభక్తులకును
భక్తినంజలి నిదె సమర్పణము సేతు॥



[నాటి నిజాము సంస్థానములో జాతీయవాదిగా పత్రికా రచయితగా పేరొందిన శ్రీ షోయిబుల్లా ఖానను రజాకారు మూకలు హత్యచేసిన సందర్భమున]

# 'కన్నీటి కానుక'

(ధవళా శ్రీనివాసరావు)

చీకటి తెరలను చించిన—నీ కలమునె విరిచారా?
ఆతతాయి పాలనలో—అందలేక అల్లాడెడు
నిరుపేదల దీన రవళి—వినుపించిన నీ కుత్తుక
రక్కసి మూకలుగూడి—నొక్కి వేసిరా! షోయీబు
ఎటు జూచిన చీకటులే—పొటమరించు నగరిలోన
వెలుగుజిలుకు నీబ్రతుకునె-మలిపి వేసిరా తండ్రీ!
నీవు చంపబడినావని—భావించము అమృతమూర్తి
సత్యాహింసల నిలువున—హత్య జేసిరని వగతుము
ఆ నిజాము నరకములో—దీన జనుల అసువు లెన్నొ
కానరాక మసియయ్యెను.
అన్నా! నీ బలిదానము—మిన్నునె కదలించెనోయి!
అదిగో! అదిగో! అదిగో!
మానవులకు శాంతి నొసగ-ఆ నరకము నశిస్తుంది!
ఆ పాపము భగ్గురుమని—ఆ లేచేమంటలలో
కాలుచున్న రజ్వీలు—కూలిపోవు నైజాములు
మానవులను ప్రేమించే—మంత్రభిక్ష బెట్టుమనుచు
మోకరిల్లి నీయడుగుల-శోకించుచు నున్నారదె
కంపించే నా హృదయము—కన్నీరే కానుకగా
నీ కొసంగు చున్న దిదే—స్వీకరింపుమా సోదర!

(అది 1946వ సంవత్సరము-భారతదేశమంతా మతకలహాములు, కరువు కాటకాలతో కల్లోలముగానున్న రోజులు)

# ఏమి వ్రాయాలి ?

(ధవళా శ్రీనివాసరావు)

ఏమి వ్రాయాలెః
నే నేమి వ్రాయాలెః
నా యింటి నడుమనే
పెనుమంటలే రేగ
నా తమ్ములే విలయ
నాట్యాలు సేయగా
నా కూన లీనాడు
కాకులకు బలిగాగ
నాదు చెల్లెండ్ర
మర్యాద దోపిడి సాగ
నా తల్లి గుండియలు
కోతల్లు వడ్డాక ఏమి వ్రాయాలెః
నా నేల కరువులకు
తావలం బైనాక
నాదు ఆకటి డొక్క
బూడకున్నాక

నా సభ్య సంస్కృతులె
నరుకుళ్లు వద్దాక
నా నాయకుల రక్తనాళాలు
దెగినాక
నా రాజ్య సౌధాల
స్వాతంత్ర్య వీధులే
బారు దీర్చక మొన్నె
కూలిపోనున్నాక
నాదు కోరికలలెల్ల
బూదియై పోయినాక
నేనె నాశన మొంద
బూనుకున్నాక నే నేమి వ్రాయాలె॥

# వీరావేశం

(మల్లాది రామచంద్రశాస్త్రి)

వీరావేశం చెంది నారమిక
వీర విహారం చేస్తాము
పరాధీనతన్ బాపు కొనంగా
ప్రళయ భేరి మ్రోగిస్తాము॥

దేశ ద్రోహుల గుండెలవియగా
సింహ గర్జనం చేస్తాము
దేశ మంతటా దుర్భిక్షమిక
తలెత్తకుండా చూస్తాము॥

తెల్ల వారికిక తొలగి పొండంచు
తెల్లముగా చెప్పేస్తాము
ఢిల్లీ కోటను విజయపతాకం
త్వరలో నెలకొల్పేస్తాము॥

ప్రళయ బాంబు విలయమ్మున కేనని
ప్రముఖులచే చెప్పిస్తాము
ప్రపంచ శాంతికి సత్యాహింసలె
ప్రధానమని చాటిస్తాము॥

విశ్వ సోదరత్వము నెలకొల్పగ
వివిధ యత్నములు చేస్తాము
విస్వ మంతకును మహాత్ముడొకడే
విజేత యం చనిపిస్తాము.
వీరావేశం చెందినారమిక
వీర విహారం చేస్తాము
పరాధీసతన్ ఊపుకొనంగా
ప్రళయ భేరి మ్రోగిస్తాము॥



# కళ్యాణ కాంతి

(మల్లాది రామచంద్రశాస్త్రి)

సమదృష్టిని వీక్షించేము
సమాదరణ జూపించేము
సమస్త ప్రాణుల నాకేరీతిగా
సంభావనమ్ము జేసేము॥

హృదయ మొక యమృతము ఝురిగా
మది నిండిన తేనె వాకగా
సుధా ప్లావితము లౌ వచనమ్ముల
సకల జగతి నలరించేము॥

అనూనమౌ విజ్ఞానముతో
ననన్యమౌ నుత్సాహముతో
ననుపమమౌ ననురాగముతో
నఖిల విశ్వమును సేవించేము॥

అవరోధమ్ముల నతిక్రమించి
అవిరోధమ్ముల నైక్య మొనర్చి
అమర పథమ్ముల నన్వేషించి
విమల చంద్రికల విహరించేము॥

# స్వేచ్ఛాగానము

రాయ వేలూరు జైలు 1931

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

నా తనువు కర్కశోపల నద్ధ కుడ్య
రాజి పరివృతాయః పంజరాంతరమున
శృంఖలాబద్ధమై కృశియించుచుండు;

నా మది విహాయస పథమ్ము నధిగమించి
దిక్కుగమి దాటి యశ్రుత ద్వీపములను
నిత్య స్వేచ్ఛా విహారియై నెగడుచుండు.

నా కనులు తారకా కిరణ ప్రసార
మును చొరగరాని గాఢతమోవృతములు;

కాని మహాత్మ దివ్యప్రకాశపుంజ
నవనవోన్మేషమై వెల్గు నా హృదయము.

నేను యమభటులంబోని సీచదండ
నాధికారి తిరస్కరణాభిఘాత
ముల కనుక్షణమును సిరిమొగ్గ వలయు;

ఐన విశ్వజనని కరుణార్ద్రమధుర
లోల దృఙ్మాలికాజాల లాలితుండ.

కొలిచి దినమును నాకిదు కూడు కుక్క
లైన ముట్టని హేయ పదార్థచయము;

నా రసన చవిచూచెడిది నితాంత
షడ్రసాతీత మధుర రసాయనమ్ము.

నా శిరము క్రూర నిశిత కంటక కిరీట
పరి నిపీడిత మైన శ్రీ భరతధాత్రి

తరుణ చరణాబ్జ సంస్పర్శ ధన్యతమము.

నా యొడలు డస్సి క్రుస్సి నానాట శల్య
శేషమైనను లోన విశిష్ట విమల

దివ్యకాంతి మయామరదేహ మొందు
దినదిన ప్రవర్ధమానమై తేజరిల్లు.

—x—

# జైలు

("దాశరథి")

ఇది నిదాఘము: ఇందు సహింపరాని
వేడి యేడ్పించుచున్నది: పాడువడిన
గోడలందున జైలులో పాడినాడ
వాడిపోనున్న పూమొగ్గ పైనిపాట.

మండుటెండకు క్రాగిన గుండె నెత్రు
బండవారిన మనసులోనుండి జారి
పచ్చ పచ్చని పూ మొగ్గపై నటించి
ఎఱ్ఱవార్చిన దీగ్రీష్మ మేడిపింప.

చల్ల చల్లని వాగులన్ చిళ్లుచున్న
తుంపురుల గుంపులో నకాలంపు కన్నె
తాన మాడినదో! రణోద్యానవాటి
వలువ విచ్చుక నృత్యాలు సలిపెనేమొ!

ఈ యెండకాలమ్ములో యెన్ని వర్షాలు
దాగియున్నవో చూడసాగినాను.
ఆ యెడారి పొలాలలో యెన్ని గంగలు
పొంగునోయని చూడబోయినాను.

ఆయాసపడు జైలులో యెన్ని ప్రజల రా
జ్యములున్నవోయని యరసినాను,
నిరుపేదవాని నెత్తురు చుక్కలో నెన్ని
విప్లవాలో యని వెదకినాను,
నీళ్లలో నిప్పు మాదిరి నిప్పులోన
నీళ్లమాదిరి కష్టాల నీడలందు
సుఖము నివసించునంట, ఉస్సురను వేడి
ఊర్పులోన పరిమళాలున్నవంట.

ఈ కాలానల కీలికావితతిలో యేయిల్లు యేవూరు యే
లోకం బాగును ఎందఱెందఱు దరిద్రుల్ చచ్చిరో యే సతీ
శోకం బాకస మంటుచున్నదొ; సుతుల్ చట్టాలు చల్లారిరో
నాకు న్నీకు గణింప శక్యమె; దురంతక్రాంతి కాలార్భటుల్.

ఇట వసంతములేదు సహింపరాని
గ్రీష్మహేమంతకాల కాళికలె గాని
ఇట ఉషస్సులు లేవు; భరింపరాని
అంబువాహసందోహ నిశాళికాని.

వెన్నెలలు లేవు పున్నమకన్నె లేదు
పైడి వన్నెల నెలవంక జాడలేదు
చుక్కలే లేవు అకాశశోకవీథి
ధూమ ధూమమ్మ, దుఃఖ సంగ్రామభూమి.

కాలదైవజ్ఞు డీజగత్కన్య హస్త
తలము దర్శించి జ్యోతిషము వచించు
"పరుల హింసించువారలు బాగుపడెదు
మాట పట్టిది నాశనమౌ్మట నిజము"



# ఇదిగో! దివాలా ప్రభుత్వం

రాజమండ్రి జైలు

(గురజాడ రాఘవశర్మ)

ఇదుగో! దివాలా ప్రభుత్వం
ప్రేళ్ళతో-కదిలి కూలిందిదిగో!
కనుము-దీని సత్వం ॥ఇదిగో॥

అంతులేని మనల నెంతమందిని బట్టి
గంతులేసి బ్రతుకుతాడు।
త్రావ ముంత సప్లయి చేయలేడు
మల్ల సుంత యివ్వలేని వాడు
తొడుగ బొంత లెన్నియ్య గలాడు
తన పంతము నిల్ప చూస్తాడు
కళ్ళకు గంతలుకట్టి యాడ్తాడు
ప్రజ్ఞ సుంత-దెలియు శక్తి శూన్యము వీనికి ॥ఇదిగో॥

ఎన్నాళ్ళనై చిన సున్న పీడికి జాలి తిన్నగ కూడు నీరీడు
పురుగు లన్నపుముద్ద లిస్తాడు
మేకు లన్నపుముద్దలిస్తాడు
ఉప్పు డన్నపుసుద్దలిస్తాడు

వాస నన్నను మంచిదంటాడు
దీనికి మిన్న లేదట మంచికూడు
జిహ్వ లన్ని కట్టాడు యీ పాడు
కూడు కన్న-నీరే పానకము, ప్రాణాధారము ॥ఇదిగో॥

యూనియను జాకు-బూవి బ్యాండుమేళం
తోను యూరేగింపు జేసి
జైలు ఖానాలెదుట నిల్వజేసి
మాకు లేనిపోనట్టి రాకాసి
ప్రభువు నేనెయనుచు తిరుగు నిప్పీ
మనము వీసి లెక్క-గొనము వాసి
యనుచు ప్రాణములను తలపోసి
మొన్న దీన ప్రదర్శనము-తెచ్చె, మెచ్చెనెవడు ॥ఇదిగో॥

కుళ్ళిపోయిన చచ్చు-కూరలు, ముల్లంగి-
ఉల్లిపాయలు, గలిజేరు-
వంగ పేళ్ళు, చీడతోటకూర
చిరి వేళ్ళు, వెంపాలి, గోంగూర
పెద్ద పల్లెకుడు, బూజుమామిడి
టెంకల్ వెల్లుల్లి, పచ్చి బొప్పాయి
ఉప్పు గల్లు, చిటికెడు-తెల్లకారం
చిన్న పల్లెకుడు- నూరుడు పప్పు
తలప యొళ్ళు ఝుల్లని-నీళ్ళగారు
పుచ్చు నల్లచింతపండు శేరు
కలిపి నీళ్ళజేర్చి, యిట్టిసారం
ఇనుప కళ్ళాయిగాచి, యధారు
వుగ నిచ్చు దేవతా పులుసు-యితని శక్తిదెలుసు ॥ఇదిగో॥

# ఇందూరు దుర్గము

## నిజామాబాద్ సెంట్రల్ జైలు

("దాశరథి")

ఇది చరిత్రాత్మకమ్మయిన, ఏ మహాదాలయమో; ఇదే మహా
కదనముకోసమై మలచి కట్టిన దుర్గమొ; భారతీయ సం
పదలను కొల్లగొట్టిన నవాబుల గుబ్బలు గుయ్యనన్ బదా
బదలయిపోన్ మరాటి భటవర్గము లొత్తిన శంఖపుంఖమో!

ఇచట శివాజివాజి యొనరించిన హేషలు నేటికిన్ గుహా
నిచయములందు గాలి పయనించుటతో వినిపించు బేద ని
ర్వచము చేసినారలు ధరాసురవర్గము రాఘవాలయ
ప్రచురతరాంగణమ్ముల ప్రపంచిక మ్రోసిరి సామగానముల్.

నశియించెన్ రఘునాథ యోధుని దివాణమ్ముల్; మహారాష్ట్రి వీ
ర శివాజీ గురురామదాస రసనాగ్రవ్యగ్ర మంత్రౌఘముల్.
నశియించెన్ రఘురామ దేవళము లీనాడీ నిజాం రాక్షసీ
నిశితాసిం బడి బందిఖానయయి కన్పించె న్వికారమ్ముగా.

ఒక కాలమ్మున యిద్ది దేవళము వేరొక్కప్డు దుర్గంబు నే
డకటా! జైలయి కానుపించెను; భవితవ్యత్కాలమం దెట్టి రూ
పకమున్ దాల్చునొ! కాలచక్ర గమన స్వాభావికా వర్త క
ల్పకమై దేవళమౌను దుర్గమగు నీ బందీలె పాలింపగన్.

ఇట మరాటీజోదు పటపట కొరికిన
పండ్లలో గోల్కొండ గుండ్లు నలిగె,
ఇట మరాటిజోదు చిటిక వేయుటతోనె
ఔరంగజేబు కంగారు పడెను
ఇట మరాటీజోదు కటి బిగించుటతోనె
గగన భూమార్గాలు కట్టువడియె
ఇట మరాటీజోదు గుటక మ్రింగుటలోనె
తురక భూపతుల నెత్తురులు తటిగె,

ఇట మరాటీలు స్వాతంత్ర్య పటహాములను
మ్రోసినారట; రాజ్యాలు చేసినారు
ఇట స్వతంత్ర పతాకాల నెత్తినారు
కత్తిమొనతో దురాత్ములు మొత్తినారు.

ఢిల్లిలో భరతాంబ చేతులకు బేడీల్ వేసి బంధించి, లాల్
ఖిల్లాపై విషదంష్ట్రిబోల్ శశికళల్ గిలించుజండా పటం
బల్లల్లాడ ప్రభుత్వమున్ జరుపునా ఔరంజేబుండు నీ
ఖిల్లామీది శివాజి కేతనము లాగింపగ లేడయ్య బో!

అల వింధ్యాచలసీమలన్ రణము సేయన్ బోయి యున్నట్టి వీ
రుల గుఱ్ఱమ్ములు దప్పిదీర్చుటకు రాత్రుల్ రాత్రులేవచ్చి జీ
నులతోనే రఘునాధ సాగరమునన్ తోయమ్ములన్ ద్రావి పి
ట్టలవోలెన్ రణమందు దూకెను మరాటాగుఱ్ఱముల్ గుఱ్ఱముల్.

ఆతడొక బ్రహ్మచారి, పరమాత్మకు నైక్యతావియో
గతలను గూర్చి చర్చలకు కాలము పుచ్చెడినాడు భారతీ
యత కపకారమున్ జరుగునప్పుడు ఖడ్గముబూని మ్లేచ్ఛులన్
మెతిపె మహామహుండ తనినే రఘునాధుడటంద్రు లోకులున్.

అమితోత్సాహమునన్ బురాతన చరిత్రాంకమ్ములన్ జూడ ప
శ్చిమ చాళుక్య మహాంధ్రతేజము వికాసించెన్ ప్రభాతారుణా
ర్యమ దివ్యద్యుతివోలె ఇందుపుర దుర్గద్వారతీరాల, ఆం
ధ్ర మహారాష్ట్రనృపాలు రెత్తిరసిధారాపూరమిచ్చోటనే.



# కారాగృహము

(యనమండ్ర కృష్ణారావు)

ఈనాడు తన వృత్తినెటు పీడెద నటంచు
చేదుమేసెడి న్యాయవాదియొకడు
ఈనాడు సీమనూలెట్లు పీడెదనంచు
పరదేశ లాభ తత్పరు డొకండు
ఈనాడు కచ్చేరి నెటుపీడెద నటంచు
పరుల సేవయొనర్చు బడుగొకండు
ఈనాడును విరోధ మెటుడింతునని యన్న
పై వ్యాజ్యమాడెడి వాడొకండు

నేడో రేపోవచ్చు స్వరాజ్యవిధిని వెలిచి
విచ్ఛమింతేని యిడనట్టి వెఱ్ఱివారు
చేరలేరమ్మ నిన్ను నిశ్చేష్టులగుచు
రాజకీయాయుధంబ కారాగృహంబ.

కీర్తిశేషుండైన క్రీస్తు నిర్బంధించు
ఖ్యాతి యెవ్వరిని ప్రఖ్యాతి పఱచె
స్వచ్ఛందమూర్తి యా జయదేవు ఖండించు
పేర దెవ్వారికి పేరుతెచ్చె

వీరహంసేను హాసేను హుసేన్ ఖూరులం దునిమిన
కీర్తి ఎవ్వరికి సత్కీర్తి గూర్చె
వీరుడైన శివాజి పిచ్చి బంధించిన
యశమదె వ్వారికి యశము పెంచె
క్రౌర్యమునగల్గు పటు నహంకారవృత్తి
బలపఱచు వానికదియె దుర్బలము కాదె
అట్టిపగవారు మననేల ముట్టగలరు
రాజకీయాయుధంబ కారాగృహంబ.

# జన్మమదేలా జైలుకుపోని

జన్మమదేలా జైలుకుపోని ॥జన్మమదేలా॥
ధర్మముతోడను-జన్మభూమికి మన
నిర్మల త్యాగము నొసగని వాని ॥జన్మమదేలా॥
నందనందను జన్మ-మందిరమునకేగి
సందియములు వీడి-సంతసింపని వాని ॥జన్మమదేలా॥
వీరమాతలకు-కారాగార విముక్తులకు
చేరి నమస్కరింప-చేతులెత్తని వాని॥జన్మమదేలా జైలుకుపోని॥

# జైలు ప్రబోధము

జైలనగన్ మిగుల సుఖము-వీలుగా నుండుమనకు
వేళకు స్నానాలు-వేడివేడి భోజనాలు జైలనగన్॥
హెచ్చుపన్ను అచటలేదు-రొచ్చుకంపేలేదు
గచ్చుచేసిన్న లోగిళ్ళు-ఘనమైన వాకిళ్ళు ॥జైలనగన్॥
కంటబడరు ఋణ దాతలు-వెంటరావు దుర్గుణములు
అంటియుండురు డాక్టరులు-జంట బాయరు నౌకర్లు ॥జైలనగన్॥
కరువుభయము కానరాదు-పరభావమనగరాదు
భారమైన ధనముండదు-మారిపోవ పీలుండదు ॥జైలనగన్॥
కూట సాక్ష్యమచట లేదు-కోర్టు ఫీజు లచట లేవు
కష్టమైన పనులులేవు-కష్టములు కానరావు ॥జైలనగన్॥
కృష్ణజన్మస్థలమునుండ-ఐకమత్యము మనకు అండ
శ్రీ కింగు జార్జి విందునుండ-శ్రీకరముగ విశ్వదండ
॥జైలనగన్॥



# రాయవేలూరు - సెంట్రలు జైలు

('గురుజాడ')

శ్రమయను మాటలేదు, బహు శాంతము జీవితమిచ్చుటన్, బరి
శ్రమయను మాటలేదు, సుకరమ్మదినమ్ము, రవంతబుచ్చ,యో
గ్యమగు తపోవనమ్మొ, మరియాదల నేర్పెడి పాఠశాల నా
శ్రమ గలిగించునేరికిది, రమ్యసుఖంబగు బందె, సౌమ్యరా!

అనుభవమ్మనతున్ మించినట్టి వస్తు
వెన్ని వత్సరముల్ మనియున్న సున్న
దొరకదది దొరికినన్ వెంట దొరకుముక్తి
యట్టి సౌమ్మిట వెదకిన, నమరు సుమ్ము.

బయట కలవారికిది, పెద్ద బందెకాని
లోన గలవారికిది, స్వర్గ లోక మరయ,
వేఱె చెప్పగవలెనె! మా విధమి కిట్టి
వింత యానందమున్, గని విని యెరుగము.

పగలు మిత్రుల మాటలం బ్రాయు ప్రొద్దు
కలత నిద్దురచే, రాత్రి కాలమరుగు
గుహలు జేరిన దాదిగా, కునుకువచ్చు
నంతకును, ప్రొద్దుపుచ్చుటే, యధికభరము॥

సందేహపడంగ, మమ్ముగల సాధనపుం గుహాలందు నుంతు, రా
నందముతోడ, జీవితమునన్‌గల భాగ్యములం దలంచి, మే
మందుము రేల ప్రొద్దుననె యుండెడి యిల్వెడరింతు రందఱిన్,
విందొనరింతు మంత సరవిన్ గడతీరిచి నిత్యకృత్యముల్.

మేనులు వొంగి పర్వులిడి మిత్రులు కల్పిత వర్షధారలన్
స్నానమొనర్చు వేళనెకసక్కెము లాడెదు వేళ నొందరుల్
బూని పెనంగువేళ తమ పుట్టెమువింగిన యట్టు లాత్రతన్
స్నాన జలమ్ము వేగగొను చందము, నందము, నోలలాడుటల్
కానగగాని, సంతసము కల్గునె! యిచ్చటి స్నానఘట్టమున్.

వాలఖిల్యులవోలె యశ్వద్ధవృక్ష
ముల, సమీపమునన్, ప్రొద్దువొడుచు తోన
పలువిధంబుల నాసన ప్రకరణముల
యోగ సాధన లిచట, చేయుదురు, మించి.

కొందఱు పర్వులెత్తుదురు, కొందరు బొజ్జల నూపుకొంచు, సి
బందెః ప్రదక్షిణమ్ము సలుపన్ జనుచుందురు, కొందరిండ్లలో
వందన మాచరింతురు, ప్రభాతములం దినుగూర్చి కష్టమున్
గొందఱు చేతురిట్లు తమకుం దగునట్లు శరీరవృద్ధి కే
చందమునచ్చునో, యటుల సాధనలన్ బచరింతు రిచ్చటన్.

ఆహా! బారులు దీర్చి, వృక్షముల ఛాయన్, విందుగావించుచున్
స్నేహాం దోశిక నోలలాడుదురు, కంచే! వీరి యానంద మీ
యూహాపోహల కందజాలనిది సద్యోముక్తిగాదోచు సం
దేహాం బేల! సుఖంబు నుంటిమిట రద్దిరవ్వ లేకుండగన్.

గంట గంటకు మ్రోగెడి గంట లిచట
కాలమున్ దెల్పు, రేల బగళ్ళ నందు
విశల ప్రతి పావుగంటకున్ నియతి మ్రోగు
చుండు గంటలవేళ వినుంగులేక
వార్డరులు హెచ్చరికల దెల్పంగ వింద,

లాలిత రాజమందిరములన్ బ్రతినిత్యము మేళవించు వై
తాళికులట్లు పెండ్లియగు తావుల మ్రోగెడి మేళమట్లు బా
కాలను నూదుచుంద్రు ప్రతికార్యముగూరిచి యందు నీ యుషః
కాలపు మేలుకొల్పు వినగా సరిగా ప్రతిజీవి మేల్కొనున్.

కూడుగుడ్డ యొసంగి కాపాడు షరతు
బూని తెచ్చెను మమ్ము ప్రభుత్వమిటకు
జేయుచున్నారలిట రాజసేవ మాకు
నౌకరుల గూర్చి సేవ లొందంగ దినము.

ఉచిత భోజనములు మాకు నుచిత వైద్య
శాలలు గలవు మంగలి చాకలియును
గసవు మూడ్చెడి చౌక నౌకరులు గలరు
కనుమ వీరి మా తోడిదొంగలెయటంచు.

చక్కనౌకార మాకు నొసంగి నార
లద్దెయడుగరు మేముండు నంతవరకు
బుద్ధి పుట్టిన సున్నమ్ముబూయ బాగొ
నర్తురీ యందమైన యొంటరి గృహాలు.

ఎందఱో పండితుల్ కవు లికెందఱు భోగులు త్యాగులుండిరీ
బందియ నొక్కరొక్కరు లవంబు నికేరికి దీసిపోవ రా
నందముతోడ వీరి గనినన్ దరిజేరిన బల్కరించినన్
దుందుడు కెల్లమాను పరితోషముగల్గు సువిద్యయబ్బెడున్॥

—: x :—

# జైలు

(గరికిపాటి మల్లావధాని)

ఉ॥ తెక్కెకుఁ బ్రొద్దుటన్ ఫయిలు లేచినవెన్కను గంజి ఫైలు ప్రొ
ద్దెక్కిన పీచుఫైలు మఱియించుక తాళిన ముద్దఫైలు నీ
చక్కని ఫైళ్లలోఁ గొఱతసల్ప ఫఖిర్లను రాజమంద్రి జై
లక్కటకక్కసంపు నరకాలయ మౌగద భారతాంబికా.

ఉ॥ ఉప్పుడుబియ్య మన్నమున నొద్దిక గొట్టిన ముద్దముద్దతో
గుప్పున నాసికం బగులగొట్టు నసహ్యపుఁ గంపు దిక్కులం
గుప్పుచు నుప్పుకారములు గానని చప్పని పుల్సు నాకటల్
దప్పిన వేళ బెట్టుదురు తల్లి వినంగదె భారతాంబికా.

చం॥ గలిజేరుకాడ దొగ్గలియు గడ్డియు గాదమువైచి రాళ్ల మే
కులు గల కంపుపుల్సు నొక కొంచెము వోయుదురమ్మ! దేవతా
పులుసట దానిపేరహహా! మోక్షపు పుల్సనరాదె చావుపు
ట్టులు గన రద్ది గ్రుక్కెడు గుటుక్కునఁ ద్రావిన భారతాంబికా.

ఉ॥ హృద్యములైన వంటకము లిచ్చటవచ్చునె నీకు సర్వమా
వేద్యముగాదె యీ పులుసు వేసిన యుప్పుడుముద్ద నాకిటన్
ఖాద్యముగావునన్ నిరభిఘార మపాత్రమునైన నీకునై
వేద్య మొసంగుచుంటి గొనవే నిరసింపక భారతాంబికా.

ఉ॥ ఒక్కయెడం బురాణములు నొక్కెడ సత్కవితా విలాసము
నొక్కడ గావ్య పాఠములు నొక్కెడ హాస్యము లాటపాటలిం
కొక్కెడ నుప్పుబద్దెలు మఱొక్కడ బల్చెడుగుళ్ళ నొప్పుగా
నిక్కరణిం గ్రదించి జరిగె నెంతయు హాయిగ భారతాంబికా.

ఉ॥ వేళకు రాదు బోన మొక వేళను వచ్చినఁ గూడ జాలియుం
జాలదు చాలెనేనియును జక్కగ బక్వముగాదు పక్వమై
గ్రాలిన నుప్పు కారములు గానరావొక యింత యుండినన్
రా లిసుముండి దంతముల రాల్చుచునుండును భారతాంబికా.

ఉ॥ సైలుల గోలవోయె దలవాకిట గావలి మాయమాయె స్నా
నాలకు భోజనాలకు నొనర్పఁబడెన్ సదుపాయముల్ విలా
సాలకు పాఠశాలలకు జాలకయుండెను గాల 'మల్లిపూర్'
జైలొక జైలునా జనునె! సత్యము చెప్పిన భారతాంబికా.

ఉ॥ వేళకు స్నానపానములు వేడుక లాటలు వారివారికిం
బోలిన విద్యలున్ సభల పొడిమి పెల్లుగ గూర్చు నల్లిపూర్
జైలును గూడ జైలనుట సాహసకృత్య మిదొక్క విశ్వ వి
ద్యాలయమంటకుం దగు యథార్థము జెప్పితి భారతాంబికా.

చం॥ అరవము కన్నడమ్ము మళయాళము నాంగ్లము దెల్గుసంస్కృతం
బురుదును హిందీ వాంగ్లమును సుత్కలమాదిగ పెక్కుభాషలం
గరచిన మమ్ము నొక్కెడ సుఖంబుగ నుంచుట నేడిదే పర
స్పరమును నేర్చుకోదగిన భాగ్యము నేకురె భారతాంబికా.

ఉ॥ కూళలు త్రాగి రాజభటకోటులు రక్కసులట్లు వొట్టి లా
ఠీలను బూని త్రుళ్ళుచు గడిం దిగనార్చుచుఁ బిన్న పెద్దలన్
స్త్రీలను వారువీరనక చేతికినందిన వారినెల్లఅన్
జాలియు నాలిలేక పిలుచన్ బడమోదిరి భారతాంబికా.

ఉ॥ వేలకువేలు నీ ప్రజలు పెండ్లికి బోయెడు లీల బుణ్యతీ
ర్థాలకు నేగుకై వడి ముదంబున గన్గొన నాటకా ల్పినీ
మాలకు బోలె "జై" భారతమాతకు "జై" యని వచ్చి నారలీ
జైలుల నింప భక్తివివశత్వము దోపగ భారతాంబికా.

# జైలు

(జోగయ్యశర్మ)

సీ॥ కరము పవిత్రమౌ ఖద్దరు వస్త్రముల్
విడిచిపెట్టితినయ్య వేధమీర
మట్టలాగును గోచి మరి జుబ్బయును టోపి
ధరియించితినిగదా దైన్యవృత్తి
మురిపెంపు ముంగురుల్ మొదలంట గొరిగించి
పిలక బెట్టితినయ్య పీడదోప
వెలగలవస్తువుల్ వీడి సీసపుబిళ్ల
రొమ్మున దాల్చితి రోతపుట్ట.

గీ॥ గోనె చాపొక్కటియు బొచ్చు గొంగడియును
పట్టు పరుపును శాలువై పరగె నాకు
నింక నేనేమి సేయంగ నెంచినావొ
కాచి యుంటిని పొందంగ గాంధిదేవ॥

సీ॥ సన్నని బియ్యమ్ము చక్కగావండిన
భోజనంబు మరచిపోయినాను
వంకాయ చిక్కుడు పనస గుమ్మడికాయ
అరటి .కూరల మాట మరచినాను

వెలగ చింత దోస వివిధములగునట్టి
మామిడి పచ్చళ్లు మరచినాను
ఉప్పు మొదలగునట్టి యున్నయారు రుచుల
మజ్జిగ నేతులన్ మరచినాను

కళ్ల ఉప్పుడు బియ్యపు కూటిముద్ద
దేవతా పులుసొక్కటే దిక్కునాకు
నింక నేనేమి నేయంగ నెంచినావో
కాచి యుంటిని పొందంగ గాంధిదేవ॥

# స్వతంత్ర భారతి

(జంధ్యాల పాపయ్యశాస్త్రి "కరుణశ్రీ")

'గణగణ' మ్రోగెరా విజయ ఘంటలు భారతమాత మందిరాం
గణమున; ద్వారబంధములఁ గట్టిరి చిత్రవిచిత్ర రత్న తో
రణతతి; వీధివీధుల విరాజిలుచున్నవవే త్రివర్ణ కే
తనములు; మేలుకాంచె పరతంత్ర పరాఙ్ముఖ సుప్త కంఠముల్.

卐

# దేశభక్తులు

(పురిపండా అప్పలస్వామి)

చిరపరాధీన శృంఖలాచ్ఛేదమునకు
జీవితసుమాలె ధారవోసితిరి మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమవృష్టి
శ్రీ విరాజిల్లు మీయోధ శిరములందు.

బాధలే భాగ్యముగ నోడి బట్టజాలు
భారతాశ్రమ తరుణ తాపసులు మీరు
ఏ నిరంకుశులేని బంధింప నిందు
నిగళముల త్రెంచుకొనెడి సైనికులు మీరు.

స్వార్థలవమేని లేని మీత్యాగ గరిమ
ప్రాకిపోయెను ఖండాంతరాల దాటి
ఇది స్వరాజ్య రమానవాభ్యుదయ వేళ
నభమె నినదించె విజయ దుంధుభులమ్రోత.



# నైవేద్యము

(దువ్వూరి రామిరెడ్డి)

తల్లి, నీయుత్సవముఁ గాంచఁ దరలినార
లనుగుఁ దనయులు నైవేద్య హస్తులగుచు;
ధన్యులెల్లరు నాత్మోచితంపుఁ గానుక
లర్పణము సేయవచ్చిరి; యందికొమ్మ.
స్వర్ణ సుమముల నర్చన సలుపువారు
భాగ్యవంతులు నీపాద పద్మములకు;
ఏమిలేనట్టి భిక్షుకుండేని నేడు
కంటి క్రొన్నీటి ముత్యాల కానుకవిడుచు.
పూజ్యులధములు ధనికులు పుట్టుపేద
లనెడి యెడలేక యెత్తిరి హారతులను;
భక్తిపరవశులైన యాప్రజలగీతి
దిక్కుదిక్కులయందు ప్రతిధ్వనించు
అమ్మరో! నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండగణము.
త్యాగ పరిశుద్ధమగు నాత్మఁ దొలగిపోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనఁగ.
ప్రొద్దు పొడుపున నీ పాదపూజ కొఱకు,
కవిని, తెచ్చితి దోసిటఁ గన్నెపూలు;
బలి వితర్దిక నిరతంబు వెలుగునటుల
హృదయపు సుగంధ దీప మర్పింతు గొనుము.

---

# సేవ

(దువ్వూరి రామిరెడ్డి)

మఘుఁగన్న భారతమాత మందిరమున
దివ్వెలై మన ముందామా. పైడి
దివ్వెలై మన ముందామా.
పరమ పావని తల్లి పాదపూజల వాడు
పువ్వులై మన ముందామా. పొన్న
పువ్వులై మన ముందామా.
భారతీదేవి విపంచిక రవళించు
తంత్రులై మన ముందామా. దివ్య
తంత్రులై మన ముందామా.
జన్మభూమీ శౌర్య సౌరభ్యములు చల్లు
గీతలై మన ముందామా. భావ
గీతలై మన ముందామా.
కథన వీరులచేతి ఖడ్గధారలలోని
మెఱుపులై మన ముందామా. కాఱు
మెఱుపులై మన ముందామా.



# నా జన్మభూమి

(తురగా వెంకటరామయ్య)

౧

నా జన్మభూమేదిరా
బాపుజీ!
నాముద్దు తోటేదిరా?
నా కోకిలమ్మేది, నా పూలమేడేది?
నా రాణి వీణేది, నా వలపు పాటేది.
కలలోని సిరులాయెరా
బాపుజీ!
కారడవి పాలైతిరా!

౨

నాయేటి లంకేదిరా
బాపుజీ!
నాయూల మండేదిరా!
నామేని పొంగేది, నా మనసు పరుగేది
నాగ స్వరమ్మేది, నాయేల పాటేది?
కాలమిట్లైపోయెరా
బాపుజీ
కన్నీరె యేరాయెరా!

౩

ఏనాటి కథలాయెరా?

బాపుజీ!

ఈ జీవమెటు నిల్చెరా?

నా ప్రేమ గెలిచేనా? నాతోట పూసేనా?

నా వీణ మ్రోగేనా? నాపాటే పాడేనా?

నాపాలి ప్రభువేడిరా!

బాపుజీ!

నా కృష్ణుడేమాయెరా?



# దొరవు నీ వయ్యేదవురా !

(తురగా వేంకటరామయ్య)

పరమ శివుడే తండ్రిరా! ఈ
ప్రకృతి సుందరి తల్లిరా !
పాడియావులు పంటపొలములు
భాగ్యములు రాజ్యములురా!

దున్నరా ఈ భరత భూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వర్గరాజ్యపు
దొరవు నీవయ్యేదవురా!

కాలమే తలక్రిందుగా నీ
కాలయముడే యేలుకోనీ
నీవు నీ గోవులును శాశ్వత
జీవులై యుండేరుగదరా! దున్నరా॥

పాడునేలే లేదురా! నీ
భావమే బీడాయెరా!
పరిమళించే తోట పెంచీ
పరమశివు నాడింపరా! దున్నరా॥

గాలి వెలుగులు జూడరా! మే
ఘాల వర్షము నడుగరా!
సూర్య చంద్రుల గమనలీలా
శోభలను దిలకింపరా! దున్నరా॥

ఏటి లంకల మేతమేసీ
పూతగిల్లిన జోడుగిత్తల
పైడి నాగటి కర్రులో జీ
వాల జీవితముండెనౌరా! దున్నరా॥

పైరులను గాచేటి సుందరి
ప్రకృతితో వెలిగేనురా! ఆ
మేడలో వర్తించు రాణికే
కూడు గుడ్డలు దూరమగురా! దున్నరా॥

ఆలుమగలూ జోడుగూడీ
ఆడుకొంటూ పాడుకొంటూ
జీవకాంతుల వెలుగు సస్య
శ్రీలలో విహరించెదరురా! దున్నరా॥

శుభదమగు 'రాట్నంపు' శ్రుతితో
సుందరీమణి పాడుచుంటే
పొంగుతూ ఆడేటి బిడ్డలే
భూములన్ని యేలెదరురా! దున్నరా॥

కత్తికలములు వ్రాలెరా! నీ
కష్టమే గెలిచేనురా!
ప్రకృతి పురుషుల ప్రతినిధులు మీ
ప్రభుతయే నిత్యమ్మురా ! దున్నరా॥

దున్నరా ఈ భరతభూమిని
తొలకరించిన పుణ్యభూమిని
కరువులేని స్వతంత్ర రాజ్యపు
దొరవు నీ వయ్యేదవురా! దున్నరా॥



# దేశమాత కొలువు
(పైడిపాటి సుబ్బరామశాస్త్రి)

ఎత్తండీ దివ్వటీలు-ఒత్తండీ శంఖాలు;
కొలువుతీర్చె దేశమాత-కొలువు తీర్చెను.

పత్తనముల, పల్లెలలో-భారతదేశమ్మంతా;
అంతులేని ఉత్సాహం-అంతరంగమున పొంగి.

ప్రామినుకుల తోబుట్టువు-ప్రాచీనత అంతటిదీ-
ఆది సృష్టియైన మాత-కంజలింపుడీ.

మల్లెలతో, మొల్లలతో-మటి గులాబి పూవులతో
ఉల్లము రంజిల్ల, పూల-జల్లు పట్టుడీ.

పదునాలుగు బాసలతో-ప్రణవతత్త్వ గీతులతో;
పాడుడీ ఆడుడీ-భారతీయులూ.

ఎత్తండీ దివ్వటీల-నొత్తండీ శంఖాలను;
కొలువుతీర్చె దేశమాత-కొలువు తీర్చెను.



# స్వాగతం

(పైడిపాటి సుబ్బరామశాస్త్రి)

స్వాగతమమ్మా! స్వాగతమమ్మా!
భారతమాతా! ఓ-భారతమాతా

హాటకమ్ము రత్న సిం-హాసనమ్మిదిగో ము
వ్వన్నె వలువతోడ వచ్చు-పున్నెమ్ములప్రోవ, నీకు. స్వాగత॥

అర్ఘ్యమ్ములు, పాద్యమ్ములు-ఆచమనమ్ములు సర్వము
అందుకొనుము తల్లి! నీకు వందనమమ్మా. స్వాగత॥

ఆడెదము పాడెదము-హారతి నెత్తేము నీకు;
ఎనుబది కోటుల చేతుల-నిదిగో, కైకొమ్మా.

స్వాగతమమ్మా-స్వాగతమమ్మా;
భారతమాతా! మా- భారతమాతా.



# స్వాతంత్ర్య దినోత్సవము

(శిష్టా వెంకటసుబ్బయ్యా)

సీ॥ బహుళ రత్న ప్రభాపటలిచే మిన్నందు
వడకు గుబ్బలి పట్టుగొడుగుగాఁగ
బ్రహ్మపుత్రా భగీరథజాది తటినుల
వరతరంగములు చామరలు గాఁగ
ప్రాచీన దక్షిణ పశ్చిమార్ణోనిధుల్
తళ్కొత్తు నిలువు టద్దములుగాఁగ
అర్ణవాంతర సదా ఘూర్ణమానోర్మికా
ధ్వానముల్ మంగళ ధ్వనులు గాఁగ

గీ॥ నలుబదియుకోట్ల భారతీయులును దనకు
అడుగు దాఁటని కూర్మి బిడ్డలును గాఁగ
డంబు మీఱెడు లంక పీఠంబుగాఁగ
ప్రజల గాపాడు గాత! మా భరతమాత!

శా॥ కొండాడందగు త్యాగ శీలురును, వాకోరాని పుణ్యాత్ములున్
చండాంశు ప్రతిమాన తేజులును చంచద్భాగ్య భోగేంధిరో
ద్దండుల్ వేలకొలంది యెందరొ సుధీ తండంబు లుంకించి, యీ
జండా కోసముగాదె? వీడి రసువుల్ స్వచ్ఛందతా ప్రక్రియన్॥

శా॥ విందుం బ్రీతినిఁ గ్రొత్త పెండ్లికొడుకుం బిండుంబలెన్, భద్ర వే
దండ శ్రేణులపోల్కి, ధీర చరిత స్తవ్యాత్మకుల్ నాయకుల్
గుండెల్దీసిన బంట్లు, బందిఁగృహులై, ఘోరంబుగాఁబోరి యీ
జండాకోసము గాదె? వీడి రసువుల్, స్వచ్ఛందతా ప్రక్రియన్॥

---

# స్వాతంత్ర్య దినోత్సవము:

("గురజాడ")

నేడుగా తమమేని నెత్తురులోడ్చి
రాజశ్రీని చేకొన్నయట్టి దినము
నేడుగా జగతి బానిసజాతియనుపేరు
పోగొట్టుకొన్నట్టి పుణ్యదినము
నేడుగా యెన్నడు వీడని దాస్య శృం
ఖలముల్ద్రెంచిన ఘన దినమ్ము
నేడుగా పరజాతినిన్ ద్రోసిరాజని
యాట గట్టించినయట్టి దినము

నేడుగా దేశమాత పున్నెము ఫలించి
ఖండ ఖండాంతరముల నఖండయశము
బడయు దివ్యముహూర్త మీ పర్వమందు
జేరుడి స్వతంత్రభారత వీరులార.

---

# "15వ ఆగస్టు 1947"

(ధవళా శ్రీనివాసరావు)

"సాహితీ మేఖల"

అమ్మ కడగండ్లన్ని అంతరించాయి
అమ్మ కమ్మని రోజులవతరించాయి
మా గాంధిబాబయ్య మంత్రమే మాయమ్మ
చెరబాపి స్వాతంత్ర్య శిఖరమెక్కించింది.

వెలుగుకై తపియించి విసిగిపోయిన రేయి
అన్నంబునకె అఱ్ఱు లెత్తిచాచిన పూట
గుడ్డకై మర్యాద గోలుపోయిన ఘడియ
ఇనుప సంకెళ్ళ బరువును మోయలేక.

కొనప్రాణములతోడ కొట్టుకొన్న యుగాలు
తలుపులో పలుకులో నడకలో బాటలో
అన్నింట దాస్యమ్ము ననుభవించిన కాల
మాగష్టు పదిహేనుతో అంతమైనాది.

మా తల్లి విజ్ఞాన మహిళయై యవిళంబు
తోడి దేశాలలో గూడి తలనెత్తుకొని
గరువంబుతో దిరుగు కాల మేతెంచింది
అమ్మకడగండ్లన్ని అంతరించాయి.

---

# సుస్వాతంత్రము

("రాయప్రోలు")

ఓ సుస్వతంత్రమా! ఓ మోహ మంత్రమా!
నీరూపు కనబడేనా! ఎందైన, ఎపుడైన
నీ రేక తేటబడునా! ఓ సుస్వతంత్రమా॥

నీ నామ జపమాల-నిష్ఠతో త్రిప్పితిమి
కంటకపథాలలో-కటిక చీకట్లలో
కక్కసల చెఱలలో, ఓ సుస్వతంత్రమా॥

నీమోము భయ భూత ధూమాగ్ని వలయమో!
కళ్యాణ పాత్రమో! కనక శతపత్రమో,
కనుపించునా మాకు, ఓ సుస్వతంత్రమా॥

నిండి తొణికిసలాడు-నీ భుజాభాండంబు
మము బలిమిలాగేను, మధుర రసమున్నదో!
మరుల విషమున్నదో! ఓ సుస్వతంత్రమా॥

నీ కుశల ఖేలనము-నిఖిల సుఖరూపకమో
జగడాల జూదమో! జాతర్లు సలిపేరు
జాతులును రాజ్యాలు ఓ సుస్వతంత్రమా॥

నరుని స్వాతంత్ర్యమై-నారీ స్వతంత్రమై
అర్థ స్వతంత్ర్యమై వ్యక్తి స్వతంత్ర్యమై
తెగునె నీ సూత్రంబు ఓ సుస్వతంత్రమా॥

జన్మహక్కులజిక్కి, స్వార్జితంబుల చీలి
రాజ్యసీమలనిరికి, పూజ్యమగు నీ పొలము
పండునో! ఎండునో! ఓ సుస్వతంత్రమా॥

స్వకుటుంబ కలహాలు జాతి మత భేదాలు
నీ తలకు చుట్టేరు నీతివేత్తలు నేడు
నిజమో! అబద్ధమో! ఓ సుస్వతంత్రమా॥

పంచభూతములను భాగాలు పంచుకొని,
తెగి స్వతంత్రించితే దిక్కేది:
ఈ లోక తీర్థయాత్రకు తేపు, ఓహో స్వతంత్రమా॥



# అమర జ్యోతి

(తుమ్మల సీతారామమూర్తి)

సీ॥ యుగయుగమ్ముల భారతోర్వీ తపః పుంజ
మెసరేఁగి జగముల కిడిన పంట
తర తరమ్ములనుండి తరలని దాస్యమ్ము
కట్లు త్రెంచిన శాంతికదనయోద్ధ।
నర నరమ్మున జీవన జ్యోత్స్నగా నహిం
సను సహించిన యోగిసత్తముండు।
పద పదమ్మున సత్యభాషా సనాతన
సౌరభ్యములు చిమ్ము సాధుశీలుఁ

డహరహమ్మును విశ్వకల్యాణలబ్ధి
కొఱకు నాత్మార్పణ మొనర్చుకొను తపస్వి
కూలె నా దుర్మతోన్మాద కుటిల తంత్ర
జుష్టదుష్టచ్ఛటా మృత్యుముష్టిహతికి.

మ॥ ఒఱిగెన్ విశ్వపతాకలెల్ల వసుధావ్యోమంబు లార్తస్వర
స్ఫురణాకంపిత వీధులయ్యె మిహిరాంశుజ్యోతు లేపారినన్
గఱకుంజీఁకటులేచి కప్పె దెసలన్ గాకోల కల్పమ్ములై
చరమ స్థానము నీవు సేర జగమే స్తంభించె యోగీశ్వరా!

ఉ॥ పూవుల తెప్పపైఁ గదలిపోయితివా యమునా తరంగిణీ
పావన రాజఘట్టమున భౌతికదేహము గాల్చుకొంటివా
నీ వపురస్థి చందనవనీ శకలమ్ముల బూదియయ్యెనా
బాపురుమంచు నీదు చితి పజ్జల శోకము పొంగెనా ప్రభూ।

క॥ మందాకినీ సరిత్కా, ళింది సరస్వతుల నస్థిలేశము కలియన్
హిందూ ముస్లిము క్రైస్తవ, బృందములో నీ మహాస్పు పెన
గొన్నదిరా।

సీ॥ అపవర్గ బాంధవం బదికి లౌకిక ధర్మ,
మాలపించితి నందబాలునట్లు
కను దిక్కులేక సోలిన మూగజీవాల,
మూల్గు మాన్పితి శాక్యముని విధాన।
సతత క్షమా ప్రేమ శరణమై నరదైత్య
కిల్బిషం బోర్చితి క్రీస్తువోలె।
ఆత్మ నిత్యము, దైవమదియొండె-యని ప్రతి
ష్ఠింపఁజాలితి సోక్రటీసు కరణి
బానిసము ప్రేఁగు డించి కింపాకజాతి
కండగా నిల్పఁబడి తత్ప్రబహోము పగిది
నద్భుతంబాయె మనుగడ యందకాక
మృతి వీధిన్ వీరి ననుసరించితె మహాత్మ!

మ॥ నిను రామాదులఁజేర్చి మెత్తురది మన్నింపన్ రిపుగ్రీవముల్
రణరంగమ్మునఁగోసి రక్తఝురిలో రామాదులోలాడి రా
వనికిన్ నీకునులేదుపొత్తు, రిపుతన్ బాధించి విద్వేషి పై
నెనరుం జిమ్మెద వీవు చిక్కదు ప్రభూ! నీ వియోగ మెవ్వానికిన్॥

గీ॥ అనఘ! నీ వీశ్వరుని దూతవగుట విశ్వ
మానవీ మానవుల్ భగవాను పట్ల!
దేట పఱుపని భక్తి నీదెస వెలార్త
రసలుకం డెను వడ్డి ముందైనయట్లు.

ఉ॥ ఆంకిలివీడి నిర్భరవయః పరిపాకమునందె యింద్రి యా
హంకృతిఁ దూల్చి పూనితి మహామతులోర్వని బ్రహ్మచర్య! మీ
బింకములేని నాఁడు వలపించి జగంబుల నిట్లు నీ
లెంకలఁ జేసికోఁదగవులే! తెలిసెం గిటుకెల్లఁ గోమటీ!

శా॥ ఆ నాఁడేసు పవిత్ర రక్తమున దాహం బార్చుకొన్నట్టి యా
దీ నాఁడెందును దిక్కులేని పురుగై యేఁ కారుచున్నాఁడు నీ
వే నీచత్వమునేలెదో మఱియు నేయే హింసలంగూలెదో
దీన త్రాణ పరాయణున్ ఋషివరున్ దిన్నాఁడ వేనఃఖనీ!

ఉ॥ చచ్చిరి దేశభక్తులు విశాంపతు లిద్దకపుల్ ప్రవక్తలుం
జచ్చిరిగాని మున్నెవని చావునకుం బ్రజలిట్లు క్రుంగిరే
సచ్చరితుండు పోవునెడ సర్వజగంబు లిటుల్ వెలార్చె న
త్యుచ్చతరాదరంబు హృదయోద్గత భక్తియు సానుభూతియున్॥

గీ॥ మనుజుడవుగావు నీవు కోమటివిగావు
బడలిపోయిన భారతీయుఁడవుగావు
కావు గాంధివి-లోకలోకముల వెల్గుఁ
జూపు నిరవధి కామరజ్యోతివోయి!

—)o(—

# బాపూజీ నిర్యాణము

## ("కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రి)

కత్తి కదల్పలేదు! విశిఖాలు విదల్పనులేదు! గాండివం
బెత్తనులేదు! ఏక్రియ జయించితివో నరమాంస పారణో
న్మత్తుల? నీ ప్రభావము లమానుషముల్! భవదీయ శాంతి సం
పత్తికి దోసిలొగ్గెను ప్రపంచము భారతభాగ్యదేవతా!

పుటలా డెబ్బదియెన్మిదేగినవి బాపూజీ వయః కావ్య సం
పుటిలో; పైపుట త్రిప్పులోపలనె మాపున్నెమ్మ మిన్నంది ప్ర
స్ఫుట భంగిన్ వినిపించె నేఁటి కిట సంపూర్ణ స్వతంత్ర ప్రజా
పటలీ వీరవిహార విశ్వవిజయ ప్రస్థాన భేరీధ్వనుల్!

'యుగ పురుషుండ'వంచు 'పురుషోత్తమమూర్తి' వటంచు
మూర్తి మ
జ్జగ దనురాగ శాంతిమయ సాత్వికశక్తి వటఁచు వేనవేల్
మొగముల ప్రస్తుతించెను ప్రమోదముతో జగమెల్ల నిన్ను ఏ
మగుదురు నీకు? తొల్లిటి మహ్మదు క్రీస్తును బుద్ధదేవుడున్.

కనిపింప దిదియేమి? కనకకాంతులుచిందు
సత్యావతార ప్రశాంత మూర్తి!
వినిపింప దిదియేమి? వీనుల విందుగా-
'రఘుపతి రాఘవ' రామ భజన'
కళదప్పెనేమి? ఏకాలమ్ము కళకళ-
లాడుచునుండు బిర్లాలమేడ
తలవంచెనేమి? మిన్నులు ముద్దుగొను
మూడు-రంగుల వీర భారత పతాక।

తడిసిన దిదేమి? కన్నీటి ధారలందు
భరత జనయిత్రి ఖద్దరుపైట చెరగు
ఏమొ పోగొట్టుకొన్నట్టు లేడ్తురేమి?
గోడుగోడున నలుబదికోట్ల ప్రజలు !!!

దివ్యమూర్తి :

విచ్చేయుచున్నాడు! విశ్వసౌభ్రాత్రమ్ము
సాధించుకొన్న 'దీక్షా తపస్వి'
దయచేయుచున్నాడు!! ధర్మమే జయమన్న
కర్తవ్యమును దెల్పు 'కర్మయోగి'
వేంచేయుచున్నాడు!! వీరభారతశక్తి
చాటిచూపిన'బోసినోటి బాబు'
వచ్చుచున్నాడు!! నల్వదికోట్ల ప్రజలకు-
మేలుకొలిడిన 'వైతాళి కుండు'

దర్శన మొసంగుచున్నాడు! స్పర్శమాత్ర
పతితపావనుండగు 'విశ్వబాంధవుండు'
రండు రండంచు పువ్వుల దండలూని
దేవతలు మింట బారులు తీర్చినారు.

## సర్గీయబాపు :

వీఁడటే: దక్షిణాఫ్రికా ప్రభుత్వంబును
మూడూపులూపిన 'ముసలితాత'
ఇతఁడేనటే! జగత్త్రితయమ్మునకు సత్య
సందేశమందించు 'శాంతిదూత'
ఈతండటే: ప్రజా స్వాతంత్ర్య రథమును
కదలించు 'విశ్వమంగళ విధాత'
ఈయనే నటే! యూరపీయుల తబ్బిబ్బు-
సలుపు 'సత్యాగ్రహ సమరనేత'

అంచు నీ దివ్యమూర్తి దర్శించు కాంక్ష
పూలదోసిళ్లతో వేల్పు పూవుబోండ్లు
గుములు గూడిరి స్వర్ణ సౌధములమీద
స్వర్గ వీధుల నీతేరు సాగువేళ.

## ధ్రువతారలు :

మండెడు స్వరాజ్య సమరాగ్ని కుండమందు
భస్మమైన గులాబి పుష్పములు మీరు
ఎన్ని కల్పాంతములకేని యింకిపోని
భరతమాత ఆనంద బాష్పములు మీరు.



# మహాత్మా

(శాస్త్రి వెంకటనరసయ్య)

అజ్ఞాన తిమిరార్కో౽యం. అహింసా సత్యపాలకః
అస్పృశ్యతా ప్రతిద్వంద్వీ, మితభాషీ జితేంద్రియః॥
బాపూజీ, శిష్య శిక్షార్థం ఉపవాస వ్రతో౽భవత్
తస్యవాణీం సమాకర్ణ్య, భారతీ జాగృతీభువి॥
జనానాం మానసక్షేత్రే, గాంధీఖ్యాత కృషీవలః
నీతి రూపక బీజాని, చిక్షేప ప్రేమవారిణా॥
రాజఘాటే సమాధిస్థః, నానాపుష్పైర్విరాజితః
భవత్యయం కర్మయోగీ, సర్వదేశైస్సమాదృతః॥
లోకే౽స్మిన్ బహుధాకుర్యాత్, గాంధి సిద్ధాంత పాలనమ్
స్వరాజ్య శుభసంధాతా, మహాత్మా పాతు శాశ్వతః॥

కనుదోయినుండియుఁ గరుణారసంబూర
చిరునవ్వుమోమునఁ జిందులాడ
వెన్నెల ప్రోగులు వెలుగొంద నవ్వులో-
గాంభీర ముద్రయుఁ గానుపింప
మదిలోని ప్రేమాంబుమాధురి పొంగగా
సాత్విక గుణరాశి సందడింప
కర్మయోగారూఢ కాంక్షలు తళుకొత్త
ధర్మ స్వరూపమ్ము తాండవింప
విశ్వమానవ శాంతికై వేడ్కమీఱ
దివ్యయత్నమ్ము సలిపిన దీపితాత్మ!
మార్గదర్శక! కరుణించి మాన్యరీతిఁ
మాదు హృదయమ్ములందున మసలు మయ్య!

---

# ఎవరి పాద చిహ్నములివి?

("దాశరథి")

ఎవరి పాద చిహ్నములివి?
ఎవరి పాద చిహ్నములు?
అతని ప్రతి అడుగు గురుతు
ఆలయమై తలయెత్తును
అతని చేతి గొడుగు క్రింద
అఖిల జగము శయనించును.
దానవులను కరగించిన
మానవు డతడెవ్వడు?
గుండెనొడ్డి తుపాకీల
గుండె పగలగొట్టెనతడు
రాటంతో రణశూరుల
ఈటెల నెదిరించె నతడు.
హిమాలయంకన్న నెత్తు
ఎవడాతం, డెవ్వడు?
ప్రతి మానవ హృదయమ్మున
నొదిగిపోవ జాలునతడు
విశ్వములో ప్రతిప్రాణిని
ప్రేమించగ జాలునతడు.

కత్తికి కన్నీరు గూర్చు
కరుణాకరు డెవ్వడు?
విషమిచ్చినవాని కమృత
చషక మిచ్చె నాతడు
కారాగారము స్వర్గము
గా. మారిచె నాతడు.
తరతరాల మన సంస్కృతి
తానై నిలిచిన దెవ్వడు?
ఓపిక రూపం దిద్దుక
ఉరికివచ్చు నాతనిలో
'శాంతి' శరీరమ్ముబూని
సాగివచ్చు నాతనితో.
మంచి' మరాళము వోలిక
'మసలునెవని మనసులో?
'క్షమ' శిశు శశి నవరేఖా
సదృశమయ్యె నతని శిరసి
'ఔదార్యం' అతని నుండి
అమర వాహినిగ దూకును.
ఎవని తనువు గతాగతము
లేకమైన యటులతోచు
ఎవని చిన్ని నివాసము
అవనికి శ్రీకైలాసము?
గుండెలలో ఆతడున్న
కొంచెము సే పాపుడీ!
కన్నులలో ఆతడున్న
కాస్త నాకు చూపుడీ!
ఎవరి పాద చిహ్నములివి?
ఎవరి పాద చిహ్నములు?

---

# మహాత్మా

(మంగిపూడి పురుషోత్తమశర్మ)

అపుడు నీ సత్యతపము మహాద్భుతముగ
పూచి ఫలియించెనొక్క యపూర్వ ఫలము
భారతులె కాదు, ఆశాంత ప్రజలు హర్ష
మేచి నినుకిరీటించి కీర్తించినారు.

ఇపుడు నీ సత్యదీక్ష పరీక్ష సురలె
నీ పరాజిత లజ్జిత నిందితమగు
శిలువ గొట్టిన నెత్తుటి శిరముపైని
నేసలను జల్లి మ్రొక్కి యాశీర్వదింత్రు.

ఏది జయము? పరాజయమేది? నీకు
మేదిని గలంచు పశుబలోన్మాద మెదిరి
దేవునకు ధర్మమునకును దేశమునకు
ఆత్మబలియిచ్చుపూత సత్యావహమున.

# మహాత్మా

(‘కవి పాదుషా’ పుష్పాడ శేషగిరిరావు)

నీ వాక్యామృత శీతధారఁ గలిసెన్ నీహారధారాళి, వి
ద్యా వైదగ్ధ్యములందుఁ బాఱిన దనంతంబైన సంద్రమ్ము, నీ
దౌ వర్చస్సున లీనమైన దఁటె శాంతజ్యోతి, గాంధీమహా
త్మా! వర్ణించెడి భూనభోంతర దిగంతంబుల్ భవన్నామమే!

తీరులు పొంది సౌరభము తేఱ మెఱింగయినేసి ఆత్మజ
స్ఫార విలోకన ప్రభలు పండిన వెన్నెల తీవలట్లు గాన్
స్వైర విహార సంపదలు పట్టెను భారతమాత నిన్ననే!
నీరము చాళ్ల చెక్కిళుల నించితి వింతనె ఏమయా-ప్రభూ!

సంద్రములు దాటి యేఱులు చక్కఁగడచి
కాల్వలీదియు నిలుముందు కాల్పఁబడితి
జగదుపాధ్యాయకుడ వంచు వగతుగాని
జన్మ చరితార్థ మో గాంధి సార్వభౌమ!

భారతీయ స్వరాజ్య సంపాదనమున
ముప్పు దెలియక నెవ్వొమ్మాలమునకె పెరుగు
కదళికా భూరుహామ వైతి గాంధిదేవ!
ఎంత బలిఁగోరె! స్వాతంత్ర్య కాంత నేడు!

రోగమునఁ జిక్కి చిక్కి మొత్తోయటంచు
మంచమునఁ బత్తు రీ యనామక జనమ్ము
గాంధి జీ! భవాదృశ మృత్యు కథయె వేఱు
వల్లె! మృతజీవి విన్వి జీవచ్ఛవాలు!

కృష్ణుఁడెటులేగె? నా క్రీస్తు మృతియు నెటుల?
అరిగిరెటు సోక్రటీసు మహాత్ములును?
ఆత్మబలి తప్ప నవతారమందు నేది?
పడయ నోతురె మిమ్ము నిర్భాగ్యజనము?

తిలకు కలగనె, దాసు శోషిలుచు పోయె,
లాలజీ ప్రాణమిచ్చె, స్వేచ్ఛాలతాంగి
అదిగొ యిదిగో యనంగ బోసరిగె, నీవు
ధన్యుడవు, స్వేచ్ఛఁ జూచియే తరలినావు.

జననికై యాత్మ రక్తమాంసమ్ము లొడ్డి
తుదకు బలియైన వీరుఁడా! దుఃఖ బాష్ప
సింధువునఁ దోగు మాయూర్పు చెమ్మలెల్ల
యుష్మదాత్మఁ బ్రశాంతిలో నోలలార్చు!

—x—

# గాంధీ-అమరగీతి

(జ్ఞానానందకవి)

చివికి జితించు మా హృదయసీమల నీదు ఘృణావినిర్మలాం
బువులను బోసి చక్కని సముజ్జ్వల పుష్పవనాళిగా నొన
ర్చి, విసుగు దాస్య కంటకము జీలిచి కమ్మని దేశమాత సొం
పు విధిగ నిల్పబెట్టిన ప్రబుద్ధ చరిత్ర జోహారులందుకో!

జగతీ చక్రము సన్నుతింపఁగ, నహింసా ఖడ్గ రాజమ్ముఁ గే
ల్దగ మన్నించి పరాయి గర్వముల నిద్రంబోయి, యస్వేచ్ఛ పుం
బొగలం దూలు సవిత్రి భారతి యశంబుందేల రాటాన, నీ
దగు శారీరము ధారవోసితివిగాదా! గాంధిమున్యగ్రణీ!

యమునాధునీ తరంగములపై నసి యాడ
పిల్ల వీచికలెల్ల వెడలువేళ
ఆకాశ మార్గాన నంబుద కన్యలు
హాయిగా యానంబు నేయువేళ
నలుబదికోట్ల బిడ్డల భారతీయుల
కన్నీటి హృదయాలు క్రాగువేళ
నవఖండముల మెప్పు జవిఁగొన్న భారతి
మురువు కజ్జల రేఖ చెఱుగువేళ

విశ్వదేశ వితతి విలపింప ముద్దుల
జిహ్వారునుఁబచేలు, జాలఁబొగుల
మమ్మువాసినావు మా పూజ్య బాపుజీ
హృదయ గాయమెటులఁగుదురుతండ్రి!

మఱి రావయ్య వరాలబోసిదొర, నీ మాహాత్మ్య సంపత్తిచే
కఱవయ్యెంగద దేశజుల్ తనివికాగం జూఱలాడంగ, నీ
దరహాసామృత మెచ్చటం జిలికితో ధర్మాభిలాషీ యదే
కుటిపింపం గదవయ్య నేడు భరత క్షోణీస్థలిన్ బాపుజీ!

గంధపుఁగాష్ఠపుం జితిని గాయ మదెప్పుడు భస్మమాయెనో
గాంధిమునీ! భవన్మహిత తత్త్వ సదాశయలక్ష్మి నేడు నీ
యంధుని దేశమందున కటా! నశియించునొ లేదొ లేక యా
గంధపు టింధనమ్ముల, జగాబడి మ్రగ్గి జితించి కూలునో.

పలుకరించునె దాదభాయి నౌరోజి కాం
గ్రెసు సంస్థ నిర్మాయి కీర్తికామి?
మురిసిపోయెనె ముదాంబుధిఁదేలి, లజపతి
రాయండు, భారత నాయకుండు
కౌగిలించెనె నిన్ను గాంచి, మోతీలాలు
పండితుండు, ప్రమోద భరితుఁడగుచు
కేలుమోడిచినె, గోపాలకృష్ణయ్యు, స్వా
ర్థత్యాగి తెనుఁగు రత్నాలమూట

పరవశుఁడాయెనె మా భగవత్తు సింగు
ప్రశుభవచనాల ననెనె సుత్రామసమితి
యైదుమూర్తుల గావంచయయ్యగారు
నేమమా మీకు, నా, స్వర్గసీమలోన॥

కూలిపోయినది, యీ కులమత భేదాల
పోరుకై ఘనవట భూరుహమ్ము
రాలిపోయినది, సార్థ పరత్వముంగాంచి
పరువు మీరినయట్టి పండుటాకు
ఆరిపోయినది, విద్యహీనతఁ జూచి
తేజ రిల్లినయట్టి దివ్యకాంతి
మునిచిపోయినది, యీ ముజ్జగంబులు, శోక
మునదేల, కరము కార్మొగులు చాయ

ఎట్టి శక్తిలోన నే భూతములలోన
నెట్టి యణువులోన విడుముకొనియె
నా మహాత్మజీవ మాపరంధాముని
యింత యూపిరకటః యెవలికెఱుక॥

స్వాతంత్ర్య సామ్రాజ్య సమర రంగమునందు
రాటంబుతోడ పోరాడునాడు
'క్విట్టిండ్య' యంచు బల్కిన బోసినోట, మం
త్యాలు వాక్యాలు పొంగారునాడు
బీహారు నవఖాళి భీకర రక్తంపు
పేరులో తిరిగి దుఃఖించునాడు
శాంతి బాటగ నహింసా కృపాణముబూని
విశ్వమ్ములను భయపెట్టునాడు

ప్రమదమందవెః సీతనూభవుని ఘనత
గాంచి యట్టి మహాత్ముని, గాంధి మహుని
పున్నెములరాశి, యశువుల గొన్న చెడుగు
భారత జాతికి నిజముగా బరువుఁజేటు॥

వినుపించునే విశ్వమునుందన్ను నవ్యభా
రత వర్ష నిర్మాత రమ్యవాక్కు
కనిపించునే! హిందు ఖండ స్వతంత్రయో
ధాగ్రేసరుని మహోదగ్రదృష్టి
రాల్చునే! రమణీయ రత్నాలు, ముత్యాలు
భువన వంద్యుని, దొడ్డబోసినోరు
లయవేయునే! హిమాలయ శృంగమునకెక్కి
కండెబొట్టు విహారి నిండు పిలక

ఖద్దరుధారి గాంధి గావంచ నేర్చునే
దేశభక్తి యెడద తరలింప
నన్ని కలుగుదాన నన్నుజూడవుగాన
నుడువుమిక వితాన కడుము దాన॥

తలలు వంచినవి, నిస్తుల యశోమూర్తి క్రమ
గ్గిన వెంట విజయనికేతనాలు
విలపించినవి మహాత్ములవారి శోకకు
ఘనత గాంచినయట్టి కవికులాలు
అడుగుబట్టినవి విద్యార్థి గ్రుంకుట
కగ్రనాయకుల సదాశయాలు
కుమిలిపోయినవి, నిక్కచ్చిగా స్థాపించు
సమతా ప్రబోధంపు శాసనాలు

చిలుముంబట్టెను, మా జాతి చిహ్నములకు
వెనుకనున్నట్టి మా జాతి విపుల కీర్తి
నిలుచునో లేదో యెవనికి దెలియుందొలుత
నిలుపు వాడల్లి స్వర్గంపు నిలయమేగ॥

నూలుప్రోగున జగజ్జాల వన్యేభంబు
గర్వంబు డించు నఖండమూర్తి
సత్య శౌచక్షమా శాంతిదయాసుధన్
విశ్వాల, జిమ్మిన పెద్దతబిసి
కదురురాటమునఁ బక్కా స్వరాజ్యముఁ దెచ్చు
నొడలు క్రుంకిన యట్టి బడుగుముసలి
తులలేని యమృత బిందువుల చినుకులు రాల్చు
ననుపమ గుణకీర్తి యమృతమూర్తి

భారత కళావతీ దాస్య బంధనముల
నూడ దన్నెడు మొనగాడు నేడులేడు
మఱలఁ గన్పింపబోడింక మందుకైన
భావిభారత రథమదే త్రోవజనునో!

ఉడుకు నెత్తురు నరముల, నుడుకుచుండ
వలతి స్వాతంత్ర్యమను పెనుమొలక లెడద
నెమ్మి చిగురొత్త వీరమన్నలరుధిర
ధారలందే యడంగె, స్వాతంత్ర్య రథము॥



# క్రొత్త స్వర్గము

("పైడిపాటి")

ఎవఁడురా వాఁడు, గుండియలెవ్వి వచ్చి
కొట్టెరా! గాంధి గుండెల గుండుదెబ్బ:
ఎవఁడురావాడు! గుండియనేమిచేసి
కొట్టెరా! గాంధి గుండెల గుండుదెబ్బ.

అయయో! చచ్చిన జాతికి నాయువిచ్చి
పరమ ధీరుఁడవై జాతికొఱకుఁజచ్చి
చచ్చిబ్రతికిన వాఁడవై శాంతినిచ్చి
సాక్షివై నిల్చినావటే-స్వామి నీవు.

సంద్రమ్ములై పొంగె జవహరు కన్నీరు
వల్లభాయి యెడంద పెల్లవిఱిగె
రాజేంద్రబాబు ధైర్యము బీటలువాఱె
వగచె రాధాకృష్ణ పండితుండు
దగ్గుత్తి పడెను పట్టాభి గొంతుక బిట్టు
టంగుటూరికి గుండెతావుతప్పె
భారతమ్మన బట్టపగలె చీకటితోచె
తోచె విశ్వమ్మున దోకచుక్క—

శాంతి సత్యమహింసయు సాధనమ్ము
జేసిచేసిన నీ యొడల్ శీర్ణమైన
పాతకమ్మెంత చేసెరా భరతమాత
కటకటా గాంధి సాధురక్తమ్ముఁ జిందె॥

తొలి కవాటమ్మునఁ బలకరించును నిన్ను
'బాల గంగాధర' పండితుండు
మలి కవాటమ్ము పువ్వులు మంకెనల్ పట్టుఁ
జల్లుగా నీమీద 'ఝాన్సీరాణి'
'జై హిందు'తో నమస్కారము లర్పించు
సైన్యమ్ముతో సుభాశ్చంద్రబోసు
సింహాసనమ్మునఁ జేర్చి యర్ఘ్యంబిచ్చుఁ
గ్రొత్త దేవేంద్రుఁ అల్లూరిరాజు.

సరస జేరిన సిద్ధార్థ శాక్య యోగి
తాను చెప్పని భక్తి తత్వమ్ముజెప్పి
జాతి నడిపించినావని సంతసించు
స్వర్గరాజ్యమ్ము నీవేగు సమయమందు॥

వడుకు నీకయి నూలు పిడుల భంభరవేణి
రాట్నమ్ము-రంభ విరామవేళ:
నులివెచ్చజేసి దొప్పలఁ దెచ్చియందిచ్చు
మేనక ముప్రొద్దు మేకపాల
నొలిచి భద్రముచేసి, యూర్వశి తినబెట్టు
జాయఁదేరిన వేలు శనగపప్పు
రామభక్తుఁడు దుగ్గిరాల గోపాలుండు
పనిపెట్టుకొని 'రామధునుల' వినుచు

మన రవీంద్రుఁడు 'జనగణమన'ని పాడు
జాతి వాసించు సరిక్రొత్త స్వర్గసీమ
బోసినవ్వుల వెలుఁగుల దూసివోసి
తలఁచు కొనుచుందు నవభారత ప్రశస్తి॥

# ఏడవకు! ఏడవకు! నా చిట్టిపాపా!

(కొప్పరపు సుబ్బారావు)

తొలికోడి కూసింది
తెల తెల వారింది
ఏడవకు! ఏడవకు, నా చిట్టిపాపా!
ఇప్పుడే వస్తాడు–నీ గాంధిబాబా ॥ఏడవకు॥

యమునమ్మ తల్లికి
ఏ బాధ కలిగిందొ
కన్నీళ్లు పెట్టుకొని
కబురు పంపించింది॥
కబురందుకొన్నాడు
కదలితా వెళ్లాడు
తెల్లవారేలోన
తిరిగొస్తనన్నాడు॥
పంటపండించేటి
పాలేళ్ల కడుపులు
గుంటపడి వీపులకు
అంటుకొని వుండంగ॥
తనపొట్ట పెంచుకొని
తనివి చెందాడంట
తనబాగు చూచుకొని
తనిసి పోయ్యాడంట
ఆ స్వామి పేరునే
మరచిపోయానమ్మ॥
రైలులో వెళ్లుతా
యమునమ్మ కడుపులో
రాగిడబ్బులు కొన్ని
వెదజల్లినాడంట

తిండి గింజల్లేక
దేశ మల్లాడంగ
దండిగా కొట్లలో
ధాన్యాలు నిలవుంచి
పేదసాదలనోట
బెడ్డకొట్టాడంట
దొంగచాటుగ డబ్బు

దోచుకొన్నాడంట
ఆసామి పేరు నే
మరచి పోయానమ్మ
ఎడులక్షలు పెట్టి
యమునమ్మ వొడ్డుపై
కట్టుతున్నారంట
గంగాధరుగుడి

కోడి కనుమూసింది
ప్రొద్దు కనుతెరిచింది
వెక్కి ఏడవకమ్మ నాచిట్టిపాపా!
వేళాయె. వస్తాడు-నీ గాంధీబాబా॥



# విప్లవం

("పూర్ణానంద్")

భారతదేశం
మహావెలుగు
మహాత్ముని
మరణం
కదిపివేసింది
మానవహృదయం
కంపించిందోయి
భూవలయం
గర్జిల్లిందోయి
భూనభోంతరాళం
క్రుంగిందోయి
హిమాలయం
కృశించిందోయి
మహోదధీ
మహాత్ముని
మరణం
మాపరాని

మతోన్మాదుల
మారణహోమం
వచ్చిందోయి
మహాత్ముని
మరణంతో
మరుగున్న
మతోన్మాదపు
మహా విప్లవం
వచ్చిందోయ్
మనస్సులేని
మనుజుడొకడు
మతోన్మాదపు
మహాజ్వాలతో
మరారియొకడు
మహాత్ముని
మరపించెర
మహాత్ముని

మహాత్ముని దివ్యస్మృతి

మహోదాశయ
మంతరించునని
మంతనించె
మతోన్మాదపు
మరాఠియొకడు
మారుమూలల
మతోన్మాదపు
మహోద్వేష
మంతరింపక
మహాత్ముల
మడియించుటకు
మహాజ్వాలలు
మందనంబునకు
నెగయుచుండెర
మత సామరస్యం

నిలబెట్టంగా
పిన్నలు పెద్దలు
ప్రజలు నాయకులు
కట్టండోయ్
మతోన్మాదుల
మహా విషంబును
వారించుటకై
కంకణం
మహాత్ముని
మానవ సేవయె
మాధవసేవగ
మహితను
మరువకోయి
సత్యాహింసల

పీడకోయి॥



# అశ్రుధార
("పూర్వాషాఢ")

ఓ భారతభాగ్యవిధాతా
శోభాయుత కీర్తి సమేతా
చాలించితివా అవతారం
సైరింపుము మా అపచారం
సకల భువన సంపూజితమూర్తి
సకలలోక సంఘోషిత కీర్తి
నీ మాటలె మంత్రచయంబై
నీ మౌనమె వింతభయంబై
విలసిల్లెను–ఆత్మలలోన.

నీ నగవున అమృతము పుట్టి
నీ చూపున హింసలుగిట్టి
నీ యాత్మ మహత్తరశక్తికి
నికృష్టులే మంలిరి భక్తికి
ఓహో! భోగ విరాగీ! యోగి
ఓహో! సౌఖ్యాంబర త్యాగి
ఓహో! సత్యాహింస స్వరూపా
ఓహో! మతకుల కక్ష ప్రతీపా

ఓహో! భారతజాతి ప్రతాపా
ఓహో! భారతదేశ ప్రదీపా
మనికితనమున మమ్ముల ముంచి
చనినావా! దివికామించి॥
శోభాయుతకీర్తి సమేతా
ఓ భారత భాగ్య విధాతా
సర్వలోక సంఘోషితకీర్తి
సకల భువన సంపూజితమూర్తి
చనినావా! దివికామించి
మనికితనమున మమ్ముల ముంచి

卐

# నీవే ప్రభువు-బాపూజీ

(రామమూర్తి)

క్రూరడవుల
కలల కావరములో
మరణించిన-గాంధీజీ
నీ అమృత వాహినులెక్కడ?
ఆశలు నిరాశలై
అస్తమించిన-గాంధీజీ
నీ చల్లని చిరునవ్వులెక్కడ?
మదించిన మతోన్మాదికి
బలియయిన బాపూజీ
నీ మత సామరస్యం యెక్కడ?
ప్రజగ్రహించి
దే ఖడ్గం తమ
నాయక హృదయం
చీల్చిందో?
ఏలోకానవున్నా
కురిపించు బాపూజీ
నీ చిరునగవు
హంతకులను హతమార్చి
నీ ఆశయాలగద్దెకు ప్రజ
కదిలింది గాంధీజీ-
ఏలోకానవున్నా
నీవే ప్రభువు-బాపూజీ

ఓహో! భారతజాతి ప్రతాపా
ఓహో! భారతదేశ ప్రదీపా
మనికితనమున మమ్ముల ముంచి
చనినావా! దివికామించి॥
శోభాయుతకీర్తి సమేతా
ఓ భారత భాగ్య విధాతా
సర్వలోక సంఘోషితకీర్తి
సకల భువన సంపూజితమూర్తి
చనినావా! దివికామించి
మనికితనమున మమ్ముల ముంచి

卐

మృతినొంది యమరుడై
దారి చూపెను తండ్రి
ఏ లక్ష్యసిద్ధికై
ప్రాణమును బాసెనో

ఆలక్ష్యమును మనము
సాధించి తీరాలి
ఆ శాంతి బాటన్
అడుగులేయాలి

అనాడె మనజాతి
గౌరవము, స్నేహితుఁడ
ఆరోజె, మన ప్రతిష్ఠ
మరల నిలపెదమోయి.

ఓహో! భారతజాతి ప్రతాపా
ఓహో! భారతదేశ ప్రదీపా
మనికితనమున మమ్ముల ముంచి
చనినావా! దివికామించి॥
శోభాయుతకీర్తి సమేతా
ఓ భారత భాగ్య విధాతా
సర్వలోక సంఘోషితకీర్తి
సకల భువన సంపూజితమూర్తి
చనినావా! దివికామించి
మనికితనమున మమ్ముల ముంచి

卐

తలలెత్తుక నిక మెలగంగలమా
ముందడుగిదియని మురియంగలమా॥

కత్తులు మెరసే క్షేత్రములందు
చిత్తముమారే విత్తుల జల్లిన
భారత స్వేచ్ఛా వీరహాలికుని
క్రూరమతాగ్నులు కోరి దాకినవి

బంగరు పంటల రంగుమారునో
భస్మీపటలమె ప్రాప్తంబగునో!

మన సఖ్యతకై వెతబడు జీవిని
మత పిచ్చియె హతమార్చిననాడు
మతము కోసమొక మానవోత్తముని
మారణ హోమం జరిపిననాడు

జాతి మతాల చర్చలేటికి
నీతి నియమముల నిర్ణయమేటికి॥

ఏ మత సఖ్యతకై తపియించెనో
ఏ మత పిచ్చికుగా మరణించెనో
ఆ మత సఖ్యత సాధించేందుకు
ఆ మహాత్ముని ఆశయ సిద్ధికి

కట్టండయ్యా దీక్షాసూత్రం
సలుపండయ్యా శపథ ప్రార్థన॥

---:o:---

మహాత్ముని దివ్యస్మృతి

ఓహో! భారతజాతి ప్రతాపా
ఓహో! భారతదేశ ప్రదీపా
మనికితనమున మమ్ముల ముంచి
చనినావా! దివికామించి॥
శోభాయుతకీర్తి సమేతా
ఓ భారత భాగ్య విధాతా
సర్వలోక సంఘోషితకీర్తి
సకల భువన సంపూజితమూర్తి
చనినావా! దివికామించి
మనికితనమున మమ్ముల ముంచి

卐

భారతీయుఁడు, కాడింకవాడు, గాంధి
పుట్టినది, నేనుపుట్టిన పుణ్యభూమి
భరత ఖండమెయని, గర్వపడని వాడు
మిగిలె నీ తృప్తి నీవు లేమిని, మహాత్మా!

ఎంతయొ మంచివాడవు కదే మొన మొన్న వధింపజొచ్చు నీ
హంతకు ప్రాణముల్ మరల నాతనికిచ్చిన పుణ్యమూర్తి ని
న్నెంతగ లోకమెన్ను కొననీ వచియించెద సత్యమిందు, నిం
కింతకు, నీదు మంచితనమే, విషమై, మరిమృత్యువాయెగా॥

ఆ యమునానదీ తటము నందున హాయిగా బవ్వళింపగా
బోయితివే సమస్త జనముల్ విలపింపగ, పీరిపీడగా
న్యాయమె యెంతగా విలచినన్ మరిరావు కదయ్య నీ యశః
కాయము సంచరింపగ, జగమ్మునజేరితె, 'రాము' సన్నిధిన్.

వసివాడ లేదింక స్వాతంత్ర్య విజయోత్స
వారంభనవ పుష్పతోరణమ్మ
ఆరిపోలేదింక నూరూర వెల్గిన
స్వాతంత్ర్య మంగళా భంగదీప్తి
మరపురాలేదింక పురుషార్థ పాతనాం
తరలభ్య ప్రవిమల త్యాగబుద్ధి
సమసిపోలేదింక సల్పిన సత్య దీ
క్షాబద్ధమౌ నహింసావ్రతమ్మ

ఈయలేదింక విడదీసి యెవరి వారి
రాజ్యములు పంచి శ్రీరామ రాజ్యముగను
ఔర! ఫలభుక్తి మాకెల్ల చూఱవిడచి
చల్లగా జారినా వనాసక్తయోగి.



# నీ చేతులెట్లాడెరా !

("గురజాడ")

నీ చేత లెట్లాడెరా!! మన గాంధి_నిన్ జంప మనసొచ్చెరా!
నీచ! నీచే, జాతికి, తీరని-నిందకొాడి గట్టితివిరా ॥నీచేతు॥
ఇట్టివాడింతవరకు–జగతిలో-పుట్టనేలేదు, కదరా!
నీ పుట్టేమి, మున్గినదిరా! గాంధిని- పొట్టను బెట్టుకొనగ ॥నీ॥
నేల ప్రాకే చీమకైన–పైన-నింగి నెగిరే, పక్షికైన
నీటగదిలే, ప్రాణికైన,దలప-నేరడీ చెఱు, పెన్నడైన ॥నీ॥
ఈశుడని, బుద్ధుడని-యేసు క్రీస్తే, యని
దేశదేశాలవారు-దర్శించి-తీర్థమై, కూడినారే॥ ॥నీ॥
తిట్టిన, తిట్టదెపుడు–మరల–నిన్ దీవించి, పంపు గదరా
నిన్ గొట్టిన, గొట్టడకట! వైరులకు-కోట్లధనము, గుప్పెరా॥నీ॥
కట్టబట్టలేని, జాతి–మానమ్ము–కాపాడి–రక్షించెరా
కడజాతి, వానినైన–తండ్రిగా–కౌగలించు, కొనియెరా ॥నీ
ఖాయిరా! నీ గుండె–చంపితివి–రాజ్యమిచ్చిన తండ్రినే!
హాయిగా, ననుభవింప-గా, లేక–పోయితివి, మాతృద్రోహి॥
నీ చేతు లెట్లాడెరా।

# బాపూజీ

(మద్దోజు సత్యనారాయణ)

జీవితమంతయున్ ప్రజల క్షేమముకై, కృశియింప, సత్యమా
త్రోవ నహింస ధర్మములతో దయనించిన బాపుజీ! భవ
జ్జీవము దైవ సన్నిధికి జేర్చిన 'జన్వరి ముప్పదిన్' విషా
దావృత మానసాబ్జముల దండలు గుచ్చితి మందుకొమ్మికన్.

ఓయని యేడ్చె భారతి, మహోన్నతశీత నగంబునుండి, గం
గా, యమునాశ్రుధారల మొగంబును కన్నులువాయ బాపుజీ
పోయెనటన్న వార్తవిని బుద్ధినిగన్న పవిత్ర భూమికిన్
పాయని మచ్చ దెచ్చిన యభాగ్యు డెవండని వంత గుందుచున్.

జిన దేవుండును, క్రీస్తు బుద్ధుడును భ్రాజిష్ణుల్ తదంతర్ముఖం
బున దీపించెడి దివ్యమూర్తి విలసత్పుణ్యంపు వారాశి శాం
తిని నిర్మించిన ధాత, భారతధరిత్రీ మాతృ సౌజన్యతా
జనితున్ గాంధిని, యల్పు డొక్కరుడునై జంపంగ తాజచ్చెనే!

చావగ లేదు లేదు- ఋషిసత్తము డాతడు విశ్వమానవ
శ్రీవిభవాభి రామముగ స్వీయ గళంబున దివ్యవాణితో
పావనమైన సూక్తులు, సుభాషితమున్ వినుపించుచుండె బో
కావున జచ్చునే యుగయుగాల తరాల తరాల వారికిన్.

కరవాలంబును చేతబట్టవు బృహద్గాండీవమా లేదు. సం
గర రంగంబున కక్కరైనది, తురంగం బొందునున్ లేదు, యే
సరణిన్ వ్యూహములల్లి గెల్చితివొ నీ సత్యాగ్రహస్ఫూర్తిచే
పరదాస్యానల తప్త భారతమహీ బంధంబు త్రెళ్లింపగన్.

అస్పృశ్యతా పిశాచాళి బట్టిన పిచ్చి
మనుజుల రోగముల్, మాన్పె నతడు
కరకు కత్తుల గుండెకాయ నెత్తురు దీయు
కఠినాత్ముల కహింస గఱపెనతడు
నిరుపేద ప్రజ సహర్నిశలు సేవించుచు
ఆర్తిమై జూచె మహాత్ముడతడు
క్రూరాహి మతముల కోరలు దీయించి
కాంగ్రెసు మతమున గలిపె నతడు

అతడు స్వాతంత్ర్య సమర సన్నాహమందు
రాట్నంపు చక్రమున, తెల్లరాజు గెలిచె
ఒక్క నూలుపోగున గట్టి, యుదధికవల
బారవైచెను, గాంధి సమ్రాట్టతండు.

ఇరువదైదు శతాబ్దముల్ యేగు పిదప
బుద్ధ దేవాకృతిని బొంది పుట్టె గాంధి
యిఱువదైదు శతాబ్దమ్ములరిగి కూడ
పుట్టునో! లేదొ! మనగాంధి బోలుతపసి॥

స్వారాజ్యమునకునై పోరాటమున విశ్ర
మించుటలేని శ్రామికము వాడు
తన భుక్తమునకుగా, 'తకిలి' తీసిన నూలు
పై వచ్చు విలువతో బ్రతుకువాడు

బిచ్చగానిని లక్షలిచ్చు వానిని గాని
కనిసమమ్ముగ వెలగట్టువాడు
దాస్య విముక్తికై తపియించి తపియించి
యుపవాసముల జిక్కియున్నవాని

లేడు, మనకింక లేడి, కేనాడురాడు
వచ్చిపో విట్టులే, ప్రతివత్సరమున
మనదు సంస్కారమును గాంచి, మందలించి
బోసినవ్వులు గురిపించి పోవు కొరకు.

కేలంబూనిన పట్టుగఱ్ఱ. మొలకున్ గీలించు 'వాచీ'యు, మో
కాలుం దాటని కట్టుపంచె, పయిపై ఖద్దర్దొకే చేలమున్
కాలం జెప్పులు, కంటియద్దములునున్ గాసించు కాల్నడ్కతో
లీలన్ వచ్చెను చూచువాడడుగొ! ఢిల్లీ రాజ్యవైశేష్యముల్.



# పరంజ్యోతి

(మానేపల్లి సంగమేశ్వరకవి)

ధర్మపరంజ్యోతి, ప్రేమైక దామమహతి
సృష్టి ముద్దాడు చక్కని జీవమూర్తి
శాంతివిస్ఫార చంద్రికా చక్రవర్తి
యైన మన బాపు స్వర్గాన కతిథియయ్యె॥

భువనాలు కవనాలు పొంగి పొర్లెడువేళ
అవని ధేనువు లిండ్ల కరుగువేళ
పశ్చిమాంగన కెంపు పటిమ దీర్చెడువేళ
సత్యదీపిక దిగజారువేళ
భువి పవిత్రత నొష్ఠబొట్టు దిద్దెడువేళ
గోవత్సములు చన్ను గుడుచువేళ
కష్టజీవుల యాత్మ కరిగిపోయెడువేళ
అష్టదిక్కులు తెల్వి యాడువేళ

రాట్నమందలి ఓంకార రమ్యగీతి
నరుల హృదయాంతరంబున, మెఱయుజ్యోతి
పుడమి నవతారమూర్తి యా బుద్ధమూర్తి
యైన, మన బాపు, స్వర్గాన కతిథియయ్యె॥

యమునా తరంగిణీ యశ్రుధారావళి
పొంగి పింగిపి. మారుమ్రోతలీపె
గోమాత కన్నీరు ఘూర్ణిత ఘనఘనా
సంజాత పానీయ జలధులయ్యె
అపరంజి సంధ్యలో నరమోడ్చు ముని చేతి
జపమాల నేలపై జారిపడియె
మహిని సీమంతినీ మాంగల్యరక్షిత
కుంకుమ మంతలో కూలిపోయె

బోసినవ్వుల వెన్నెల బొలుచు రథము
శాంతి సత్య మహింసయే శాంతి సుమము
భక్తి విజ్ఞాన భారతభాగ్య ఫలము
కల్ప వృక్షము భువిపైన కాలిపోయె॥



# అమరజీవి బాపూజీ

(వేముగంటి నరసింహాచార్యులు)

ఏడీ మా గుజరాతి వైశ్యముని, నేడేమాయె గన్పింపఁడా
రాడా మమ్ములఁజూడఁడా దయదలిర్పన్ శాంతి సందేశ మిం
కీడా చక్కని బోసినోటఁ జిరునవ్వేచిందఁడా! అక్కటా
క్రోడుల్ వారెనుతద్వియోగమున బెంపున్‌బాసి మా చిత్తముల్.

నిగ నిగల్ దళుకొత్తు నెమ్మేని శోభల
బందీ గృహంబుల పాలొనర్చి
ఉడుకు రక్తము పొంగి యుబుకు సత్త్వంబెల్ల
భారత సేవకు ధారవోసి
తూగుటుయ్యేలఁ దులఁదూగించు భాగ్యముల్
కొల్లాయి గుడ్డకు గుదువబెట్టి
మకరందమూరు కమ్మని వాగ్బలం బుప
న్యాస పీఠంబుల కప్పగించి

తుదకు ప్రాణంబులైదు పిస్తోలుగుండు
దెబ్బలకు నర్పణముజేసి, దివికిబోతె!
సురకులాధీశ్వరుడు నిన్ను జూఁడ గోరి
పిలువనంపెనొ! బాపుజీ! విమల చరిత॥

సంచరింతువె! నిత్యంబు సంబరమున
నందనోద్యాన దివ్య వనంబులోన
స్వర్గ సుఖదోల నూగుచు భరతసుతుల
మరువబోకుమా! మహాత్మా! మునీంద్ర!

నూరేండ్లయినను నిండలేదపుడె, నిన్నున్ స్వర్గమున్ జేర్పఁగా
నే రీతిన్ మన సొప్పెనో అకట బ్రాహ్మీ భర్తకున్ నిన్నుబోల్
ధీరగ్రామణియైన నాయకుఁడు, ధాత్రిన్ గల్గునే యింక, గాం
ధీ రక్తాశ్రులు జిమ్మె లోకములు నీ నిర్యాణమున్ జూచియున్॥



# అశ్రుతర్పణము

(గరికపాటి మల్లావధాని)

అశని పాతంబొ! భూకంపమయ్యె నొక్కొ
అగ్ని పర్వతమే బ్రద్దలగుట నిజమొ
ఆకసము కూలెనో సమస్తాబ్ధిచయము
పొంగెనో లేక, లోకమే క్రుంగెనేమొ.

హృదయ విదారకంబయిన, యీకటు దారుణ ఘోరవార్తకున్
మది, కలగెన్, వచించుటకు మాటలు వెల్వడ జాలవయ్యె గ
ద్గదిక యొసంగె గాత్రముల గాలుపు గంపము విస్తరిల్లె, న
య్యది యెదియో, యొకానొక మహాప్రళయంబుగదోచెనక్కటా!

గాంధి మరణించెననుమాట కర్కశంబు
కష్ట దుర్వాచకం, బమంగళముగాఁగ
దోచి యదివల్కు 'వాడొక దుష్టుండంచు
వానిపై నాగ్రహావేశభావమొదలె॥

అయయో నేడు, మహాత్ముడే, ధరణిలేడా!యింక దిక్కెది, సం
శ్రయమే పోయెనె, ధర్మమార్గమునకు సత్యంబు, శాంతంబునున్
దయయు న్నిల్వఁగవీడిపోయెనె ప్రశస్తంబౌ నహింసాధ్వమున్
వ్యయమైపోవునె లోకమాతయు, క్షయంబై పోవుచే,నిక్కమా.

అరియే లేని యజాత శత్రునకు నీకా, యీ యవ్యాజంపు, దు
ర్మరణం బయ్యది కూడ స్వీయమృతిమూ మాకింక నేరీతిగా
శిరముల్నల్గురిలోన నెత్తికొనఁగాఁ జెల్లున్ మహాత్మా! మమున్
దరిజేర్పన్ భవదాత్మయే తరణికాదా యిట్టి కష్టాబ్ధికిన్॥

# గాంధీస్మృతి

(కోగంటి దుర్గా మల్లికార్జునరావు)

సత్య ప్రభావ గరిమన్
నిత్యము బోధించినావు నిఖిల జనులకున్
సత్యస్వరూపుఁడవనగ
సత్యేతరమిందులేదు-జనసుత గాంధీ॥

అవతారమూర్తివని, ని
న్నవనీ జనులెల్లరు, గొనియాడిరి, అయయో॥
అవతారము చాలింపఁగ
అవనీ జనమెల్ల మునిఁగె, ననుతాపాబ్ధిన్.

ఓయీ॥ దుర్మార్గా॥ నీ
చే యెటులా డెనురః విమల భక్తుని గాంధిన్
మాయింపఁ జైకినెత్తగ
బోయడవో రాక్షసుడవా ఘాతంబవాకో॥



# ఘోరతమస్సు

(కొడాలి వెంకటరాజారావు)

మతమదోన్మత్త మృత్యు దుర్మార్గ చర్య
ఫలితమా! అహింసా చక్రవర్తి గుండె
లోతులకుపోయి మండినదా తుపాకి
లోని సీసపుముక్క కల్లోలపరచి॥

శాంతికోసము యొడద, విశ్రాంతి విడచి
హింసకోర్వక యొడద, నహింస నడపి
దెబ్బదెనిమిదియేండ్లు పండిన వయస్సు
నే కిరాతుని కరము దహించె తండ్రి॥

సత్యమన్నది 'బాపు' వచస్సు నిమిడె
శాంతియన్నది 'బాపు' వర్చస్సు నిలచె
మరి, యహింసయన్నది 'బాపు' మనసు పెనచె
మరల క్రమ్మెను ఘోరతమస్సులకట॥

— X —

# హాహా కారమయ్యెలోకము

(కవికొండల వెంకట్రావు)

శాంతిశూర! కర్మవీర, సత్యాగ్రహాధీరా!
సీ-ఈ-మరణవార్త
ఘోర, మతికఠోర, మరరె! చోర!
ఢాం! ఢాం! ఢాం! క్రూర!
మరయ చిన్న మనిషినీ!
ఒడ నింత రక్తమా?
కూడనింత మాంసమా?
వాడు తినగబంపెనా?
వాడుమనగ చేర్చెనా!
తు-పాకికీ-వేట గూర్చెనా
తోడి మానవుండగున్!
నీడ వానికింకెటు?
వేడికొనగ లేవుగా!
వీడిపోతివా భువిన్!
మహాత్మ గాంధి? హా-హా కారమయ్యెలోకము
ఆకారమెడసి నీవు పో
అంధమిడియె శోకము!
కల్యాణ గుణ పరంపరా! నిర్మాణ మీవు పొందితే
భారతాంబనీవు వినా-భయోత్పాత నిపతితం!

లేదె మృతికి ఆవల
వాదులేని సత్యము
స్వాదువైన అమృతం?

గుండె గుండె బొఱిగన్
వెలికి వెతలె హృద్ద్రుత-
నీ సుహృద్ద్రుతమదే
మాకు మాకు అమృతం
శోకమార్పు సూనృతం.

నెత్తురింత చిందకే
ఎత్తు కెత్తు తెచ్చితి
'హమార్ దేశ్' స్వతంత్రతల్
నీ స్వతంత్ర తీవయో
నెత్తురోడ్చి కంటివి॥

ఓ మహాత్మగాంధిజీ,
నీ మహిమే నెవరిలో
నేన్ మహిపైనున్న చో
పునః ప్రాణజేతుమోయ్
ఓ మహాత్మగాంధి నిన్
పునః ప్రాణజేతుమోయ్॥

ఆ-దాకా చేతులెత్తి మ్రొక్క-నీయ్
నీ-ఆత్మశాంతి కొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
నీ-ఆత్మ శాంతికొఱకు
ఓం-శాంతిశ్శాంతిశ్శాంతిః



# గాంధి మహిమ

(మారేపల్లి రామచంద్రశాస్త్రి కవి)

అవతారము లావేశము
లవు నొక్కొక తఱిని నీది యట్టిదె యగు, హైం
దవ దాస్యముక్తి చేయం
గ వచ్చి చేసితివయారే, గాంధిమహాత్మా!

భారత దాస్యపు చీకటి
పేరు అహింసావ్రతంపు వెలుగునఁదొలగన్
నేరిచిన ధీరశూర! వి
శారపు హతిఁ గ్రుంకితకట! గాంధిమహాత్మా!

బోయడు కృష్ణుని వలెనే
యీ యెడ నొక బోయ నిన్ను హింసించెనయో!
గాయమున నీకు మృత్యువ!
కాయము క్షణభంగురంబు గాంధి మహాత్మా!

ఢిల్లిలో నీ పిల్పుట
లల్ల పరీక్షిత్తు మరణమాత్మకు దెచ్చున్
బల్లిదులు కాతు రనుటలు
కల్లగదా చావునుండి గాంధిమహాత్మా!

భారతులకు స్వాతంత్ర్య ము
దారతఁ దెచ్చితివి కాన ధన్యుఁడవు మహో
దారుండగు పరమేశుడు
గౌరవమున ముక్తినిచ్చు గాంధిమహాత్మా!

పౌరపడె 'బెర్నాడ్‌షా' యని
సరసముగా దెలుపువాడ సాహిత్యకళా
పరుడైన సత్యమెఱుగుట
కరమరుదగు నొక్కచోట గాంధిమహాత్మా!

నీ హత్య వినుచు భూ ప్రజ
హాహాకారము లొనర్చు టది వింతయె! స
మ్మోహిత మది నీ సమతా
కాహళనినదంపు మహిమ గాంధిమహాత్మా!

స్థూలత కంటెన్ సూక్ష్మత
మేలగు సూక్ష్మంపుటొడలి మేదుర శక్తిన్
పాలింపుము భావి కలి
కాలపు పాపములఁ బాపి గాంధిమహాత్మా!

ధీమంతులు కొండాటన్
సామెత నీకిడుచు నెంతొ సోలెద రకటా
సామాన్యులవలె వారలు
కామితముల తీర్పు ప్రతిభ గాంధిమహాత్మా!

నీపయిగల భక్తి మెయిన్
పాపము కొందఱు కలంగి పరుల కహింసన్
ప్రాపింపజేయువారల
కాపాడవె యార్తరతుల గాంధిమహాత్మా!

మత సహనము దేశస్థుల
మతులన్ కలగించి యొక్క మతి నందఱు నీ
గతి నడవఁజేసి వెస దు
ర్గతులన్ తొలగింప వలయు గాంధి మహాత్మా!

భారత దేశంబునకు న
పార యశం బబ్బె నీదు ప్రజ్ఞన్ దానిన్
ధీరత కావలె నీ స్మృతి
కారణమునఁ జెడక నిలువ గాంధి మహాత్మా!

●●●●●●●

# మరణవార్త

("సుధ")

రేడియో యేడుస్తుంది
సృష్టిదేవత శోకిస్తుంది
ఆకాశంలో
కరుడుగట్టుకుపోయినహిమం
కరిగి, కన్నీరు కాల్వ-
నింగి నున్న నక్షత్రాలు
'ఏమిటిదంతా!'
ఆతురత చూడవచ్చి
అచ్చెరువందాయ్-వెల వెల
పోయాయ్
మహాత్ముని మరణింపజేసిన
మతిలేని మానవ దౌష్ట్యాన్ని
అసహ్యకించు కున్నాయ్
ప్రపంచం పాలి పోయింది

దేశాలన్నీ దిగ్భ్రమజెందాయ్
భూగోళమంతా బావురుమన్నది
ఒక్కమారుగా
నిత్యవ్యవహారాల్లోంచి విరమించు
కొన్నది
నిశ్చేష్టురాలై నిలచి పోయినది
దేశం.
కన్నీరు-మున్నీరు
మానవహృదయంనిలచిపోయింది
మనుషుల భాషలు
మూగవోయినై
అవ్యక్తంగా ఆగిపోయినై!
-శోకం-శోకం-!
కాలం- కదల-లే-
(ఇదే మహాత్ముని మరణవార్త)

# అమరజీవి గాంధి

(జాగర్లపూడి వెంకటసుబ్బయ్యశాస్త్రి)

రాముడవై తన ప్రాణాలు తీసిన
కోపాన ముసు వాలి, ద్వాపరాన
కృష్ణుండవై పుట్ట-కినుకతో బోయఁడై
అవసాన ప్రాణాలు దీసి
అంతతో బోవక యాతడే కసిబట్టి
పొదలుచునుండె నీ పుటుక కొఱకు
గాంధివై పుట్టిన గమనించి యా పాపి
ప్రత్యక్షముగఁ మ్రొక్కి- హత్యచేసె

అతడు కసి బట్టుకున్న నీ యవని యందు
శాతవులు నీకు లేరు, నిస్సంశయముగ
భరత భాగ్యోదయ విధాత పతితగీత
రామమంత్ర ప్రభాత్మ! గాంధీమహాత్మ!

కొట్టినన్ దిట్టినన్ హత్య కోరియున్న
భౌతిక శరీరమునకెగదా! తలంప
అమరజీవివి నీకు చావరయ గలదె
దివ్యతేజః ప్రహర్షి! గాంధీమహర్షి!



# మన గాంధి

(‘దేశభక్త’ కొండా వెంకటప్పయ్యా పంతులు)

కానగరాదు గాంధి, యిక గానగ జాలము వారిపోలికన్
తానుగ కష్టభారముల దాల్చెను మెండుగ దేశభక్తికై
పూని దవానలంబనగ ఘోరు చరించెడి నౌకహాలిలో
మానగజేసె దౌష్ట్యమును, మాన్యుడహింసను బోధజేయుచున్-

నిరసన వ్రతదీక్ష నెన్ని సారులో, పట్టి
కలహకల్లోలంబు గట్టిపెట్టి
కాశి ఘట్టమునందు గఠినమౌ వ్రతదీక్ష
హస్తినా పురమందు నట్లుజేసె
తన ప్రాణరక్షణకు దగిన భద్రమొనర్ప
వలదని వారించెఁ బాలకులను
పరగ ననర్థముల్ పాయంగ శ్రీరామ
మననంబు జేయించె జనులచేత

దేహమర్పించె, శాంతికై ధీరుడతడు
మనసు నర్పించె బరమేశు మహితభక్తి
తపమటన్నను నిది ఘోరతపము గాదె
తపసి యాతడు, మహితాత్మ తపసి యతడు.

పరమ గురువంచు ప్రణతులు భక్తితోడ
హృదయపు బళ్లెరపుటార్తి సదయుడంచు
దేశముక్తు దాటించుసుదీపపూజ
సలిపి మ్రొక్కెద గాంధికి స్థైర్య నిధికి॥

# మహాత్మ

(కన్నెగంటి వీరభద్రాచార్యులు)

క్రూరు చీకటులలో గాంతి రేఖలగూర్చి
దారి చూపిన మహోదార జీవి
అగ్నికుండాలలో నశ్రుధారల నింపి
యెల్లలోకము నేలు చల్లనయ్య
వడగాడ్పులో శీతవాతంబు గల్గించి
హాయి జూపిన భారతీయ యోగి
హాలాహలంబులో నమృత మాధురిఁజొన్పి
కల్లోలమాపు దీక్షాతపస్వి

రామరాజ్య ప్రదాత భారత విధాత
కరుణగల శాంతిదూత మా గాంధితాత
ఖండ ఖండాంతరముల దుఃఖమున ముంచి
వదలి పోయెను స్వర్గలోకమును జేర॥

ఇల కంపించెను, దేశనాయకులు 'తండ్రీ'!యంచు వాపోయి మూ
ర్ఛిలుచున్నారు పవిత్ర భారత సవిత్రీ నేత్రదుఃఖాశ్రువుల్
వెలయేళ్లై ప్రవహించె శాంతిగుణరాశీ! ఖండ ఖండాంతరం
బులు ఘోషిల్లె భవద్వియోగవిషయంబున్ విన్నమాత్రంబునన్॥

అమరుల్ నీ యిరుప్రక్కలన్ నడువ, దివ్యధ్వానముల్ మ్రోగగా
రమణుల్ హారతులిచ్చి సన్నుతులొనర్పన్ బాలగంగాధర
ప్రముఖుల్ దీవెనలీయ అవ్యయము జేరంబోవు నీ పాద ప
ద్మములన్ బవిత్రమైనవి మహాత్మా! స్వర్గసోపానముల్.

హాలమా రాట్నము-గిత్తలా విమల సత్యాహింస లేప్రొద్దు నీ
పొలమా భారతభూమి విత్తనము లభ్యుత్థాన సందేశముల్
ఫలమా దాస్యవిముక్తి సత్వరమసః స్వాతంత్ర్యముల్ కర్షకో
జ్జ్వల చారిత్రము నీయదే, మధురాభవా ఎంత ధన్యుండవో?

卐

# ఘోరదుర్దినము

("జాఘవ")

అది తలపోయరాని హృదయ ప్రవిదారి విషాదవాచ్య కా
స్పదమయి పంచఖండములు బావురుమన్న పిశాచవేళ ము
ప్పది పదికోట్ల భారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోర దుర్దిన మిసీ వచియింపగ జిహ్వలాడునే.

ఉపవాసం బుపసంహరించుకొని, యెన్నోనాళ్లు కాలేదు, తా
నుపలాలించు ప్రపంచశాంతి రమ కాయుర్భూతి సిద్ధింప లే
దపరాహ్ణంబున గ్రుంకెన్ భరత మున్యాదిత్య బింబంబు, తూ
రుపు ఖండంబున సస్వభావికముగా రోదసు రోదింపగన్.

అదిగో రాట్నముచేత దేశజుల కాహారమ్ము గల్పించి, అ
భ్యుదయాపాదక సామరస్యమున కాయుర్దాయమున్ బోసి ఆ
పద పాలై మరణించి భస్మచయమున్ భాగించి దేశాలపై
వెదజల్లించిన గాంధితాత ఋణమున్ విశ్వం బెటుల్ తీర్చునో!

ఆటం బాంబులవారు దద్దరిలి, రాజ్య త్యాగమున్ జేయ, ము
ప్ఫూటల్ పస్తులు జేసి చిక్కిన మహాత్మన్ జీర్ణకంకాళమున్
వేటాడించిన క్రూరురాల వకటా! నీ కాస్వరాజ్యంబు, నీ
చేచే శాశ్వత దాస్యమున్ మరల వ్రాసెన్ బ్రహ్మ ఢిల్లీపురీ!

గోచియు గొంగడిన్ గలిగి, కొట్టక తిట్టక భారత క్షితిన్
గిచిన గేటులో నడుపు నేర్పరి-కన్నుల ప్రేమచంద్రకల్
పూచి ఫలించు నిశ్చలుడు, మ్రొక్కిన తక్కిన సామరస్యమున్
తూచి యొనంగు నీశ్వరుని దూతకడన్ పగ కూపిరాడునే!
ప్రేమ స్వర్గము సృష్టిచేసి చనియెన్ క్రీస్తుండు మున్నిండియా
భూమిన్ బుద్ధుడహింస నాటిచనె మామూదుండు హింసక్రియా
వైముఖ్యంబు విధించె, వర్గకలహావ్యాధి న్నివారింప, నిం
కే మందుల్ పనిసేయు; శాంతి చనిపోయెన్ ఖాయలాపడ్డదై.

అవతరించిన స్వరాజ్యపాజ్య బాలిక
కక్కటా ముకుపచ్చ లారలేదు
సకుఁటుబముగ వీడి-చనుచున్న పరరాజు
నిజసీమలో కాలు నిలుప లేదు
హస్తినాపురిమీద హైందవ ధ్వజమెత్తి
నిండుగా యేడాది నిండలేదు
స్వాతంత్ర్య ఘనమహోత్సవ జయధ్వానంబు
మారోమ్రత లూరూర మాయలేదు

సింహపీఠిక నధివసించిన యనుఁగు
మనుమలన్ జూచుకొనుచు, నమందహర్ష
పులకిత స్వాంతుడగు దొడ్డముసలివాడు
మాయమయ్యెనే! లోకాల గాయమగుచు.

అంటరాని వాడవై యాఫ్రికాయందు
తెల్లవారి నడుమ తెలిసికొంటి
అంటరాని వారి యతరంగంబున
ప్రేలు అగ్నిపర్వతాల ఘోష.

---

# మహాజ్యోతి

(దీపాల పిచ్చయశాస్త్రి)

క్రూరు చీకట్లు గ్రమ్మె. నాక్రందనములు
ఖండ ఖండాంతరమ్ముల గ్రందుకొనియె
స్తంభితంబయ్యె సాధుచేతః ప్రవృత్తి
అల మహాత్మ మహాజ్యోతి మలగిపోవ.

సీమ సింహాలు, నౌఖాళి చిఱుతపులులు
నీదు తత్వంబు నెఱిగి మన్నించెగాని
ఎఱుగలేడయ్యె నీ సహోదరుడె, నిన్ను
కాల్చి క్రుందించె నతడెంత ఘాతుకుండొ?

తూర్పు పడమరలైన, హిందూ మహమ్మ
దీయులకు నైక్య లేమిని సాధించుటేమి?
కాని పని బూని నిష్కామ కర్మయోగి
బలియొనర్చితె బంగారు వంటి బ్రదుకు.

కడగండ్లమారి చీకటి బందిఖానులే
రమణీయ ధర్మ హర్మ్యములుగాగ
ఓకిలింతలు తెచ్చు తూకంబు మెతుకులే
షడ్రసోపేత భోజనముగాగ

క్రూరభటాళి కఠోర గర్హణములే
యాప్తసల్లాప వాక్యములుగాగ
కృపణాధికారి నిర్దిష్ట కర్మంబులే
యాత్మీయ నిత్య కృత్యములుగాగ
తన్నులకు తోపులకు గూడ, తాళితాళి
తెచ్చికొన్న స్వరాజ్యంబు తివిరి యనుభ
వించు వేళకు నిటు ముప్పు ముంచుకొని యె
భారతీయుల గాఢ దౌర్భాగ్యమేమొ॥

# పూర్ణరాజర్షి

(మాల కొండారెడ్డి)

నిఖిల మతములు తంత్రులై నిస్వనింప
మేల్మి గౌతాళి పంచిక మేళవించి
సత్యగానామృతము జిందు సాధుఋషికి
హత్య కాబోలు హైందవు లంపు కాన్క!

గాంధి దేవుని మరణ సంఘటన యనెడు
బాంబు వేటున చుక్కాని బ్రద్దలయ్యె
నట్టనడియేట భారత నౌక కిపుడు
దారి జూపించు దిక్సూచి జారిపోయె!

అస్తమించినది నేడాసేతు హిమశైల
దేదీప్యమానమౌ దివ్యతార
భగ్గుమన్నది నేడు భారత జనయిత్రి
కనిపెంచుకొన్న బంగారుపంట
బెడిసి గల్లున క్రిందబడిన దుర్వీ కాంత
కలికి పాపట మీద కనకభూష
మూగవోయినది భూభువనభర్త కరాన
నినదాభ శాంతి మాణిక్యవీణ

మనుజ కోటికి మకుటాయమానుడవయి
దేశమున నవ్యచైతన్య దీపమిడిన
పుణ్యు నిను జేతులార గోల్పోవు కతన
పూర్ణరాజర్షి! యీ లోటు పూడ్చు టెట్లు?

రాజవునీవుకావు, పలురాజులు నీ చరణాల దాపునన్
పూజలొనర్చినారు, అసి బూనిన యోధుడవీవుకావు: ఘో
రాజిని, నీకు మించిన పరాక్రమవంతుడులేడు, చిత్రమై
రాజిలు నీ చరిత్రకు జరామరణంబులులేవు_ బాపుజీ.



# భువన బాంధవుడు

(ఏటుకూరి వెంకటనరసయ్య)

ఒక త్రుటిలో ప్రపంచమాటె లూగిన దొక్కాకయత్రు వర్ధిగా
ప్రకృతి ద్రవించి యేడ్చినది ప్రత్యణు వాత డనంతకోటి రూ
పకుడని దోయిలించినది బ్రహ్మ పదార్థములోన లీనమై
పకపకలాడు మా భువన బాంధవుడిం కిటు తొంగిచూచునా!

నలుబదికోట్ల బిడ్డల మనః పరివర్తనకై తపించి నం
దుల కిదియా ఫలంబు; మన దుష్కృతమా శశితారకమ్ముగా
నిలువకతప్ప దీ భువన నిందకు పాత్రము గాకతప్ప దా
ఖలుని కతమ్మునన్ భరతఖండ చరిత్రమె తారుమారుగా.

చలమున్ శౌర్యము తేరిచూడని యహింసాఖడ్గమున్ దూసి, హా
ఖుల నొక్కెత్తున నీరు ద్రావిన భవన్మూర్తి ప్రభూత ప్రభో
జ్జ్వల మాహాత్మ్య వశంపదమ్ములయి, రక్షఃక్రౌర్య కౌటిల్య సం
కుల సామ్రాజ్యము లిచ్చమెచ్చినవి నీ కూలంకష ప్రజ్ఞకున్.

ఒక నూల్పోగున ఆంగ్లరాజ్య విభవ మ్ముత్త్రాత లూగించి, యం
కెకు రాబట్టితి వంతమరల, త్రిలోకీ పూజ్యమా నీ చరి
త్రకు దిగ్వ్యూహముల్ నమస్కృతులొనర్పన్ స్వీయ దేశీయు లీ
ర్ష్యకు లోనై తెగటార్చి రాత్మహననవ్యాపార పారీణులై ॥

ఆరిపోయిన దాసియా జ్యోతి నీవెట్టు
లీ చీకటుల నెదురీదగలవు
సడలిపోయినద హింసా సూత్రమె దయా
మహిమ హింసాకాండ మాన్ప గలదు
దగ్ధమైన దపూర్వ ధర్మదేవత మరే
న్యాయ మీ లోకంబు నడుపగలదు
తరలిపోయినది సత్యస్ఫూర్తి యే నీతి
నిష్ఠ లాశాంతిని నిలుపగలవు?

సార్వకాలిక సమధికాచార సార
మీమహాస్ను మదాత్మలం దేలగించి
అజరమమర మనిర్వాచ్యమగుచునగుచు
విశ్వ కల్యాణ కిరణమై వెలయుగాక.

---

# గాంధి మహాత్మ

(నండూరి రామకృష్ణమాచార్యా)

సత్య మహింస, యుచ్ఛ్వాశ నిశ్వాసముల్
సల్పి జీవించెడి సత్యమూర్తి
విశ్వకల్యాణ గవేషణాపథమందు
పయనించు, యోంటరి బాటసారి
సత్యాగ్రహమ్ముచే శాత్రవులను శిష్య
నిర్విశేషుల జేయు నిగమరాశి
రాట్నము ధర్మచక్రముజేసి పరిశుద్ధ
ఖద్దరు ధరించు కర్మయోగి

బుద్ధ దేవుడు పుట్టిన పుణ్యభూమి
నేటికిని పునః పూతమై నెగడునట్లు
అవతరించిన యట్టి, యో అమృతమూర్తి
అందుకొనవయ్య మా స్వాగతార్ఘ్యములను.

గాంధిమహాత్మ! దివ్య పదకంజములంట జనావళుల్ జగ
ద్బాంధవ తీర్థయాత్రకయి వచ్చిరి; లెమ్మిక ఊతకోలతో
బంధములో కృశింపదిక భారతమాత; స్వతంత్ర ీతికా
బంధురమైన దుందుభిరవంబులు నింపుము బోసినోటితో.

— x—

# బాపూజీ

(పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు)

అకుటిలచారు వృత్త మనహంకృతి పాత్రము, మాతృదేశ పూ
జక సహకారి నాయకము, సత్యదయా నయశాంతిదాంతి బో
ధకము స్వరాజ్య లాభన ముదాత్త మహింసముగాంధి ముఖ్య నా
యకము, విషాదనాటకమహో ముగిసెన్ భరతోక్తి శూన్యమై.

ఆ పాతాళము త్రవ్వసాగరులు యజ్ఞాశ్వార్థ, మాగంతికున్
వ్యాపించెన్ సుయశంబు సాగరము నా బాపూజి తద్భస్మపున్
ప్రాపున్ గాంచనివారు, త్రవ్విరట, తత్పాతస్థలిన్ మృత్స్నకై
కూపంబో యది పుణ్యవాసియో, మహాకూపారమో కాదొకో,

రతనంబున్ జెయిజార్చికొంటిమిక, నూరాపేర, నీకయ్యొ భా
రతమా నిశ్శరణంబవై తివి, పదార్థంబా! వృథాసూనృత
వ్రతమా నీ బ్రతుకింక, సద్గుణములారా! మీరు నిష్కాసితుల్
శత వర్షంబులు నీకునిండెనె యహింసా హింస కాలూనితే?



# యుగప్రవక్త

(బొడ్డు బాపిరాజు)

జోహారులు బాపుజీ
స్నేహామృతః శిశిరసారణీస్మిత రోచి
స్సౌహార్ద మధురమూర్తి
ఊహా శేషుండవైతివో మా తండ్రీ

ఒకచూపు చాలులే సకల ప్రజాకోటి
చిత్తసీమల శాంతి చిలుకరింప
ఒకమాట చాలదే, ఉద్రిక్త సోదరా
ళుల తేర్చి సుప్రసన్నులను జేయ
ఒక వ్రాతచాలునో ఉర్వీధరుల రాజ
ముద్రికలకు మార్గములను జూప
ఒక దీక్షచాలు ఊరక లోకములు లోక
ములు తల్లడిలి పదమ్ములకు మ్రొగ్గ

అతడు నిస్వార్థబుద్ధి సత్యాగ్రహుండు
అఖిల మతములాతనివె దాస్యాంధకార
బంధురాకాశ వీథి నవ్యస్వతంత్ర
సుప్రభాత విధాత యుగప్రవక్త.

స్వేచ్ఛాలోభ పరస్పరాసహన దుర్హింసా మతద్వేష దో
షచ్ఛాయాఖని భారతావని ప్రతిష్ఠాపింపగా సర్వ లో
కోచ్ఛంబౌ యొక రామరాజ్యమును, నీ వూహించితే తండ్రి యా
తుచ్ఛ స్వార్థమత ప్రమత్తులకు లేదో ఆ మహాదృష్టమే,

ఒక్క దీపము తాను కొండెక్కి నంత
నేడు నలుబదికోట్ల గుండెలును కూడ
వెలుగుచున్నది శాంతి నిశ్చలపు కాంతి
ఏ తుపానులు ఆర్పలేవింక దీని.



# హృదయావేదన

(దివాకర్ల వేంకటావధాని)

తన మనోవైశాల్యమును చెప్పకయె చెప్పు
వెడద కన్నులదోయి బెడగుతోడ
తన తత్త్వ విజ్ఞాన తత్పరత్వము దెల్పు
సదమల బ్రహ్మ తేజంబుతోడ
తనదీనమానవోద్ధరణేచ్ఛ సూచించు
కుదురైన కొల్లాయి గుడ్డతోడ
తన యహింసా మార్గమును ప్రతిష్ఠాపించు
శ్రుతి మనోహర వచోవితతితోడ

పూర్వ హైందవ భూమి భృద్భూమి విజయ
నివహ సంపాదనోద్యోగ నిత్యహేతు
భద్రమత్తేభ గమన శోభనత తోడ
నాతడెచటికొ నడచుచున్నట్లు తోచు.

అంతరిక్ష తలంబున నఖిలలోక
దుఃఖపీడనమ్ము తోచెను శోకచుక్క
భూతలమునుండి నిఖిల భూభువన పుణ్య
ఫల మెగిరిపోయె నొక్క దివ్యంపు జుక్క॥

దీనులపాలి కల్పకము, దేశముగాంచిన పెన్నిధానమున్
మానవ సంఘమందు దలమానికమున్, గరుణా స్వరూపమున్
జ్ఞాన నిధానమున్ జనకసన్నిభు నంధమతాభిమాన క్రౌ
ర్యానవధించినాడు, సకలావని గుండెలు చీల్చెనొక్కటిన్.

చాలెటులైన మర్త్యులకు సంఘటిలున్: మృతిగన్నవారి స
ద్భావమునెంచి యేడ్చుటయు, వ్యర్ధముకాని యహింసకోసమై
జీవితమంత పుచ్చిన విశిష్టుని హింసకు బాలుసేయు దు
ర్దైవము చెయ్దమెంచిన యథాయధలై హృదయమ్ము క్రుంగెడిన్.



# ఓయి మహాత్మ

(కొత్త సత్యనారాయణచౌదరి)

ఓయి మహాత్మ ! లోకము నయోమయమ్మై హతమారి పోయిన
ట్టేయిక నిన్ను బాసి యెకడెక్కడ నేమిట ప్రొద్దు పుచ్చునో,
న్యాయము చట్టుబండలయి యారడి పోయెనె ? పాడులోక మీ
గాయము మాన్పుకో నయితిగాక, కృశించి తపించి పోవదే ?
బంగరు వాన వెల్లువలు పారి ఫలించి ప్రపంచమంతయున్
గొంగున దాచిపెట్టు నదిగో ! నవభారతమంచు, మించి యు
ప్పొంగితిమయ్య దాని నిజమున్ గురుతించెడి వేళ నిట్టుల
య్యెంగద యోయిపాపపు విధీ ! నినుమెత్తురె లోకు లిత్తరిన్॥
ఈ కొరగాని దేశమున నింక మహాత్ములు పుట్టబోరు, లో
కైక మహాత్మ దాచుకొనరైరి కదా ! యొక యాతతాయి చీ
కాకయి దేశ గౌరవము గాలనురాచి మతంబులోన ము
క్కాకలు దేరియున్న మొనగానిని గ్రుక్కలుబట్టి మ్రింగునా ?
అదిగో! తూరుపు దిక్కులో నెరుపు దృశ్యంబయ్యె నామీద న
భ్యుదయంబున్ గనవచ్చునంచు మదిలోనుత్సాహ ముత్సేకమై
పొదలన్! రివ్వునగారు చీకటుల సంపూర్ణంబుగా గ్రమ్మి; య
భ్యుదయంబున్ హతమార్చె శాపమదియో మోగాని యీజాతికిన్.

---

# జగతి నిర్జీవమయ్యె

(మహావాది వెంకటరత్నము)

ఆ దుర్వార్త వినంగనే మనసు నీరైపోయె, నా గుండెలో
యేదో తీరని బాధ హెచ్చినది, నా యిల్లాలు నా బిడ్డలున్
నా దుఃఖంబున పాలుపంచుకొని, రానాడే జగత్తంతయున్
చెడిపోయెను-తాతతోనె, నశియించెన్ విశ్వసౌభాగ్యముల్.

ఆరిపోయెనుగదా అన్ని లోకాలను
వెలిగించు నిర్మల ప్రేమదీప్తి
ఆగిపోయెనుగదా అన్నిమతాలకు
సఖ్యత గలిగించు శాంతి గీతి
చచ్చిపోయెగదా సర్వతోముఖముగా
చెన్నారు భారత జీవశక్తి
నిలచిపోయెనుగదా కుల భేద మెరుగని
రఘుపతి రాఘవ రామ భజన

నీవు, "హే రామ" యనుచు, యీ నేల గూల
వేయిపడగల సామియే వివశుడయ్యె
ప్రకృతి యంతయు చైతన్య రహితమయ్యె
నీవు కనుమూయ జగతి నిర్జీవమయ్యె.

నెత్తురు జిందకుండ యొకనిన్ బలిపెట్టక కత్తిలేక లో
కోత్తర శాంతిపూర్వక మహోద్యమ మొక్కటి లేవదీసి; యు
ద్వృత్తుగ వైరిశక్తుల జయించి స్వతంత్రత గొన్ననేమి? నీ
నెత్తురు ద్రావె నేటికొక నీచుడు, -బాపు! యిదేమి వైరమో?

---

# హుతవిధీ

(ధూపాటి కొండమాచార్యులు)

హుతవిధీ! పొట్ట బెట్టితి వనుపమాన
శాంతిమయ జీవి నిటు మహాసాధుశీలు
నింక జగతిని కావెద్ది ? యెంచిచూడ
సత్యము సహించ కిద్దియా సత్ఫలంబు ?

భౌతిక శరీర మొక్కటే బాసె గాని
యనుపమంబైన యాతని యాత్మశక్తి
నిండుకొనివెల్గుచుండె, బ్రహ్మాండమెల్ల
మించి రాత్రిని పునరుద్ధరించుగాత!

# అహింసా తపస్వి

(జూలూరి కామేశ్వరి)

ప్రార్థనా సన్నివేళ సభముఖాన
శాంతి సత్యాలు వినదించు సమయమందు
చంపెనట నిన్ను నో యహింసా తపస్వి
కఠిన పాషాణ హృదయు డొక్కడు తెగించి॥

నీ వొక ద్రోహిచేత మరణించితివన్న విషాద వార్తకే
స్థావర జంగమాత్మక విశాల జగస్థలి గుండె నీరుగా
బావురుమంచు యేడ్చినది భారతభాగ్యవిధాత ! నీదు స
ద్భావమె నీకు మృత్యువయి తారసిలెన్ తుది నక్కటక్కటా !

మంచికి మంచిలే దసలు మానవ జాతికి మానవత్వమున్
పెంచి సుఖింపుడంచు వినిపించిన శాంతుని క్రీస్తునిన్నె చం
పించిరి– స్వార్థమున్ విడిచిపెట్టి స్వదేశము కోసమింత క
ష్టించిన బాపుజీ బ్రతుకు చేదయి కాల్చిరి నేటికక్కటా!

ఆరనిమంట నా హృదయమందున నిల్పితి వో ప్రభూ ! యికన్
తీరనిబాధతో కుమిలి దేశము దిక్కును మొక్కులేక సం
స్కార విహీనమై బ్రతుకు చావులమధ్య కృశించి యింకన్
ఘోర విపత్పరంపరలకున్ గురికావలెనో కదా! తుదిన్॥

---

# విలయము

(అయాచితుల హనుమచ్ఛాస్త్రి)

ఒక విలయమ్ము పెంచుకొని, యొక్కడు నిన్ను సమస్తలోక భావుక శుభమూర్తి, శాంతి పరిపుష్టవినిశ్చలధీరు శోక నిశ్చలిత హృదంతరాంతర ప్రసన్నమనోహరరూపు, సాధుతా నికషము పొట్టబెట్టుకొన నేర్చెనటే' ప్రళయాంబుదార్భటిన్,

ఓ సత్యాగ్రహి! సర్వలోక వినుతాత్యుత్సాహదీప్రాత్మ దీక్షా సామ్రాజ్య రమాధినాధ నిఖిలాశాపూర్ణ కీర్తీశ్వరా నాసాంతః పుట కించిదుజ్ఝిత జవోష్ణ శ్వాసనిర్ధూత సర్వాశాదేశ విరోధియూధ యిదె సాష్టాంగమ్ము రాట్ప్రియా



# నగుబాటు

(బృందావనం రంగాచార్యులు)

కత్తుల గడ్డయైన 'నవఖాళి' తటంబున శాంతి బీజముల్
విత్తిన హాలికా! అహామువీడని హైందవజాతి ఘాతమే
మిత్తిగ మారె నీ యెడల మించె దురుష్కమతాల మౌఢ్య సం
పత్తిని మామతమ్ము నగుబాటయిపోయెను, నాల్గుపోకలన్॥

దాస్యాంధజగతిలో దారిజూపెడు వెల్గు
వెల్లువలై ముందువెడలినావు
బానిసనై పరిపాలింప దగ దిక
లెమ్మని నిద్దుర లేపినావు
నిరుపప్లవంబులై నెరపు సత్యాగ్రహ
సమరముల్ మెండుగా సలిపినావు
నలుబదికోట్ల మానవ సంఘ సేవకై
జీవితమర్పణ జేసినావు

చరితలో మున్నెరుంగని శక్తిజూపి
ఖండ ఖండాతరాలలో ఖ్యాతి వడసి
మత సమైక్యత జగతి సమ్మత మటంచు
నచ్చ చెప్పుటకే ప్రాణమిచ్చినావు

~~:o:~~

# బాపూజీ

("కళ్యాణశ్రీ")

అతిహేయంపు దురాగ్రహమ్ము మము దయ్యమ్మట్టు లాడింపగా
మతభేదమ్ము సవారి జేయ మెడపై మా తండ్రి రక్తమ్మె, భా
రత భూమిన్ పొలిజల్లి యీ గతిని దుర్మార్గమ్ముగా కాల రా
చితిమే! బాపుజి విశ్వధారుణియె, నిస్సేమమ్ముగా రోదిలన్.

భారత జనయిత్రి పాలబుగ్గలమీద
కాలువల్ గట్టెడు కంటినీరు
స్వాతంత్ర్యవీరుని బ్రదుకుటెడారిలో
యువ్వెత్తుగా రేగుచున్నధూళి
భారతదేశ సౌభాగ్య తపస్వులు
నేలనోడ్చెడు కంటి నెత్రుపేళ్ల
యుప్పెనయై పొంగి, యురుకు హిందూమహా
పాథోధి శీకర భంగపాళి

ప్రళయ పరిణత విస్ఫుర ప్రకృతి యటుల
కురులు విరబోసికొని యాడు కౌరవి దయ్య
ముల వలెన్ జిందు ద్రొక్కుచు కలగుచున్న
వవిగొ బాపుజీ నీ వటు కదలినంత॥

—:o:—

## జ్యోతి

(బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు)

జ్యోతి మలగెను, పెనుతమ ముర్వి గ్రమ్మె
యింతనైన వాస్తవము గ్రహింపరేమి;
చనిన పితకు వాఙ్మాత్రాను సరణ మనెడి
ఆత్మవంచన సేత భావ్యమ్ము కాదు.

## పిడుగుపాటు

(అంబడిపూడి నరసింహశర్మ)

అణగెనా యొక్క మహాదీప్తి శమదమ
సుందర దివ్యతేజోమయంబు
మడిసెనా! ధర నహింసా బోధనామృత
మూటలూరిన బోసినోటి తపసి
కూలెనా! కట్టిన కొల్లాయి కొంగున
కోటు లర్థించి గైకొన్న ఘను
అరిగెనా! సత్యాగ్రహము తేరు నడిపి, స్వ
రాజ్యముగొన్న సారథియు, రథియు

పోయెనా భారతాంబిక పొగలు బాపి
దాస్య బంధన మూడ్చిన వినతాసుతుండు
అస్తమించెనా గాంధి—మహాత్మ గాంధి
అయ్యో యెంతటి పిడుగుపాటాయె నేడు.

అదిగో చూడుము దివ్యయానమున కల్పానల్ప పుష్పావళుల్
పొదువంగా బడు పూలపాన్పుపయి కొల్వుందీరి కన్నీరు నీ
రధులై పారగ తండ్రిలేన నదులై రాత్రింబవళ్ క్లేశగ
ద్గదికన్ నీకయి యేడ్చు విశ్వజన సంఘాతమ్ము గాంధీప్రభూ.

ఎనుబదియేండ్లనాడు మనహిందు పురంధ్రికి కంఠహార భూ
షణము లభించె, క్రొందళుకు జాయ మెరుంగులదిద్ది, యీ
దినమున 'గాంధి నామకము' దివ్యమురత్నము గోలుపోయి యా
జనని గళమ్మునన్ నిలచె సన్నని దారము, కంఠహారమై.

శాంతి కోరవడి దిద్దు నొజ్జవు, యహింస
బలము రూపించు తపసివి, భరతఖండ
ముక్తి కిరవగు వేలుపు ప్రోడవీవు
గాంధిజీ! నీ కిదే నమస్కార శతము.

—)o(—

## మహాత్మా గాంధి

(బబ్బిళ్లపాటి కామేశ్వరరావు)

సత్యధర్మ దయాగుణ శాంత్యహింస
లన్ని నీ మూర్తి సేవించి వన్నెగాంచె
పూజ్య భారత విపుల సామ్రాజ్యమందు
యనుపమాన కృపాత్మ! మహాత్మాగాంధి॥

గుండె చెమర్పనట్టి హంతకుం డరుదెంచి తుపాకిగుండ్ల నీ
యెండిన బక్క దేహముపయిన్ బడవేసిన ఘోరవార్తతో
బండలు సైతమున్ కరగె, పాయని దుఃఖముతో ప్రపంచమే
బెండయి కంపమొందె, కడు బిక్కమొగంబిడె సృష్టి బాపుజీ.

## అమృతమూర్తి

(బొడ్డుపల్లి పురుషోత్తం)

ఉష్ణ కిరణుడు చరమాద్రి నొరగిలగ
అరుణ కాంతులు నలుదెసలందు క్రమ్మె
అతి భయానకమయ్యె, సితాంబరమ్ము
రక్త యుతమైన ఖాదివస్త్రమ్ము వోలె.

సత్య సంయుతశక్తి యసత్యమాయె
వెలుగు నశియించె చీకటు లలముకొనియె
అమృత మూర్తిని మృత్యువు నావరించె
యెట్టి దారుణవార్త విన్పించె వాణి॥

## బాపూ! విశ్వవైతాళికా

(ఆచార్య ధనకుధరం)

నీ సత్యాగ్రహదీక్ష, నీ మధుర సందేశమ్ము నీ దేశ సే
వా సౌభాగ్యము, నీ యచంచలవచః ప్రాగల్భ్యమున్ యహిం
సా సిద్ధాంతము, శాంతి ఘాతుకులు దేశద్రోహు లాత్మీయులే
మోసానన్ తమ కాహుతిన్ గొనిరె బాపూ విశ్వవైతాళికా.
పోసినపాలుత్రాగి విషమున్ వెలిగ్రక్కు కరోరతక్షకా
గ్రేసర మీజగమ్ము చెలరేగి తుదిన్ నినుగూడ పొంచి కా
టేసినదా దయాబ్ధి! యిక నీ ఘరతావని స్వీయ జీవితా
శ్వాసములో లిఖించుకొన సాగునటే, తన దుశ్చరిత్రమున్.



# తిరిగిరాని యాత్ర

(ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి)

చనెనా! భారత గౌరవైక కృత దీక్షా కంకణస్వామి యే
గెనటో యీ పరిరబ్ధ శత్రు సుహృదేకీభూతవక్షుండు, పో
యెనటయ్యో! పతితార్త దీనజన సాహిత్య క్రియాలోలు డౌ
మన 'బాపూ' మహితాత్ము డింక గనలేమా భారతోర్వీ తలిన్.

ఈవు మృతుండవైతి వన నెవ్వరు నమ్మెదురో మహాత్మ! క్రొం
బూవుల తేరిపై వెడలిపోవు మహోజ్జ్వలమూర్తి భారతీ
యావనిలోన శాంతి సుఖమన్నది వచ్చెనుగాని, ధర్మపుం
భావన వచ్చెగాని, యని మాత్రమనందగు నేటి నుండియున్.

ఆఫ్రికా హైందవ వ్యథమాన్ప దివురు మ
హోద్యమమ్మున నెత్తు రోడ్చియోడ్చి
తెలి పులి కోఱకు కోఱల కండయై చిక్కు
భారతావనికినై పోరిపోరి
శ్వసృగాలముల కన్న పరిహీనులన్న సో
దరులకై కన్నీట దడిసి తడిసి
ఇస్లాము పేరింట హింసాకళంకమ్ము
నడరు శాంత్యమృతాన కడిగి కడిగి.

కలలలో వెల్గు స్వాతంత్ర్య కలిత కాంతి
కంటబడినంతనే యొరకంట జూచి
పూలరధమెక్కి యెచటికో పోవుచుంటి
వయ్య మహితాత్మ మరి రానియాత్ర దగిలి॥

నెత్తుధారపోసి, విజదేశ దాస్యముక్తి
తరిమి భాగ్యమిచ్చి తనిపినావు
అగ్ని గోళకముల కాహుతి గావించి
మించి నిన్ను గౌరవించినాము.

—:o.—

# జ్యోతిర్మయ దివ్యతార

(మాదిరాజు పార్థసారథి)

ఒక జ్యోతిర్మయ దివ్యతార యకటా వ్యోమంబునందుండి, నే
లకు రాలెన్ సకల ప్రపంచగతి వైక్లబ్యంబుమై నిద్రలో
నికి జారెన్ బసితూనలాదిగ మహానిర్వేద ధారావహా
నకమై మానవ సంఘమెల్ల కుమిలెన్ గల్యాణ సంధాయికై.

అదియొక జాతి జీవన కళామల దివ్యజగత్తు, దానిలో
గుదురుగ ప్రాణముల్ నిలుపుకొన్నవి సూ మతసామరస్య సం
పద లతిలోకమైన పరమార్థము దాగిన నందనమ్ము, నే
డది లయకాల గర్భ కుహరాంతరమందు విలీనమొందెనా.

మతము లన్నవి మోక్ష సామ్రాజ్యమునకు
వివిధ మార్గములం జూపు విధులుగాని
కఱకు గత్తుల చాటున బెరుగుచున్న
వికట మృత్యు కరాళ దంష్ట్రికలు కావు॥



# బాపూజీ

(మునగపాటి విశ్వనాథశాస్త్రి)

లోకంబంతయు నిద్రజెందినది నెహ్రూబాబు కెవ్వారు ఆ
యాకాలంబుల యోచనల్ దెలుపువారాలేరు, సర్వ ప్రజల్
శోకంబందు మునింగియుండి రసువుల్ గోల్పోయిరొక్కొక్క చో
సీకై యిట్టి నరాధమున్ విధివిధిన్ సృష్టించెనా బాపుజీ।
నీ హత్యన్ విని లోకలోకములు కన్నీర్నించెపె, ఖస్మాత్సిక్తై
వాహిన్యాకృతి వేసవేల్ ప్రజలు బాష్పస్నిగ్ధ నేత్రాలతో
"హాహాబాపుజీ"యంచు నేడ్చి రడలన్ వ్యర్థంబె యోచింప నీ
దేహం బింకను జూతుమే కరుణమూర్తీ ఓ నిరాడంబరా!

నవకాళిం దిరుగాడునాడు నిను కన్నారంగ వీక్షించి హైం
దవులున్ ముస్లిములున్ సమంబుగ దురంతాలెల్ల బోనాడి విన్
స్తవముల్ జేసి త్వదీయ సూత్రముల శ్రద్ధాభక్తి పాటించి రెం
త విశేషంబొ యహింసచే జయము బొందన్ లేదొ మేధానిధీ!

—:o:—

# కీర్తి దేవాలయము

(వల్లా విచ్చయ్యశాస్త్రి)

జాజి గులాబులు సంపెంగలుం గావు
శాంత్యహింసాది పుష్పములు వలయు
పసిడి పల్రతనాల పలక నిల్పుటగాదు
నిరతంబు హృత్పీఠి నిలుపవలయు
అగరు సాంబ్రాణుల పొగలు వేయుటగాదు
సద్వాసనామైత్రి జరుపవలయు
తనివిగా ఫలనివేదనము సేయుటగాదు
తెంపు ధైర్యము నివేదింపవలయు

మహిమమహాత్ముని పూజ సామగ్రియట్టి
లనుచు దెలియుడు ప్రజలార యనవరతము
నెల్ల కడలను జూపించు నెత్తుగలుగు
దివ్య కీర్తియ యగుజుమ్మ దేవళమ్ము.



# గాంధీజీ

(విద్యాపతి)

గాంధిజీ కీ నాడు కలుగదు మరణమ్ము
చచ్చుచున్నది దేశ శాంతిగాని
వైవర్ణ్యమే లేదు బాపుజీ ముఖమున
మానవత్వము నేడు మాసెకాని
బాపుజీ రక్తాన పంకిలం బైనది
చరితమేకాని తత్ఫలము కాదు
అయ్యయో ఘాతుకా ఆ మహాత్ముని జంపి
యెదిమూటగట్టు కోనెంచినావొ

క్షణములో ప్రాణముల్ తీయగల్గినావు
కాని సకల ప్రజల గుండె వ్రేచుచున్న
ప్రజల సంతాప వహ్ని నార్పంగ గలవె
తరతరమ్ముల దుష్కీర్తి చెఱపగలవె?

నీ మేనం గలరక్త బిందువుల ము న్నేనాడొ వెచ్చించి నే
డామాత్రంబుగ నస్థిపంజరమ్ములా గైనన్ మనంగల్గ కే
లా మావంటి కృతఘ్ను దేశజులకై ప్రాణంబులన్ గూడ నో
స్వామీ త్యాగముచేసి వైచితివి, నిస్స్వార్థత్వమిట్లొప్పునే!



# గాంధీ మహాత్మ

(శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి)

పలికిన పలుకులో తులతూగె నుపనిష
దోషధనాత్మక సుధాపూర గరిమ
చూచిన చూపులో సువ్యక్తమయ్యె ని
ష్కల్మష ప్రేమ ప్రసారమహిమ
తలచిన తలపులో నొలికె సమస్త స
ర్వం సహాజన్ర కల్యాణ కాంక్ష
చేసిన చేతలో భాసించె బహుమత
సారాత్మకంబహింసాతి దీక్ష

బ్రతికినంత కాలమ్ము శ్రీరామనామ
భవ్యచింతనా యత్త సుస్వాంతుడవయి
'రామ రామా' యటంచునే ప్రాణములను
బాసిన మహాత్మ నీ యాత్మ బడయు శాంతి.

ఒక చెంపగొట్ట వేరొక చెంప జూపుటే
ఘనతగా భావించు క్రీస్తు వీవు
ధర్మంబులకునెల్ల ధరణి నహింస యు
త్తమ ధర్మమనిన గౌతముడ వీవు

ప్రతిఫలాపేక్ష భావములేక త్యాగంబు
లొనరించు మను కర్మయోగి వీవు
అతి నీచులుగ నెంచు హరిజన సోదరు
లని చెప్పు పతితపావనుడ వీవు

ధర్మ సంస్థాపనార్థమై ధరుణి యుగ యు
గంబు నుదయింతువన్న వాక్యంబు నిజము
పౌనరుపం బుట్టు శ్రీ విష్ణుమూర్తి వీవు
దివ్యశాంతి స్వరూప గాంధిమహాత్మ

●●●●●●●

# కలడు దేవుడు

(దేవులపల్లి రామానుజరావు)

ఎండ కన్నెఱుగని యిందీవరాక్షులు
కానెలు విగియించి కదలినారు
విజ్ఞాన జగతిని విహరించు పండితు
లర్పింపనున్న వారాత్మ శక్తి
కూలినాలి యొనర్చి కుడుచు పింబేదలు
సీ గొడ్డు ఛాయల నిల్చినారు
సిరితోడ తులదూగు శ్రీమంతులెందఱో
త్యాగ సంసిద్ధులై తరలినారు

వేణుగోపాలు గానము విన్న గోపి
కల విధమ్మున మేనులు పులకరింప
అరుగుదెంచిరి ప్రజలు విన్ననుసరింప
కలడు దేవుడు, మనయందు కలడు కలడు.

—x—

# పాలించు తండ్రి

(పోలూరి హనుమజ్జానకిరామ శర్మ)

ఎవ్వాని ప్రభుశక్తి నిందఱు నాయకు
లేకసూత్రమ్మునం దిమిడ గనిరి
ఎవ్వాని దీశక్తి నీ భారతావని
పరదేశ దాస్యమ్ము బాపుకొనియె
ఎవ్వాని దీప్తిచే నీ దాస జనులకు
ఖండాంతరమ్ముల గతులు గలిగె
ఎవ్వాని కరుణచే నీ నాడు మాలలు
హరిజనులై పెంపు నందగనిరి

అట్టి బాపుజీ అరచేత నఖిల భార
తమ్ము పైకెత్తి పాలించు తండ్రి, నేడు
దేశమునగల్గు పాటును దెలియ దేమి
యెచటికేగెను మరలి తా నెపుడు వచ్చు.



# మహాత్మ గాంధి

(మల్లాది శివరాం)

ఒక్క మహాత్ము జంపితివి యుల్లసమందితివే, పిశాచి, ఆ
యొక్కొక రక్తబిందువున కొక్క మహాత్ముడుగా ప్రపంచ మం
దెక్కడగాంచ నక్కడ నహింసయు,సత్యము,ప్రేమ,ధర్మముల్
పిక్కటిలున్ దురంత పరివేదన నీ పోక హిందువాటయే.

దయ్యముబట్టి గాంధియొక ధర్మ విఘాతకుడట్లు దోచి నీ
యయ్యనె చంపుకొంటి విదియాస్వమతోద్ధరణమ్ము మూర్ఖుడా
వెయ్యి యుగంబు లీవు విలపించి తపించి కృశించి యైన నీ
తియ్యని పల్కు వెయ్యములదిట్ట గనుంగొన జాలుదే యికన్.



## మహాత్మ గాంధి

(సున్నం వీరరాజు)

హరిజనాత్రాత నిజవిప్లవాధినేత
సద్గుణ సమేత పావన చరిత్ర శాంతి
దూత భారతభాగ్యవిధాత గాంధి
మమ్ము విడనాడె క్షణములో మాయమైతే?

భారతీయులకై నిరాహార దీక్ష
సలిపి తావక రక్తమాంసములు ధార
వోసిన పవిత్ర దేవతామూర్తి వీవు
నీ ఋణము దీర్ప శక్యమౌనే మహాత్మా!

## గాంధి

(భాగవతుల నృసింహశర్మ)

గాంధికి లోక సన్నుత యుగంధర మంత్రి సమాన దివ్య ధీ
కంధికి, వాఙ్నిశాత కరకాండ విఖండిత శత్రురాడ్గళ
గ్రంధికి, సంధి వర్జిత పరస్పరరంధికి సర్వదేశ సం
బంధికి భక్తిపూర్వక నమస్కృతులిచ్చెద దేశ శాంతికిన్.



# గాంధి తాత

(రావెల వెంకట సీతారామారావు)

క్రోటీశ్వరుండని కొనియాడ ఫలమేమి
చొక్కాకు గతిలేని బక్కవాడు
దేశనాయకుడని వాసి కెక్కిన నేమి
కూటికి కఱవైన కూలివాడు
మహనీయమూర్తియై మనిన లాభంబేమి
పరులకు చుక్కనై పరగినాడు
భారతీయులపాలి భాగ్యంబ కానేమి
నిత్య దరిద్రుడై నిలచినాడు

విశ్వ కల్యాణమూర్తియై వెలసినాడు
శాంతి పాఠంబు గొంతెత్తి చదివినాడు
దేవుడే దిక్కటంచు ప్రార్థించినాడు
కామ్యఫలసిద్ధి గన్నాడు గాంధితాత.

ముసలివాడనుకొన్న కొనలేని మీసాలు
త్రిప్పుచు లోకాలు త్రిప్పగలడు
మాట తుప్పను బోసినోటివాడనుకొన్న
మెప్పుగా ధర్మాలు చెప్పగలడు

కూడుగుడ్డకు లేని కూలివాడనుకొన్న
కోటాన కోటులు గూర్పగలడు
పేరు పెంపులు లేని బిచ్చగాడనుకొన్న
కోటీశ్వరులనె భిక్షకుల జేయు

అఖిల భూతాళి బలిగొను యముని కేవి
శాంతమే భూషణమ్మని చాటగలడు
సకల జగముల శాసించు శాంతిదూత
కలి కలుషజేత భారత గాంధితాత.



# కారణ జన్ముడు మహాత్మగాంధి

(విశ్వనాథ వెంకటేశ్వర్లు)

వ్యాధిగ్రస్త కళేబరం బది పరవాక్యవృత్తి దుర్వైర్య కృ
ద్బాధాలబ్ధ విమూర్ఛ మిందు నిలువన్ భద్రంబు లేదంచు దు
ష్టాధోలోకగమిష్య మాణులము, మమ్మార్తిన్ బడంజేసియున్
వేధోలోకము నొక్క దేగెదవటే విద్యామనోజ్ఞాకృతీ!
శ్రుతికందందగు మూలవస్తు వది చిద్రూపంబు, మాయోప బృం
హిత వైరాట్పదవీ పరిష్కరణ సాహిత్యంబు రూపించి, భా
రత సర్వంకష కిల్బిషౌఘధృతి మంత్రద్రష్టవై తత్వతః
స్థితి వైరాజ్య మలంకరింతువు విభూతిస్థాన యోగాకృతీ.
హోతవు హవ్య మయ్యె దవహో యిది యెక్కడి వింతయజ్ఞ మ
ద్వైతము రూపుగొన్నయది, తావకసత్య విభూత్యఖండతా
ద్యేతలుగాక వస్తుగుణధీ ప్రవిలుప్తులు నిన్నుగూర్చి దుర్
జ్ఞాత విభేద విక్రియత సాగునటంచు దలంతు రెమ్మెయిన్,
కారుణజన్మ దేలికను, కారణమృత్యుడవౌదువో, దురా
చార వివృత్తమౌ భరత సంఘము నీదగు సప్తకోటి నా
డీ రమణీయమౌ వెడద టెంకియె దూరముగా తనూ
భారము తాను నిన్బొదిలి పాలనసేయునటయ్య, మోక్షముల్.
అంతేవాసి జనాంతరాత్ముడవు ప్రత్యక్స్వాత్మ విజ్ఞాన వా
గంతర్నాద విలాసభాసిని త్వదీయారంభ దివ్యార్థ సా
రాంతస్తత్వములన్ గ్రహింప వశమే యానంద కందాను భూ
త్యంతర్వాణి కులాబ్ధి చంద్ర, కొనుమయ్యా మా నమోవాకముల్॥

# మరువకుడీ మహాత్ముణ్ణి

(మల్లవరపు విశ్వేశ్వరరావు)

మరువకుడీ జనులారా! మన గాంధీమహాత్ముణ్ణి
మరువకుడీ ప్రజలారా! చిరంజీవి మహాత్ముణ్ణి
భారతదేశ విముక్తికి బంగారపు కలలుగన్న
మహాత్ముణ్ణి పేద జనుల పెన్నిధియౌ మహాత్ముణ్ణి.

గోచిపాత దాల్చి తాను దేశస్థుల కట్టబెట్ట
నూతన ధవళాంబరముల నాతని, కల, ఆతనికల!
నిరాహారదీక్ష నెలలు తన దేహము బలిచేసుకు
జనపాళికి భక్తిపూర్వ కలగాంచెను, కలగాంచెను!

దౌర్జన్యపు లోకాటవినా తన దేకాంతవాళి
గాయమైన పాదయుగళి కాయముక్షతమై వ్రాలిన
కదలిపోవు నేకాకిగ కలకాలపు కలలదారి
మరువకుడీ మహాత్ముణ్ణి నిరుపేదల మహాత్ముణ్ణి
మరువకుడీ జనులార మన గాంధీమహాత్ముణ్ణి.



# మహాత్మ.

(కేశవపంతుల నరసింహశాస్త్రి)

నీ మహనీయతేజమున నిర్మలమై వెలుగొందుచున్న, యీ
భూమి తమో మహాంధమయి పోవ నొనర్చితి వేమి దేవ! యో
స్వామి యికెవ్వరీ భరత సంతతి సంతమసంబు బాపి, ప్రే
మామృతవృష్టి దేల్చెడు మహాత్ములు? చెప్పఁగదే కృపానిధీ!
ఎంత కఠోరవార్త ఇది యెంత విఘాతము భారతావనీ
కాంతకు పుత్రశోకమును గట్టి సురాలయమేగుచుంటి, నీ
పంతము లెల్ల సోదరు లవశ్యము గుండెలు క్రుమ్మరించి, తీ
ర్పింతురు రమ్ము సోదరుల పీడకుమయ్య నమస్కరించెదన్.
ఉఱికెన్ తోయధి పంచకంబు నదిగో ఉల్లోల కల్లోలమై
కబళింపన్ బరవళ్ల ద్రొక్కెడు నదే కార్చిచ్చు పెన్మంటలై
ప్రబలగ్రావ మహోగ్ర వృష్టికదె అభ్రవ్రాత ముంకించె మం
త్రబలోపేతము శాంతి సాయకముతో రావయ్య! రక్షింపగన్.
పచ్చని భారతమ్ము విడువన్ మన సొగ్గని యాంగిలేయు లే
యుచ్చును వేసినన్ వెడలనూధి స్వతంత్ర సుఖామృతంబు నం
దిచ్చిన వైనతేయుని, మహీజనబాంధవు, నిన్ను నేటికిన్
మెచ్చని పాపజాతి, క్రతిమీతె, నికేగతిఁబట్టి పోవునో.
అవురా యెంతమోసగాడవు మహాత్మా! ఒక్కనాడేని, నీ
వవనిన్ తావక విష్ణుభావమును, వ్యాఖ్యానింపనే లేదు, మే
మెవరున్ నీవు పరాత్పరుండ వనుకోనేలేదు, లేదేని, నీ
యవినాభావ చిదాత్మ కత్వమునకై యత్నింపమే? బాపుజీ!

# మరలిరమ్మా ఒక్కమారు

('అమరేంద్ర')

మరలరమ్మా ఒక్కమారు
కరుణజూపు బాపూ
నూరేడులు మనసీ యని
క్రూరాత్ముల మన్నింపుము

నిన్ను రాతిబొమ్మచేసి
నీ బాటనె మరచినాము
నిరుపేదల నేలరాసి
నీ పేరును చెప్పువారి

నెలవైనది నీ దేశము
తోటి నరుల కడుపుకొట్టి
కోటికి పడగెత్తు ఘనుల
కోటలె కులుకుచున్నవి

బరువులతో కరువులతో
బ్రతుకు పీడ కలయైనది
ఆర్తుల హృదయావేదన
అయినది అరణ్యరోదన

నీ కలలను నిజము చేయ
నీవే దిగిరావలెనిక
దీనజనుల కొసగ ప్రాపు
నీ కన్నుల జాలిచూపు
పరహిత జీవితముగ
చరియించిన కరుణాత్మా
మట్టిబొమ్మలగు మనుజులనే
గట్టి వీరులుగ. మలచిన శిల్పీ
వెన్నవంటి మనసుతోడ
కన్నతల్లి మమత తోడ
బోసి నవ్వు మోముతో
మోసులెత్తు ఆశలతో
మకుటము దాల్చిన చక్రవర్తిగా
సకల హృదయముల నేలు మూర్తిగా

మరలి రమ్మా
తరలి రమ్మా
ఒక్కమారు
ఒక్కమారు

నీ రాకకు నిఖిలజగము
నిర్నిమేషమై వేచెను
నీవులేని భరతావని
నిద్రాణముగా తోచెను
మరలరమ్మా బాపూ
మాపై కృప జూపూః

# బాపూజీ

(శ్రీరామకవచం సత్యనారాయణ)

నీ వాశించిన రామరాజ్యమది రానే లేదు, మున్దెన్నడో
యావిర్భావము జెందు నాసయు వృథాయయ్యెన్గదా జాతిలో
సేవాభావ మభావమైనది, నశించెన్ద్యాగశీలమ్ములో
దేవా! ధర్మము నుద్ధరించుటకు జ్యోతిర్మూర్తివై రాగదే!

నీతిని పాతిబెట్టి, యవినీతికి హారతిబట్టి పాపపున్
జేతలు గజ్జె కట్టె, గుణశీలము లావల నెట్టి, నెత్తినన్
జేతులు వెట్టి, దీనజన సేవకు నీ పథమొల్లనట్టి, దు
ర్నీతుల నొంపగా, నవతరింపుము జాతి తరింప, బాపుజీ!

నిన్ను చేజేతులన్ జంపు కొన్ననాడె
చచ్చినది జాతి, జాతి యుజ్జ్వల యశమ్ము
నాశనమ్మయ్యె, మరల ప్రాణప్రతిష్ఠ
సేయగల గాంధిదేవ! విచ్చేయవయ్య!

# దేవుడతడు

(బిరుదురాజు రామరాజు)

హింస నంటక రణము జయించు యోద్ధ
స్వార్థమెఱుగని సంపన్న వైశ్యవరుడు
మతము గల్గియు సర్వసమ్మత వివేకి
చావు చేజిక్కిపోయిన దేవుడతడు.

---

# గాంధీ మహాత్మా

(గడియారం రామకృష్ణశర్మ)

ఘోర దురాగతంబులకు శోణితలంబు కలంగ, బోధ నా
సారముచేత శాంతిని ప్రసారము చేసిన కర్మభూమిలో
భారతజాతి ఘాతకుడు భారత జాతిపితన్ వధింప నా
ధారుణి క్రుంగలేదు; రవితారక చంద్రులు, దుల్లరేలొకో!

అఖిల విశ్వారాధ్యుడైన శ్రీ కృష్ణుండు
వ్యాధ బాణమున నిర్యాణమందె
శాంత్యహింసాధర్మ సంస్థాపకుడు బుద్ధు
డొక క్షుద్రు కతమున నుర్విబాసె
స్నేహధర్మ ముపన్యసించిన జీసను
నీచ మానవులచే నిహతుడయ్యె
దీనబాంధవుడు, గాంధీ మహాత్ముండు, మ
తాంధుని చేత గతాసుడయ్యె

ఖ్యాత జీవనులైన మహాత్ములెల్ల
నీచమృతి బొందగా దైవనియతి కలదొ!
కాలగతి నడ్డువారి కేగతి కలుగునో
యేదియు గమనింప కిటులైతివే మహాత్మ!

పారావారము మేరమీరిన, జగద్వ్యాపారమే మారినన్
తారానాథ దినేంద్రులాగిన, యసత్యంబెన్నడున్ బల్కవే
నూరుం బాతిగ వత్సరాలవని నుండున్ శాంతికై యంచు, నో
రారంబల్కియు హంతచేబడి మహాత్మా! మాకులేవైతివే!

ఆంగ్లేయ కపట తంత్రాళిచే రాజి మి
న్నంటిన చిచ్చు చల్లారలేదు
జిన్నా నిమిత్త విచ్ఛిన్న భారతమాతృ
బాష్పాంబు లరికట్టఁ బడగలేదు
మత పిశాచార్పిత మానవాగాధ
రక్త ప్రవాహంబులింక లేదు
మానవాకృతి ఘోర దానవా కల్పిత
హాహావినాదంబులణ లేదు

ప్రాణముల నొడ్డి కన్న స్వరాజ్యలక్ష్మి
కలయరిష్టంబులైన వైదొలఁగలేదు
బాధ్యతలు వీడి, యాత్మ విశ్వాస మీగి
తీరుకొన్నావె, నీవు, గాంధి మహాత్మా॥

# భువనబాంధవ

(కలవుటవు రామగోపాలరావు)

ఆకసమ్మూడి పడి గుండె లదిమినట్టు
లుర్వి సర్వమ్ము స్తంభించె నొక్కసారి
బాపు-మనబాపు-హత్య అబ్బా! యిదేటి
ఘాతుకత్వము ఘోర జగద్విపత్తు॥

లోకములెల్ల నొక్కత్రుటిలోన ఘటిల్లిన సంజవేళకే
చీకటులయ్యె గుండియలు చిట్లిన మానవకోటి దుఃఖ మం
దేకముగాగ, నాకమటు లెల్లెడ గన్నులు చెమ్మగిల్లి యే
దాకస మేది భూమియను నంతర మింతయు గానరావిచోన్.

లేదింక మన బాపు, లేడు భారతభాగ్య
సంధాత, మానవ శాంతిదూత
లేదింక మనగాంధి, లేడు సత్యాహింస
సిద్ధాంత గురుడాత్మ శక్తి పరుడు
లేదింకి మన మహాత్ముడు, పీడిత ప్రజో
ద్ధరణైకవ్రతుడు సద్ధర్మరతుడు
లేడు వర్ధా యోగి, లేడు సబర్మతీ
తపసి, సేవాగ్రామ విపినమౌని

యుగ యుగమ్ముల సారాంశ మొక్క బ్రతుకు
లోన వెలిగించి, మానవ లోకమెల్ల
నొక్క దీనార్త హృదయమై యుడుక నేడు
తీరిపోయెను, మన పెద్దదిక్కు బాపు!

పావనమైన నీ చరణపంకజ సేవకు నోచుకొన్న, మి
త్రావళితో, స్వతంత్ర భరతావనితో, నిహమెల్ల నొక్క చే
కోవగ, నిన్ను మున్ను కనుగోనివి కన్నులునైత మూర్తితో
బావురు మన్నవో భువనబాంధవ యొక్కటి దివ్యబంధమో!

—)o(—

# సాయుజ్యము

(బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి)

క్రుంగె హిమాద్రి శృంగములు కొండలు గుండెలు కూలి
పోయె, ది
క్కుంగనలేని పక్షులుగ గొంతుక చించుక నేడ్చెయేడ్చె, క
న్నుంగవలన్ సముద్రముల నోడ్చెను విశ్వజనంబు, భారత
ప్రాంగణమెల్ల జీకటులు బర్వెను, రాలితివా మహాద్యుతీ!

పోయెను వేలయేండ్లకును బుట్టని పున్నెము చేయిజారియే
పోయెను లక్షలన్ గొలిచి పోసిన పొందని వెల్గు, రాలియే
పోయెను కోట్లుగుప్పినను బూడని వజ్ర మయో! దరిద్ర నా
రాయణమూర్తి! నీ వగుదువా! యిటులెంతగనెన్ని యేడ్చినన్.

తీరములేని దుఃఖ జలధిన్ బడె సర్వజగత్తు, యెంతకున్
దీరని చింతచే భారతదేశ కిరీటము వ్రాలె, హంతక
ప్రేరిత మృత్యు ఘోరపదవీ పరిషిక్తతనుర్విముక్తి జీ
వారవ మెన్ని లోకముల కావల మ్రోగెనొ శాంతి సూక్తముల్

ఊహల కందరాని, కరుణోదధివై, పరదాస్య బంధన
వ్యూహము జించి, భారతి కపూర్వ విశాల యశఃపతాకికా
బాహుల నెత్తి, మాతృపద పంకజ పూజను వ్రాలినట్టి నీ
మోహన ధర్మమూర్తి కనబోలునె మాకు, దరిద్ర కోటికిన్!

నూలు పోగున దేశదేశాలు కదిపి
యుపవనంబున దేవు నుఱ్ఱూత లూపి
యే మహాదేశ కీర్తుల నెగసినావా
యే మహాజాతి నార్తుల నెత్తినావా
ఓయి! గాంధి మహాత్మ! సాయుజ్యమగుము,



# అహింసాజ్యోతి

("కరుణశ్రీ" జంధ్యాలపాపయ్యశాస్త్రి)

ఉయ్యాలలో నూగుచున్న ముద్దుల బిడ్డ
లేచి కెవ్వున కేకవైచె నేమొ
పాకలో లేగకు పాలిచ్చు గోవు, 'అం
బా' యంచు, గొంతెత్తి యఱచె నేమొ
జలజల ప్రవహించు జమున నిస్తబ్ధయై
నిలిచి కన్నుల నీరు నింపెనేమి
చకచక పొలము దున్నుకొని పోయెడి
రైతు నాగలి ముందుకు సాగదేమి ?

కోటలో ఆరుగంటలు కొట్టబోవు
వాని హస్తాలు గడగడ వడకునేమి
యే మహాత్ముని గుండెపై నెక్కి చనెనొ
కాలపురుషుని రథరథాంగములు నేడు.

ఇదియేమీ! నిజమా! మహాత్ముడిక లేనే లేడు-యీ వార్త వ
ట్టిది కాదా కరుణాసముద్రుడగు తండ్రిన్ హత్య గావించిరా
యిదియేమీ యిదియేమి!యేమిటిది-స్వామీ!యీ విషంబేమి మ్రిం
గుదుమా? మ్రింగక తప్పదా? జగము గగ్గోలెత్తి వాపోయెడిన్.

నిండు మనస్వి, విశ్రుత వినీత పునీత యశస్వి, సాత్త్వికా
ఖండ తపస్వి, సత్యసహాకారము, చిట్టచిటారు కొమ్మపై
పండినపండు బ్రహ్మఋషి-భారత భాగ్యవిధాత ప్రార్థనా
మండపవేదిమీద నిక, మా కనుదోయికి విందొనర్పడా?

గుండెలు జారిపోయె ప్రజకున్, కనుగోనల నశ్రు వాహినుల్
నిండె, నభమ్ము బ్రద్దలయి నెత్తిపయిన్ బడె-దద్దరిల్లి బ్ర
హ్మాండము క్రుంగిపోయినది-అంతటి తండ్రిని ధూర్తుడైన, పు
త్రుండు కిరాత హస్తములతో వధియించె నటన్న వార్తకున్,

క్రొత్తవెలుంగు బాట నెటకో గొనివచ్చి "స్వతంత్ర భారతో
దాత్త నిదర్శనం" బగు ప్రదర్శన మంచు, మహాభయంకరో
న్మత్త పిశాచి నీ వికట నాట్యము సూపితివేమి? ఈ కథా
వృత్తము చూడలేము-తెరవేయుము దీపము లార్పుమో ప్రభూ.



# అవతారమూర్తి

("మధునాపంతుల")

చిఱుతగొడ్డలివ్రేటు-చుఱుక సోకినది
ఒక మహావిటపి, నేలకుఁగూలిపడినది
ఒక హాలాహలవాయు-వాలసి వీచినది
కైలాస శిఖరి గ్రక్కదల చెదరినది

తులువ చిమ్మటకు రెక్కలు వాఁడియైనవి
ఒక గుణజ్యోతి జీవిక డిందుపడినది
ఒక అఖండి ధనుర్గుణోక్తి మ్రోగినది
ఆచార్యునకు భౌతికాంగ మాఁగినది

ఒక బోయగుండె, ఊరక-ఱాయియైనది
అవతారమూర్తి దేహము పూర్తియైనది
ఒక శక్రలక్ష్మి నిట్టూర్పు సాగక దూఁగె
శని యట్టహాస ముషఃకేళిలోఁ దోఁగె

తా నిచ్చినది భారత స్వరాజ్యము కాని
పుచ్చుకొన్నది మొక్కవోని స్వారాజ్యము
అతడు ప్రజావళీతత హృదయగ్రంధి
మనగాంధి గుణకంధి మఱికానబడడు.



# జోహారం
("పైడిపాటి")

భారతాంబా! నీకు జోహారు
జ్ఞానదాత్రీ! నీకు జోహారు
వీరమాతా! నీకు జోహారు
అమృతవల్లీ! నీకు జోహారు
కన్నతల్లికి-నీకు జోహారు
వెన్నెల్ల దూపులకు జోహారు.

~~~:o:~~~
~~~

# ధ్రువతారలు

("కరుణశ్రీ" జంధ్యాలపాపయ్యశాస్త్రి)

ఎవ్వారి రణగాథ లింత వర్ణింప స
త్కవుల కలాలు సార్థకత నొందు
ఎవ్వారి జయగీతు లించుక పాడ గా
యకుల కంఠములు ధన్యత గడించు
ఎవ్వారి రూపు లొక్కింత రూపింప శి
ల్పుల కళాకృతి మహోజ్జ్వలత గాంచు
ఎవ్వారి పదధూళి రవ్వంత సోకిన
భూదేవి నిలువెల్ల పులకరించు

నభము మార్మ్రోగు, వీర దుంధుభులు వారు
త్యాగ ధనులైన, సత్పవిత్రనులు వారు
జాతిరత్నాలు వారు, శాశ్వతులు వారు
పావనులువారు, ధన్యజీవనులు వారు

మండెడి స్వరాజ్య సమరాగ్ని కుండ మందు
భస్మమైన గులాబి పుష్పములు మీరు
ఎన్ని కల్పాంతములకేని యింకి పోని
భరతమాత ఆనంద బాష్పములు మీరు.

—.o:—

# బాపూజీ పుట్టిన రోజు

("బుజ్జి")

బాపూజీ! మన బాపూజీ
పిల్లల తాత బాపూజీ
సత్యాహింసల బాపూజీ
సత్పురుషుడు మన బాపూజీ.

సత్యాగ్రహముల బాపూజీ
శాంతిదూత మన బాపూజీ
బోసినవ్వుల బాపూజీ
బంగరు పలుకుల బాపూజీ.

కొల్లాయిగట్టిన బాపూజీ
బానిసత్వమును నిర్మూలించి
ప్రభువులజేసిన బాపూజీ
స్వరాజ్యజ్యోతిని వెలిగించి
చీకటిని బాపిన బాపూజీ

బాపూతాతా పుట్టినరోజు
భారతావని పండుగరోజు
గాంధి తాతకు జేజేలు
బాపూజీకి జేజేలు.-(తెలుగు ప్రతిక)

# గాంధీ దేవ

శ్లో॥ గాంధీదేవ నమస్తుభ్యం-ప్రసీద మమ మంగళమ్
శాంతిదూత నమస్తుభ్యం-గాంధిదేవ నమోనమః

నమస్తే పురుషాధ్యక్ష, నమస్తే హైందవప్రియ
నమస్తేస్తు సదానంద, గాంధిదేవ నమస్తుతే॥

స్వరాజ్య రథమారూఢం-సర్వలోక పితామహం
సర్వపాపహరం దేవమ్-తం గాంధిం ప్రణమామ్యహమ్॥

తం గాంధిం లోక కర్తారమ్-మహాతేజ ప్రదీపనమ్
దారిద్ర్య ధ్వంసనం దేవమ్-తం గాంధిం ప్రణమామ్యహమ్॥

---

# గాంధీ తాత

(కోటు సోదర కవులు)

శ్రీమన్మంగళ, కస్తురి
రామా హృదయేశ! లోక రంజిత సుగుణా
నీ మహిమలెన్నదరమా! కామితవరదా మహాత్మగాంధీ తాతా.
భారత భాగ్యవిధాతా! వారిధి గంభీర! రాజవై భవ దేశో
ద్ధారక మా వందనమిదె కారుణ్య సమేత నేత గాంధీ తాతా.
ఇలపై బుద్ధుని కంటెను తలపగ శిబికంటె ధర్మతనయునికంటెన్
వెలయు నహింసా శీలము కలలో నెవ రీడునీకు, గాంధీతాతా!
ధీరోదారము జగదుపకారము నిజ కార్యదీక్ష గౌరవ మహితా
కారము, సత్యస్ఫురణయు గారుణ్యము నీకునగుట గాంధీతాతా.
తిట్టిన తిట్టవు, మఱి నిను గొట్టిన గొట్టంగబోవు, క్రూరులెదలలో
నెట్టులదలచిన వారల గట్టిగ మరలింతు వౌర! గాంధీతాతా!

— X —

# మంగళహారతి

(సురటరాగము-ఆదితాళము)

మాతా నీ కిదే మంగళమ్ భారత భాగ్య
మాతా నీ కిదె మంగళమ్
చెన్నుగా నీకృపా రసము-చిలికి మము గాపాడుమీ
వన్నె కెక్కి-న వసుధలో రాణి-కన్నతల్లి! కల్యాణీ॥మాతా॥
గాంధిని, అరవింద సాధుని, లాలా లజపతిరాయుని
ఆలీసోదర, నెహ్రూ.సీ ఆర్ దాసు-ట గూరిని
బిపిన్‌పాల్ వెంకటప్పయ్య-దేశభక్తులైన వారల
కేసరీ సమాజికులను-కీర్తిమించ నేలు తల్లీ ॥మాతా॥

---

# మంగళ హారతి

భైరవి-ఆదితాళము

(కొండపల్లి జగన్నాథదాసు)

జయమంగళమ్ నిత్య-శుభమంగళమ్
మంగళము శాంతునకు-మంగళము దాంతునకు
మంగళము ప్రవిమల-స్వాంతునకును
మంగళము మనగాంధి-మోహన దాసునకు
మంగళము కస్తూరి-బాయిపతికి ॥జయమంగళమ్॥

మంగళము దేవునకు-మంగళము వేల్పునకు
మంగళము స్వరాజ్య-సాధకునకు
మంగళము దౌర్జన్య రహితనిరాకరణ
మంత్రసూత్రస్థాప-నాచార్యునకును ॥జయమంగళమ్॥

మంగళము హిందుజన-మానధన చరితునకు
మంగళము మన మతో-ద్ధారకునకు
మంగళము మహమ్మదీయ సోదరహిందు
మనుజ సమ్మేళనా-మహిమాఢ్యునకును ॥జయమంగళమ్॥

సాధనకు మన జగ-న్నాథ సంసేవ్యునకు
సాధునుత ప్రత్యక్ష-మానవునకు
మంగళము సురవినుత-సత్యగుణశీలునకు
మంగళము మనదేశ సంరక్షకునకూ
జయమంగళమ్ నిత్యశుభ మంగళమ్॥

卐